ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 1977

ప్రతులకు :
1. 8-3-898/2 నాగార్జున నగర్,
హైదరాబాద్-500 873.

2. ఆంధ్ర సారస్వత పరిషత్తు
బొగ్గులకుంట,
హైదరాబాద్-500001.

మూల్యము : రు. 25-00

ముద్రణ :
నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్
బషీర్‌బాగ్, హైదరాబాద్-500029

Ballads in Telugu Folk Literature

By :
**Dr. N. Krishnakumari**
*Osmania University*

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణకు రు. 10,000/-
ద్రవ్య సహాయము చేసిన ఆంధ్రప్రదేశ్
ప్రభుత్వమునకు నా కృతజ్ఞతలు.

హైదరాబాద్,
7-9-1977.

నాయని కృష్ణకుమారి

# అంకితం

పడి ఉన్న చోటునుండి
అణువైనా అటూ ఇటూ
తనంతట తానై
తరలలేని
కందుక సదృశ
మంద ప్రవృత్తి నాది!
నన్ను పురికొల్పి రెచ్చకొట్టి
తిన్నగా పరిశోధనా సముద్రంలో
ముంచేసి
తమాషా చూచిన
నా భర్తకు నా ప్రాణానికి
శ్రీ కనకపల్లి మధుసూదనరావుకు

# నా మాట

పరిశోధనా విషయముగ 'తెలుఁగు జానపద గేయ గాథ'లను గ్రహించు మని యాదేశించిన సాహిత్యమూర్తులు, డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారికి నా కృతజ్ఞతాభి వందనములు.

పరిశోధనా మార్గమున, నడుగడుగున అమూల్యాభిప్రాయముల నందించి, పథిశ్రమము కానరాకుండ నడిపించిన సౌమ్య, విజ్ఞానమూర్తులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వాదనములు.

నా పరిశోధన కవసరమగు ముద్రిత జానపద గేయ గాథలను, కుతూహల చిత్తముతో తామిదివఱకు సేకరించి యుంచుకొన్నవానిని, నాకిచ్చి వాత్సల్యము చూపిన సాహితీ బంధువులు శ్రీ పందిరి మల్లికార్జున రావుగారికి మనఃపూర్వకాభి వాదములు.

నేనడిగినదే తడవుగ, తాము సేకరించి దాచుకొన్న గేయగాథలను సోదర వాత్సల్యముతో నిచ్చిన డాక్టర్ బి రామరాజుగారికి, డాక్టర్ తూమాటి కౌణప్ప గారికి నా కృతజ్ఞతలు.

విషయ సేకరణమునకై యెదుటఁబడి సంభాషణలు నెఱపినపుడు ఆప్యాయముగ జానపద జీవన పర్యాలోచనమును మాటలలో పొదగి అందించిన శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారికి, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారికి, డాక్టర్ పాటిబండ మాధవశర్మ గారికి నా నమస్సుమనస్సులు.

జానపద గేయ గాథా సేకరణమునకై నా శక్తి ననుసరించి, పలుపథ ప్రాంతముల కేగినపుడు, నన్ను మన్నించి, సహకరించిన ఆయా యూరి పెద్దలకు నా కృతజ్ఞతలు,

నాకై, పలు గాథలను, తన యూరినుండి తాళపత్ర గ్రంథ రూపమున సేకరించి యందించిన నా సహోధ్యాపకురాలు చి. సంయుక్తకు నా ఆశీస్సులు.

నాకై, బుఱ్ఱ కథలను చెప్పువారిని తన యింటికడ సమావేశ పఱచి, వారు చెప్పు కథలను విను నవకాశము తొలుదొల్త కలిగించిన మా కళాశాల చరిత్రాధ్యాపకురాలు డాక్టర్ వైదేహి కృష్ణమూర్తి గారికి నా నమస్కారములు,

పరిశోధనా వశమున, నేను వివిధ విషయములను ప్రస్తావించినప్పుడు, తమతమ భాషలలోని జానపద గేయగాథలను గూర్చిన సమాచారము నందించి సహకరించిన మా కళాశాల, కన్నడ అధ్యాపకులు శ్రీమతి ఇందిర, శ్రీ మహంతయ్య, మరాఠీ అధ్యాపకురాలు, శ్రీమతి యూయా సర్దేశాయీ, తమిళ భాషాధ్యాపకురాలు శ్రీమతి మేరీ కొర్నీలియస్, సంస్కృతాధ్యాపకులు శ్రీమతి మేరీబర్న్సు, శ్రీమతి నళినీ పరాడ్కర్ గార్లకు స్నేహ పూర్వకాభివాదములు.

నాతో కర్నూలు జిల్లాలోని యూళ్ళు తిరుగుటకు వచ్చి, యచట గేయ గాథా ప్రవర్తకులు కథలు పాడుచుండగా విని వ్రాసి, సహాయపడిన నా సహోధ్యాపకురాలు డాక్టర్ ఝాన్సీ లక్ష్మికి నా శుభాకాంక్షలు.

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన జానపద జన జీవితమును గూర్చి వివిధాంశముల నెఱింగించిన నా సహోధ్యాపకురాలు శ్రీమతి యశోదారెడ్డికి నా శుభాశంసనములు.

జానపద భాషా విషయములను నాతో చర్చించిన, భాషా శాస్త్రాధ్యాపకులు డాక్టర్ చేకూరి రామారావుకు నా కృతజ్ఞతా పూర్వక శుభాకాంక్షలు.

ఈ వ్యాసమునకు శుద్ధ ప్రతిని వ్రాసిపెట్టిన ఉస్మానియా విశ్వవిద్యాలయపు 'విన్‌కాన్‌సిన్' ప్రణాళిక యందు అధ్యాపకత్వమును నెఱపు వి. జయలక్ష్మి డాక్టర్ నిర్మల గార్లకు నా శుభాశీస్సులు

ఈ పరిశోధనము జయప్రదముగా సాగుట కన్ని విధముల ప్రోత్సాహము నందించిన మా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి జస్సవాలా గారికి నా నమోవాకములు.

నాకు పదునేడేండ్ల నుంచి శృతిని కల్పించి, యీనాడీ పరిశోధనావకాశమును గూడ కల్పించి, చల్లని చూపు చూచుచున్న, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్థకు నేనెంతయు ఋణగ్రస్తురాలను

మహిళా కళాశాల
8 - 8 - 1969

నాయని కృష్ణకుమారి.

# విషయసూచిక

ఎ


| | | | |
|---|---|---|---|
| 1. | జానపద గేయ గాథలు-నృశాస్త్ర విజ్ఞానము | ... | 1– 19 |
| 2. | జానపద గేయగాథా లక్షణ సమాలోచనము | ... | 20– 65 |
| 3. | జానపద గేయ కథాంశ స్వరూపము | ... | 65–133 |
| 4. | టోటమిజాంశములు | ... | 134–183 |
| 5. | మాతారాధనాంశములు | ... | 184–246 |
| 6. | వీరారాధనాంశములు | ... | 247–303 |
| 7. | రాజకీయ సాంఘికాంశములు | ... | 304–333 |
| 8. | భాషా విశేషాంశములు | ... | 334–368 |


బి


| | | | |
|---|---|---|---|
| 9. | సేకరించిన గేయగాథలు | ... | 369–428 |
| 10. | జానపదుల వాడుకలోనున్న పదసమూహము | ... | 429–479 |
| 11. | గేయ గాథల పట్టిక | ... | 480–483 |
| 12. | ఉపయోగపడిన గ్రంథముల పట్టిక | ... | 484–489 |

# జానపద గేయగాథలు - నృశాస్త్ర విజ్ఞానము

జానపద గేయ గాథా కల్పనము జానపద కళ (Folk Art) కు సంబంధించిన సృష్టి. ప్రాచీనాలంకారికులు 'కళ'ను పలువిధములుగా నిర్వ చించిరి.

కళ యనఁగా మానవ బుద్ధి జన్యమై, చాతురీ మహితమై, సృష్టికి ప్రతి రూపమై భాసించు రూప విశేషము, అని వివరించుటకు వీలున్నది. అనఁగా మాన వుని పనితనమును వెల్లడి చేయుచు నాతనిచే మిక్కిలి ప్రతిభావంతముగా తీర్చి దిద్దఁబడిన యెట్టి స్వరూపమైనను కళాత్మకమైనదని పిలువబడుటకు అర్హతను పొందును. అది మానవుని యొక్క కరచరణాద్యవయవములచే తీర్చిదిద్దబడినది (Physical Art) కావచ్చును. లేదా, వాని మేధా వికసనము వలన రూపు నొందినది (Mental Art) కావచ్చును. వీనినే క్రమముగా సాంకేతిక కళలు (Technical Arts) లలిత కళలు (Fine Arts) అనియు పిలువ వచ్చును.

కళాఖండమని పిలువదగిన ప్రతియంశమునందును మానవుని బుద్ధి వైశ ద్యమును, పనితనమును వెల్లడి యగుచుండుట యవసరము. కావున, ఒకగీత, పలుకు, ఆకృతి, రంగు, లయ, ధ్వని వంటి మౌలికాంశములకు, మనుష్యునిచే నాపాదింపఁబడిన విశిష్టమును, ప్రచురమును, నగు రూప కల్పన (Overt Expression) యందు కళాత్మకత భాసించు చుండును. అట్టి రూపములే కళా ఖండములనుటకుఁ దగినవి.

---

1. Art and Arts – The New Educator Encyclopaedia – Vol. 1 P. 233 – Calcutta. 1937

తీఱిక వేళల యందు, మనుష్యుని మెదడు పనిచేయు పద్ధతి, జీవన వ్యాసంగమున నతి ముఖ్యములగు రకరకముల కార్య సాధనలయందాతఁడు నిమగ్నుఁడై నప్పటి పద్ధతి కంటె భిన్నమైనది. పంచేంద్రియముల యనుభవమునకు వచ్చుచు, నెట్ట యెదుట సాక్షాత్కరించుచున్న సృష్టిని, అనుకరింపవలయు ననెడి బలీయమగు కాంక్ష మనుష్యుని యందెల్ల వేళల జాగరితముగనే యుండును. ప్రకృతిపై నధికార సంపాదనము చేయవలయుననియు, దాని నధిగమింపవలయు ననియు మానవ హృదయము తహతహ లాడుచునే యుండును. ఇట్టి సంఘర్షణయే అనుక్షణమును, మానవుని అభివృద్ధి పథము వైపునకు పురోగమించునట్లు చేయుచున్నది. ఇట్టి సంఘర్షణ యెవ్వనియందు ప్రబలముగ నుండునో వాఁడుత్తమ కళాకారుఁడై భాసించును. అనఁగా మానవుని యందుత్పన్నమైన ఉద్రేక సహిత భావనా ప్రవాహము భగవత్సృష్టి ననుకరించుచు నొక రూపునందగా నది కళయని పిలువఁబడుచున్నది

మానవునకు కళలను సృజించు శక్తి యెట్టిదశయందలవడినది యని ప్రశ్నించినచో, దాని సమాధానము మనల నాదిమ మానవుని యాలోచనా విధానము కడకుకొని పోవును. ప్రకృతి యందలి సర్వవస్తువుల యొక్క చలనము నందు 'లయ' (Rhythm) అంతర్నిహితముగానున్నది. దానికి తోడుగా ప్రకృతి యందు వివిధ రూపములలో మధుర శబ్దోత్పాదనము పొదుకొని యున్నది. నిత్యజీవితమున ప్రతి యంశము నందును. ఏదో యొక రూపమున లయాన్విత శబ్ద స్ఫూర్తి యుండుటను ఆదిమ మానవుడు గుర్తించి యుండును. దానికొక యాకారము నిచ్చుచు నాతఁడనుకరించిన విధానమే నృత్య కళగా భాసించినది. అతఁడు నిత్యము నాటవిక జీవనుఁడగుటచే, చెట్లు చేమల నెక్కుటలో పట్టుపడిన చుఱుకు దనము, జంతువుల పట్టుకొనుటలో పరిస్ఫుటమైన లాఘవము, వానికి కళను వశమగునట్లుగాఁ జేసినది. ఈ నాఁటికిని, అనేక భంగిమలయందు, శరీర చాలనమునందు, అనుకరణమునందు, వారు చూపెడి చాతుర్యము నాగరకున కాశ్చర్యదాయకమైనదే.

ఇట్లు రూపునొందిన నృత్యమునను సరించి గానముండి తీరవలయునను నియమమేదియు నాదిమ జాతులలో లేకపోయినను, వారు అడుగులు కదుపునపు

డుత్పన్నమగు లయతోపాటు సహకరించుటకు క్రమ బద్ధముగా చప్పుడు (Rhythmical Sound) చేయు విధానముండెడిది. అందుకు రెండు కఱ్ఱలు న్నను (కోలాట) చాలును లేదా, చిఱుతలు (Rattle), భజన చెక్కలు, డోళ్లు వంటి యతి సామాన్య శబ్దోత్పాదక సాధనములు ఆనాఁటి నృత్యమునకు సహాయాంగములుగా నుండెడివి. కఱ్ఱకు త్రాడు తగిల్చి, ధనురాకారమును పొంది, జంతువులను వేటాడనేర్చిన యాదిమ మానవుని యూహ, అదే త్రాటిని మీటి, మధుర శబ్దోత్పాదనము చేయఁగలిగి తన నృత్యమునకు దాని నంగముగా తీర్చుకొనఁగలిగి యుండును.

సంస్కృతి పథమున పయనించు నాదిమ మానవుని యొక్క భావ ప్రకటన (Expression) కథాత్మకమును, కల్పనా పాటవము కలదియునై వచన రూపమును (Prose) పొంది యుండవచ్చును. అట్లే, లయాన్వితమును, గాన ద్వితీయమునునై పద్యరూపమును (Poetry) పొంది యుండవచ్చును. ఈ నాలుగు లక్షణములచే భాసించు నాదిమ మానవుని కళా సృష్టియే, కథా రమ్యమును, కల్పనా పటిష్ఠమును, గాన ద్వితీయమును, లయాన్వితమును, నైన జానపద గేయగాథా స్వరూపమున ప్రతిఫలించుచున్నది-జానపద గేయగాథా ప్రచారము అర్వాచీనమైనదేయైనను, నా కళాసృష్టియందు ప్రాక్తనత్వమును సూచించు లక్షణములు నెలకొనియున్నవని యొప్పుకొనక తప్పదు

ఈ గేయగాథలయందలి కథాస్వరూపమును తఱచి చూచినచో నాశ్చర్యోపాదకములగు సంశయములు బయల్పడును. బిచ్చమెత్తుకొని, పొట్టఁబోసికొనెడి వీధి గాయకునకు తాను పాడు పాటలలో కథలేల కావలసి వచ్చెనో? నిజమునకు మనుష్యుడు కథలల్లి, పాటలు పాడి, యేమి సాధింపదలచుకొనెను? అట్లు చేయుట వలన నాతఁడు పొందనున్న యానంద స్వరూపమెట్టిది? యను ప్రశ్నలకు స్పష్టమైన సమాధానములు లేవు. కాని మానసిక తత్త్వవేత్తల పరిగణనము ప్రకారము మానవ మస్తిష్కము యొక్క లోపలి పొరలలో నణగియున్న కోరికలును (Desires) ప్రేరణలును, (Impulses) ఏ క్షణమున కాక్షణము బహిర్గతము లగుటకు యత్నించుచుండును. నిత్య జీవన వ్యవహారమున నవకాశము లేని

వీనికి, కళారంగమునందు వ్యాప్తి యుండుటకు వీలున్నది. అందువలననే మానసిక తత్త్వవేత్తలు మానవ మనస్తత్వ పరిశీలనమునకు కళారంగమే మిక్కిలి యనువైనదని నిర్ణయించిరి [2]

ఒక వ్యక్తి యొక్క కోరిక యెట్టిదైనను అది సఫలమగుటకు వీలుకాని యడ్డంకులు బాహ్య ప్రపంచమున నున్నచో, నా కోరిక పలు మార్పులను, భిన్న రూపములను పొంది యేదో విధముగా సఫలమగు ప్రయత్నములు జరుగుననియు అట్టి నిర్విరామ ప్రయత్నమే సాహిత్య స్వరూపమున అద్భుత వృత్తాంతములను, వీరోచిత ఘట్టములను, అమానుషశక్తులను కల్పించుననియు వీరివాదము. మిక్కిలి దుర్బలుఁడైన వ్యక్తి నిత్య జీవితమున వీరోచిత ప్రసంగము చేసినచో హాస్యాస్పదుఁడగును. కాని వాఁడే వీర గాథలను కూర్చినను, అద్భుత కల్పనలు చేసి నడి వీధిలో గొంతెత్తి పాడినను, ఎవ్వరును నిరసింపక పోఁగా మీదు మిక్కిలి ప్రశంసింపఁ బూనుకొందురు. ఆ విధముగా, దుర్బలుఁడగు వ్యక్తి తన యంతరాంతరముల యందు దాగిన వీరము పట్ల గల యభిమానమును ప్రదర్శింపఁ గలిగి, దాని ననుభవించుట సాధ్యమగుచున్నది. కావున నేదేనొక కళా స్వరూపమును సూక్ష్మముగ పరిశీలించితిమేని ఆ రూప పరిణామము వెనుక, మానవుని మానసిక స్థితి గతులకు సంబంధించిన మౌలికాంశములు (Crude Elements) ను, అనేకములు, బయల్పడుటకు వీలున్నది. అట్టి కళాస్వరూపము పరిణత హస్తుడు తీర్చిదిద్దిన దగుట కంటె, అప్రతిభుఁడును, పామరుఁడునైన వాఁడు తీర్చినదైనచో దానివలన పరిశోధకునకు మఱింత మేలు కలుగును. నాగరకత యొక్క ఆవకుంఠనము లేని మౌలికాంశముల యునికి యిచట కాన్పించును. కళలు ఏ విధముగా మనస్తత్వ ప్రదర్శకములగుచున్నవో, అదే విధముగా మానవజాతి చరిత్రకు సంబంధించిన ప్రాథమికాంశములను ప్రదర్శించుటకు కూడ చాలియున్నవి. అట్టి విషయముల యునికి నాగరక కళాస్వరూపమున కన్న జానపద కళయందు సమ్మర్దముగా కాన్పించునని చెప్పవచ్చును.

---

2. Dr. Padma Agarwal – Symbolism – A. Psychological study.

జానపద గేయగాథలయందున్న కదాకథనమునకు గల ప్రాముఖ్యమెట్టిది? ఈ కథలు కేవలము సమకాలిక సంఘటనము లాధారముగా నల్లబడినవి మాత్రమే యగునా? లేక ఈ కథల యడుగున, ప్రాచీన నరునకు సంబంధించిన విషయముల స్ఫూర్తి యున్నదా యని బరిశోధింప బూనినచో, నట్టి పరిశోధనము ఆశ్చర్యమును కలిగించు నంశములను వెలికిఁదీయునదిగా నుండును. కేవలము కథలు చెప్పవలయుననెడి యుత్కంఠను మాత్రము పోషించుకొనుచు రాగతాళయుక్తముగా వీధి గాయఁకుడు గేయగాథా ప్రచారకుఁడగుచున్నాడు. కాని ఆ గాథల వెనుక నృశాస్త్ర విజ్ఞాన మంతయు నెన్నియో యంశములుగా మఱుగుపడి యుండుట స్పష్టమగును.

నిజమునకు కళయొక్క స్వరూపము అది జన్మనందిన సంఘము వలన నిర్ణయింపఁబడును. సంఘము అనఁగా కేవలము మనుష్య సమాహారము అని చెప్పుట సరికాదు. ఒక సంఘమునకుఁజెందిన మనుష్యులు ఒకరికొకరు సహాయకులుగా నుండవలయునను భావముతోడ సన్నిహితులైన వారుగా కాన్పింతురు. అట్లు గుమిగూడిన మనుష్యులు తమ చుట్టును ఆర్థికముగను, సాంఘికముగను నొక లక్ష్యమును, స్వేచ్ఛా వలయమును నిర్మించుకొందురు. అనఁగా తమకు సంబంధించిన యార్థిక సాంఘిక విషయములను తమలో తాము సమాలోచనము చేసికొని ప్రత్యేక వ్యక్తిత్వముతో నిర్ణయించుకొందురు. ఇట్లు పరస్పర సహకారాపేక్షతో నొకటిగా సమకూడియు, మఱల తమలోతాము బలమగు వ్యక్తిత్వ నిర్మాణమును చేసికొనెడి మనుష్య సమూహమునే సంఘమనఁజెల్లును. అనఁగా సంఘమనునది,స్వయంవ్యక్తిత్వము చే నిర్ణయించుకొన్న సంస్కృతినిబట్టి వ్యవహరించుమనుష్య సమూహము అని నిర్వచింపవచ్చును.[3] కావున ఒక సంఘముయొక్క అలవాటులును, ఆచారములును. మత, రాజకీయాది విషయవిధానమును నియమితములై యొక నిర్ణీత పద్ధతియందు క్రమ పరిణామమును చెందుచు కాన్పించును ఇట్టి క్రమబద్ధత, పరస్పర సహకారాపేక్షతో నొక గుంపుగా చేరు జంతువుల మధ్య నుండదు. ఇదియే జంతుసమూహమునకును, మానవ సంఘమునకును మధ్యగల

---

3. Adamson Hoebel – Man in the Primitive World.

ప్రధాన భేదము. ఇట్టి సంఘముతో నవినాభావ సంబంధము కలిగిన కళా స్వరూపమునందు, సాంఘిక సమస్యల స్వరూపము, మత విషయక విజ్ఞానము, రాజకీయ పరిస్థితుల ప్రస్ఫుటత్వమును, అంతర్నిహితముగా నుండక తప్పదు. తనచే సృజింపఁబడెడి కళారూపము, సంఘముయొక్క, మతముయొక్క, రాజకీయ పరిస్థితులయొక్క యంశములను ప్రతిబింబింపవలయుననెడిది కళాస్రష్టయొక్క పరమోద్దేశ్యముగా నుండును. ఈ యంశములను పరిగ్రహింపఁ గలిగిన వారికి కళ మహత్తర సందేశహారిణి యగుచున్నది. లేని వారట్టి దానిని కేవల కళా ఖండముగ నారాధించి మానసికానందమును పొందుదురు. ఈ రెండవ తెగవారి కొఱకై యుద్భవించినదే కళ కళకొఱకనెడి నానుడి.

సంఘమునకు వెలిగా మానవుఁడెట్లు బ్రతుక నేరఁడో, సంస్కృతిని పొందని మానవుఁడును అట్లుండలేఁడు. మానవుఁడు సంస్కృతికిని శిశువే. సంస్కృతిని భిన్న వర్గములకు భిన్న కాలమునకును చెందిన రకరకముల యాచార ముల యొక్కయు, నడవడికల యొక్కయు, 'నమూనా'లను (Patterns) సంతరించుకొన్న సమాహార స్వరూపముగా నిర్ణయింపవచ్చును. ఇట్టి నమూనా లలో కొన్ని వాని ననుసరించు సంఘమున కొకప్పుడు సజాతీయములను, మఱి యొకప్పుడు విజాతీయములును కావచ్చును. ఒక జాతియొక్క సంస్కృతి నవ గతము చేసికొనుట యనఁగా నా జాతికి చెందిన మనుష్యుల యొక్క వివిధ కాలములలోని, వివిధావస్థల యందలి, సంఘజీవనము పరిశీలించుట. ఈ విధ ముగా సంస్కృతికి సంఘముతో విడదీయరాని సంబంధమున్నది. సంఘము యొక్క ప్రాబల్యమును స్పష్టముగా పొందిన కళల యందు ఒక జాతియొక్క సంస్కృతియు ప్రతిబింబించుట తప్పనిసరియగుచున్నది.

కళా స్వరూపములైన జానపదగేయ గాథల యందు ప్రతిఫలించుచున్న ప్రాచీన సంస్కృతియొక్క స్వరూపమును, సంఘజీవన విధానమును, ఎట్టిదని పరిశీలించుట యాసక్తిదాయకమగు విషయము.

అధునాతన సాహిత్యము వలన ప్రాచీన మానవుని సాంఘికాంశములను వానికిఁజెందిన సాంస్కృతికాంశములను, తెలియుటకు వీలున్నదాయనునది పరి

షమగు సందేహమే. కాని యీ క్రింది పట్టికను పరిశీలించినచో, ప్రాజ్మానవుని యొక్క సాంస్కృతిక విషయ వివరణము చేయు నృశాస్త్ర విజ్ఞానమునకును, సాహిత్యమునకును, గల సంబంధము స్పష్టమగును. కళారూపమగు సాహిత్యము, ప్రాచీన మానవ జాతికి చెంది, మఱుగుపడిన, విజ్ఞానముయొక్క పలు శాఖలతోడ నెట్టి సంబంధమును కలిగియున్నదో తెల్లమగును.




ఒక జాతికి ఆదినుండియు లభ్యమైన సంస్కృతిని గూర్చి పరిశోధన చేయునపుడు ఆ జాతి మాట్లాడెడి భాష ప్రథమ గణ్యమగు విషయమగు ననుటలో విప్రతిపత్తి లేదు. భాష, అచ్చులు, హల్లులు, ధ్వనులు, వాక్య నిర్మితి మొదలగు నంగములతో గూడిన భాషాశాస్త్ర విషయ మొకటియు, వ్యక్తియొక్క భావన, కల్పన, అభిప్రాయ నివేదన మొదలగు బుద్ధి సంబంధియగు నంగములతోఁగూడిన సాహిత్య మొకటియునుగా నేర్పడుచున్నది. ఒక జాతికి, వివిధ

దశలయందు లభ్యమైన సాంస్కృతిక పరిణామములను ఆయా కాలముల యందు ద్భవించిన సాహిత్యము భద్రము చేయును. కావుననే కళల కెల్ల తలమానిక మగు, సాహిత్యము ఒకజాతియొక్క మతము, ప్రభుత్వము న్యాయము, మనుష్యుల మధ్య నెలకొను సంబంధములు, ఆచారములు, మొదలగు నంశములను వివరించు టకు శక్తి కలదగుటయేకాక, ఆ జాతియొక్క వివిధ వర్గముల చరిత్రను, భిన్న వంశములను గూర్చిన సమాచారమును ప్రస్ఫుటము చేయఁగలిగి యున్నది. జాన పద సాహిత్యమునకు చెంది, కళా స్వరూపములుగా నెన్నఁబడిన జానపద గేయ గాథలయందు, అతి ప్రాచీన కాలమునకు చెందిన మత సాంఘిక రాజకీయ విధా నములును, నరవర్గ (Ethnography) నరజాతి (Ethnology) చరిత్రలకు సంబంధించిన విషయములును, ప్రస్ఫుటము కాఁగలుగుటకు వీలున్నదా ?

నిజమునకు, నేఁడు లభించుచున్నంతలో తెలుఁగు జానపద గేయగాథల కాలమును నిర్ణయింపఁబూనుకొన్నచో, నేవియు, క్రీ.శ. పంద్రెండవ శతాబ్దికి నావలికాలము నకుఁజెందినట్లుగా కానరావు. ఇంత అధునాతనములైన యీ గాథలు, అతి ప్రాచీనములగు, ప్రాజ్మానవుని మత, సాంఘికాంశములను పొం దించుకొని యున్నవనుట యెట్లుసమంజసము ? అనిప్రశ్న యుద్భవింపవచ్చును.

జానపద గేయగాథలకు ప్రచారము, శ్రీనాథుని వంటి పండితుల యాదర ణము మూలమున మిక్కిలి యర్వాచీన కాలమున విద్యావంతుల సమాజమున కన్పట్టుట నిజమే. అంతమాత్రమున వాని పుట్టుక మిక్కిలి యర్వాచీన కాల మునకుఁజెందినదని నిర్ణయించుటకు వీలులేదు. అట్లని వీని ప్రాచీనతను, కాల మును బట్టి, నిర్ధారించుట కనువగు గేయగాథలును నేఁడు లభించుట లేదు. ప్రాచీన కాలమునకుఁజెందినవియే యైనను, నవి లిపిబద్ధములు కాకపోవుట వల నను, మౌఖిక ప్రచారము మాత్రమే కలిగిన వగుట వలనను, వాని కాలమును ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదు కాలనిర్ణయము చేయుటకు వీలుగలిగిన చారిత్రికాంశములేవైన లభించినచో నవి యర్వాచీన కాలమునకు చెందినవిగానే యున్నవి.

వీని కాలమెంత యర్వాచీనమైనను, వీనియందు ప్రస్ఫుటమై, జానపదులచే నభిమానింపబడిన కథాంశము, చారిత్రిక ప్రాధాన్యము కలదిగా నెల్ల యెడల

కాన్పింపదు, సమకాలిక సంఘటనలకు జానపద గేయ గాథా ప్రవర్తకుని దృష్టిలో నెక్కువ ప్రాముఖ్యము లేదు వంతపాట గాఁడు చెప్పెడి య ప్రధానాంశములలో నెక్కడ యేని సమకాలిక సంఘమును స్పృశించు సంభాషణ లుండవచ్చును గాని, యీ గాథలు మౌఖిక ప్రచారము కలిగిన వగుటచే నట్టి సంభాషణలకు స్థిరత్వముగాని, యవి లిఖిత రూపమున భద్రపడుట గాని జరుగదు. కావున నవి ఒకవ్యక్తినుండి మఱియొక ప్రసారమునకు భేదించుట జరుగును. కావున వీని యందలి యితివృత్తమును (Plot) బట్టి కాలమును నిర్ణయింపఁగలుగుట పొసగని పని.

కాని వీనియందు చెప్పఁబడెడి కథాంశ స్వరూపమునకు (Story Element) ప్రాచీనత నాపాదించుటకు వీలున్నది. కథలన్నియు కొన్ని మూసలలో నిముడ్చుటకు వీలగునట్లుగా నమరుటవలనను, అట్టి కథాస్వరూపములు ప్రాక్తన దశనుండియు నాదిమ మానవునకు లభించినవిగా నాయ జాతుల పురాగాథల (Myths) వలన స్పష్టమగుచుండుట వలనను, నవి ప్రాచీనములే యని నిర్ధారింపవచ్చును.

జానపద గేయగాథలలోని కథాంశమునకును పురాగాథాంశమునకును పోలికలు కలవను విషయము ముందు ప్రకరణములలో వివరింపఁబడును.

పురాగాథల (Myths) స్వరూపము అతి ప్రాచీన దశయందు సంక్లిష్టమును, సరళమును, కాఁగా పరిణామ దశయందు చిక్కులతోడను, కల్పనలతోడను, కూడుకొని యున్నదిగా కాన్పించును. ఒక జాతియొక్క నమ్మకములు. ఆచారములు, ఆ జాతికి ప్రాచీన కాలమునుండియు పరంపరగా సంక్రమించుచున్న పురాగాథల వలన స్థిరపడును. అనఁగా నొక జాతియొక్క పురాగాథల యందు మత విషయకమగు ప్రాధాన్యమును, పవిత్రతయు నుండుటయేకాక, అవి, ఆ జాతికి అనూచానముగ లభించు నమ్మకములకు నడవడికలకు మూలస్థానములై రూపొందుచున్నవి.[4] అంతమాత్రమున వీనిని సత్యాంశముల ప్రతి

---

4. Felix M. Keesing – Cultural Anthropology World View–Knowledge & Belief Religious system P.336.

బింబములని గాని, లేదా, వీని యందలి కథనమంతయు కేవల కల్పన మనిగాని చెప్పుటకు వీలు లేదు. ఇవి, కొన్ని యెడల సృష్టిపుట్టుకకు సంబంధించిన వివరములను తెలియఁజేయు గాథలుగను, కొన్ని యెడల నాగరక ప్రపంచమున స్థిర స్థానమును పొందిన పలు మత స్వరూపముల యొక్క మౌలిక బీజములను సంతరించుకొన్న కథలుగను, కాన్పించుచున్నవి[5] వీనియందు ఆధి మానవాంశము యొక్క స్పష్టీకరణము, విశ్వోద్భవము, చరాచర వస్తు సంచయ నిర్మాణ క్రమము, మానవ సృజన, నీతినియమముల కట్టడి, మతాచార విధులు, సాంఘికాంశములు, మొదలగున వన్నియు స్పష్టాస్పష్టముగ కాన్పించుచుండును. కావున వీనిని ఆదిమ మానవుని కాంక్షా పూరితమగు నాలోచనల యొక్క కల్పనాత్మకమగు స్వరూపముగా నిర్ణయింప వచ్చును.[6] అవి మనుష్యుని యాలోచనల కథీనములుగా రూపునొంది, సృష్టికి ప్రతిసృష్టి యనఁదగినవిగా నున్నవి.

పురాగాథల యొక్క ముఖ్యోద్దేశము, ఇతర కథలకు వలె, కేవలము విను వారికి నౌత్సుక్యమును కలిగించుట మాత్రమే కాదు అట్లే కేవలము చారిత్రిక సత్యము వెలిబుచ్చుటయు, వాని గమ్యము కాదు. కాఁగా అవి, ఒక జాతికి సంబంధించిన జీవన విధానము యొక్క మౌలిక రూపమును, దాని యందలి యాచారముల యొక్క ప్రాథమిక స్వరూపమును సంతరించుకొని, యొకానొక ప్రాక్తన సత్యమును (Primitive Reality) వివరణాత్మకముగాఁ దెలుపు సిద్ధాంతములు[7] (Statements). అంతేకాక ఇవి, మానవుఁడనుభవించుటకు వీలులేని విషయములను గూర్చి, యాతఁడు కల్పనాత్మకముగా వివరించుకొనిన యూహల సమాహార స్వరూపమనీ చెప్పవచ్చును.[8]

వీనియందు ప్రతిబింబితమైన భూతకాలపు స్థితిగతులను గ్రహించుటవలన, నొక జాతి తానాచరించుచున్న మత ప్రధాన కర్మకాండను( Ritual), తానవ

5. Ibid – P.336
6. Benedict – Myth – Encyclopaedia of Social Sciences – 1931.
7. Malinowski – Myth in Primitive Psychology.
8. Kluckhohn. C. – Myths and Rituals – A General Theory – Harvard – Theological Review – 35; Pp. 45–79.

లంబించుచున్న నైతిక విధానమును, (Moral action) సమర్థించుకొని వానిని క్రమము తప్పకుండ పాటించుట కలవాటుపడును.

వీనియందు సృష్టి ప్రారంభము, విశ్వోద్భవము, వివిధ జీవుల యొక్కయు వస్తువుల యొక్కయు పుట్టుక, స్త్రీ పురుష సమ్మేళనమున మానవ వంశ విస్తరణము, జల ప్రళయముల యందు నాశనమైన సృష్టి పునః ప్రారంభింపఁబడుట, మొదలగు నంశములు విరివిగా వివరింపఁబడుచుండుటయే కాక వీరతా స్ఫూర్తిచే నసాధ్యకార్యములను సాధించి జాతికంతటికిని మేలుచేయు వీరుల కథనములు, దేవతలకును, మానవులకును మధ్య రాయబారులగు దైవాంశగల వ్యక్తుల కథనములు, వంశపురుషుల కథనములు కాన్పించును. మఱియు గ్రామములను, జనులను, పశువులను రక్షించి కాపాడు రక్షక దేవతల (Guardian deities) కథనములు కాన్పించును.

పైన పేర్కొనిన యంశములన్నియు జానపదగేయ గాథలయందు ప్రబలముగా కన్పట్టుచునే యున్నవి వంశకర్తల కదనము, వీరారాధన, మాతృపూజ, దైవారాధన, జంతు ప్రాధాన్యము, మంత్రతంత్ర ప్రాబల్యమువంటి యనేకాంశములలో నీ పురాగాథాంశము (Mythical Element) చొఱఁబారి, యీ గేయ గాథలను ప్రాచీన దశా వైభవ సమువేతములగు కళాఖండములుగా తీర్చి దిద్దుచున్నవి.

పురాగాథలకు ప్రపంచ పరివ్యాప్తముగా పోలికలు కాన్పించుచుండును. ఈ యంశములను పొదుగుకొనుటచే జానపదగేయగాథల (Ballads) యందును ప్రపంచ వ్యాప్తముగా పోలికలు కల యంశములున్నటుల మనము గమనింపవచ్చును. జానపదగేయ గాథలయందు ప్రముఖ వ్యక్తులను, సమకాలిక సంఘటనలను చెప్పవలసివచ్చి నపుడైనను, వానికి పురాగాథాంశములను పోలిన యంశములే యనుబంధింపఁబడుటచే, నొక విధముగా జానపద గేయ గాథలు పురాగాథలను ప్రచారము చేయు సాధములగుచున్నవి. కావున నాగరక ప్రపంచమున ప్రవర్తితములగు వీనిని, అతి ప్రాచీన కాలమున జననము నందిన పురాగాథాంశములను పొందించుకొన్న జానపదకళా స్వరూపములుగా స్వీకరింపవచ్చును. అనఁగా నీ

గేయ గాథలయందు ప్రాఙ్మానవ జాతికి సంబంధించిన సృష్టి విజ్ఞానము, మత విషయక పరిజ్ఞానము, అంతర్నిహితములై యుండి మనకు, ప్రాఙ్మానవుని యాలోచనా క్రమమును సూచించుటకు సమర్థములగు చున్నవి.

ఈ గాథల యందు ప్రస్ఫుటములైన మత సంబంధియగు నంశములు గూడ ప్రాచీన మానవుని మత పరములగు నంశములను తెల్లము చేయుచున్నవి.

ప్రాఙ్మానవ కళా స్వరూపమునందు మిక్కిలి ప్రముఖముగా కాన్పించునది మతము. ఈ నాఁడు మతమునందుఁగల వైవిధ్యమును, బహురూపములును పలు దైవములును, అచట కాన్పింపవు. కాని యీ నాఁటి మత స్వరూపమునకు మౌలి కాంశమనఁదగిన అధిమానవాంశమునకు అచట చోటు గలదు. అనఁగా తొలు దొల్తటి మత భావన కేవల మతి మానుషమగు శక్తులపైఁ గల నమ్మకమున నేర్పడినది మాత్రమే కావున దానికి నీనాడు నెలకొని యున్న ఆధ్యాత్మికమును గంభీరమును నగు నర్థములేదు.

ఆదిమ మానవుడు తనయెదుట మరణించుచున్న మనుష్యులను జూచి, తాను కనెడి కలలనాకళించుకొని, తనకు వివరించుటకు సాధ్యముగాని రోగముల యొక్క యౌద్ధత్యమును గ్రహించి, తన యనుభవమునకు రాని అమానుష శక్తి యొక్క రూపకల్పనము చేసికొనెను. అదియే ప్రాఙ్మానవుని మత స్వరూపమునకు మూల బీజము[9]. మరణించిన వాని యాత్మ, తనకు నివాసస్థలముగానున్న శరీరమును విడిచినను, నశించిపోదు. బాహ్య ప్రపంచమునందలి చెట్టు పుట్టలను, ఱాయి ఱప్పలను, వివిధ జంతువులను, నాశ్రయించి యుండును. అట్లాశ్రయించిన యాత్మకు ప్రత్యేకమగు రూపకల్పన లేదు. కేవలమొక రాతినో, కొయ్యనో దానికి చిహ్నములుగా నిలువ బెట్టుకొని భయ సంభ్రమములచే దానిని ప్రసన్నము చేసికొనెడి పద్ధతులు ఆదిమ జాతుల యందెల్ల యెడల వ్యాపించియుండెను. ఇట్లు భగవద్భావనకు ముందు ప్రాఙ్మానవునకు గల యాత్మభావనయే యాత్మారాధన

---

9. E B. Taylor – Animism – Primitive Heritage – An Anthropological Anthology M. Mead & Nicholas Calas.

దశ (Animism) యందు స్థిరపడినది[10] ఈ యాత్మకును హైందవ వేదాంత విదులు రూపు నొందించిన యాత్మకును చాల భేదమున్నది. మరణానంతరము శరీరమును వదలి బహిర్గతమై ప్రకృతియందలి వివిధ వస్తుచయము నాశ్రయించి రహించిన జీవము, లేదా ప్రాణము, ప్రాచీనుని యాత్మారాధన దశయందలి యాత్మ ఈ యాత్మయే నాగరక మానవుని వివిధ మతములయొక్క సుపరిష్కృత రూపములకు ప్రాతిపదికగా నున్నది

ప్రాచీన మత పరిణామ క్రమమున కాన్పించు, ఆత్మారాధన (Animism) భూతారాధన (Fetishism) పితృదేవతారాధన (Manism or Ancestral worship) జంతు ప్రాధాన్యము (Totemism) మాతారాధన (Mother Goddess worship) దైవారాధన, వంటి యంశము లెన్నియేని జానపద గేయ గాథలయందు చోటు చేసికొన్నవి.

మతమునకు గేయ గాథలయందు ప్రాముఖ్యము కలుగుటకు కారణమేమి? మన సత్త్వశాస్త్ర రీత్యా పరిశీలించినచో మానవునకు చిన్నతనమునుండియు దైవ భక్తి యేర్పడుట కనుకూలమగు వాతావరణము సంఘములో నుండును బిడ్డ బుద్ధి తెలిసిన నాటినుండియు తండ్రికి భయపడుట, వాని యాజ్ఞకు లొంగుట మన మెఱింగిన విషయమే. తాను స్వతంత్రించి చేయుటకు వెనుకాడెడి ప్రతి చిన్న పనికిని తండ్రి వద్దనుండియో, దగ్గఱి వారైన పెద్దలనుండియో, సహాయ సందేశములకై యెదురు చూచుట ఆ బిడ్డకు విడరాని విధముగా నలవడును. పెరిగి పెద్దవాఁడైనను రక్తమునందు జీర్ణితమైన యీ లక్షణము వానిని తండ్రికి బదులు దైవమునకు విధేయునిగాఁ జేయును. దైవభక్తి కట్లు మానవునిలో స్థానము లభించుచున్నది.

అంతేకాక దైవమును మానవుఁడాశ్రయించుటలో మఱియొక బృహత్ప్రయోజనము కన్పించుచున్నది. జీవితమున తనకు లభ్యముకాని యంశమేదేని యున్నచో దానిని కేవలము తన యసమర్థత వలననే తాను పొందలేకపోయితి

10. E. B. Taylor – Primitive Culture – London – 1871.

నను జ్ఞానము మానవుని యహంకారమునకు (Ego) పెద్ద దెబ్బ. అట్టి సమయములందు, అపజయమునకు కారణము తానుగాక యితరుఁడని నమ్ముట వానికి శాంతినిచ్చును. దైవకృతము కావుననే యొక కార్యము సానుకూల పడ లేదనియు నట్లు జరుగకుండ నడ్డుట తన శక్తిని మించినదనియు సమాధానము చెప్పుకొనుటవలన వాని యహంకారము పరిరక్షింపఁబడి మనశ్శాంతి కలుగు చున్నది జీవిత మహాసమరమున నడుగడుగునకు నెదురు దెబ్బలు తినెడి మానవుని, నిస్పృహనుండి, నైరాశ్యము నుండి రక్షించి, శాంతి కల్పించి, యాశను పూరించి, వాని దృష్టిని భవిష్యత్తు వైపునకు త్రిప్పునది దైవభావనయే కావున, అతర్కితములును, విషాదకరములును, చంచలములును, హటాత్సంభవములు నగు పెక్కు సంఘటనలు నిరంతరము వాటిల్లు నీ ప్రపంచమున మనుష్యునకు నిర్భయత్వమును, క్షేమభావమును, కలిగించుచు, పెద్ద బాధ్యతను నిర్వహించు శక్తి గలది మత మొక్కటియే యని నిర్ధారింపబడినది.[11] మత సంబంధమగు నంశములకు ప్రాక్చారిత్రక యుగము (Pre Historic Age) నందలి గుహా చిత్రముల (Cave Art) యందు స్థానమున్నట్లు కన్పించును. అచట నాటవికుల పూజా విధానములు, అధిమానవాంశములకు కల్పింపబడిన రేఖా మాత్ర రూపములు కాన్పించుచున్నవి.

మతమునకు సంబంధించిన కార్యకలాప మంతయు వివరణము నాశించునది. వివిధ జాతుల యందలి రకరకముల యాచారములకును, నడవడికలకును, ఆయా జాతుల మతముల యందు వివరణాత్మక చర్యలు కాన్పించును. ప్రపంచమున మానవుని సృష్టి, పెరుగుదల, వాని శక్తి యుక్తులు, ఈ శక్తులను పట్టి యాడించు భగవదంశముయొక్క కల్పన, జాతిని సురక్షితముగను, ఉపద్రవ రహితముగను నుంచు చర్యలు, జాతికి సంబంధించిన యాచారాదికముల కట్టుబాట్లు–మొదలగు నీ విషయముల కన్నింటికిని, ఆ జాతి యొక్క మత ముఖమున వివరణాత్మకమగు సమాధానములు పొందుటకు వీలగును. మతమునకును, ఆ

11. Kluckhohn – Myths and Rituals – A general theory – Harward theological Review – 35. Pp 45 – 79.

మతములను చేపట్టిన జాతియొక్క సంస్కృతికిని, అవినాభావ సంబంధము కలదు. సంస్కృతి వికాసమున మతమునకు గల స్థానము గొప్పది. మానవ సంస్కృతిని వెల్లడిచేయు, నొక జాతి యందలి వ్యక్తుల జనన మరణముల యందు, వివాహములయందు, గర్భధారణ, యుక్తవయస్సును పొందుట మొద లగు కార్యకలాపముల యందు నవలంబింపబడెడి యాచారముల వెనుక మతము ప్రచ్ఛన్నముగా నుండియు ప్రాముఖ్యమును వహించుచున్నది. అట్లే వ్యావసాయి కుఁడు నిర్వహించు, నారు పోయుట, పంటనూర్చుట మొదలగు క్రియలయందును, వేఁటగానికి సంబంధించిన, వన ప్రయాణము, మాటువెట్టుట, జంతువును బంధిం చుట, వధించుట. మొదలగు క్రియల యందును మత ప్రాధాన్యమును సూచించు నంశముల ప్రమేయము కలదు. పశుపాలకులు పశువులను మేపునపుడు, జాలరులు చేపలు పట్టునపుడు, అట్లే వివిధ వృత్తుల వారాయావృత్తి పరములగు చర్యలను ప్రారంభించుటకు ముందు, జరుపు నాచారములలో మతచర్యలు ప్రస్ఫుటముగా కన్పించుచునే యుండును.

మతము మానవుని యొక్క నైతిక స్థాయిని పెంచునదిగను, వాని ప్రవర్తనను సరిదిద్ది, సంఘమున నొక కట్టుబాటును, వికాసమును కలిగించునది గను నున్నది. సాంఘికములగు ననేకములగు నాచారములు నమ్మకములు, క్షతి లేని స్థితిని పొంది వెలుఁగుటకు మతము కారణమగుచున్నది.

దీనికిట్లు ఒక జాతియొక్క సంస్కృతి తోడను, సాంఘిక వ్యవస్థ తోడను, సంబంధమున్నట్లే, ఆ జాతికి సంబంధించిన రసదాయకములగు కళల తోడను అవినాభావ సంబంధము గలదు [12] సంగీతము, నృత్యము, చిత్రలేఖనము సాహిత్యము మున్నగు లలిత కళలయందు మతప్రధానములైన యంగముల యునికి ప్రాక్చారిత్రిక యుగము నుండియు కన్పించుచునే యున్నది.

పురాగాథలయందు (Myths) కన్పించు రసవంతములైన భావనల కును, కల్పనాత్మకములైన రమ్యోహలకును మతము మౌలికాంశమును అందించు

---

12. Felix M. Keesing – Cultural Anthropology – The Science of Custom – P. 328.

చున్నది. అట్టి మతము లేని మానవ సమాజముండదు. మత విషయకములగ నంశములతో సంబంధము లేని ప్రాఙ్మానవ జాతులేవియు నీనాఁటికిని కనుఁగొనఁబడలేదు కావున ప్రాచీన మానవుని కల్పితోహల సమాహార స్వరూపముగా నెగడిన పురా గాధలయందును, పురాగాథా లక్షణముల నధికముగా సంతరించుకొనిన జానపద గేయ గాథలయందును, సంస్కృతికిని, సాంఘిక వ్యవస్థకును పునాదివంటి మత స్వరూపము కానరాకుండ నుండుట యసంభవమగు విషయము.

కావుననే జానపదగేయగాథల యందు పదింట తొమ్మిది పాళ్ళు, మతమే ప్రధాన వస్తువుగా నెగడిన గాథలే కాన్పించుట సహజము. ఈ గాథల యందలి గ్రామదేతల కథలు, దైవ సంబంధమగు కథలు నిట్టివే. కథ యెట్టిదైనను, కథాపశమున వర్ణింపఁబడు సాంఘికాచారములు, నమ్మకములు, మంత్రతంత్రముల ప్రాధాన్యము, దైవ భావన, జంతు ప్రాముఖ్యము మున్నగు విషయములన్నియు ప్రాచీన మానవుని మత స్వరూపమును వివరించుటకుఁ దగియున్నవి.

ఈ విధముగా జానపద గేయగాథలయందు సంస్కృతి, సంఘము, మతమువంటి యంశములతో పరిపుష్టమైన నృశాస్త్ర విజ్ఞానము పలు ముఖముల ప్రతిభాసించుచున్నది.

వానియందు నిగూఢముగానున్న ప్రాచీన విషయ పరంపర, విమర్శకులును, పరిశోధనా చక్షువులునైన వారిని సమాకర్షింపవచ్చును. కాని సామాన్యుని మానసమును గూడ నాకర్షించు లక్షణము వీనియందు కానవచ్చుచున్నది. ఆ లక్షణము యొక్క స్వరూపమెట్టిది ?

సాంప్రదాయికమగు సాహిత్యమున రసభావాలంకారములకు స్థానముండుట వలన నవి సహృదయ హృదయ రంజకములై పండిత పామరజన మనస్సమాకర్షణము చేయఁ గలుగుచున్న వనవచ్చును. గేయ గాథల యందు ప్రాచీనాలంకారికుల నిర్వచనమునకు లోఁబడు సత్కావ్య లక్షణము లున్నవనుటకు వీలు లేదుగదా ! వీని యందు అలంకారికుల పరీక్షకు నిలచు దసముగాని,

కవిగత ప్రతిభా వ్యుత్పత్తుల ప్రదర్శనముగాని, నెలకొని యున్నట్లు చెప్పలేము. కావ్యమున కాదర్శమగు, వ్యవహార విత్త్వము, శివేతర క్షతి, సద్యః పర నిర్వృతి, కాంతా సమ్మితత, మొదలగు లక్షణముల పొలఁకువయు వీనియందు గాన్పింపదు. శబ్దాలంకారముల గుప్పింపు, ఉపమోత్ప్రేక్షాద్యలంకారముల సమ్మర్దము, రమణీయార్థ ప్రతిపాదనము వంటి లక్షణములేవియు వీనియందు ప్రముఖముగా గాన్పింపవు. అయినను నివి జనమానసముల నలరించు కళా స్వరూపములు (Popular Art) గా నెన్నఁబడుచున్నవి.

ఇచటి కళాకారుఁడు సంఘమునందలి సామాన్యవ్యక్తి. ఆతని జీవన పద్ధతులును, సంఘములోని సగటు మనుష్యుని యొక్క జీవన పద్ధతులును, నొకటే స్థాయికి చెందినవి అతని యలవాటులు, ఆశయములు సాధారణములైన యూహలు, సంఘమునందలి రూపు గైకొన్నవిగనే యుండును. జానపదగేయ గాథా స్రష్ట సంఘమునందలి తన యనుభవము వలన గ్రహించిన విషయములనే పొదిగి, పురాగాథలతో జోడించి, గేయ గాథలను మలచి యిచ్చుట గుర్తింపఁదగిన యంశము. నిజమునకు సాహిత్య విమర్శకుల యభిప్రాయానుసారము కళ యనునది మన జీవితములు ప్రతిబింబించునట్లు మన కొఱకే నిర్మింపఁబడిన ప్రక్రియ.[13] ఈ నిర్వచనమును అక్షరముల పాటించు కళాకారుఁడు, జానపద గేయగాథా స్రష్ట. సామాన్యులు, తమ జీవన విధానమును, తమ యనుభూతులను తాము పాటించు నాచార వ్యవహారములను, తమ బుద్ధికి సులువుగా నర్థము కాఁదగిన మత సాంఘిక రాజకీయ పరిస్థితులను, తమ విశ్వాసములను, నీ గేయ గాథలయందు, దర్పణమున స్వబింబమును చూచుకొనఁగలిగినట్లుగా, దర్శించుటచే నీ కళకు జనజీవనమున వ్యాప్తి యెక్కువయ్యెను.

అంతేకాక ఈ గేయగాథలు గాన ద్వితీయములైనవి. కించిదంగ చాలనముతోడను వాద్యముల సహాయమునను వంతపాట గాంఢ్ర తోడ్పాటు వలనను ప్రవ

---

13. William. K. Wimsatt. Jr. & Cleanth Brooks. Literary Criticism – A short History - P. 457.

ర్శింపవలసినట్టివి. వీనియందు సాహిత్య లక్షణములకంటె నాటక లక్షణములు విరివిగా నుండును. జనులు వీనిని కేవలము విని యానందింతురనుటకంటె, నీ గాథా ప్రవర్తకుల యంగ చాలనము, ముఖ వికారాదులు, గాథా ప్రవర్తనమునందు చూపఁబడు చాతుర్యము, మొదలగు లక్షణములను చూచి యానందింతురనుట సమంజసము.

ఇట్లు వీనియందు ప్రాముఖ్యము వహించు సామాన్య జన జీవన విధాన మును, నాటకీయతయు, గాన లక్షణమును వీనిని జన మనస్సమాకర్షక మగు కళా స్వరూపములుగా తీర్చి దిద్దుచున్నవి.

పామరులోకందుకు వీని నామోదించుచుండగా, పండితులోకందులకై వీని నధ్యయనము చేయుట యవశ్యకర్తవ్యము.

పద కవితలనియు, పామర జనమల్లుకొను కల్లబొల్లి గాథలనియు, భాషా సౌష్ఠవములేని యపప్రయోగముల కుప్పలనియు, వీనిని చిన్న చూపు చూచుట కంటె, నట్టి దోషములను, సహృదయతతో నొప్పరికించుట పండిత లోకము యొక్క హృదయ వైశాల్యమును చాటును. నృశాస్త్ర (Anthropology) సాంఘిక శాస్త్ర (Sociology) నరవర్గ (Ethnography) నరజాతి (Ethnology) శాస్త్ర, పురా (Mythology) శాస్త్ర విజ్ఞానములకు వెలుఁగు నిచ్చుచు నివి యందించు ననేకానేకాంశములను గ్రహించుటయే ధ్యేయముగా వీని నధ్యయనము చేయుట జిజ్ఞాసువుల కవశ్యకర్తవ్యము.

నేఁడు తెలుఁగు దేశమున ప్రచారమున నున్న జానపద వాఙ్మయము నంతటిని ఒక పట్టిక క్రింద నమర్చుటకు వీలున్నది.

ఈ పట్టికను పరిశీలించినచో, పామరులయందు, కథావిరహితములగు, శృంగార, పారమార్థిక, పారిశ్రామిక గేయములకంటె, కథా సహితములైన గేయములకే ఎక్కువ విరివియు, వ్యాప్తియు నున్నట్లు కాన్పించును. అందునను జానపదులలో వ్యాపించు గాథలు, గాన సహితములు కాకుండునట్టివియు కలవు. దీనిని బట్టి చూచినచో, జానపదుఁడు కథకే యెక్కువ ప్రాముఖ్యము నిచ్చె ననియు, ఆ కథయందు, నరజాతికి చెందిన ప్రాచీన విజ్ఞానమును పొదిగెననియు గ్రహింపవచ్చును. ఆ కథాంశమే, వారి సాహిత్యమునందు సహస్ర ముఖముల తోడ ప్రతిభాసించుచు, జన మనస్సమాకర్షణము చేయుచున్నది.

—: o :—

# జానపద గేయగాథా లక్షణ సమాలోచనము

'జానపద గేయము' యొక్క లక్షణములను గూర్చి సమగ్ర చర్చ చేయుచు, దానికొక సునిశ్చిత స్వరూపమును నియమించినారు డాక్టర్ బి. రామరాజుగారు [1] ఆయన, తన కంటెను ముందు, పలువురు పెద్దలు వాడిన జానపద వాఙ్మయము, జానపద సాహిత్యము, (శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, ఉప్పల లక్ష్మీనారాయణ, శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు, శ్రీ హరి ఆదిశేషువు, శ్రీ నేమనూరి గంగాధరం ప్రభృతులు.) ప్రజా వాఙ్మయము, (శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము) పదవాఙ్మయము, (శ్రీ తల్లావఝుల శివశంకరస్వామి) అనాదృత వాఙ్మయము (శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ) మధుర గీతలు, (శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి), దేశి సారస్వతము, (శ్రీ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి శాస్త్రి) అను పేర్లలో నాయన జానపదశబ్దమే ముగ్ధమును, అసంస్కృతమును, ప్రాగ్దశా చిహ్న సంశోభితమునైన పల్లె ప్రజల సాహిత్యమునకు ననుబంధముగా చేర్చదగ్గదని యభిప్రాయ పడెను.[2] నేనును ఆ పదమునే స్వీకరించుచు జానపదగేయ సాహిత్యము నందొక శాఖయై వెలసిన గేయగాథా లక్షణ సమాలోకనము చేయ నుత్సహించుచున్నాను.

✓జానపద గళనాళ వినిర్గతములై, యసంస్కృతములై యక్షరగణ నిబద్ధములు కానివై. కేవల గేయగుణమును కలిగియుండుటయే కాక, కించిన్నృత్త గుణమును (అంగ విక్షేప మాత్రము నృత్తమని దశరూపకము) గూడ కలిగి ప్రదర్శనార్హతను సంతరించుకొనిన కథలు మాత్రమే ఇచట ప్రసక్త విషయములు, ఇవి జానపద మేధా విలసితములగు కల్పనల వలన రూపునొంది,

---

1. తెలుగు జానపదగేయ సాహిత్యము-డా.బి. రామరాజు-పేజీ. 2.
2. Ibid పేజీ. 8.

పరంపరగా తండ్రినుండి కొడుకునకును, వాని నుండి వాని యపత్యమునకును, కులక్రమాగతముగా సంక్రమించుచు చిరంజీవిత్వమును కలిగి యుండెడి కథలు. కథకుఁడు, కాలికి గజ్జెకట్టి, చేత వాద్యములు ధరించి, వంత పాటగాండ్ర సహాయమున నావేశపూరితుఁడై, కించిదవయవ చాలనమున, పదవిన్యాసమున, లయబద్ధముగ ప్రజాసమూహము నెదుట గానము చేయును. ఇట్టి వానికే యాంధ్ర దేశమున బుఱ్ఱకథలనియు, జంగము కథలనియు, పదములనియు, తందాన కథలనియు, పురాణములనియు, కతలనియు వ్యవహారము కలదు. కథకుఁడు చేతి యందు సొర బుఱ్ఱ తోడనో, గుమ్మడి బుఱ్ఱతోనో చేసిన, తంబురా, శారద, వంటి వాద్యముల ధరించి, వాని ధ్వనులతో మేళవించిన గానము గల కథలను పాడుటచే వీనికి 'బుఱ్ఱకథల'ను పేరు వచ్చినది. ఈ పేరు మిక్కిలి విరివిగా సర్కారు ప్రాంతమునందు వాడఁబడుచున్నది. ముఖ్యముగా కృష్ణా, గుంటూరు జిల్లాల యందును, పల్నాటి ప్రాంతము నందును దీనికి వాడుక యెక్కువ కలదు.

'జంగముకథ' యను పేరు గూడ కోస్తా జిల్లాల యందే ప్రచారమును పొందినది తఱచి చూచినచో జంగమ శబ్దమొక కులమునకు సంబంధించిన పదము కాదు. వీరశైవము, కర్ణాటాంధ్రదేశములలో నత్యుచ్ఛస్థితి యందున్న కాలమున (11, 12 శతాబ్దులు) బసవేశ్వరుని యనుయాయులై తన్మతప్రచారమునకై కంకణము కట్టుకొన్న వారును, ఆ సిద్ధాంతములను ప్రాలుమాలిక లేక యవలంబించిన వారును జంగములని పిలువఁబడిరి వర్ణాశ్రమ ధర్మములకు వ్యతిరేకియై బ్రాహ్మణాధిక్యమును నిరసించిన బసవేశ్వరుఁడు, అన్ని కులముల వారును, శివారాధన కర్హులని యందఱిని గ్రహించి, యట్టి భక్తగణములనే జంగములని నిర్ణయించెను. వీరశైవులకు మూఁడు విషయములు మిక్కిలి ప్రధానములైనవి. అవి 1. గురువు. 2. లింగము, 3. జంగము. ఇందు జంగమనఁగా తోడి వీరశైవుఁడు. దీనిని బట్టి చూచినచో జంగమ శబ్దము, ఒక కులమునకు సంబంధించినదిగా కాక, యొక భక్త సమూహమునకు చెందినదిగా మొదట రూపు నొందినది. ఈ భక్తబృందమును, లింగధారులైన వీరశైవులు. ఆనాటి శైవాభిమానులైన జానపద గాయకులు వీరశైవమత ప్రచారమును చేయు నుద్దేశ్యముతో, మహిమాన్వితులైన శివభక్తుల గాథలను కైగట్టి, గేయరూపమున 'భక్త కూటువ'ల యందు పచరించుచుండెడివారు. ఇట్లు చెప్పఁబడిన జంగముల

కథలన్నియు "జంగం కథ" లైనవి. సోమన కాలము నాటికే యీ జంగముల కథలు పాటలుగా పాడఁబడు చుండెడివను విషయము తెలియ వచ్చుచున్నది.[3]

శ్రీగిరి పరుసలో చనుదెంచు భక్త జనముల తీరు తెన్నులను పాల్కురికి సోమన మిక్కిలి విపులముగా వర్ణించెను. పుణ్యస్త్రీలు, జోగులు, కన్నడిగులు, ఆరెవాండ్రు, అరవ వాండ్రు, చెంచులు, పిచ్చుకుంట్లు, వృద్ధ జంగములు, మిండ జంగములు, మొదలుగా గల వారందరును ఏ విధముగా పరుసలో పాల్గొని యుత్సాహ పరిపూర్ణులై సిరిగిరి దర్శనార్థమై తమకమును చూపుచుండిరో యాయన వర్ణించెను. అందు జంగములను వర్ణించునపుడు, వారి యాకార వర్ణనము చేసి.

మెల్లని నడపులు మృదుభాషణములు
వల్లభత్వములు చిత్తోల్లాసములును
భక్తి శృంగారముల్ ప్రభుశక్తులును, వి
రక్తి భావములు నారాధ్య సంపదలు,
జనమనోహరమగు శాసన మహిమ
బొనరారు లాంఛనంబులు, నైజముగను
మానుగా నొక్కొక్క మండలి యనఁగఁ
బూని యెంతయు జగత్పూజ్యతఁదనర
నభిరమ్య లీల దులాకడంగ నిట్టు
లుభయ జంగమ కోటులొక్కట

నడువ,"[4] వచ్చిరని చెప్పెను.

---

3. పాల్కురికి సోమన - పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - పేజీ. 345-349 (1939)

4 పాల్కురికి సోమన - పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - పే 314 1939

అట్లే మిండజంగములను గూర్చి చెప్పుచు, వారి శృంగార రసపరతను మిక్కిలి వర్ణించుచు,

"పౌనరు కస్తురి మృగంబుల క్రమంబునను
జనులకు దేహవాసన లొసఁగుచును
దేవదేవేశు భోగావతారముల
భావన భక్తుల ప్రాణేశులనఁగఁ
దను మనోధనము లాదట హరింపుచును
ననుషక్తలింగ నిరంతర సావ
ధాన తత్పరతమై తత్ప్రసాద ప్ర
లీన భోగోప భోగానంద సౌఖ్య
మండిత సకల సమగ్రత మెఱసి"[5]

మిండ జంగమ కోట్లు మెల్లన నడచిరని చెప్పెను.

ఇందు జంగములైన వారు శివకథలనో, శివభక్త కథలనో పాడుచు వచ్చిరన్న విషయము చెప్పఁబడలేదు. కాని పిచ్చుకుంట్ల పరుస నడకలను వర్ణించుచు, సోమన, వారు పగలెల్ల నడచి, మాపటి వేలములు చేరిన వెనుక,

ఏలయా యిందులో నెవ్వరే కరుణ
నాలించి యొక్కటా యనుచు మాయట్టి
దీనుల, మఱియొక్క దేశంబులకును
బోనీక వృత్తులు, భూములు, గన్నె
దానములు,హిరణ్యదానముల్, వస్త్ర
దానముల్, మఱి యన్నదానంబు, లెక్కఁ
బోతుల, నెద్దను, బోలుగ నిచ్చు
దాత మా బసవన దండ నాయకుని
భూమిలోఁబోలెడు స్వామి భక్తుండు

---

5. Ibid - Page 320

దా మఱి యొకఁడు లేఁడే మల్లినాథ
తార మొసంగరే ధర్మాత్ములార;

యని, బసవన, సిరియాల సెట్టి, కరికాలచోడుఁడు, అఱయమరాజు, ఏణాధినాథయ్య, చేరమరాయఁడు, సింధుబల్లహుఁడు, వీరచోడుఁడు, చిరయూరిచోడుఁడు, శివలింగదేవుఁడు, సిద్ధరామయ్య, నవరద నాచయ్య మొదలగు దానపరులైన జంగములను వారి దాన కార్యాచరణమును కథలుగా కీర్తింతురు. మఱియు, సుంకరి బసవయ్య, సురియ చౌడయ్య, శంకర దాసయ్య, లెంక మంచయ్య' దేవర దాసయ్య, తెలుఁగు బొమ్మయ్య, బావూరి బ్రహ్మయ్య, బాచి రాజయ మొదలగు స్వామి భక్తులగు జంగముల వీరమాహేశ్వర వ్రతాచరణమును కీర్తింతురు ఇట్లు జంగముల మహత్త్వమును కథలుగా పాడుచు, "తార మొసంగరే యనుచు, నితర ధార్మికుల నిట్లెన్నుచు మఱియు, ప్రీతి చూపుచు, భక్తిపరుల వేడుచును, వచ్చుచు, పరుసభావనము సేయుచును," పెల్లేగుదేరు పిచ్చుక గుంటులను సోమన వర్ణించెను. దీనిని బట్టి చూడఁగా సోమన నాఁటికి శివభక్త కథలను పాటలరూపమున వెలార్చెడి పిచ్చుక కుంట్లుండిరిగాని, వీరశైవాచార నియమములు గల జంగముల కట్టి గాథలను పాటలుగా పాడ నాచారమున్నట్లు కానరాదు. అందువలన "జంగమ కథ" అన్న వాడుకను, జంగములచే చెప్పఁబడిన కథలను నర్థముగాక, జంగములను గూర్చి చెప్పెడి కథలను నర్థమున గ్రహించుటలో నసామంజస్యము లేదనుకొందును జంగముల యొక్క కథలన్న నర్థమున ఈ యూహకు ప్రాబల్యము నిచ్చు మఱియొక విషయము గమనార్హము. వివిధ గాథలను గానరూపమున పచరించు, పిచ్చుకుంట్లు, ఎఱ్ఱ గొల్లలు, మోదాటి గొల్లలు, కురమలు మొదలగు తెగల వారందరును శైవులు పిచ్చుకుంట్ల కులమునకు మూల పురుషుఁడైన కుంటి మల్లన శ్రీగిరి మల్లేశ్వరుని వరమున జనించినవాఁడు.[6] కురమలకును గొల్లలకును మూల పురుషుఁడైన కొమిరెల్లి మల్లన్నయు పరమేశ్వర వరప్రసాదియే. ఆయన కరుణా విశేషమున, నాయనచే సృజియింపఁడిన "బూరు క్రిముల" వంటి గొఱ్ఱల మందకు తొలిపాలకుఁడై "గొల్ల

---

6. కుంటి మల్లారెడ్డి కథ – నాచే కర్నూలు జిల్లా రుద్రవరమున సేకరింపఁబడినది.

గాచు కులము" (గొల్ల కులము) నకు మూల పురుషుఁడయ్యెను.[7] అంతియేకాక కోమట్లను యాచించుచు, వారి యింటి యాడ పడుచై జనించిన కన్యకాపరమేశ్వరి గాథలను ప్రచారము చేయు వీరు ముష్టులును, తెలంగాణమునందు విశేషముగా గాన్పించు శారద కాండ్రును శైవులే శివుడే వీరి యారాధ్య దైవము. వీర ముష్టులు వీరశైవాచార పరాయణులై, ఆత్మహననము, ఒడలియందు నారసములను గ్రుచ్చుకొనుట, నాల్కలు తెగఁగోసుకొనుట, జీవద్దీపములై వెలుఁగుట, మొదలగు వీర కార్యాచరణములను దుస్సాధ్యకలవారై యుండుటలో ప్రసిద్ధులు. ఇట్లు జానపద గాథలను, గేయరూపమున వెలార్చు, పలు తెగల జానపద గాయకులలో, చాలమంది శైవులు. కావున తొలుదొల్తటి దశలయందు వీరు ప్రచురితము లొనర్చిన గాథలన్నియు శైవ సంబంధి గాథలై, శివభక్తాగ్రగణ్యులగు జంగముల గాథలగుట విదితము. ఆ కారణమున నీ గాథలకు జంగమ కథలను పేరు వచ్చియుండుట సమంజసము.

ఈ పేరును గూర్చి విజ్ఞులలో మఱియొక యభిప్రాయమును గలదు. డా. రామరాజుగారు జంగములను గూర్చి, చెప్పుచు,- "జంగము లందరును శైవులు. వీరు చెప్పెడి కథలను జంగము కథలని పేరు. జంగం కథల వరుస రగడకు సమీపముగా నుండును. జంగములు తొలుత కేవలము శైవ సంబంధములగు కథలనే చెప్పెడి వారైనను రాను రాను శైవేతర జంగం కథలను కూడ చెప్పుచున్నారు. దేశింగు రాజు కథ వంటి చారిత్రక గేయములు కొన్ని జంగం కథల వరుసలందున్నట్టివే. విరాట పర్వము జంగం కథ, భల్లాణ జంగం కథ, సిరియాళ జంగం కథ, దేవయాని జంగం కథ, వామన విజయము జంగం కథ, అంబరీషోపాఖ్యానము జంగం కథలవంటి కథలు వీరు చెప్పెదరు. వీరశైవమునకు తగిన యావేశము వీరి కుండును. కనుక జంగం కథలు గూడ నీ యావేశమునకు సరిపోవునట్టి వరుసలో నుండుటచే వీరు కథలు చెప్పునపు డుత్సాహజనకముగా నుండును[8] అని వివరించిరి.

---

7. చెర్విరాల బాగయ్య - కొమిరెల్లి మల్లన్న కథ -1949.

8. డా బి. రామరాజు - జానపద గేయ సాహిత్యము పేజీ. 778.

ఈ వివరణమును బట్టి జంగమువారు చెప్పునట్టి కథలే. శివపరము లైనను, శైవేతరములైనను జంగము కథలుగా పేర్కొనఁ బడుచున్నవను విషయము స్థాపింపఁబడినది. ఈ యభిప్రాయమున కుపబలకముగా, పాటలు పాడి పొట్టబోసుకొనెడి యాచనామగ్న జాతులలో జంగము కులము వారున్న విషయము మనకు తెల్లమే. బుడిగె జంగములనియు వీరికి పేరు కలదనియు, వీరు వాయించెడి వాద్యము పేరు 'బుడిగె' యగుటచే వీరి కాపేరు వచ్చినదనియు వివరించియున్నారు. అంతేకాక వీరికి జంగాలు, ఈతముక్క జంగాలు, సెట్టిబలిజలు, సెట్టి ఫణిజులు అను తెగలన్నియు జగంమతెగకే చెందినవని శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారు వివరించియున్నారు.[9]

వీరశైవము మిక్కిలి యున్నతస్థితి నందుకొనియున్న కాలము నాటికి 'జంగమ' పదము ఒక కులమునకు కాక, శివభక్త సమూహమునకు మాత్రమే యన్వయింపఁబడినదని మనవి చేసియుంటిని. ఆనాఁడు పాటల రూపమున కథలు చెప్పెడి పిచ్చుకుంట్ల వారి ప్రశస్తి కాన్పించుచున్నదిగాని, యట్టిపనిని చేపట్టినట్లు జంగముల విషయమున కాదు. శివభక్తిపరుల మాహాత్మ్య కథనముచేయు గేయగాథలే యీనాఁ డెక్కువగా కాన్పించుటకు కారణము, అప్పటి వీరశైవ ప్రాబల్యమును, జానపద కథాగాయకుల శైవ మతాభిరతియునని చెప్పుకొన వచ్చును. ఇట్టి శైవగాథలకు ప్రతిస్పర్థిత్వము వహించినవి వైష్ణవగాథలుకాక, వీరశైవ మతోజ్జృంభణమున కెంతో ముందు కాలము నుండియు జన జీవితము నందు పాదుకొనియున్న మాతృదేవతల గాథలు. అందువలననే యీ కథాగేయ నిర్మాణములో వీరశైవమునకును, మాత్రారాధనకును మధ్య స్పర్థయు, నందొక్క పక్షము నెగ్గుటయునను నంశమునకు ప్రాధాన్యమీయబడి దాని చుట్టును కథ అల్లబడినవి.[10]

---

9. శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి—జంగం కథలు — 'ఆంధ్రప్రదేశ్' సెప్టెంబరు 1964.

10. మాతపురాణము—'మాత్రాధిక్యము'—బవనేని ఎంకయ్య వ్రాసుకొన్న పుస్తకము—
ఈదెమ్మకథ 'శైవాధిక్యము'— నల్లగొండజిల్లా పెనవాడ గ్రామమున తాళపత్ర గ్రంథరూపమున లభించినది.

ఈ దృష్టితో చూచినచో మాతృ ప్రాధాన్యముగల గ్రామదేవతల కథలకు ప్రతిస్పర్థిత్వము వహించు కథలన్నియు. శివ పారమ్యమును స్పష్టముచేయు జంగమ కథలు. ఆ విధముగా కూడ "జంగమ కథలు" అను వాడుక, శివ భక్తుల కథలను, నర్థమున నొక వైశిష్ట్యము నాపాదించుకొని జన జీవితమున ప్రచారమునకు వచ్చియుండవచ్చును.

జంగముల యొక్క కథలు అను నర్థమునుండి జంగములు, చెప్పు కథలు అను నర్థమునకీ వాడుక వచ్చుట చాల తరువాతి కాలమున జరిగియుండవచ్చును. వీరశైవ ప్రాబల్యముతగ్గి, దానియందుగల గౌరవాదరములు జనసామాన్యమున పలుచబారిన వెనుక, జంగములకు, "వీరశైవ భక్తసమూహము" అను గౌరవము తగ్గుటయు. నంత బ్రతుకుతెరువునకై వారందరును మరల నొక కులముగా నేర్పడుటయు జరిగియుండవచ్చును. ఉదరపోషణార్థమై వారవలంబించిన యనేక వృత్తులతోపాటు శైవగాథలను పాడి, యాచ్ఞావృత్తి నవలంబించుటయు ననువుపడి యుండవచ్చును. ఆ విధముగా నీ జంగములు చెప్పు జంగములకథలు గూడ, "జంగమ కథలు"గా వ్యవహరింపఁబడుటలో విప్రతిపత్తిలేదు. ఎన్నియో కులములకుఁ జెందినవారు గేయగాథలను పచరించుచున్నఁగా నే కులము పేరు మీదుగను వ్యవహరింపఁబడని యీ గాథలు, 'జంగమ' పదమును విశేషణ స్థానమున బొంది వ్యవహరింపఁబడుటకు బలమైన కారణ మొకటి యుండవలయు ననియు నది పైన నేను మనవి చేసినది కావచ్చుననియు నొక యూహ.

తందాన కథలను పేరీ గాథలకు, వీనియందు నెలకొనియుండెడి 'తందాన తాన' యను పల్లవివలన సంక్రమించి యుండవచ్చును. ఈ పేరు కోస్తాజిల్లాల లోను, తెలంగాణమునందును వినిపించదుగాని, రాయలసీమ యందు మిక్కిలి ప్రాచుర్యము వహించినది. 'పదము' అను పేరు జనుల వాడుకలో పాటగా పాడదగిన దానికి స్థిరమై యుండుట మనకు తెలిసిన విషయమే.[11]

---

11. "పదము పాడిందంటె పాపాలు పోవాలె
కతలు సెప్పిందంటె కలకాల ముండాలె"
— శ్రీ నండూరి సుబ్బారావు —ఎంకి పాటలు

"ఒక పదంపాడు, ఒకశాస్త్రం చెప్పు" — అను వాడుక సందరెరిగినదే. ఈ జానపద గాథలన్నియు పాడఁదగినవే యగుటవలన వీనికి పదములను పేరు వచ్చియుండవచ్చును. అట్లే వీనియందలి కథాప్రాముఖ్యమువలన కొందరు వీనిని కథలని వ్యవహరింపవచ్చును. జానపద గేయగాథలలో నిడివి కలవై, ఒక కుటుంబంలోని పలువురు మహత్తు కలిగిన వ్యక్తుల యొక్క కథలను గుది గూర్చినప్పుడో, లేక ఒక ముఖ్యకథ కనుబంధప్రాయములుగా నవాంతర కథలు చేర్పబడి, గ్రంథము పెరిగినపుడో అది 'పురాణమ'ను పేర నొప్పారినది జాంబ పురాణము, గౌత పురాణము ఇట్టివి.

ఇట్టి గాథలను, ఆంగ్లమునందు 'Ballads' అని పిలువబడు జానపద సాహిత్యప్రక్రియతో సమానమైనట్లుగా భావించెడి వాడుక, తెలుగు సాహిత్యలోక మున కలదు. Ballad అను పదము ఆంగ్లభాషలోనికి లాటిన్‌లోని'Ballore' నుండి వచ్చినది. ఇదియే ఇటాలియన్‌భాషలో 'Ballata' అని వ్యవహరింప బడుచున్నది. 14వ శతాబ్దమున ఫ్రెంచ్ దేశపు రాజాస్థానములయందలి కవులచే (Courtly poets) నభిమానింపఁబడి, యీ శాఖ యభివర్ధితము చేయఁబడి నది. దీనిని వారు 'Ballade' అని పిలిచిరి ఎలిజబెత్ యుగమున ఆంగ్లేయు లచే గ్రహింపఁబడిన యీ పేరు (Ballad) కథాగేయములకు మాత్రమే కాక ప్రాచుర్యముచెందిన గేయములకును, మధుర కవితలకును, గూడ నన్వయింప బడినది. కేవలము 18వ శతాబ్దమున మాత్రము ఈపదము జానపద జీవితమున ప్రాచుర్యముచెందిన కథాగీతములకు మాత్రమే పరిమితమై యొప్పారినది.

పశ్చిమ యూరప్ దేశమున Ballad ప్రక్రియకు ముందు, మధ్యయుగ మున, గానముతో కూడుకొని నృత్తవిలసితమై వెలసిన మధురకవితాస్వరూప మొకటి, ప్రచారమందుండెడిది. అదియే కెరోల్ (Carole) అను ప్రక్రియ. ఒక ప్రముఖవ్యక్తి పాడుచుండగా, నొక సమూహము చేతులు పట్టుకొని వర్తులా కారముగ నిలుచుండి, అడుగులు ముందునకును వెనుకకును కదుపుచు, లయ తప్పకుండ, గుండ్రముగా తిరుగును. ఈ నృత్త విశేషమే కెరోల్. 12 వ శతాబ్ది యందీరకపు ఆటపాటలకు ఒక వెఱ్ఱి వ్యామోహము ఫ్రాన్సు దేశము నందు మొదలై యూరప్ దేశమందంతటను వ్యాపించి యుండెడిది. కథావిరహితగాన

ప్రక్రియ యగు నీ Carole నుండియే Ballad ప్రక్రియ రూపుగొన్నదని చెప్పుటకై Axel Olrik అను విమర్శకుడు ప్రయత్నించెను. Ballad స్వరూపమునందు, కథాంశముతో నెట్టి సంబంధమును లేక కుదురుకున్న వంత (Refrains) లన్నియు కెరోల్ నుండి గ్రహించినవే యనియు, నవి కథకుని భావోద్విగ్నతను చాటుటకే యుపయోగించునసియు నాయన వివరించెను [12]

Steen Strup అను విమర్శకుడు, పై విషయమును ఆమోదించుచు· Ballad ప్రక్రియకు, సహజముకాని అత్మాశ్రయత్వము, అక్కడక్కడ కథాంగమునందు గోచరించుట 'Carole' యొక్క ప్రభావము వలననే యని వివరించెను. (Contrary to the usual impersonality of European Ballads there is somtimes an 'I' in this initial lyrical outburst, when the narrative begins, the ballad reverts to the normal 3rd person)[13] ఇట్టి చిన్నెలనుబట్టి Carole యొక్క ప్రభావము Ballads మీద నెక్కువగా కలదని పాశ్చాత్య విమర్శకు లభిప్రాయపడిరి.

ఐరోపీయ దేశములకు చెందిన Ballad ప్రక్రియయందు మఱియొక విలక్షణత కాన్పించుచున్నట్లుగా Prof. Entwistle అను విమర్శకారుడు వివరించెను. జర్మను కథాగీతములును, దక్షిణ ఐరోపీయ దేశముల యందలి కథాగీతములను చాలవఱకు వంతలు(Refrains) లేనివిగా కాన్పించుట నాయన గమనించెను అట్లే స్పానిష్, జుగోస్లావ్ కథాగీతములు, కథాకథనమునం దన్ని విధముల నాంగ్లకథాగీతములును పోలుచున్నను, అంగచాలనమునకును, అడుగుల కదలికకును అందు స్థానము లేదనియు నాయన యభిప్రాయపడెను. నృత్తము నకు సముచిత స్థానమునిచ్చి ప్రతి రెండవపాదము తరువాతను, పల్లవిని చేర్చుచు పాడిన స్కాటిష్ కథాగీతము లతిప్రాచీనములనియు మిగిలినవన్నియు, వానికి

---

12. Axel Olrik J.C.H.R.

13. Steen Strup. J.C.H.R.

గల నృత్తగుణమును జారవిడుచుకొని కేవలము పాడబడెడివిగా మాత్రమే మిగిలిపోయి యుండుననియు నాయన యభిప్రాయపడెను.[14]

ఆంగ్లమునందలి Ballad లక్షణములను చర్చించుచు M. J. C. Hodgart అను విమర్శకుడు, చిన్న పాదములు కలిగినవియు, కర్త యెవ్వరో తెలియనివియు, ఒకానొక బలవత్తర సంఘటనను చిత్రించుటయే ప్రధానోద్దేశ్యముగా కలిగినవియునగు శాఖాభేదములే Ballads అని తెలుపబడును నని వివరించెను.[15] ఒకే ఒక సంఘటనను నాటకీయమగు పద్ధతితో సంబంధించి వానిని నిర్వహణ సంధియందు వలె పరాకాష్ఠ నందించుట వీని ముఖ్య లక్షణము. (They (Ballads) deal with one single situation, and deal with it dramatically)

ఈ కవితయందు కవి వ్యక్తిత్వముగాని, నీతి బోధగాని చూపించరాదు. సమకాలికములై ప్రచారములోనున్న సంప్రదాయ కవిత్వ పద్ధతులుగాని, కట్టుబాట్లుగాని, దీనిని నియమింపరాదు. ఇది స్వేచ్ఛాపూర్ణమై, నిసర్గసుందరమై, అసంస్కృతమై శోభింపవలయును. ఇచటి ఛందముగాని, ఇందు వాడబడెడి భాషా ప్రయోగములుగాని, పదబంధములుగాని యీ రకపు కవితకే పరిమితము లై యుండవలయును. ఇంచుమించి యభిప్రాయములనే బలపరచుచు G. H Gerould అను విమర్శకుడు, Ballad అనునది ఒక కథను ఆ కథ యందలి పరాకాష్ఠ నందుకొను సన్నివేశమునకు ప్రాముఖ్యము నిచ్చి చెప్పెడి దియు, కవియొక్క యభివ్యక్తిని ప్రదర్శింపనిదియు, సన్నివేశ కల్పనము చేతను, సంభాషణా చాతుర్యము వలనను కథ దానంతట నదిగా ప్రకటమగునట్టి

---

14. W. A. Entwistle, European Balladry, Oxford. The Clarendon Press (1939)

15. M. J. C. Hodgart, London 1950 The Ballads.

కల్పనా వైభవము కలదియు, నగు జానపద గీతమని చెప్పెను.[16]

ఈ యభిప్రాయము ననుసరించి 'Ballad' కవితలో, కథ కంటెను దాని కాయువు పట్టగు సంఘటనయే ప్రముఖమైనదిగా కన్పించుచున్నది. అట్టి సంఘటననే వంతపాటగాండ్రు సహాయముతో, వీధిగాయకుడు ఆవేశపూరితుడై, మాటిమాటికిని దాని నావర్తించుచు గానము చేయును. 'Ballad' కవితయందలి ప్రముఖమైన యిట్టి సంఘటనను గుర్తించుట సులభ సాధ్యము కాదు. అందువల్ల ననే మామూలు జానపద కథాగేయమునకును, 'Ballad' కును మధ్య నిర్దిష్టము చేయబడిన హద్దులను గుర్తించుటయు కష్టసాధ్యమే యగును. ఒక కొసనుండి మరియొక కొసకు వ్యాపించిన వర్ణపటలము (Spectrum) నందు, ఒక కొస భావావేగముతో కూడిన మధుర కవిత (lyric) కాగా మరియొకకొస కథన పద్ధతిపై యభినివేశము కలిగిన (narrative) కవిత యగును. ఈ రెండింటి కిని మధ్య బాలెడ్ స్వరూపమును గుర్తించుటకు, ఎచట విభాగ రేఖలు గీయ వలయునో, యను సంశము ఆయా వ్యక్తుల యభిరుచిపై నాధారపడి యుండును.[17]

---

16. G. H. Gerould / The Ballad of Tradition-Oxford. The Clarendon Press. (1932)
"A ballad is a folksong that tells story with stress on the crucial situation and tells it objectively with little comment or intrusion of personal bias and tells it by letting the action unfold itself in event and speech."

17. "Folk singers do not make any clear distinction between their ballads and other songs. There is a continous spectrum in folk song between the purely lyric and the purely narrative. Ballads are simply the songs at the narrative end of the spectrum and it is ia matter of taste as to where the dividing line is drawn,"
G. H. Gerould/The Ballad of Tradition

ఆంగ్లమునందలి 'Ballads' ను సమీకరించి వానికి పీఠికను వ్రాసిన Sir Henry New Bolt అను సాహిత్యకుడు కథన పద్ధతి (narratism) కలిగిన యే గేయమైనను Ballad విభాగము క్రిందకి వచ్చునట్లుగా తలచినట్లు తోచును. అందరికిని సహజసమై గోచరించునదియు, తేటతెల్లముగా భాసించునదియు, పలు తెఱంగుల మలచుటకు వీలగునదియు నగు కథాకథనమును, భావకవితయందలి ప్రగాఢత తోడను, విలక్షణత తోడను, మిళితము చేయుటకై కథాగేయ ప్రవర్తకుడు (Ballad Singer) సదా ప్రయత్నించుచుండుటచే[18] ఆంగ్లమునందలి Ballad విభాగమునకును నితర కథాగేయములకును భేదము చూపుట చాల కష్టమని యాయన సూచించెను.

ఈయన Ballads నన్నిటిని మూడు విభాగముల క్రింద నమర్చెను. అవి (1) మొదటి తరపు కథాగీతములు (Early Ballads), (2) రెండవ తరపు కథాగీతములు (Later Ballads), (3) చిన్న కథలును (Narratives) ప్రాసంగిక కథలును (Episodes).

మొదటి విభాగమును గూర్చి చర్చించుచు, నిందలి కథలలో, ప్రాక్తనమైన నృత్య విన్యాసమును, గానమును కల గలసి యుండుననెను. ఒక వ్యక్తి కథను గానరూపమున వెల్లడి చేయుచుండగా, చుట్టును నడుగులు కదపెడి యౌత్సాహికులు తమకు తోచిన రీతి నొక్కొక్క పాదమును మధ్య మధ్య చేర్చి ప్రధాన కథనమునకు పుష్టి కలిగింతురు. ఇట్టి పాదములే సామూహిక గానముగనో (Chorus) లేక వంతగనో (Refrain) తదుపరి రూపొందియుండనని Newbolt అభిప్రాయము. రెండవ తరపు కథాగీతములలో, నిట్లు చేరిన పంత, ముఖ్య కథకు సంబంధింపనంత సందిగ్ధముగా తోచినపుడో, కాలాను

18. The Ballad Singer is seeking to unite spaciousness, the intelligibility and the variety of the narrative with some degree of the significance and the intensity of true lyric poetry-

Sir Henry New Bolt - Introduction to English Ballads-

సారియై యర్థరహితముగా మారినపుడో, దాని ప్రాముఖ్యము నశించి జారిపోవుటయు, దాని స్థానమున నాటకీయతను కల్పించు సంభాషణలు ప్రవేశ పెట్టబడుటయు సంభవించునని యీయన వివరించెను. అనగా మొదటి తరపు కథా గీతముల యందు వంత పాడినవాడే, రెండవ తరమున నర్థరహితమగు నట్టి వంతను వదలి కథకునితో సంభాషణ కుత్సహించును. అట్టి సంభాషణలయందు, కథకు సంబంధించిన విషయములతోపాటు, అప్రస్తుత విషయములును, సమకాలిక సంఘ విమర్శనములును, చొచ్చుకొని వచ్చును. మూడవ తరపు కథలలో ప్రాముఖ్యము వహించు వాడొక్క కథకుడు మాత్రమే. ఇట వంతలు (Refrains) గాని, సంభాషణలు (Dialogues) గాని, లేక రానొక్కడే కించిద్రాగతాళ యుక్తముగా కథను వినిపించుచు పోవును. ఈ దశకు చెందిన కథా గీతము లన్నియు సాహిత్య స్థితిని పొందినవని చెప్పవచ్చును. అట్టి విభాగమునందు తరచి చూడగా, ఈ కథా గీతములను Ballads గా గుర్తించుటకు తోడ్పడు లక్షణములు, వీని యందు సహజించి ఇంక యిమిడి జీర్ణమైన, నృత్తానుగుణమైన లయయు (Dancing rhythm) గేయ గుణమును (Singing tone) గా రాన్పించుచున్నవి. ఈ రెండు లక్షణములును, ఏ దశయందైనను వీనిని విడిచిపోక యుండుట వలననే, వీనిని కేవల (Pure narratives) కథల నుండి భిన్నముగా చూపించుటకు వీలగుచున్నది. కథా గీతములకు మనుష్య హృదయములను కదల్చు శక్తి, పైగుణముల వలననే లభించినది. ఈ విధముగా ప్రాచీనములని చెప్పుకొనదగిన కథా గీతములన్నియు, ఒక వ్యక్తి చేతనో, పలువురు గూడిన గుంపు వలననో, లేదా, యెప్పటికప్పుడు తప్పులని తోచినవి దిద్ది సరిచేయు జిజ్ఞాసువుల వలననో, యొక పరిణత రూపమును పొందియుండి వచ్చును. ఏది యెట్లైనను ఈ కథా గీతములన్నియు సృజనాత్మకమైనవి. వీని కర్తలు, తాము నిత్యము జీవించుచు, కష్ట సుఖముల ననుభవించు నీ లోకమున కంటె, మిక్కిలి విభిన్నమును, నాశరహితమును, నిత్యసుందరమును నగు లోకమును సృజించి, దానిని అతి మానుషములును, అద్భుతములును నగు గుణములతో నింపి వేయుదురు. అప్పటి నాయకులు వీరగుణమును ప్రధానముగా కలిగి, లోకోపకారులై మెలగుచు తమకు లభించిన యద్భుత శక్తి ప్రదర్శనము వలన అందఱ మనసులను నాకట్టుకొని యాదర్శప్రాయులై మెలంగెదరు ఇట్టి

వీరాద్భుత చర్యలను, మధురతా పరిపూర్ణములైన గేయములలో పొదిగి చెప్పుటయే, యీ కథన గీతముల యందలి విశిష్టత. వీనియందు కాన్పించు గానమును, లయయు, శాస్త్ర విధేయనులు కానివై, మనుష్యుని మాటలయందు సహజముగా నిక్షిప్తములైన లయయు, గాన గుణమునునై భాసించునట్టివి. పలువురు జిజ్ఞాసువుల యభిప్రాయములను క్రోడీకరించుచు Mac Edward Leach అను విమర్శకుడు కథా గీతములను గూర్చి సమగ్ర చర్చ చేసెను. కథా గీతముల యొక్క కథాంశమును (Content) కథన పద్ధతియు (Style), నావిష్కారమును (Designation) కేవలము జానపదులకు చెందినవి. ఇందు ప్రాముఖ్యమంతయు నొకానొక ముఖ్య సంఘటనకు పరిమితమై యుండును. ఇందు నీతి బోధలు గాని మఱెట్టి ప్రబోధాత్మకములైన యుద్దేశ్యములుగాని యుండవు. కవి యొకడో, పలువురో యేర్పరింపరాక యనామకత్వము వహించి మఱుగున నుందురు. వాని వ్యక్తిత్వ మిసుమంతయు కథ యందు ప్రతిబింబింపదు. కథ, పంతల వలనను, సహాయకుల సంభాషణల వలనను, చక చక సాగ కడమట్టు వేగము కలదిగా నుండును.[18A]

ఈ కథా గీతములయందు చతురంగములు ముఖ్యములై కాన్పించును. అవి 1. చలనము (Action) 2. పాత్రలు(Characters)3. కథ(Theme) 4. సన్నివేశ కల్పన(Setting). ఈ నాల్గింటి యందును మిక్కిలి ముఖ్యమైనది కథాగమన వేగము (Speed of action). సన్నివేశ చిత్రణము ప్రధానమైనది. కథయు పాత్రలును నిజ జీవితమున మనకు తటస్థపడెడివి కావచ్చును, కాక పోవచ్చును. పాత్రలు జీవితవ్యక్తులు కావు. వారి స్వభావ చిత్రణ విలసితము లైన నమూనాలుగా (Types) గ్రహించుట యుక్తము. ఇట్టివి నమూనాలుగా నమరుట వలననే దేశకాల భాషా తారతమ్యము లేకుండ నీ పాత్రలను కథాంశములును, ప్రపంచమందంతటను పోలికలు కలవియై భాసించుచున్నవి

కథా గీత లక్షణము లిట్లుండగా, దాని పుట్టుక యొక్క తీరుతెన్నులను గూర్చి పాశ్చాత్యులలో విభిన్నాభిప్రాయములు గలవు.

---

18. A. Mac Edward Leach-'Ballad'-
Dictionary of Folklore, Mythology & Legend.

F. B. Gummere వంటి ప్రజ్ఞులు, సామాన్య జానపద గీతమునకును, కథాగీతమునకును సరియైన హద్దులు నిర్ణయింపలేక, మామూలు జానపదగీతము వలెనే, కథాగీతముకూడ మానవుని యాదిమ దశయందే రూపునొందినదని యభిప్రాయపడిరి. జానపదులు, సమూహముగా నేర్పడి, ఆయా పరిస్థితుల కనుగుణముగా నవసరము వచ్చినపుడు కథాగీతకల్పనము (Communal improvisation) చేసిరని వారి నిర్ణయము.[19] ఈ యభిప్రాయము వలన, కథా గీత రచయిత యొకడు కాడని స్పష్టమైనది. తరువాత Kittredge మొదలగు విమర్శకులు పైయభిప్రాయమును పూర్తిగా త్రోసి రాజనక పోయినను, కొంత సవరణ చేయవలసిన విధముగా తీర్మానించిరి. జానపదులు, అనిశ్చితులును, అప్రత్యగ్రబుద్ధులును (Indefinite) అశిక్షితులును నగుటచే నింత కట్టుబాట్లతో నొక పద్ధతికి లోబడిన కథాఖండమును, సమూహముగా చేరి నిర్మింపజాలరనియు, పండితుల [illegible], ఛాయకులను నొక నాయకుని పర్యవేక్షణ క్రిందనే యట్టి కథాఖండ నిర్మాణము సాధ్యమగుననియు వారి యభిప్రాయము.[20] ఈ విధముగా, కథాగీత నిర్మాణము జానపదులదే యైనను తత్పర్యవేక్షణమును రూపకల్పనా చాతుర్యమును, ఒక్క వ్యక్తికి చెందినదిగా గుర్తింపబడినవి. తరువాతి విమర్శకులు, M.J.C Hodgart మొదలగువారు, సామూహిక కర్తృత్వ సిద్ధాంతమును త్రోసిరాజని, కథాగీతము లన్నియు నేకవ్యక్తి కృతకములే యను నిర్ణయమునకు వచ్చిరి. వారి నిర్ణయ సారాంశమిది

1. కథా గీతములు ఏక వ్యక్తి కల్పనములుగాని సామూహిక కర్తృత్వము గలవి గావు.

2. ఇది మధ్య యుగమునకు చెందిన [illegible].

3. ప్రాక్తన మానవ సంఘమునకు చెందిన ప్రక్రియగాదు.

4. అనాగరిక మేధ [illegible] కథాఖండము.

---

19. F.B. Gummere - The Popular Ballad. 1907
20. G.L. Kittredge The English and Scottish Popular Ballads-Introduction 1904.

5. వీధి గాయకులు (Ministrels) సంచరణ శీలురైన పండితులు కవులు (Wandering scholars & Bards) నిట్టి రూప ప్రక్రియకు జీవముపోసి యాదరించి నిలువబెట్టిరి. దీని జన్మమునకు వీరే కారకులు.

దీనిని బట్టి, ఐరోపీయ కథా గీతముల జననమునకు ప్రాక్తనత్వము లేదనియు, నవి మధ్యయుగమున నుత్పన్నమైనవనియు, పాశ్చాత్యుల్య యభి ప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది.[21]

కథా గీతముల పట్ల మిక్కిలి యాస్థ చూపి విశేష పరిశ్రమను చేసిన F.J. Child అను నాంగ్ల సాహిత్యకుఁడు ఆంగ్లస్కాట్ దేశపు కథాగీతములను దాదాపు మూడు వందల యైదింటిని ప్రోగుజేసెను.[22] వీనిని పరిశీలించి నచో నొక విషయము తెల్లము కాగలదు. ఇందు, వీర గీతమును (Heroic) అస్పష్ట చారిత్రిక గీతములు (Quasi historical) అద్భుత గీతములు (Romantic) భావ నిర్భర గీతములు (Sentimental) ప్రేమ గీతములు (Love songs) కలవు. చిట్టచివర కొన్ని హాస్యస్ఫోరకములైన (Comic songs) గీతములును చేర్పఁబడినవి. ఈ గీతముల యందు పొదుగఁబడిన కథనుగాని సంఘటనలను గాని పరిశీలించినచో, భారతీయ కథా గీతముల యందు ప్రముఖముగా కాన్పించు మత సంబంధి గీతములు కానరావు. బైబిలు నందలి కథలాధారముగా కొన్ని గీతములు కలవు గాని యవియన్నియు సాంఘిక విప్లవము (Reformation) తరువాత, గీతములుగా మలచఁబడిదే. అద్భుత గీతములయందు గంధర్వులు (fairies) జలదేవతలు (Mermaids) పరకాయ ప్రవేశములు (Transformation) మాంత్రికులు (Sorcerers) మంత్ర విద్యా పాటవములు (Sorcery) వంటివి, ఆంగ్లమున కాన్పించును. కాని జర్మన్ ప్రజలకు చెందిన పురాగాథలు (Myths) గాని, సాంప్రదాయిక కథలుగాని (Traditional stories) వీనియందు చోటుచేసికొనలేదు. ఇదే విధముగా క్రిస్టియన్ మతమునకు చెందిన కథలకైనను ఇచట నంతప్రాచుర్యము కలుగలేదు.

---

21. M.J.C. Hodgart-The Ballads London 1950.
22. F.J. Child-The English and Scottish Popular Ballads 1904.

ఆంగ్లమునందలి కథన గీతములు మధ్య యుగమునకు (Medieaval Age) చెందినవిగా విమర్శకులచే నిర్ధారింపఁబడినవి. నిజమున కే జానపద గీత మునకైనను దాని కాల మిదయని నిశ్చయించుటకు వీలుపడదు. ఒక గీతము నందలి కథాబీజములను బట్టియు, నందు ప్రతిబింబించెడి యస్పష్ట చరిత్రను బట్టియు, నా గీతము జనించుటకు వీలైన ఆవలి హద్దును నియమింపవచ్చునేమో కాని, అట్టి సంఘటన జరిగిన యెంతకాలమున కీ గీత ముద్భవించినదో నిర్ణయించు నీవలి హద్దును గుర్తుపట్టుట సాధ్యముకాదు. సాధారణ సూత్రము క్రింద బ్రిటిష్ కథాగీతములన్నియు 14 వ శతాబ్దికి చెందినవని నిర్ణయింపఁబడినవి. అట్లే ఐరోపీయ దేశములలో కథా గీతోత్పత్తియు ఇంచుమించు ఈ కాలముననే జరిగినట్లు నిర్ణయింపఁబడినది.

| | | |
|---|---|---|
| డేనిష్ కథా గీతములు | —— | 14 వ శతాబ్ది పూర్వ భాగము |
| స్పానిష్ కథా గీతములు | —— | 14 వ శతాబ్ది మధ్యభాగమున |
| ఫ్రెంచ్ కథా గీతములు | —— | 15 వ శతాబ్ది |

దీనిని బట్టి పాశ్చాత్య కథాగీత జన్మ చరిత్ర మిక్కిలి ప్రాచీనమైనది గాదని స్పష్టమగుచున్నది. మధ్య యుగమందలి వాఙ్మయ పరమైన యనేకానేక శాఖల వికాసముతోపాటు జానపద మేధా సంబంధియగు నీ కథాగీత శాఖయు పుట్టువు నొంది యభివర్ధితమైనదని పాశ్చాత్య విమర్శకుల విశ్వాసము. మధ్య యుగములలో కన్పట్టెడి కాల్పనిక వాఙ్మయమునకును (Romance Literature) కథా గీతముల యందలి కథాంశములకును పోలికలు మిక్కుటముగా కలవు. కాల్పనిక శాఖకు చెందిన కథలలో నెట్టి నమూనాలు (Types) చోటుచేసి కొన్నవో, కథా గీతముల యందును నట్టి నమూనాలే కన్పించుట మనము చూడ వచ్చును. 'Lais' కును కథా గీతములకును దగ్గరి పోలికలు కలవు. కథా గీత ముల యందు వలెనే 'Lais' నందును ఒకే ఒక ప్రముఖమగు సంఘటన చుట్టును కథ యల్లబడి, చిన్న పాదములలో వాడఁబడి, దాని ప్రాముఖ్యము చివఱి వరకును కాపాడఁబడును. ఈ విధముగా కాల్పనిక వాఙ్మయపు ప్రభావము కలిగిన కథా గీతము లన్నియు రెండవ దశకు చెందినవనియు, నిట్టి ప్రభావము లేనివి, దాని కంటె కించిత్పూర్వమైన మొదటి దశకు చెందిన వనియు విమర్శకుల మతము.

ఇట్లు పాశ్చాత్య కథాగీత స్వరూప స్వభావములను కొంత సమగ్ర దృష్టితో పర్యాలోచించిన వెనుక, దానికిని, తెలుఁగు నందలి కథా గీతములకును గల సామ్యభేదము లెట్టివో యెఱుంగఁజూచుట సమంజసము.

1. కథనము (Narration) వారికిని మనకును సత్యపసరమైనదియు. ప్రాముఖ్యము వహించునదియు.

2. రెంటి యందును పల్లవియో, పంతయో, సంభాషణాత్మకతయో కలదు.

3. రెండును సంగీత విరహితములుగ మన జాలనివి.

4. రెండును సమకాలికమైన సాంప్రదాయిక కవిత్వ పద్ధతికి విధేయములు కానివియు, స్వతంత్ర ప్రపిపత్తి కలవియు.

5. రెండును వాని కర్తయొక్క వ్యక్తిత్వపు ఛాయలు పొందక, నీతి బోధకములు కాక, రచయిత ఒక్కఁడో, సమూహమో ఏర్పరింపరాని అజ్ఞాత స్థితిని కలిగినవి.

6. ఛందమునందును, భాషా ప్రయోగముల యందును సంప్రదాయ కవిత్వ భిన్న మార్గములు కలిగినవి.

ఈ సామ్యము లన్నియు నిట్లుండగా తెలుఁగు కథాగీతమును, పాశ్చాత్యుల Ballad స్వరూపమును ఒక్కటియే యని గుర్తించుటకు వీలుకాని ప్రధాన భేదము ఒకటి కలదు. అది కథా విషయికమైనది. కథనము రెండింటి యందును ప్రధానాంశమే యైనను, కథయొక్క స్వరూపమున రెంటికిని మధ్య విభేదము స్పష్టముగా గోచరించును. తెలుఁగు కథలలో, ఒక రాజును గూర్చియో, సతీ మహత్త్వమును నెఱపెడి పేరంటాలిని గూర్చియో, అద్భుత కార్యముల నాచరించు వీరపురుషుని గూర్చియో, సంపూర్ణ కథనముండును. కథానాయకుని పుట్టుటకు ముందు నుండియు కథ మొదలై, యాతని జననము, బాల్య యౌవన దశలును, సాహస కార్యాచరణము. వివాహ సంరంభము, మొదలగు నంశములతో కథసాగును.

నాయకుఁడు, రాకుమారుఁడైనచో మకుటాభిషిక్తత తోడను (కాంభోజరాజు కథ) వీరుడగుచో, యిష్టకార్యసిద్ధి తోడను, (బాలనాగమ్మ కథ) సామాన్య యువకుఁడైనచో రాజ్యలాభము తోడను (శివసుమాపని కథ), భక్తుఁడగుచో పరమేశ్వర దర్శన లోభము తోడను, (సిరియాలుని కథ), కథ సుఖాంతముగ ముగియును.

అందువలన ఏ కథాగేయములైనను, కథకులు రెండు మూడు రాత్రులకు మించి చెప్పునంతటి నిడివి గలవిగా నుండుట జరుగుచున్నది. ఆంగ్లము నందలి Ballad కథ కీ లక్షణము లేదు. అచటి కథాకథనములందు నాయకుని కంటెను, నాయకుని ప్రవర్తనను నియమించు సంఘటనకే, ప్రాముఖ్యముండుట మనము గమనింప వచ్చును. ఇచట నాయకుని పూర్ణ జీవిత చిత్రణమునకు చోటు లేదు. అనగా నీ కథలు ఒక వ్యక్తికి ప్రాముఖ్యము నిచ్చునవిగా కాక, ఒక బలమైన సంఘటనను వర్ణించుట కుద్దేశింపఁబడినవిగా కన్పించును.

మఱియు పాశ్చాత్య కథన గీతములన్నియు మధ్య యుగమునకు చెందినట్లుగా నిర్ధారింపబడినట్లు గ్రహించితిమి. అంతేకాక ఇది జానపద కళయే యైనను, నాగరకతా వాసన కలిగిన సంచరణశీలురైన గాయకుల వలనను, కవుల వలనను సభిమానింపఁబడి యుద్ధరింపబడినదని పాశ్చాత్య విమర్శకుల విశ్వాసము. అనఁగా మధ్యయుగమున, కించిన్నాగరకులైన కవులును, గాయకులును, సంతకు పూర్వమే జానపద జన జీవితమునందు స్థిరపడి మఱుగున నున్న కథాగీతముల నుద్ధరించి వానికి ప్రచారము నిచ్చి యవి జానపదుల వలననే వ్యాప్తిలోనికి వచ్చుటకు ప్రోత్సాహము నిచ్చి యుందురని యనుకొనవలయును.

తెలుగు నందలి యీ కథా గీతముల చరిత్ర యందుకు భిన్నముగా నుండును. పాశ్చాత్య సాహిత్యకులు సేకరించిన కథాగీతములను పరిశీలింపఁగా వానియందు మత పరములైన గీతములు లేవని గ్రహింపవచ్చును. తెలుఁగు కథాగీతములయందు దసంఖ్యాకములైన గాథలు మతపరమైనవి. వీరాద్భుత చారిత్రిక గాథలిచటఁగూడ కాన్పించినను, వీనిని మించిన సంఖ్యలో విరివిగా కన్పించునవి మతసంబంధి గాథలే. ఈ గాథలయందు ప్రతిబింబించిన మతమైనను మధ్యయుగమునకు చెందిన వీరశైవ, వీరవైష్ణవ సంబంధి యగు మతాంశము మాత్రమే కాక, ప్రాఙ్మానవుని మేధావిలసనమునకు చెందిన మాతృపూజా విధానము

(Mother Goddess worship) ఆత్మారాధన (Animism) భూతారాధన (Ancestral worship) జంతుపూజా పద్ధతి (Totemism) మొదలగు సతి ప్రాచీనాంశములతో పరిపుష్టమై విరాజిల్లుచున్నది. దీనిని బట్టి తెలుగునందు కథాగీతావిష్కారము మధ్యయుగమునకు పూర్వమే జరిగి యుండవలయుననుట స్పష్టము.

అట్లని దీనిని మఱియు ప్రాక్తన దశకు (Primitive) చెందినదానిగా చెప్పుటకుగాని, మిక్కిలి యనాగరకులును, మృగదశనుండి విడిపడుచున్నవారు (Barbarians) నగు నాటవికుల చేతియందు రూపుదాల్చిన కళయనిగాని చెప్పుటకు వీలులేదు. అక్షరజ్ఞానము లేకపోయినను, భావసంపద పుష్కలముగా కలిగిన జానపదులు, ఆనాటికే తమ జీవన మార్గమున నెలకొనియున్న మత సంబంధి గథలను, తమ నమ్మకములకు సంబంధించిన యనేకానేక సంఘటనలతో కూర్పబడిన కథలను, నెఱిగియుందురు. అట్టి పురా కథలను (Myths) సమకాలిక సంఘటనలను, జనపదవి తమునగల భావ పౌష్కల్యముచే వానికి మెఱుగులు పెట్టి కొంత సంస్కృతి దశకు పెరిగిన ఆదిమ మానవుఁడు, కథాగీత నిర్మాణమునకు కారకుఁడై యుండవచ్చును. అనఁగా కథాంశము పురాతనమును, ఆదిమ దశావిర్భూతమును, నైనను దానిని గీతికాబద్ధము చేయుటయు, తాళలయాన్వితముగా, కించిన్నృత్తానుసారిగా, వాద్య సహాయకముగా, దానిని జన సమూహాము నెదుట ప్రదర్శించుటయు, మానవుఁడు ఆటవికదశ నుండి కొంత పెరిగి సంస్కృతిపరు డైననేగాని సాధ్యపడదు. ఇట్టి నిర్మాణము మొదలైన నాటినుండి, సంవత్సరముల తరబడి కాలము ననుసరించి, యందలి కథాంశము, కథన పద్ధతి, మార్పులు చేర్పులు చెందుచు జానపద జనజీవితమున వ్రేళ్ళూని పెనవేసుకొనిపోయి యుండ వచ్చును. ఆ విధముగా నొక స్థాయికి వచ్చిన యీ కళాప్రక్రియను చూచి,ముగ్ధులైన కవులును, రసజ్ఞులును, దానిని చేపట్టి యందలి స్ఖలితరూపములను, పామర జనోపయుక్తములగు పదబంధములను, గణయతి భంగములను మార్చి దానికి సాహిత్యము నందొక స్థానమును ప్రసాదించినట్టి తృప్తిని పొందుట జరిగినది. శ్రీనాథుఁడు చేపట్టిన పల్నాటి వీర చరిత్రయు, ఎల్లన చేపట్టిన కాటమరాజు కథయు నిట్టివే.[23]

23. పినయెల్లయ - కామరాజు కథ - 1953; శ్రీ నాథుఁడు పల్నాటి వీర చరిత్ర - 1961

ప్రపంచ సాహిత్యము నందు విశిష్ట స్థానమును సంపాదించిన భారతీయుల తొలి కథాగీతము 'రామ కథ' యని చెప్పవచ్చును. వాల్మీకి తనచే రచితమైన, శ్లోకాత్మకమైన రామాయణ గాథను లవకుశులకు నేర్పి, వారిచే పాడించి ప్రచారము చేయించెనను విషయము రామాయణము నందే కలదు.[24] రామాయణ కాలమును గూర్చి విజ్ఞులలో ననేకాభిప్రాయములు కలవు. 3000 బి. సి. నుండి 500 బి. సి. వరకును గల కాలములో నెపటనైనను నీ మహాకావ్యము జనించినట్లుగా విమర్శకులు భావించుచున్నారు.[25] పాశ్చాత్య విమర్శకారుల అభిప్రాయము ననుసరించి గ్రహించినను, రామాయణ రచన 500 బి. సి. ముందే జరిగియుండునని విశ్వసనీయముగా గ్రహించవచ్చును.[26] రామ పుత్రులగు లవ కుశులు తా మయోధ్య యందు పాడిరను నుత్తరరామాయణ గాథయే సత్యమగుచో నీ కథాగీతముల యునికి రామాయణమంత పురాతనమైనదని యొప్పుకొనక తప్పదు. అట్లే హోమర్ యొక్క ఇలియడ్, ఒడిసియస్ గాథలు గ్రీకు దేశమున నానాడు వీధి గాయకులచే పాడబడెడివను వాడుకయు గలదు. ఈ గాథలు వైయక్తిక రచనలు కావనియు, నానాటికి జనులలో గేయరూపమున వ్యాప్తిచెందిన అవేద్య కర్తృకములైన వీనిని హోమర్ సమీకరించి, సంస్కరించెనే గాని, స్వతంత్రముగా వివరింప లేదనియు, విజ్ఞులలో నొక ప్రచురాభిప్రాయము గలదు[27] మరి కొంద రాధునికులు హోమరను నామము ఒక కాలమునకు గాని, దేశమునకు గాని చెందదని, పలువురు వ్యక్తుల సమూహమునకు చెందినదని తలంతురు. ఏది యేమైనను హోమర్ కాలము 900 బి సి యని యభిప్రాయము కలదు.[28] అనగా నానాటికే గ్రీకు వీర గాథలలో నగ్రగణ్యములైన ఒడిసియస్, ఇలియడ్‌లే ఆనాటి కథాగేయములకు జీవత్తార్కాణములని విశ్వసింపవచ్చును.

---

24. వాల్మీకి సంస్కృత రామాయణము
25. [1] రామాయణ మహాభారత పౌర్వాపర్య విమర్శ-మల్లాది సూర్యనారాయణశాస్త్రి-సంస్కృత వాఙ్మయ చరిత్ర Part II.
 [2] Agarwal – A short History of Sanskrit Literature 1963
26. A. A. Macdonell– History of Sanskrit Literature. 1965
27. Encyclopaedia Britannica
28. Encyclopaedia Britannica

200 బి. సి. కి చెందిన భరతుని నాట్యశాస్త్రమునందు సూత్రధార ప్రసక్తి[29] యుండుటయు, సంస్కృత మహాభారతమున గల మాపోప జీవనమును విషయమును గూర్చి నీలకంఠ పండితుడు వ్యాఖ్యానించుచు నది బొమ్మలాట యని తేల్చుటయు[30] చూడగా, బొమ్మలాటల యునికి, క్రీ.పూ. 2, 3 శతాబ్దులకంటె, వెనకకు పోవుచున్నది. అర్థానుసారియైన నటనము, వేషధారణల యొక్క ప్రమేయము లేక, కేవలము అంగచాలనము కలిగి కథాయుతములై పాడబడెడి గీతములే, బొమ్మలాటల కంటెను ప్రాచీనమైన పుట్టుక కలిగియుండు ననుట యుక్తిసహము మానవ మేధ యొక్క వికసన చర్యలో సరసములును, నాతి క్లిష్టములునైన విషయముల సృజనముండును. ఆలోచనా పరిణతములును, క్లిష్టములునైన విషయముల యుద్భవము తరువాత, జరుగుచుండును. తెర బొమ్మల నాడించియు సంభాషణలో పాత్రలను రూపుకట్టియు, విలసిల్లిన మేధ అంతకు ముందెప్పుడో గీతముల యందు కథను బంధించి దానిని ప్రేక్షకవర్గము (శ్రోతృవర్గము కూడ) ముందు లయాన్వితముగ పాడుట నేర్చుకొనియుండవలయును. మహాభారతమున చర్మ పుత్రికా ప్రసక్తి యున్నదని నమ్మినచో రామాయణము సాక్షాత్తు రామ పుత్రులచే గానము చేయబడినదని నమ్ముటలో విప్రతిపత్తి లేదు. ఎప్పుడును తోలు బొమ్మలును, చెక్క బొమ్మలును ఆడించు వారి కంటెను, పద ప్రవర్తకులే ప్రాచీనులని యొప్పుకొనక తప్పదు. ఋగ్వేదము నందలి దాశరాజ్ఞయుద్ధము నిశ్చయముగా వీర కథానక గీతమును దలపించుచున్నది [31] ఈ విధముగా నూహ సారించినచో భారతీయ కథాగీతముల సృజన పాశ్చాత్య కథా గీతముల వలె 13, 14 శతాబ్దులకు చెందనదిగా కాక, క్రీస్తు పూర్వపు శతాబ్దులకు చెందినట్లు నిర్ణయించుటలో నసామంజస్యము లేదు. సంస్కృతమున నింత ప్రాచీన కాలముననే విస్తరిల్లిన ట్లుపపత్తులను కలిగిన యీ కథాగీత ప్రక్రియ,

---

29. నాట్య శాస్త్రము-

30 సంస్కృత మహాభారతము- నీలకంఠ సంపాదకీయము.

31. ఈ యుద్ధ కథనమును గూర్చి విపులముగా శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారు వివరించియున్నారు. లక్ష్మీరంజన వ్యాసావళి - పేజీలు 244 - 258 - ఎ. 1968.

వివిధ భారతీయ భాషలలో, నాయా భాషల పరిణామ వికాసములు పొందుచున్న వివిధ దశలలో జనసమంది, ప్రాముఖ్యమును పొందెనని యూహింప వచ్చును.

తెలుఁగు నందు దాదాపు ఏ శతాబ్దమున నిట్టి గాదాగీత విలసనము మొదలైనదో చెప్పుట కాధారములు లేవు. తెలుఁగు రాజైన హాల శాతవాహనుని సంకలనమగు గాధా సప్తశతి యందు పాటల ప్రసక్తి చాల చోటులఁ గలదు[32] ఆనాఁటికి తెలుఁగు భాష యొక్క యునికి కలదని గాధా సప్తశతి యందు చోటు చేసికొనిన యనేకములైన తెలుఁగు పదములు నిర్ధారణ చేయును.[33] కాన నట్టి పాటలు ఆనాఁటి తెలుఁగు భాషయందును నుండియుండు ననుటలో నసామంజస్యము లేకపోయినను, వాని స్వరూప స్వభావము లిట్లుండునని నిర్ణయించుటకు మన కితరాధారములు లేవు. హాలుఁడు ప్రాకృత 'గాథల'ను సేకరించినట్లుగా నానాఁటి తెలుఁగు గేయగాథలను సేకరించుట కెవరును పూనుకొనక పోవుట తెలుఁగు జాతి దురదృష్టము. తెలుఁగులో శాసనములు తొలుదొల్తగా నాఱవ శతాబ్దియందు వెలువడినట్లు నిర్ధారింపఁబడినది. (రేనాటి చోళుల - కలమళ్ల శాసనము). ఆనాఁటి నుండి చెదురుమదురుగా తెలుఁగులో, పద్య రూపమున కాన్పించు శాసనములలో నెచటను కథాగీత ప్రసక్తి కానరాదు. అట్లే ఆది కావ్యమై, తెలుఁగు భాషలో స్థిర పీఠమును పడసిన మహా భారతము నందును, వీని ప్రసక్తి లేదు.

నన్నెచోడుని కుమార సంభవము నందు గౌడుగీతముల ప్రసక్తి కలదు.[34] పరమేశ్వర ప్రసాద లాభము కోరి యడవి యందున్న పార్వతీదేవి యచటి స్త్రీలు పాడెడి గౌడ గీతములను వినెనని యున్నది. జానపద గేయ సాహిత్యము నందు డా॥ రామరాజు గారు గౌడు గీతముల ప్రసక్తి కొనివచ్చిరి.[35] "గౌడ జాతివారు

32. గాధా సప్తశతీ సారము- తెలుఁగు. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ - పే: 25; 144.

33. ప్రాఙ్నన్నయ యుగము. డా॥ దివాకర్ల వేంకటావధాని.

34. నన్నెచోడుఁడు - కుమార సంభవము - 4 వ అ. 112 ప.

35. డా॥ బి. రామరాజు - తెలుఁగు జానపద గేయ సాహిత్యము- పే. 491. ఎడిషన్ 1958.

పాడుకొను గేయములను గౌడు గీతములందురు. నన్నెచోడుడు పేర్కొన్నది గౌడజాతి కన్య లొకరి వెనుక నొకరు పరుగులు పెట్టుచు పాడుకొన్నట్టిది" యని వివరించిరి. మఱియు గౌడులకు కాటమహేశ్వరుఁడారాధ్య దైవము. క్రొత్తగా కల్లు గీయునపుడును, తాటి ముంజలు తీయునపుడును, ఇంటిలో జరిగెడు ప్రతి శుభకార్యమునకును వీరు కాటమయ్యను పూజింతురు. ఈ కాటమామహేశ్వరుఁడు శ్రీ శంకరుల సమకాలికుఁడనియు, నీయన శిష్యుఁడగు గౌడుని సహాయము వలన మండన మిశ్రుని కోటను శంకరాచార్యులు దాట కలిగెరనియు నొక యుదంతము కాటమహేశ్వర చరిత్రమున కలదని రామరాజుగా రుటంకించిరి.

అంతియేకాక గౌడుల కులదైవమగు నీ కాటమ మహేశ్వరుని పేర ననేకానేక గాధలు ప్రచారములో నున్నవి. కౌండిన్య ఋషికి చెందిన తాటివనమును రాక్షసుఁ డొకఁడు కురూపియై వచ్చి పాడు చేయుచుండెనట. అందుకు చింతించి యా ఋషి పరమేశ్వరుని గూర్చి ప్రార్థించెను. మహాదేవుఁడు భక్తుని మొర యాలించి, తన మెడనున్న రుద్రాక్ష తాపళమునుండి, యొక మహావీరు నుద్భవింపఁజేసెను. అతడే "కాటమయ్య" యనియు, "కట్టంరాజు" అనియు పిలువఁబడెను అతఁడు గౌడుల కులదైవమై వెలసి యనేక మహత్తులను పచరించెను.[36] ఆ మహత్త్వమును వెల్లడి చేయు ననేకానేక గాథలు కాటమయ్య జాతరలయందు గేయ రూపమున పాడఁబడుట మనము గమనింపవచ్చును. ఇన్ని కథలను తన చుట్టును అల్లుకొనగలిగిన ప్రాముఖ్యముగల కాటమరాయని ప్రశంసాగీతములే నన్నెచోడుని నాటి గౌడు గీతములగునేమో; ఈ కాటమరాయఁడును, గొల్లల కాటమ రాజును నొకటి కారను డా.రామరాజుగారి యభిప్రాయము సరియైనదే. అందువలన, నన్నెచోఁడుని నాటికి "గొల్లల కాటమరాజు" లేఁడు కదా యను సందేహమున కిచట చోటు లేదు. ఇట్లీ గౌడు గీతములయందు కథ నిక్షిప్తమై యున్నదనుకొన్నచో, తొలి కథన గీతము తెలుఁగు సంప్రదాయ సాహిత్యమున కుమార సంభవమునందే తొలుదొల్త నుటంకింపఁబడినదని చెప్పవచ్చును. పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రయందు, బొమ్మలాటలను పేర్కొనెను[37]

---

36. Syed Siraj Ul Hassan – The Castes and Tribes of H. E. H. the Nizam's Dominions–Vol. 1–1920.

37. పాల్కురికి సోమన – పండితారాధ్య చరిత్ర-పర్వత ప్రకరణము- Page 435–1939

అందును తోలుబొమ్మలాడువారిని, కొయ్యబొమ్మలాడువారిని గూర్చి చెప్పెను. అంతేకాక, బసవ పురాణమున భక్త కూటువలయందు భక్త చరితలను కథలుగా పాడు వారిని చెప్పెను.[38] శ్రీశైలయాత్రా సందర్భమున మాపటి వేళలయందు వేలముల విడిసిన పిచ్చుకుంట్లు, భక్తవరుల గాథల నుగ్గడించుచు యాచన చేయుట వక్కాణించెను. బసవపురాణమున కోలాటమును, గొండ్లి పేరణి, కేళికల వంటి జానపద నృత్యములు పేర్కొనఁబడినవి. వేణు వీణావాద్య వితతుల యులివుతోఁగూడిన యానంద గీతములను, శంకర గీతములను పాడువారు పేర్కొనఁబడిరి.[39] అంతేకాక పాటిజాతరలును, వీరభద్రుని జాత్రలును నుగ్గడింపఁబడినవి[40] జానపద నృత్యములిందు బేర్కొనఁబడుటచే పరిణామక్రమమున వీనికంటె తొలి స్వరూపమగు, గేయగాథావిన్యాస మానాఁటికున్నట్లే యగును. గేయగాథలు పచరించుట కనువగు జాతరలును ఇందు బేర్కొనఁబడుట యీ యంశమున కుపబలకముగా నున్నది. దీనిని బట్టి, భారతమునందీ జానపద కళాప్రసక్తి లేకపోవుటకు, అది యనువాదమను విషయమును కారణముగా సంగీకరించినచో, తెలుఁగు సాహిత్యమున తొలుతటి నుండియు, నీ గేయ గాథల ప్రసక్తియు, దీనితో సంబంధము కలిగిన బొమ్మలాటలవంటి జానపద కళాప్రసక్తియు నున్నదనియే తెల్లమగుచున్నది. సంస్కృతాంధ్రముల యందు, అసమాన ప్రతిభ కలిగి యుద్దండ లీల కవిత్వము నెఱపిన శ్రీనాధుని వంటి ప్రౌఢ కవియే యీ జానపద కథా గేయముల యెడల మోజుచెంది యానాటికే ప్రచారమందున్న పల్నాటి వీరగాథను కొంత సంస్కరించి వెలయించె ననవచ్చును. ఈ విధముగా జానపద కథాగీతము తెలుఁగున పుట్టిన కాలమెద్దియో నిర్ణయింపలేము గాని, తెలుఁగు భాష సాహిత్యదశ సందిన నాటినుండియు దీని ప్రసక్తి కలదని నిర్ణయించుటకు విప్రతిపత్తి లేదు.

కథాగీతము లన్నంతనే కాలికి గజ్జకట్టి చేత వాద్యము ధరించి వంతపాటగాండ్ర సహాయమున నావేశపూరితుఁడై ప్రేక్షక లోకము నెదుట కించిదవయవ

---

38. పాల్కురికి సోమన -బసవపురాణము చతుర్థాశ్వాసము-పే. 108(1952)

39. పాల్కురికి సోమన - బసపురాణము - ప్రథమాశ్వాసము - పే.20

40. Ibid తృతీయాశ్వాసము - పేజీలు 58, 62

సామ్యవైషమ్యములను చర్చించుటవలన, నీ జాతి జానపద కళకు ఏక సూత్రత యేమైన కలదేమో కనుగొనుట సంభవము కావచ్చును

1. హరికథ :-

హరికథలయందు, సంప్రదాయ సాహిత్యము నందలి యనేక కథలు గ్రహింపఁబడి యక్షరశుద్ధి యున్నవాఁడును, భారత భాగవతాది గ్రంథముల యందలి పద్యములను కంఠగతము చేసికొని వానిని కథాపరముగ మధ్య మధ్య సందర్భానుసారముగ చెప్పింపఁగలవాఁడును నైన కథకుఁడుండుట కాన్పించును. ఈ కథకుని చేతియందు బుఱ్ఱకథల కథకుని చేతియందుగల తంబురా కాక చిఱుతలుండుటయు, వంతపాట గాండ్రకు బదులు పక్క వాద్యములను వాయించెడి హార్మోనిష్టులను, తబలా వాద్యగాండ్రను, నుండుట గమనింపవచ్చును. రెండు ప్రక్రియల యందును అభ్యాసమునకు గానమే వాహికగా నుపయోగ పడినను, దానిని ప్రదర్శించు పద్ధతులును, హంగులును వేఱు. రచనాంగములుగా బుఱ్ఱ కథల యందు మంజీర ద్విపదయు, నచటచట రగడలును, దరువులును, క్వచిత్తుగా నేలలును, వచనములును కాన్పించును. హరికథలయందు కొన్నాలు హిందుస్థానీ సంగీత [illegible] చేసుకొనును

ఈ విధముగా ఈ రెండు ప్రక్రియలను [illegible] సామ్యవైషమ్యముల నీ క్రింద చూపినట్లు పొందుపఱచుటకు వీలున్నది

1. రెండు ప్రక్రియలును, కథాగర్భితములై [illegible] వ్యాఖ్యాన [illegible] గా [illegible].

2. అభ్యాసమునకు రెండింటి యందును గానమే వాహిక.

3. కథాకథనమును రెండు ప్రక్రియల యందును ప్రముఖుఁడైన కథకుఁ డొక్కఁడే చేపట్టి నిర్వహించును.

4. ప్రక్క వాద్యముల తో [illegible], రెండు [illegible] కథకునకు ముఖ్యమైన యంగము.

5. రెండు ప్రక్రియలయందును, కథకులు, తాళలయాశ్రితమగు కించిదంగ చాలనముతో, ముందునకు వెనుకకును, నడుగులు కదుపుచు కథను చెప్పుదురు

మౌలికములైన గుణముల యందీ రెండు ప్రక్రియలకును సామ్యములు గోచరించుచున్నను, నిట్టి సమాన లక్షణములయందే, పరిణత బుద్ధివలనను, నాగరకత యొక్క ప్రభావము వలనను, నొక శాఖయందు కంటె మరియొక శాఖయందు కొన్ని మార్పులు జరిగి, తన్మూలమున నొకటి దేశి ప్రక్రియగను, మరియొకటి అట్టి దేశి ప్రక్రియ నుండియే జన్మమంది, క్రమవికాసమునొంది రూపు దాల్చిన మార్గప్రక్రియగను, నేర్పడినవి.

స్థూలముగా చూచినచో హరికథను జానపద కళయనుటకు వీలు లేని యంశములు కొన్ని ప్రచురముగ కానవచ్చును. అవి యీ క్రింద పొందు పరుపఁ బడుచున్నవి.

1. ఇది యక్షరాస్యులైన కథకులచే ప్రచురిత మగుచున్నది.
2. ఇందలి కథ సాధారణముగా రామాయణ భారతాదుల నుండియు, పురాణముల నుండియు నుద్ధరింపఁబడిన సాంప్రదాయికేతి వృత్తము.
3. కథా వాహిక యగు గానము దేశ్యముకాక, మట్లు, పార్శీమట్లు, తోహరాలు, హిందూస్థానీ రాగ పద్ధతులు, కీర్తనలు మొదలగు వానితో కూడియుండును. అచటచట దేశ్యములగు రగడలును, ఏలలు నున్నను, ప్రాచీన గ్రంథముల యందలి పద్యములు సందర్భానుసారముగ చొప్పఁబడుటయు కాన్పించును.
4. సహాయకములగు వాద్యములను పరిశీలించినచో, బుఱ్ఱకథయందు జమిడికె, తంబుర, గుమ్మెట, 'అందె' వంటి దేశ్యములగు నుపకరణములు వాడఁబడగా, హరికథల యందు పాశ్చాత్య నాగరకతా విస్తరణానంతరము ప్రశస్తిగాంచిన, హార్మొని తబలా వంటి వాద్యములు వాడఁబడుట కాననగును.

ఈ లక్షణములను పరిశీలింపగా, హరికథ, 'బుఱ్ఱకథ' యందలి మౌలిక లక్షణములపైననే నిర్మింపబడినదైనను, నాగరకతయొక్క ప్రభావము వలన, నా లక్షణములనే, తదనుగుణముగా మార్చి, తానుబుఱ్ఱకథ కంటెను వేరైన క్రొత్త రూపమును పొందినదనవచ్చును. అనగా, బుఱ్ఱకథ జానపద మేధో ద్భవమై, యసంస్కృతమై, జాత్యమై, భాసించిన కళకాగా, దాని ఛాయల ననుసరించి యుద్భవించినదేయైనను హరికథ, సంప్రదాయ కథా కవిత్వమును, నాగరక పద్ధతుల కనువుగా మలచబడినదియు, నక్షరాస్యుడైన కథకునిచే ప్రవర్తితమునైన, నాగరక కళయై భాసించుచున్నది.

హరికథయను నామము నందలి వాచ్యార్థమును గ్రహించి వేదకాలముననే ఈ ప్రక్రియ బీజరూపమున నున్నదనియు సకలపు రామాయణ గానము హరికథా రూపమనియు కొందరు వర్ణించిరి 44 ఈ విషయము నందలి సామంజస్య మెట్లున్నను. ప్రక్రియా పరముగ చూచినచో, నిది 17 వ శతాబ్ది తరువాత గాని ప్రబలము కాలేదనుట స్పష్టము. కావున జానపదుని ప్రాచీన సంపదయగు బుఱ్ఱకథకును, హరికథకును మధ్యగల యంతరము పెద్దది.

## యక్షగానము

డాక్టరు. జోగారావుగారి ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ననుసరించి క్రీ శ. 16 వ శతాబ్ది యుత్తరార్థమున నుండిన కందుకూరి రుద్రకవి యొక్క సుగ్రీవ విజయమే తొలుదొల్తటి యక్షగాన మనవలసి యుండును.45 యక్ష గానము గాన ప్రధానమైనది. ప్రదర్శనమున నృత్త నృత్యాత్మకత కలిగినది. రూపకోపయుక్తమైన రచనాంగము కలిగి, సాహిత్య ప్రక్రియగా భాసించినది. సుగ్రీవ విజయము ప్రదర్శన సౌలభ్యము కలిగిన రచన. వచనము లేకపోయి నను ఆఖ్యాన శైలి కంటె సంవాద శైలికి ప్రాధాన్యము నిచ్చునది. ఇందు

---

44. Sri M.S. Ramaswami Iyer - Kalakshepamu.

45. డా. య్యస్వీజోగారావు—ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర -

జంపె, త్రిపుటలతో రచన సాగును. ఈ లక్షణములను చూడగా, ప్రదర్శ నార్హతయు, సంవాద శైలియు, వేషధారణావసరమును, యక్షగానములు సాహిత్య స్థితిని చెందిన 16 వ శతాబ్ది యుత్తరార్థమున, వానియందు తప్పని సరిగా నెలకొన్న యంశములని నిర్ణయించుటకు వీలగుచున్నది. ఈ నిర్ణయమును సమర్థించు లక్షణములే సుగ్రీవ విజయము తరువాత, పండిత కవులచే రచింపబడిన యనేకానేక యక్షగానములలో కాన్పించును. అట్టియెడ కేవలము ఆఖ్యాన శైలికే ప్రాధాన్య మిచ్చునదియు, వచన సాహచర్యము కలిగినదియు, వేషధారణావసరము లేనిదియు నగు బుఱ్ఱకథతో యక్షగానము యొక్క భేదసామ్యముల నెన్నుట యెందులకన్న ప్రశ్న యుదయింపవచ్చును. జోగారావుగారి ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రయందు, దాదాపు మూడు వందల యేబది యక్షగానములు సమీక్షింపఁబడినవి. ఈ యక్షగానములన్నియు, ముద్రితములుగనో, అముద్రితములుగనో లిపిబద్ధములై యాయనకు వివిధ గ్రంథ భాండాగారములనుండి లభించినవే యని స్పష్టముగా తెలియవచ్చుచున్నది. యక్షగానముయొక్క పరిణత రూపమునకు తొలిహద్దు నాయన 16 వ శతాబ్దముగా నిర్ణయించి సుగ్రీవ విజయముతో దానికి నాంది వాచనము పలుక కలిగెను. నాగరకత నేర్చిన కవి హస్త నిర్గతమగుటచే నిది మార్గప్రక్రియగ నిర్ణయింపఁబడినది. 'యక్షగాన' నామ చరిత్రను గూర్చి చర్చించుచు, నాయన పూర్వము నుండియు కావ్యాదులలో దాని ప్రసక్తియు, స్వరూప స్వభావములను చర్చించెను. యక్ష, జక్కుల శబ్దముల గొని భౌమమగు యక్షజాతియే జక్కుల జాతి యనియు, తొలుదొల్త వారు పాడెడి శ్రీ మహాలక్ష్మి స్తుతి గీతములే, యక్షగానములనియు నిర్ణయించెను. ముద్రితాముద్రిత యక్షగానములను పరిశీలించి పండిత జన హృదయ రంజకమగునట్లుగా వీరు చేసిన కృషి యమూల్యమైనది. వీరు తమ పరిశోధనను కేవలము, ముద్రిత యక్షగానములకును, అముద్రితములై తాళపత్రములయందు లిఖింపఁబడి, గ్రంధాగారములయందు వెలుఁగు చూడక యున్న యక్షగానములకును, నియమితము కావించిరనక తప్పదు. అనఁగా, లిఖిత రూపమును పొందక కేవలము జానపద గళస్థములై, పరంపరగా తాతనుండి తండ్రికిని, తండ్రినుండి కుమారునకును సంక్రమించుచు, పరిరక్షింపఁబడుచున్న యసంస్కృత యక్షగాన స్వరూపమును చేఁజిక్కించు

కొనుటకు వారు పూనుకొనలేదు. యక్షగానముయొక్క పరిణత రూపమునకు తొలిహద్దును 16 వ శతాబ్దిగా నిర్ణయించుకొనుటవలన, వారికి ముందు కాలమున కేవలము మౌఖిక రూపముగనున్న యక్షగాన స్వరూపమును గూర్చి చర్చించు నవసరము లేదనుట సమంజసము.

కాని తెలుఁగు జానపద గేయగాథా సమాలోచనము చేయఁబూనుకొన్ననే నిచట యక్ష గానములను గూర్చియు, వానికి గేయగాథలతో గల సంబంధమును గూర్చియు కొంత వివరింపఁబూనుకొనుట ఉపస్థానప్రసక్త విషయము కాఁబోదు.

వివిధ జానపద కథాగీతములను, జానపదుని ముఖతః సేకరించుచున్న పట్టున నాకొక విషయము చిత్రముగా నవగతమయ్యెను. 'సిద్ధయోగమ'ను కథను[46] చెప్పెడి వాఁడొకఁడు తన్ను ఆసాదివాఁడనని చెప్పుకొనెను. ఆసాదులు గ్రామదేవతల కథలను, 'రేణుకా యెల్లమ్మ' కథలను చెప్పెదరు. సిద్ధయోగము నందలి కథ పురాణ కథా సువాసితము కాక కేవలము దేశ్యమనిపించుకొనెడి కథ. జమదగ్ని పత్నియగు రేణుక, సిద్ధులను పూజింపగోరి మేరు గిరిపై నున్న వారిని కొనితెచ్చుటకు తన పెద్దకొడుకగు జంపలేశ్వరుని నియమించెను. అతఁడు, పర్వతములు గడచి, యడవులు దాటి, చిక్కులలోఁజిక్కి, నానాకష్టము లనుభ వించి, చివఱకు వారిని తల్లి కడకుఁదెచ్చి యామె కోర్కెను దీర్చును. దీనిని పాడుచున్న అనాది వాఁడిది పదమనియే చెప్పెను. కాని యందు యక్షగాన లక్ష ణములైన 'కాంభోజి'. 'శ్రీశైల కాంభోజి' వంటి రాగ భేదములు, ద్విపద, వచనము, యాలలు, రేకులు మొదలగు ఛందో వైవిధ్యములు కాన్పించినవి.

ఉ. దా—

'శ్రీశైలకాంబోది' —ఆ యద్రి గిరులన్ని అలయ వెదకిరి
రేకులు— ఇక్కడ నుండ 'నాకేలా
నవలక్ష పర్వతము లెక్కినేఁజూచితి
ఇక్కడ నుండ నాకేలా

---

46. 'భువనగిరి' కి చెందిన 'నరసింహ' యనువాఁడీ కథను చెప్పెను ఈతఁడే 'తరిదేవికథ' ను గూడ చెప్పెను.

'కాంబోది' ...ఘనమైన యాగంబు గావించె దాసని
తనయుఁడ నే నమ్మికుంది
అనుమానము బెడితివి కార్యమె ర్త[47]మాయె
ఇఁగ యెట్లు నేనేమి చేతు...

'ద్విపద' ...ముద్దుటుంగర మందె మునిపుత్రు చేత
పంచె వన్నెల పక్షి నాదినాథుండు
పట్టుక వచ్చిన యా పక్షి నిచ్చె
శుద్ధి చేయుమని చెప్పె సురనాథుండు

'యేలలు' ...మేము మేర్వగట్లలోన
కండ్ల బడని కోన లోన
ఉన్నజాడ ఎట్లు దెలిసెరా!
అల్లవోవో జంపలేశ్వరా!
పగలు రాత్రిలేని చోటకు
గుర్తులేని గృహములాకు
ఎట్లు వస్తిరి వేగముగాను!
గట్టిగా నాతోను జెప్పుమి
అల్లవోవో జంపలేశ్వరా!

ఆయా రాగములు, నడక మారినపుడు, ఇది యేమని యడుగగా నాగేయ గాథా ప్రవర్తకుఁడే కాంబోది, శ్రీశైల కాంబోది, ఏలలు, ద్విపద యను పేర్లు చెప్పెను.

ఇట్టిదే తరిదేవి కథయు. ఇదలి రచనాంగములన్నియు యక్షగాన రచనాంగములతో పోలియున్నవి,

---

47. వ్యర్థమాయె -

తరిదేవి జమదగ్ని చెల్లెలు. సిద్ధమారాజు భార్య. ఈమె సంతానము లేక నోమును నోచి వ్రతములు పట్టి, శివునిగుడియందు ప్రాణాచారముండి, సంతాన వరమును పొందెను. పురిటి నొప్పులారంభము కాఁగా నిట్లు విలపింపసాగెను.

కీర్తన - దరువు

దేవినే కాని ఖాది (?) దేవినే
దేవినే నే దేవతాల నమ్మిన దేవినే
కాంతనే కరిరాజ వరదూని వేడెద
కాంతనే కాంతను నేనిక
తాళజాలనే.
వచనం – అమ్మ మీరెవ్వరూ

మోను చందురుని మించూ, ముఖము కాంతి
సూర్యుని మించూ సుందరి నీ నామము, నీ
భర్తపేరు, నీ పట్నము పేరు, నీ అత్త
మామల పేరు, నీ తలిదండ్రుల పేరు మాకు
విన్నవింపవే కోమలాఁగీ – కోరితి మీ
ముచ్చట కొదువ లేకా–

కీర్తన

నా నామము తరిదేవీ
నయమూతో వినవమ్మా మోహనాంగీ
నానాథుడూ సిద్ధమారాజు వినవమ్మా
మాజనకుడూ గౌతమా మునిశ్వరుడూ,
జనని అహల్యాదేవి జగతిలో వెలసెనూ
సప్తకోటి మునులు మాయన్నలో యమ్మా
నానామము తరిదేవీ నయముతో వినవమ్మా.

దరువు ... కలికిరో నే తాల జాల
ఒక్క కాను ఫె నాకు

ఎక్కాౘస మాయెను
కనిపెంచిన తల్లులారా
నా కష్టాలు కడ తేర్చరమ్మా
నాకు దూలాన తాడెయ్యరమ్మా

ద్విపద ... పనిబడినపుడూ ప్రార్థించి పిలిచేరు
తర్వాత మమ్మలా దలచ రెవ్వారు
నీలవేణికి తొలుత నీరాడ జేసితే
జరి కోక యి స్తనని మరచిపోయేనూ

దర్వు ... కంచు గొట్టరమ్మా
కాంతలు కల్మి జల్లరమ్మా
బోటిరో పాటించి చూచి
బొడ్డు గొయ్యరమ్మా
నూనె తుడుపులు బెట్టరమ్మా
పట్టు బట్టలు గప్పరమ్మా
బాలలకు మీరు—" ఇట్లు సాగుచున్నది.

దీనిని పరికించి చూడగా, నిర్మాణవైభవముచే నిది యక్షగాన మని పిలువఁబడు టకు తగియేయున్నది. కాని యీ కథా ప్రారంభము కేవలము పదము వలె సాగి నదే గాని, 16 వ శతాబ్ది తరువాత నాగరకులచే నొక రూపును దిద్దుకున్న యక్ష గాన ప్రక్రియ యొక్క ప్రారంభము వలె లేదు.

ఉదాహరణకు సుగ్రీవ విజయ ప్రారంభము

వ. నా యొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంబునకుం గథాక్రమంబెట్టిదనిన

సీ. శ్రీరామ చంద్రుండు సీతా మహాదేవిఁ
గాననంబున వెదుకంగ వచ్చి
పంపాసరోవర ప్రాంత్య భూముల యందు
సౌమిత్రియునుఁదాను సంచరింప

నా వేళ సుగ్రీవుఁడధిక సంభ్రమముతో
ఋష్యమూకమున వర్తించుచుండి
చూచి యా ఘనుల తేజో విశేషములకు
వెఱఁగంది మంత్రి కోవిదున కనియె

వీరు మనలను వధియింప వేష మొంది
వాలి పంపున వచ్చిన వారు గాను
నాకుఁ గాన్పించుచున్నది గాకయున్న
దాపసులకేల శరచాప ధారణంబు.

వ. అని పలికి యచ్చోట నిలువంజాలక భయపడుచున్నసుగ్రీవునితో హనుమంతు డేమనుచున్నాఁడు.

త్రిపుట – కపికులోత్తమ నాకుఁజూడఁగఁగపట
వేసము గానరాదిది
విపుల పుణ్యులచారమతులని వెఱచనేల
ఏల యిచటికి వచ్చిరో వీరెవ్వరో యీ
రూపవంతులు
చాల పరిశోధించి చూతము జడియ
వలదు
రాజవంశ్యులు రాజతేజులు రాజపురుషులు
రాజవీర్యులు
రాజసంబున నిటకు నేమిట రాఁగతంబో
ఈ మనోహర రూపవైఖరు లిట్టి తేజము గలుగు
వారికి
భూమి నెటువలె దుష్ట గుణములు పొడము నయ్యా
ఏను నచటికిఁబోయి వారల పూనికంతయుఁ
దెలిసి వచ్చెద

భాను నందన వెలిన నేటికిఁ బంపు నన్ను-" అనియున్నది.

ఈవిధముగా సుగ్రీవ విజయము సంప్రదాయము ననుసరించి ప్రారంభమై సీసమును, వచనమును గాన్పించి యా తదుపరి దేశి రచనమనదగు 'త్రిపుట' సాగినది.[48]

దీనికి ప్రతిగా 'తరిదేవి' కథా ప్రారంభము.

"ఎలిగొండ బుట్టినపుడు సలిగొండ బుట్టినాది
సలిగొండ బుట్టినపుడు ఎలిగొండ బుట్టినాది
ఎలిగొండ సలిగొండ ఏలేటి రాజు
సత్యమా గౌతుండు సమాన ధీరుండు
గౌతముని భార్య అల్యాదేవి
అల్యాదేవి కొమాండ్లు సప్తకోటి ఋసులు
ఋసుల తోడ బుట్టింది ముత్యాల తరిదేవి
ధాన్యములు నోమంగ బుట్టింది ధర్మతరిదేవి
పున్యములు నోమంగ బుట్టింది పున్య తరిదేవి"

ఇట్లు మిశ్రగతిలో నడచుచు నీ పదము, కథాగేయ లక్షణములు కలిగియుండి రాను రాను కథా మధ్యమున పైన పేర్కొనిన యక్షగాన స్వరూపమునకు దారి యిచ్చినది. ''సిద్ధ యోగము'' యొక్క ప్రారంభము గూడ యక్షగాన ప్రారంభమువలె గాక ''పదము'' ఆరంభింపబడినట్లే యారంభమైనది.

ఉదా: ''అప్పుడూ రేణుక అతి వేగముననూ
విప్రకుల జెంపన్న విజ్ఞానమూర్తి
నా మనవి యొక్కటి చిత్తగించయ్య
సిద్ధయోగంబునే చేయవలయూనూ

48, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయము.

శీఘ్రంబుగా బోయి సిద్ధులా వేగ
అతి వేగముగ బోయ ఆది నాథుణ్ణి
తేవయ్య పుత్రకా శీఘ్రంబుగాను''—

ఇట్టి యుదాహరణములను పరిశీలింపఁగా శ్రీయస్ వి. జోగారావుగారు నిర్ణయించిన యక్షగాన పరిణతస్వరూపము యొక్క కాలమునకు ముందే, అనగా 16 వ శతాబ్దికి ముందు, యక్షగాన స్వరూపము, జానపద కథాగేయ స్వరూపమున కలగలిసి, యుండెడిదనుటకుపపత్తులు లభించుచున్నవి. అనగా యక్షగానమునకా పేరు జక్కుల జాతినుండి వచ్చినను, దివ్యయోనులైన, గానప్రియులగు, యక్షులనుండి వచ్చినను, జానపద సమూహము మధ్య జాతరల యందును, పండుగుల యందును, దానిని ప్రవర్తించిన వారిలో కథాగేయ ప్రవర్తకులు గూడ కలరని సిద్ధాంతము చేయవచ్చును. అందుకు లిపి బద్ధము కాక, కథాగేయ రూపముతో కలగలసి యున్న యీ తరిదేవికథ సిద్ధయోగము కథ, వంటి ప్రక్రియలు తోడ్పడుచున్నవి శ్రీనాథుని కాలమున కేవలము గాన విశేషముగా నుగ్గడింపఁబడిన యక్షగానము, సుగ్రీవ విజయ కాలము నాఁటికి సుపరిణత రూపము నందినదనుట సత్యమే. కాని యీ మధ్యకాలమును నవఁగా గాన రూపకమగు యక్షగానమున అభినయము, వేషధారణ, సంవాదనపద్ధతి ప్రవేశ పెట్టఁబడి రూపక స్థితిని పొందుటకు ముందు, దానినా పరిణత స్థితికి తెచ్చుటకు తోడ్పడిన వారిలో, పదప్రవర్తకులును, గలరనుట సమంజసము.

తంబురా చేతఁబట్టి, కాలికి గజ్జె కట్టి, తందాన కథలు చెప్పెడి పిచ్చుకుంట్లను, బైండ్లవారును, శారద కాండ్రును, తీరిక మరింత లభించిన పట్టున, ఉత్సాహ మింక కొంత అతిశయించిన వేళ నైపథ్య రచనము చేసికొని, తాము చెప్పెడి కథాగేయమునే, సంభాషణా భరితముగను, వివిధరాగ సంపన్నముగను చేసి, దానిని యక్షగాన ఫక్కికలో నభినయయుతముగ ప్రదర్శించుట నేర్చి యుందురు. నాకు "శివకుమారుని కథ", "పరంజ్యోతి" కథ చెప్పిన 'తాండూరి కిష్టయ్య'—ప్రతిఫలముగ నొక పాత పట్టు చీరను పొంది, అది ఉత్సవ వేళ వేష రచనకుపయోగించునని సంబరపడెను. అతఁడు పగటివేళ కథలను పాడి భిక్ష మడిగికొనుచు, నొక్కొక్కసారి రాత్రివేళల, తమ జట్టు మనుష్యులను గూడి, స్థిరియైన దాత లభించినపుఁడదే కథను వేషరచనతోడను, అభినయాధిక్యము

తోడను, సంభాషణాంగ రాగవైపుల్యముతోడను, దానిని యక్షగాన ప్రక్రియగా ప్రదర్శించుట తమ కలవాటని చెప్పెను.

జానపద కళలలో సామూహిక గానము (కోలాటపు పాటలు, కలుపు పాటలు వ్రతగానము, గొబ్బిపాటలు, బతకమ్మ పాటలు వంటివియు) తొలుదొల్త మతాంగ ప్రదర్శకముగను, నాపైన శ్రమాపనోదన సాధనముగను, నామీద వివిధ క్రీడానుగతముగను రూపునొందినది. ఈ గానమునందు, ఆదిమ మానవ మేధా సంబంధి యగు కథాంశమును, ఆనాటి మతత్వరూపమును, సంఘనిర్మాణ మున నవలంబింపబడిన మౌలిక సూత్రములను, అతి మానుష శక్తిపైన నాతనికి గల మోజును, చక్కగా ప్రతిబింబింపఁ బడినవి. మానవుఁడు మరింత నాగర కుఁడై యాతని యాలోచనా శక్తియందు, క్రొత్త యంశముల పరిణామము రూపుదాల్చుట యారంభించిన దశలో నిట్టి కథనగీతములు, శ్రోతలును, ప్రేక్ష కులునైన జానపద సమూహము నెదుట కించిదంగ చాలనము తోడను, వాద్య సహాయకములుగను, ప్రదర్శితములైనవి. వీనినిట్లు ప్రదర్శించుట, జానపదుల సాహిత్య సంబంధి కళా వికసనమునకు తొలిమెట్టు. వీనియందే అభినయపుపాలు హెచ్చి, కథకుడును, వంత పాటగాండ్రును పాత్రలవలె మారి సంభాషణాత్మ కతకు జీవము పోసి, దానికి నైపథ్య రచన చేరినచో నది యక్షగానమైనది. 16 వ శతాబ్ది తరువాత నాగరక కవులచే నొక పరిణత రూపమును దాల్చి రాజ ప్రాపకమును బొంది, ప్రదర్శన యోగ్యములై జనపరిషత్తుల నలరించిన యక్షగాన లక్షణములను మనస్సులో నుంచుకొని వీనిని విమర్శింపఁబూనుకొని నచో, జానపదుల 'హృత్కవిలె' లైన వీనియందు వానియందు వలె నభినయపు పాలు హెచ్చుగా నుండదు. ఇచట, బుఱ్ఱకథల కంటె సంభాషణములు నెఱపుట యందు వంతపాటగాడు నిర్వహింపవలసిన విధి కొంత క్లిష్టమైనను, నాగరక యక్షగానములకు వలసినంత నైపథ్య రచనయు, తెఱ మొదలగు రంగస్థలాంగ ములును, వీనికి వలసినట్లు కానరాదు. దీనిని బట్టి, శ్రీనాథాదులు తడవిన యక్ష గానములయందు, బుఱ్ఱకథల లక్షణములతోపాటు, రచనాంగముననే కించిద్భేదమో కలిగి, కించిదభినయాత్మక మైన కథాగీతముల యునికియే స్ఫురించుచున్నది. అనఁగా శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణమున పేర్కొనిన యక్షగాన సరణియు, క్రీడాభిరామమందలి జక్కుల పురంధ్రి పాడుచు వచ్చిన కామవల్లి పాటయు

కొంచెముగా యక్షగాన లక్షణలక్షితములైన కథాగీత విశేషములను తెలుపు ప్రక్రియలేగాని, పరిణతములును, 16 వ శతాబ్దికి తరువాత మనకు కాన్పించు నవియు నగు యక్షగాన ప్రక్రియలు కావనుట పండిత జనసమ్మతమే కదా! జానపదుల కవితాలక్షణమును వెల్లడించుటకు తొలిసాధనమైన యీ బుఱ్ఱకథ యందే, కాలక్రమమున నభినయ చాతుర్యము చేరి, యది యక్షగానమై భాసించిన దని చెప్పుటలో నీ రెండింటికిని మాతృపుత్రికా సంబంధమున్నదని చెప్పుటకు వీలులేక పోయినను, మొదటి దానియొక్క (బుఱ్ఱకథ) స్వరూపమున, తొలి మానవుఁడు అభివృద్ధిపథమువైపు నడుగిడుచున్న పరిణామ దశలో వాని పరిణతోహలవలన కలిగిన, యనేకాంశముల చేరికవలన, రెండవ దానికి (యక్షగానము) రూపకల్పన జరిగినదని చెప్పుటలో నసామంజస్యములేదు. వీధి భాగవతము, కుఱవంజి, యక్షగానము అనునవి, గానాభినయములతోడి కథాకథనమును జీవలక్షణముగా కలిగి, జానపద కథాగీతములతో విడరాని యనుబంధమును కలిగియున్నవి.

## బొమ్మలాటలు

బొమ్మలాటల యందును కథాకథనమే యను స్యూతముగా నుండును. యక్షగానమున మనుష్య ప్రవర్తితమైన కథ యిందు బొమ్మలచే నభినయింపఁబడును. తెరమీద 'నీడ' ల బొమ్మలను, రంగముపై చెక్క బొమ్మలును, తోలుబొమ్మలును, కథానుగతముగా నాడుచుండగా బొమ్మలను కదుపువాఁడును, వాని యభినయమునకు సరియైన కథాకథనమును, గాన రూపమున చేయువాఁడును నగుసూత్ర ధారుడు, తెర వెనుకనుండును. ఇట్టి బొమ్మలాటల ప్రాచీనత క్రీ. పూ. 2,3 శతాబ్దులకు చెందినదానిగా నిర్ణయింపఁబడినది. తొలి మానవుని మేధా సంబంధియగు కథాంశమును, సాధారణ గానముతో చేర్చి, వినిపించుట కంటె, కించిదభినయ లక్షణము కలిగిన యక్షగాన రూపమున ప్రదర్శించుటయు, పాత్రల స్థానమున బొమ్మలను చేర్చి బొమ్మలాటల రూపమున నాడించుటయు, క్రమముగా నొకదాని కంటె నొకటి యర్వాచీనములు. కావున 'బుఱ్ఱకథ' ప్రక్రియ, దేశవ్యాప్తముగా, క్రీస్తు పూర్వపుశతాబ్దుల యందే యుండి యుండునని చెప్పుకొనుటలో నసామంజస్యము లేదు.

ఇట్లు, ప్రాచీనత కలిగిన యీ ప్రక్రియ యందు నెలకొని యున్న ముఖ్య లక్షణముల సారాంశమిది.

1. కథాకథనమే యుద్దిష్ట లక్ష్యము.

2. కథ, సాధారణముగా, మత సంబంధియు, నభౌమాంశములతో కూడిన నదియు నైన దశ దీని తొలిదశ. వీర ప్రశంస చేయునదియు చారిత్రిక సత్యముల నుగ్గడించునదియు నగు దశమలిదశ.

3. గానమును, వాద్యమును, నృత్త్యమును దీనికి సహాయకములు.

4. రూపకమునకు తొలిమెట్టనదగిన యక్షగానమున నెలకొన్న లక్షణముల నన్నిటిని బీజప్రాయముగా సంతరించుకొని, దానియొక్క మౌలిక రూపమని యెన్నదగినదీ ప్రక్రియ.

5. మత సంబంధి కార్యకలాపములను (Rituals), తొలి మానవ దశను చెందిన పురాగాథలను (Myths) వివరించు నవసర మేర్పడి మేర్పడి నప్పుడే, యీ ప్రక్రియ జన్మనందుట జరిగినది గాన, సాధారణముగా, పండుగ పబ్బములలోను గ్రామ దేవతలకు సంబంధించిన ప్రత్యేకోత్సవముల యందును (జాతరలు), నీ బుఱ్ఱకథలు ప్రవర్తింపఁబడుట కాననగును. రానురాను, వీనికి గల మత సంబంధమైన వైశిష్ట్యము నశించి, వీని ప్రవర్తకుల తీఱికనుబట్టి, యివి ప్రవర్తకము లగుచున్నవి— ఇందులో నొక శాఖ కేవలము కొన్ని కులముల గొప్పతనమును కీర్తించు కథలు చెప్పునదిగా మారుట తరువాత చేరిన యంశము.

ఇట్లు తొలి మానవుని మేథాపరిణామ వికాసములను తెలియఁజేయు నీ ప్రక్రియ జానపద వాఙ్మయ శాఖ లన్నింటి యందును తలమానికము వంటిది.

జానపదగేయ గాథలను, శ్రీనాథుని కాలము నుండియు, సంప్రదాయ సాహిత్యము ఎన్నియోచోట్ల పేర్కొనినది. శిష్ట సాహిత్యమున గల వీని ప్రసక్తి వి.

డా. రామరాజు గారు[49] విపులముగా ప్రదర్శించుటచే నా యంశమును తిరిగి తడవుట చర్వితచర్వణ మగును.

అట్లే గేయగాథా ప్రవర్తకులగు వివిధ కులముల వారిని గూర్చియు, వారుపయోగించు వాద్య వైశిష్ట్యమును గూర్చియు, ఛందో వైవిధ్యమును గూర్చియు, డా. రామరాజుగారు, క్షుణ్ణముగ పరిశీలించి, తమ సిద్ధాంతవ్యాస మున ప్రకటించి యున్నారు.[50] కావున నా విషయము లిట పునః ప్రసక్తము లగుట పిష్ట పేషణ న్యాయమున కుదాహరణము లగుటయే.

కాని, తెలుఁగు జానపద కథాగేయ ప్రక్రియతో వోలిన ప్రక్రియ యితర భాషల యందెట్లున్నదో, స్థూలముగ ప్రదర్శించుట యిచట యస్థాన పతితమగు విషయముకాదు.

జానపద కళ యెట్టిదైనను దేశకాలాభ్యంతరములు లేక, అవిచ్ఛిన్నముగ, స్వేచ్ఛా సుందరముగ పుట్టి పెరుగుచుండును. దాని యందలి పరిణామ క్రమము, దేశ వ్యాప్తముగ, నెట్టి భాషావరోధములను చూపక, పోలికలు కలిగి యుండును. మళయాళ దేశము నందలి కథాగేయ ప్రవర్తకునకును హిమాచల సీమయందలి వానికిని, పోలికలు కాఁనవచ్చు చుండును. వారు చెప్పు కథలలోని పురా గాథాంశములు (Mythical Elements) ఆదిమ మానవ మేధా సంబంధి యగు సంశములగుటవలన నేకత్వమును సూచించు బహు లక్షణ ములతో గూడిన, కథాకథన పద్ధతిని గలిగి భాసించుచుండును.

పదములకు, పదగాయకులకు, వారుపయోగించు వివిధ వాద్యములకు మధ్య, వివిధ రాష్ట్రమున యందు నామ విభిన్నతలేగాని, ప్రక్రియయందుగాని,

---

49. డా. బి.రామరాజు–తెలుఁగు జానపదగేయ సాహిత్యము పేజీలు
పేజీలు 39-52

50. Ibid పేజీలు 760 – 774
,, 788 – 789

ప్రయోజనము నందుగాని, ప్రయోగించు పద్ధతి యందుగాని, చెప్పుకొనదగు ప్రధాన భేదములు కానరావు.

ఉదాహరణకు, సిమ్లాకు 60 మైళ్ల దూరమున నున్న' జుబ్బల్ లోయలో గేయగాథా ప్రవర్తకులు కొన్ని కథలు చెప్పదురు.[51] వీరిని 'నాథీలు-జాగీలు' అందురు-చలికాలమున పరిసర ప్రపంచము హిమ ధవళావకుంఠనము కలిగి, ప్రజలు నిర్వ్యాపారులుగాగా, నీ గాయకులు, రాత్రివేళల యందు, కథాగానము చేయుదురు, చేత తంబురా వంటి వాద్యము ను ధరించి, ప్రక్క నున్న సహాయకుని వంత పాటతో వీరు చెప్పు కథా సమువాయము నందలి కథాంశము ప్రాచీన లక్షణములను సంతరించు కొన్నదే యగుచు. రాత్రులకు రాత్రులు ఒక్కొక్క కథ యవ్యాహతముగా సాగుచుండును.

ఒరియా దేశమున, మౌఖిక ప్రచారమును పొందెడి గేయ గాథలనుగూర్చి కొన్ని యంశములు తెలియవచ్చుచున్నవి[52] సంచరణ శీలురగు, నాథ్‌లు, చకులియాపండాలు, యోగినులు వైశాఖ, కార్తిక మాఘ మాసములయందుబిచ్చమెత్తు కొనుచు' నింటింటికిని దిరుగుచు కథాగేయములను పచరింతురట. వీరు చెప్పెడి గాథలలో "దెవుల తొల"(Deulatola) యను పూరి జగన్నాథాలయ నిర్మాణ గాథ ప్రముఖమైనది. సవరల జాతియందు ప్రచురముగా నున్న పురాగాథలు (Myths) వంశ కథనములు, వీరగాథలు ఎన్నియేని వీరి మౌఖిక ప్రచారమున' నిప్పటికిని జీవించియే యున్నవి. "సరళాదాస్" అను ఒరియా దేశపు కవి, దేశమునందు వాడుకలో నున్న యిట్టి కథల నెన్నిటినో తన కావ్యమునందు నిక్షిప్తము చేసెను. జాతరల సమయమున వివిధ దేవాలయముల యందు, పూర్వ రాజ వంశముల దివాణములకడ నిట్టి కథా గేయముల నెన్నియేని సేకరింపవచ్చునని మిశ్రాగారి యభిప్రాయము.

---

51. Main Goverdhaan Singh - The Ancient Ballads of Jubbal – Foklore – Vol. VI. No. 1. Jan 1965.
52. Narendranath Mısra – Qriya Ballads and Oral traditiont – Folklore – Vol. VI. No. 2–Feb, 1965.

కన్నడ దేశమున మౌఖిక ప్రచారమున నెన్నియేని గాథలు గలవు. అందు ప్రముఖ స్థానమును వహించినవి బసవేశ్వరుని (12 th Century) కాలము నాఁటివి. ఇవి "మంటేద స్వామి కథగళు" - మంటె లింగయ్య (ఈశ్వరుఁడు) కథలను పాడుచు వచ్చు నీ కథా ప్రవర్తకులను 'లీలగారరు' అనియు 'నీలగారరు' అనియు పిలుతురు. ఫాలమున భస్మము, కంఠమున రుద్రాక్షలు, చేతియందేక తార, తంబూరు చిఱుతలు, 'దమ్మడి' (గజ్జెలు కూర్చిన చిన్న తప్పెట)-వీనిని ధరించి, ముగ్గురు సాధారణముగా కథా ప్రచారమునకుపక్రమింతురు. ఇందు ముఖ్య కథకుఁడు తంబురాను ధరించి కథను చెప్పుచుండగా, సహాయకులు ఏకతారను. దమ్మడిని ధరించి వంతలు పలుకుదురు. సంక్రాంతి రోజులలో, చిక్కలూరు అను చోట మంటేదేవర శిష్యుఁడగు "సిద్ధప్పాజి" జాతర జరుగును. అప్పుడీ కథలన్నియు ప్రవర్తకములగును. అట్లే శివరాత్రినుండి ఉగాది వఱకును "ఎడతొరె" యను ప్రదేశమున 'కప్పడి రాచప్పయ్య" యను మఱియొక శిష్యుని పేర జాతర జరుగును. అప్పుడును ఈ కథలు చెప్పఁబడును. 'నీలగారరు' తమ్ము తాము 'మంటేవారు', 'మంటే స్వాము'లనియు చెప్పుకొందురు. మంటే స్వామి కథలనేగాక యనేక లౌకిక గాథలను, పురాగాథాంశములతో కూడిన కథలను గూడ వీరు చెప్పుదురు.[53]

అట్లే, వీరగాథలెన్నియేని యీ దేశమున ప్రచారమునందున్నవి. "పిరియ పట్టణ కాళ (Battle of Piripattana)యను గేయగాథ మిక్కిలి పేరు నందినది. పిరియ పట్టణమేలు సామంతరాజు నోడించి దానిని మైసూరు రాజ్యమున కలుపుకొనుట యందలి ప్రధానాంశము.[54]

దీపావళ్యుత్సవ సమయములయందు మలెనాడు సీమలలో, రంగప్ప నాయకవీరగీత మొకటి పాడుదురు. ఈతఁడు 1381 లో తరికెలెను

---

౫౩. సుధా, కన్నడ వారపత్రిక -మంటేదస్వామి కథగళు.

౫౪. క. రా. కృ-జానపద కథనగీత గళు-

పాలించిన జాతీయ విరుడు విదేశీయాక్రమణమును ప్రతిఘటించిన వీని వీర చర్యలు కథలై నిలిచిపోయినవి.[55]

మహారాష్ట్ర దేశమున, ప్రచారమున నున్న, పొవాడెలు,. గోంధళ్‌లు నిట్టి జానపద గేయగాథలే. 'పొవాడెలు' కేవలము విరగీతములు. వీరగాథలను గానము చేయుచు, దేశీయ వీరులను (శివాజీ, తానాజీ వంటివారు) ప్రస్తుతించుట వీని ముఖ్యాశయము. తంబురా వాద్యము, వంతపాటయు నిచటి కథాగానమునకు నంగములు.[56]

'గోంధళ్' అనునది, మహారాష్ట్ర బ్రాహ్మణుల వివాహానంతరము జరుగు ప్రక్రియ. దీనిని జరుపువారు 'భోపే'లను వారివారు - వీరి వృత్తియే కథాగానము.

మహారాష్ట్ర బ్రాహ్మణుల యింటి వివాహము ముగిసిన వెనుక, వారు భోపేల నాహ్వానింతురు-వారు, ఒక 'ఘటము' (గంప) నందు గోధుమ పిండిని నింపి, మూడు జొన్న కర్రలతో నా గంపపై నుయ్యాలను కట్టి, యందు వెండి రేకుపై వ్రాయబడిన తులజాదేవి బొమ్మ నుంచి, నైవేద్య సమర్పణ చేయుదురు. తమచేతగల 'సంబళి' వాద్యమును పూజించి కథ చెప్పుట మొదలు బెట్టుదురు. రాత్రియందీ కథా ప్రారంభము జరుగుటవలన ప్రక్కన 'పోల్' అను కాగడాను గూడ పూజించి నెలకొల్పుదురు. పెండ్లి కూతురును, పెండ్లి కొడుకును, దేవికి మ్రొక్కి, కాగడాకు నూనెయు, క్రొత్త బట్టలను సమర్పించిన వెనుక కథ మొదలై తెల్లవారులును సాగును. సాధారణముగా నీ సమయమున వీరు తులజాభవాని, కొల్హాపూర లక్ష్మి, 'పడి', 'నాసిక' గ్రామముల యందలి భద్రకాళి, బీడ్ జిల్లాలోని అంబేజోగాయి గ్రామమునకు చెందిన 'అంబ'- మొదలగు స్త్రీదేవతల గాథలనే మనోహరముగావర్ణింతురు.[57]

---

55. Mastı Venkatesh Iyyengar–Popular Culture in Karnataka.
56. కపిలావాత్స్యాయన్ సచ్చిదానంద వాత్స్యాయన్ - భారతీయ జానపద నృత్యాలు
57. మా కళాశాల మరాఠీ అధ్యాపకురాలు శ్రీమతి మాయా సర్దేశాయి, దయతో నిచ్చిన సమాచారము.

తమిళ దేశమునందు, కణ్ణకి గాథ, వీరపాండ్య కట్ట బొమ్మన్ కథ, నల్ల తంగాల్ కథ వంటి పనేకములు, గేయ గాథా ప్రవర్తకుల వలననే ప్రచారము గాంచినవి. ఇందు కణ్ణకి కథకు మిక్కిలి ప్రాచీన చరిత్ర కలదు.

ఇట్లు ఏ రాష్ట్రమునకు జెందిన జానపద సాహిత్యములు పరిశీలించినను జానపద గేయ గాథల చరిత్రయు, ప్రచారమును, మనోహరమై కాన్పించును.

కేపలము, తాంబూర, అందెలు, గుమ్మెట, జమిడిక, ఒగ్గు, డక్కి వంటి వాద్యముల సహాయమున. ఎంతపాటగాండ్ర తోడ్పాటుతో, జాతికి కాణాచి వంటి యపూర్వ కథా సంపదను, నాశనము కాకుండ కాపాడు నీ జానపద కథా గాయకులకు, భారతజాతి యెంతయేని ఋణపడి యున్నది.

తెలుగు దేశమున, వివిధ కథాంశములతో, దేశ వ్యాప్తముగ ప్రవర్తింప బడుచున్న కథాగేయ స్వరూపము తరువాతి ప్రకరణములలో చర్చింపబడును.

—: o :—

# జానపద గేయ కథాంశ స్వరూపము

శతాధికముగ జానపద గేయగాథలను పరిశీలించుటవలన, నిందలి కథాంశము యొక్క అమరికలో నొక ప్రక్రమమున్నటుల స్ఫురింపక మానదు. జానపద గాథ లిట్లుండి తీరవలయునన్న ప్రత్యేక నియమముగాని, రూప నిర్ణయముగాని యింతవరకు తెలుగు జానపద సాహిత్య సమాలోచనమున స్పష్టము కాకపోయినను, వీని యొక్క నిర్మాణ వైఖరియందు, ఇవి ప్రత్యేకముగా కొన్ని మూసలలో నిముడ్చుటకు వీలగునవిగా మాత్రమే రూపొందిన ప్రక్రమము కాన్పించుచున్నది. ఈ నమూనాలనే ఆంగ్లమున Motifs అందురు. మానవుని ప్రాగ్దశా సూచకములగు నిట్టి యచ్చులలో నిమిడిపోవు కథాంశముల వలన, జానపద బుద్ధి యెంత ఆధునాతన కాలమున నున్నను, ప్రాగ్దశాలబ్ధమై యనుస్యూతముగా తనకు సంక్రమించు ప్రాచీనమైన యూహ యొక్క వైభవమును విడువకుండ స్వంతము చేసుకొన్నదని తెలియవచ్చును. కథ యే కాలమునకు చెందినదైన కావచ్చును. కాని కథను చిత్రికబట్టి, మార్పులును చేర్పులును చేసి, కొన్ని నియతములగు మూసలలో బిగించు పద్ధతి, ఆ కథాకాలము కంటె ప్రాచీనమైనదని యొప్పుకొనక తప్పదు. జంతు దశనుండి విడిపడి ఆలోచనా శక్తిని వికసింపజేసికొనిన ఆదిమ మానవుని యూహ లానాడు రూపుకట్టిన పద్ధతియే, ఆనాటి జానపద గాథలయందును కన్పించుచున్న దనుటలో నతిశయోక్తి లేదు. ఉదాహరణకు, తెలుగు జానపద గేయగాథలలో, నిట్టి ప్రాచీన నిర్మాణ పద్ధతి స్పష్టముగా కన్పించు గాథలుగా కాంభోజరాజు కథను, బాలనాగమ్మ కథను, పేర్కొనవచ్చును.[1] నిజమున కివి యే కాలమునకు చెందినవో నిర్ణయించుటకు, గ్రంథస్థాధారములు గాని, బాహ్యాధారములుగాని లేవు.

---

1. శ్రీ లేకుమళ్ల కామేశ్వరరావుగారు కాంభోజరాజు కథను, క్రీ.పూ. 1000 సం. నాటిదిగా పేర్కొనుచున్నను, నందలి సామంజస్యము తర్కసహము కానిది. గృహలక్ష్మి-1954 జూన్, జూలై, అగస్టు, సెప్టెంబరు సంచికలు బాల-1953 మార్చి సంచిక.

ఇందుకొందఱు రాజుల పేర్లును, కొన్ని ప్రదేశముల పేర్లును ఉన్నను, వానికి చరిత్రతో నెట్టి సంబంధమును లేదు. కాంభోజరాజు కథలోని కాంభోజ రాజునకును, కాంభోజ దేశమునకును సంబంధములేదు. ఇతఁడేలు నేత్రవాది పట్టణము బాలనాగమ్మ కథయందును గలదు. ఈ రాజు భార్యలు, సూర్య, చంద్ర, పగడ కన్యలుకాగా, బాలవర్ధిరాజు పెద తల్లులును ఆ పేరిటివారే. కాంభోజ రాజు కడగొట్టు భార్యయు, బాలనాగమ్మ కథలోని నవాభోజరాజు రెండవ భార్యయు, 'మాణిక్యాలదేవి' నామధారిణులు-బాలనాగమ్మ కథలోని మాయల పకీరు సమాధియు, అతఁడేలిన మౌలాలి గట్టును, నేఁటి హైదరాబాదున కాఱుమైళ్ల దూరమున నున్నట్లు మనము చూడవచ్చును. బాలనాగమ్మ అత్తింటి, వారేలిన పానుగల్లును, వారు రాజకార్యములు నిర్వహించిన ఘండికోటయు హైదరాబాదునకు నాతి దూరమున నున్న వని మనము గ్రహింపవచ్చును. అంత మాత్రమున, స్థల నిర్దేశము చేయఁగలుగుగాని, కాల నిర్ణయముగాని, అందలి వ్యక్తులను గుర్తుపట్టుట కాని చేయుటకు వీలులేదు. ఈ కథయందు ప్రసంగ వశమున వచ్చు భూచక్ర పట్టణము, నయనవాది పట్టణము, నేత్రవాది పట్టణము, గంగవాది పట్టణము మొదలగునవన్నియు జానపదుని బుద్ధియందు భద్రము చేయబడిన నామకోశమునుండి వినిర్గతములై, సందర్భోచితముగ వాడబడిన పేర్లు మాత్రమే. మాయల పకీరు 'మూడుపుట్ల' ఖురాను చదువుటయు, ''కులవృత్తి వేషము''గు ఫకీరు వేషమున నుండుటయు గమనించినచో నితఁడు మహమ్మదీయుఁడని తెల్లమగును. బాలనాగమ్మ తండ్రి నవాభోజరాజు ఢిల్లీ జమాబందికి పోవుటవలన, నీ కథాకాలమును మహమ్మదీయ ప్రాబల్యము హెచ్చి, చిన్నరాజులు, గోల్కొండ సుల్తానులకు (జానపదుని, ఢిల్లీ రాజులు వీరే కావచ్చును) లెక్కలు చూపి కప్పములు కట్టుకాలమునకు (17 వ శతాబ్ది) సరిపోల్చవచ్చును. రామరాజుగారు దీనిని పరామర్శింపుచు నిందలి కథ "పురాగాథల (Myths) వలె నత్యంత ప్రాచీనమైనదిగా నగుపడినను, అంత ప్రాచీనమైనది గాదు" అని నుడివినారు[2]. వారి అభిప్రాయము ఆలోచింపవలసినట్టిది. కథాకాలమెట్టిదైనను,

---

2. డా. బి. రామరాజు – తెలుగు జానపద గేయ సాహిత్యము (1958)-పేజీ 552.

ఆ కథయందు ప్రాచీన కథాకథన పద్ధతులును, వాని నమూనాలును నెలకొని యున్నచో, నట్టి కథలను, నాగరికతచే జుష్టములు గాని, ప్రాచీన కథలుగనే యెన్నుకొనుటలో ప్రమాదము లేదు. ఈ కథ 17వ శతాబ్దియందు జరిగినను దీని ప్రాచీన కథన పద్ధతికి మోసము లేదు ఇదియే శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారి యభిప్రాయము గూడ[3] కన్నడమున బాలనాగమ్మ కథతో సరివచ్చు జానపద గేయగాథ యొకటి గలదు అందలి నాయిక పేరు 'నాగరగన్నె'. ఈయమ కళ్యాణ పట్టణము నేలు ఏడుగురు రాజులలో పెద్దవాని భార్య. ఆ రాజులు రాజకార్యార్థమై నంది దుర్గమునకు పోయి యుందురు భూతాళి పట్టణ మేలు జోగి మారువేషమున భిక్షకుడై వచ్చి, నాగరగన్నెను జూలుకుక్కను జేసి యపహరించుకొని పోవును. రాజులు వానిపై దండెత్తి పోయి వాని చేతిలో రాళ్లగుదురు. నాగరగన్నె చెఱపట్టబడినపుడు మూడు దినముల పిల్లవాఁడగు 'పుట్టరామణ్ణ' పెద్దవాఁడై తన యవ్వవలన విషయ మెఱిఁగి, తల్లిని విడిపించుకొని వత్తునని బయలుదేరును. తల్లికి మాలకరి ద్వారా 'చీటీ' పంపి తన్నెఱిఁగించుకొని, ఫకీరు ప్రాణ రహస్యము గ్రహింపుమని చెప్పును. అనేక యోజనముల దూరమున నొక చెట్టు, చెట్టు కడ కంచు బావి, బావి నీళ్ళలో నీశ్వర పక్షి, ఆ పక్షిలో మాయజోగి ప్రాణముస్న దన్న రహస్య మెఱిఁగి, దానిని సాధించి తెచ్చి తండ్రులకు ప్రాణము పోయుంచి, ఫకీరును చంపును. ఈ గాథను తందాన కథగా కన్నడ జానపద గాయకులు మల్లెనాఁడు, బయలనాఁడు, పల్లె ప్రాంతములలో పాడుదురు.[4]

తెలుఁగు దేశమున, పానుగల్లును, పౌలాలియు కథా ప్రవర్తక స్థలములు కాఁగా, కర్ణాట దేశమున కల్యాణమును, భూతాళె పట్టణమునైనవి. అచటి నాగరగన్నెయే యిచటి బాల (కన్నె) నాగమ్మ. ఇచటి ప్రతి నాయకుఁడు ఫకీరుకాగా

---

3. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము — ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము (1965) పే. 318

4. శ్రీ క. రా. కృ. — జానపద కథన గీతగను

నచటివాఁడు జోగి. ఇట్లు ఈ కథ ఒక భాషనుండి మరియొక భాషకు ప్రయాణించుట వలన నిందలి కథాంశము, అన్ని దేశ, కాల, పరిస్థితులకును సరిపోవునట్టి మౌలిక లక్షణములు గలది యని స్పష్టమగుచున్నది. కథా ప్రవర్తక కాలమెట్టిదైనను, స్థలమేదియైనను కథకునకు అది పెద్ద ప్రతిబంధకము కాలేదని దీని వలన తెలియుచున్నది. ఇట్టి సంచరణ శీలత (Mobile quality) పురాగాథల కుండెడి లక్షణములలో నొకటి ఒక్కొక్క జాతికి కాణాచులైన పురాగాథల (Myths) ను పోలిన గాథలు, ఇతర జాతుల పురాగాథలుగా కూడ కాన్పింపవచ్చును.[5] ఒక జాతికిని మరియొక జాతికిని మధ్య వలసల యేర్పాటు జరుగుట వలన, రెండింటికిని వర్తక వ్యాపారములు నెలకొనుట వలన, సాంస్కృతిక కారణములచే, నొక జాతివారు మఱియొక జాతి మధ్యకు వచ్చి యావాసము లేర్పఱచుకొనుట వలన, నిట్లు పురా గాథల వినిమయమును (Exchange) విలీనతయు (Fusion) జరుగవచ్చును దీనిని బట్టి, ఒక జానపద గేయగాథ తాను జనించిన ప్రదేశమున ప్రశస్తి నందుటయే కాక సుదూర భూములలో నెలకొన్న దనఁగా నా గేయ గాథా లక్షణమునందు పురాగాథా లక్షణము నెలకొని యున్నదనియు, దానియందు మౌలికమగు ప్రాచీన మానవ మస్తిష్క జనిత కథాంశము పొదుగఁబడి యున్నదనియు నిర్ణయించుటలో నసామంజస్య మేమియు నుండబోదు. బాలనాగమ్మ కథయు, కాంభోజరాజు కథయు, వానిని బోలిన యనేక గేయ గాథలును అట్టివి.

ఈ మౌలిక లక్షణములను గుర్తించుట యెట్లు ? అని ప్రశ్నించినచో,

---

5. సృష్టిని గూర్చిన బాబిలోనియనుల పురాగాథ యందు 'మర్దుక్' అను వీరుఁడు 'రియచుత్' అను సర్పముతో పోరి, భూమిని మనుష్యుని సృజించుట కనువైన వ్యవస్థ కల్పించెను.
హైందవ పురాగాథయందు విష్ణువు మధుకైటభులతో పోరి, వారి మేధస్సుచే భూమిని నిర్మించెను.
ఈజిప్ట్ దేశీయుల సూర్యదేవత యగు 'రా'కును. హైందవుల సూర్య దేవతకును. పోలికలు గల పురాగాథలు కలవు.

తిరిగి ఆదిమ మానవుని మత స్వరూపమును మననము చేసికొనుటయే మనకు తప్పనిసరి యగును. ప్రాచీన మానవుని కల్పనా పటిష్ఠములైన సర్వోహల యందును, అధిమానవాంశముతో పాటు, తన కవగతము కాని జన్మక్రియయు (Creation) మరణ చర్యయు (Death) ప్రథమ స్థానమును పొందుచున్నవి.

ముందు పుటలలో వివరించినట్లుగా, ప్రకృతి శక్తులతోపాటు ఆత్మారాధన, జంతుపూజ, మాతృపూజ, వీరారాధన, దైనారాధన వంటి మతసంబంధి విషయములే, ఆయా జాతుల పురాగాథలయందు ప్రముఖ స్థానము నాక్రమించు చున్నవి. అట్టి యంశములే, కాలము క్రమించినను నశింపక. సంప్రదాయ రక్షకులగు జానపదుల కథలతో సురక్షితముగా నెలకొన్నవనవచ్చును. కావున నిట్టి యంశముల సన్నిధిని, ప్రాచీన మానవుని మత పరిణామ దృష్టితోడను, వానికి సృష్టి, జననము, మరణము (Creation, origin and death) ల యందుగల కల్పితోహల స్వరూపము చేతను, సమన్వయము చేయుట కష్టము కాదు.

సృష్టినిగూర్చి యాదిమ మానవుఁడు పొందిన ఎభ్రాంతియు, అది యెట్లు జరుగుచున్నదో, గ్రహింపలేని వాని మస్తిష్కము కల్పించెడి కల్పనయు, లెక్కకు మిక్కిలియగు పురాగాథలయందు స్పష్టమగుచున్నవి. ఈ పురాగాథా స్వరూపమెట్టిదో గ్రహించినచో నట్టి పురాగాథలను బట్టి రూపు దిద్దుకొనిన జానపద గేయ గాథాస్వరూప మవగతమగును.

ద్రావిడ కుటుంబమునకు చెందిన గోండుల పురాగాథలలో నీ సృష్టి క్రమ మును గూర్చి విచిత్ర కథ కలదు. మేరు పర్వతము మీద సమావేశమై మూడు వందలమంది దేవతలలో 'పాపి నిరంజన్ పెన్' అను దేవుఁడు నేనే అందరి కంటెను అధికుఁడననెను. వెంటనే యచటి వారిలో నున్న స్త్రీ దైవము 'నిరా నిరంజన్ పెన్' అను నావిడ నేనే యధికురాల ననెను. ఇరువురి కన్నులును కలుసు కొనుటచే వెంటనే 'నిరా' గర్భవతియాయెను. అనగా నామె అరచేయి యుబ్బి యందుండి తొమ్మిది ఘడియల వెనుక నొక కూతురుద్భవించెను. ఆమె పేరు 'కాలికంకలి'. కంకలి యొకనాడు సముద్రమునుండి నీరు తెచ్చుటకై యేగి నీటిలో నొక తములపాకును చూచి దానిని నమలెను. ఆ యాకు 'ఋషి శరధ్'

అను దేవుడు తన దంతములను శుభ్రపరచుకొని పారవైచిన దగుటచే, దానిని భుజించిన కంకలి గర్భవతియై 12 కళ్లముల (Threshing Floors) గోండు దేవతలను, 33 కళ్లముల తెలుఁగు దేవతలను, 32 కళ్లముల మరాటా దేవతలను కనెను. ఈ జాతియొక్క దేవతల యుద్భవ మిట్లున్నది.

ఈ గోండుల వంశపురుషుఁడగు 'పెహంది లింగాల్' అను వాని జననమును గూర్చి మఱియొక కథ గలదు. పురాతనమైన గరుడ పక్షి (Mythical Vulture) యొకటి కలదు దాని పేరు 'మొహమి'. అది యొక గ్రుడ్డు పెట్టెను. ఆ గ్రుడ్డు పగులఁగా నందుండి "పెహంది లింగాల్" ను పంచ పాండవుల తండ్రియగు "పాండురాజా" యును జనించిరి.[6]

సవరల పురాగాథల ననుసరించి, వారి దేవతలైన 'రమ్మ, భిమ్మ' ల కొక కోడియుండెను. అది యొకే గ్రుడ్డును పెట్టగా నది క్రిందనున్న జలమున పడి పగిలెను. దాని తెల్లని సొన నీటిపై వ్యాపించి, గట్టిపడి, యీనాటి భూమిగా మారెను.

నీటి యందీదుకొనుచు వచ్చిన పెద్ద సొరకాయ (gourd) పగిలి రెండు చెక్కలై యొకటి భూమియు, నొకటి యాకాశము నయ్యెను. ఆ బుర్రలోనుండి స్త్రీ పురుషులు బయటికి వచ్చి ఆది దంపతులైరి.

దేవుడగు భిమ్మ తన యొడలి మీది మన్ను నలచి, చిన్న చిన్న బొమ్మలను చేసి, ప్రాణము పోసి, మనుష్యులను చేసెను.

తన యింటి గోడలపై బొమ్మలను గీచి, ప్రాణము పోసి మనుష్యులను చేసెను.

అట్లే వారి మరియొక దేవుడు కిట్టుంగ్ తన యొడలిపై మన్ను నలచి, మనుషులను చేసెను.

---

6. The Raja Gonds of Adilabad.

నాలుక మీది పాచి తీసి, విషముగా చేసి, పాము కోఱలలో ప్రవేశ పెట్టెను.

అతడు తన గడ్డమును కత్తిరించి పాతిపెట్టగా నందుండి సగ్గుబియ్యపు చెట్టు మొలచెను.[7]

ఒరిస్సా దేశపు ఆటవిక జనుల సృష్టి గాథలలో నొక కథ యిట్లున్నది. "భగవానుఁడు తన పరివారగు దేవతల నందఱిని పిలిచెను. వారి శరీరముల నుండి కొంత రక్తమును, శరీరములపై పేరుకొన్న కొంత మట్టిని గ్రహించెను. ఆ రెంటిని కలిపి పెద్ద రొట్టెప జేసెను దానిని నీటి పైకి విసిరి వేయఁగా నది భూమి యయ్యెను.[8]

గోండులకు సంబంధించిన పురాగాధలలో పరమేశ్వరుఁడు తన కుడి తొడ మన్ను నలచి దానితో నొక బొమ్మను జేసి దాని వీపుపై మూఁడు గీతలు గీచి జీవ జలముతో దానిని ప్రోక్షింపఁగా నది యువతి యయ్యెను.[9]

వంశ కథనము చేయుట వృత్తిగా కలిగిన పిచ్చుకుంట్ల పుట్టుకను గూర్చి యొక కథ కలదు[10] త్రిమూర్తుల వివాహ సమయమున వారి వంశ వర్ణనము చేయుటకు తగిన వ్యక్తి కావలసి వచ్చెను. బ్రహ్మ మట్టితో బొమ్మను చేసి ప్రాణము పోయు సమయమున, దాని కాలు విఱుగుటచే, నా వ్యక్తి కుంటివాఁడై జన్మనందెనట. ఈ విధముగా పిచ్చుకుంట్ల మూల పురుషుఁడుద్భవించెను. ఇవియే

---

7. Verrier Elwin - The Religion of an Indian Tribe
8. Verrier Elwin - Tribal Myths of Orissa
9. The Raja Gonds of Adilabad
10. Syed Siraj Ul Hassan - The castes and Tribes of H.E.H. The Nizam's Dominions,

కుంటి మల్లారెడ్డి కథయందు కొంచెము భిన్నముగా చిత్రింపబడినది.[11] ఇతర దేశముల సృష్టి గాథలలో, పురాగాథలెట్లుండునో గమనింతము. ఆది కాలమున ప్రపంచమంతయును జలమయము. అది 'ను' అను పేర బఱగు చుండెను. భగవంతుడు అచట, ఆ జలముపై మొదట నొక గ్రుడ్డుగా ప్రకాశించుచు తేలుచుండెనట ఆతఁడే ప్రకాశమానుఁడైన 'రా'. 'రా' కన్నుల నుండియే మానవులు జనించిరి. ఇది ఈజిప్ట్ దేశపు పురాగాథ.

పురాణములను పరిశీలించినను, మధుకైటభుల మేధస్సు నుండి భూమి యుద్భవించిన దనుటయు, బ్రహ్మ, వాగ్బుజోరు పాదములనుండి చతుర్వర్ణ ములు జనించిన వనుటయు, అత్రి నయనమునుండి చంద్రుడు, విష్ణునాభి కమలస్థుడై బ్రహ్మయు, క్షీరసముద్రోద్భవయై లక్ష్మియు, రూపునందిరనుటయు, నీ పురా (Mythical Element) గాథాంశమును స్పష్టముచేయు కథలేయని తెల్లమగును, అట్లే, గాంధారీ గర్భనిర్గతమగు పిండమును నూఱు శకలములు చేసి ఘృత భాండమున నుంచి పెంపఁగా దుర్యోధనాదులు జనించుటయు[12] వినతాగర్భ సంభవములైన గుడ్లనుండి యనూరు గరుత్మంతు లుద్భవించుటయు[13] నిట్టి యంశముచే. బైబిల్ నందు, ఆదామ్‌ను భగవంతుఁడు సృజించి, అతని ప్రక్కటెముక నుండి 'యీవ్'ను రూపొందించె ననుటయు[14] నిట్టిదే.

---

11. "సత్యమూరెడ్డి భార్య చిన మెంగమ్మకు ఎడమ హస్తము కుడి పదములేని కుంటి కుమారుఁడు బుట్టెను. విషవాక్కు, అమృత వాక్కు, దేవ వాక్కు గల, కాపుల గోత్రములు జెప్పెటి వాఁడు కుంటి మల్లారెడ్డి, కులపురుషుఁడు"— కుంటి మల్లారెడ్డి కథ

12. ఆంధ్ర మహాభారతము — ఆదిపర్వము — పంచమాశ్వాసము— పేజీ. 125.

13. dlbi —ఆది పర్వము—ప్రథమాశ్వాసము —పేజీలు 27.31— 1915.

14. Old Testament,

ఈ యంశమే తెలుఁగు గేయ గాథల యందును గలదు. ఎల్లమ్మ కథ యందు తన కడకు వచ్చుచున్న 'రేణుకా యెల్లమ్మ'ను జూచి పది యేండ్ల నుండి పట్టిన తపస్సు భగ్న మగునని యోచించిన జమదగ్ని, తన బొచ్చె (బొమ్మ) మీది మన్ను నలచి ముగ్గురు చిన్న బాలలను కలుగఁజేసి రేణుకను అపుటకై పంపెను.[15]

జాంబ పురాణము నందు 'బాంధవ దూరమైన' (అంటు చెందిన) పార్వతీ దేవి యంటు వలన. పుట్టుపల్ల జడలతో నొక బాలుఁడును, దేకు, చెన్నంగి వృక్షములును బుట్టినవి.[16]

అదే గేయ గాథ యందు, సృష్టికి మూల రూపిణియైన ఆదిశక్తి కోడి గేరినట్లు గేరి, నెమలి పొదిగినట్లు పొదిగి, మూఁడు గ్రుడ్లు పెట్టఁగా వాని నుండి త్రిమూర్తు లుద్భవించిరి.[17] ఇట్లు పురుష ప్రమేయము లేకయే స్త్రీ గర్భవతి యగుటయును, గ్రుడ్లు పిగిలి యందుండి మనుష్యోద్భవము జరుగుటయును, ఆదిమ మానవుని యాలోచనా క్రమమునకుఁ జెందిన యంశమే ఆదిమ మానవుని యూహల యందు స్త్రీ సంతానవతి యగుట యనునది యొక యద్భుత చర్య. అందు పురుష ప్రమేయ ముండవలయునని లేదు. చనిపోయిన పూర్వీకుల యాత్మలును, కుల దేవతల యంశల్లును, మానవ లోకమున మనుగడ నందుటకై, స్త్రీ గర్భమున ప్రవేశించి సంతాన రూపము నందుచున్నవని ప్రాచీన మానవుల నమ్మకము.

అమెరికన్ ఇండియన్లలో 'అరుడా' జాతి వారిలో నీ నమ్మకము ప్రచుర ముగాఁ గాన్పించును. తమ కుల దేవత (సాధారణముగా, టోటమ్ జంతువు) యొక్క యంశ స్త్రీ గర్భమున ప్రవేశించి నంతనే యామె గర్భవతి యగునని వీరు నమ్ముదురు. ఇచటనే వారా హుంగా (Warra Hunga) యను మతి

---

15. ఎల్లమ్మ కథ — నాచే సేకరింపబడినది.
16. జాంబపురాణము—శ్రీ బి. రామరాజుగా రిచ్చినది.
17. Ibid.

యొక గుంపునకు చెందిన స్త్రీలు తమ కుల దేవతాలయమున (Totam Place) రాత్రిపూట నిద్రింపఁగా నారాత్రి కులదేవత యంశ తమలోఁ జొరబడి తమ్ము గర్భవతులను చేయునని విశ్వసింతురు.[18]

ఈ విధముగా సంతాన కారకుఁడు తండ్రి కాక కులదైవమో, మహాపురుషుఁడో, తద్దత్త వస్తూపయోగమో యను నమ్మక మాదిమ జాతుల యందుఁ గలదు. ఇదియే జానపద గేయగాథల యందనేక స్థలములలో కాన్పించును.

ఇచట నిస్సంతువులైన స్త్రీలు సంతతికై వ్రతములు చేయుదురు. దేవాలయాది సప్తసంతాన ప్రతిష్ఠ కావింతురు. తీర్థయాత్రలు చేయుట, పెండ్లిండ్లుకాని వారికి పెండ్లిండ్లు ఒడుగులు కాని వారికి ఒడుగులు చేయింతురు. చంటిపిల్లలకు పాలు పోయింతురు. కాశీతీర్థము రామేశ్వరమునకును, రామేశ్వరపు టిసుక కాశికిని నోమెదరు.[19] ఇవన్నియు ఫలమీయని చోట తమ కులదైవమును గూర్చి తీవ్రతరమగు తపము చేయుటకై స్త్రీలే సాహసికలై భీకరారణ్యములకు తరలి పోదురు. అచట రుద్రాక్షలు, రుద్రాక్షల మీద భద్రాక్షలు, భద్రాక్షల మీద పోక చెక్క, పోకచెక్క మీద సన్నసూది, సూది మొనపైన శిరస్సు క్రిందికి సిరిపాదము మీదికి పెట్టుకొని 'వరతపసు' బట్టుకొని యుందురు. అప్పుడు చీలమండల రక్తము మోకాలి చిప్పలకు, అటనుండి తొడలకు, నడుమునకు, గుండెకు, చివరికి ముక్కు చెలమలకు, వచ్చినఁగాని, ఆ తీవ్రతకు మనస్సు కఱగి భగవంతుఁడు సాక్షాత్కరింపఁడు. భగవంతుఁడే కానక్కర లేదు. ఒక యోగియో, మహాపురుషుడో యెవరేని కావచ్చును.[20] అతడు ప్రత్యక్షమై ఒక

---

18. కాంభోజరాజు కథయందు, రాజు భార్యలు ఆలయమున నిద్రించి సంతానదములగు కలలు గనుటయు, నా కలలో భగవద్దత్తములైన వస్తువు లుపయోగించుటవలన గర్భవతు లగుటయు నను నంశమును పై నమ్మకముతో పోల్చి చూచుకొనవచ్చును.

19. శరిదేవి కథ, బాలనాగమ్మ కథ, కుమార రాముని కథ.

20. బాలనాగమ్మ కథ, గాంధారి కథ, పరమజ్యోతి కథ, శివకుమారుని కథ, వీరనాగమ్మ కథ,

పండో విభూదియో, ఇంత మంత్ర పూతజలమో యేదే నిచ్చి యనుభవింపు మని చెప్పును. వాని ననుభవించిన స్త్రీలు గర్భవతులై పిల్లలను పొందుదురు. అందునను, అనుభవించిన వెంటనే, స్త్రీలకు గర్భము నిలుచునట్లుగా వర్ణించు టయు గలదు. కాంభోజరాజు కథయందు పరమేశ్వరుఁడు 'చెఱబందె'యందున్న మాణిక్యాలదేవిని, విముక్తురాలిని చేసి వరము కోరుకొను మనును. అంత నామె "ఓ స్వామీ! నేను కోరదగిన వరము ఇస్తామంటిరిగదా మహాపుణ్యంబు కాచే వారు అయితే,

"కొమారునిదా దయచేయవయ్యా! తందాన తాన"

అని వేడుకొనెను అంత నీశ్వరుఁడు గోఁచెకు విభూతి యెత్తివేసి, "అమ్మా ఇక తొమ్మిది ఘడియల కంతాగర్భము నిలుస్తుంది. కుమారుడు జన్మింప బోతాడే, తందాన తాన" యని వరమిచ్చి యేఁగగా, నామెకు కొడుకు పుట్టెను

అట్లే బాలనాగమ్మ కథయందును, భూలక్ష్మిదేవి, జటంగి మహాముని యనుగ్రహమున నాగేంద్రుని గట్టునను న్న బాల మామిడి చెట్టు పండ్ల నేడింటిని రసము పిండుకొని,

"ముగ్గురు మూర్తుల దలచుకొన్నదపుడు
నాగమయ్యను దలచుకొన్న దేమీ
జటంగి మహాముని దలచుకొన్నదపుడు
ఏడు పండులా రసము మ్రింగినాదీ
పుచ్చుకొన్న వో ఘడియకు నాయనా
జిల్లేడాకు పాలిన చందాము
లక్ష్మిదేవి యా దేహము పాలేను...

అట్లు 'గర్భచిన్నెలు' పొడసూపి "ఏదో ఘడియకు కష్టపడతదేమీ తంధాన తానానందనాన",

ఇట్లనేక గేయగాథల యందీ యంశము కాన్పించును. అందునను గర్భ భారము వహించుటకు నవమాసముల వ్యవధి యా కథలలోని స్త్రీల కక్కఱ లేదు.[21] సత్యకాలమున జరిగెడి కథలు గావున నవమాసముల వ్యవధానము నవ ఘడియలకే కుదింపబడును.

ఇట్లు ఆదిమానవాంశము యొక్క ప్రభావముచే సంతానము కలుగునను నంశమే కాక, మనుష్య సృష్టియందు మఱొక వైచిత్ర్యము, ఈ జానపద గేయ గాథలయందు కాన్పించుచున్నది. కథానాయకుఁడును ప్రతిభాసమన్వితుఁడు నగు వాఁడు మానవు లందరివలె స్త్రీ గర్భమునుండి కాక, అయోనిజుఁడై జనించు నట్లుగా వర్ణించుటయు నిందు కానఁగును.

'మాత పురాణము'న నాయకుడు వీరరుద్రుడు. ఈతని పుట్టుక యీ క్రింది విధముగా నా కథాగేయమున వర్ణింపఁబడినది.

రత్న భల్లాణుఁడను,

"రాజు సతికి గర్భంబు నిలిచెను గౌరీశు కృపను
శివుని సత్కృపగల్గి శివభక్తి పరుఁడు
పరమేశు వరమున భవ్యశీలుండు
పురహరు దయచేత భూపాల వరుడు
తన తల్లి గర్భమున తడయ నిల్చి ఆలోచనలు చేసె—"
"మానవుల గర్భాన మలినంబు తోడ
హీనమై పుట్టుట యిది యెంత ఘనత
అనుచు బాలుఁడు తన యాత్మ నూహించి"

గుమ్మడి తోటలో పుట్టెదనని పురహరునిఁదలచి, నెట్టుకొని యెనిమిది నెలలు గడువఁగా,

---

21. తరిదేవి కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ—
తరిదేవి కథ నాచే సేకరింపబడినది.

"అవ్వేళ బాలుండు హరుని మాయఁను
భూవర సుతుఁడపుడు పుట్నిల్లు వెడలి
పదపడి గుమ్మడి పంటిలో దాగె
నవ మాసములు వెళ్ల నరరుద్రుఁడయ్యె"

ఆ పండుతోటలో, తొడిమ బుచ్చియున్నదని, తోటకాపరులు గ్రహించి, దానివలన తోటకు చేటు వచ్చునని, దానిఁ బయట పారవైచిరి. ఒక పిప్రభామ, దానిని గొనిపోయి కరకరఁదఱుగఁగా, నరరుద్రుఁడందుండి వెలుపడెను.

ఇట్టిదే "యీదెమ్మ కథ" యను గేయగాథ యందలి నాయకుఁడు మాంధాత విషయమున గూడ కలదు.

యవనాశ్వుఁడను రాజు దప్పిగొని, మంత్రపూత జలమును ద్రావగా వాని గర్భము చీల్చుకొని మాంధాత జనించెనను గాథ పురాణములందు కలదు.[22] నిశ్చయముగా నిది జానపద మేధా సంబంధియగు నంశము.

"సుతులు లేనట్టి యా సతులకు నైన
యుదకంబు ద్రావిన యుదయించె రాజు
ఎఱుగక యవనాశు ఎదయెండి త్రాగె
యవనాశునకు గర్భమాయె ఏడు గడియలకు
కొలువుకు రాఁడాయె కొంతసేపటికి
తల యొంచుకొని యుండె తన వారిలోన
నెట్టన ఆ రాజు నిద్రబోవంగ
పొట్ట బగులగ జీరిపుట్టె మాంధాత."

అట్లు పుట్టిన మాంధాతకు స్త్రీ గర్భమున జనింపక పోవుటయే గొప్ప, యని

---

22. విష్ణు పురాణము; ఉత్తర రామాయణము-

"మంత్రులు ఏమనిరి మాంధాతతోను
సతుల గర్భమున పుట్టిరి రాజులు
పురుష గర్భము చీరి పుట్టిన వాఁడ
సరిరారు నీతోను సమరంబునందు
ఇటు విను మాంధాత జనపాల తిలకా."
మంత్రుల మాటల వలన తెలియుచున్నది.

'పణతి', రామాయణ కథానాయిక యగు సీత వలె, నాగేటి చాలునందు దొరికెను.[23] పల్నాటి వీర చరిత్ర యందలి నాయకురాలు నాగమ్మయు నీ విధముగా నయోనిజయే. మాహూరమ్మ జననమును ఇట్టిదియే.[24] అహల్య అల్లియ చెట్లగుంపులో రూపొందెను.[25]

స్త్రీ గర్భమునుండి పుట్టబోవు బిడ్డయున్నను, ప్రసవ సమయమున, యోని మార్గమున కాక, కపాలమునుండి వినిర్గత మగునట్లుగా కొన్ని గేయగాథలయందు వర్ణింపఁబడుటయు కలదు.

పరమ జ్యోతి కథయందు, నోరు, ముక్కు, కన్ను, చెవి యివేవియు వినిర్గమనమునకు సరికావని, లోనున్న బిడ్డ

"లఖా గోరు బట్టెనూ
ఔరౌర నేటన్నా తాన తందన తాన
మాడు పట్టు జీల్చెనూ ...ఔ...
బయటీకి దుంకెరా ...ఔ...

23. కమ్మవారి పణతి - పసల బాలరాజు కథ. పేజీ. 3- వెస్టు వార్డు అండ్ కొ వారి ప్రచురణ - 1951
24. మాహూరమ్మ కథ - శ్రీ రామరాజుగారు దయతో నిచ్చినది.
25. గౌతపురాణము - "జమ్ముల నార్సిమ్మ కొమారుఁడు చంద్రయ్య" వ్రాసి కొనిన తాళపత్ర గ్రంథము-

ప. "మూడుపట్టును 'లాఖాగోర్ల బట్టి గద్దరున జీల్చుకుంటా దాసినాళ్ల చేతుల బడకుండా దూసుకొని బయట బడెనయ్యా బిర్హో మహారాజు"-

ఈ విధముగా పురాగాథలయందు నెలకొన్న ఆదిమ మానవ మేధా సంబంధియగు జనన విషయమగు వివిధమోహాలు, జానపద గేయగాథలందంతటను కాన్పించుచున్నవి. వీనితో సమానముగ, మరణానంతరము మనుష్య శరీరగత మగు నాత్మను గూర్చిన యూహలును, ఈ గేయ గాథల యందంతటను పలుచు కొని యున్నవి.

ఆదిమ మానవుని యూహ ప్రకారము, మరణ క్రియ తరువాత, మనుష్య శరీర గతమగు నాత్మ స్వేచ్ఛనంది, సృష్టి యందలి వివిధ చేతనా చేతన వస్తు జాలము నాశ్రయించి యుండును. ఒక చెట్టు, ఒక పుట్ట, ఒకరాతి మొదలైనవి అప్పు, యన్నియు నట్టి యాత్మ నివేశనములుగా నగుట వలన, నానాటి మాన వునిచే పూజింపదగిన వస్తువులుగా నేర్పడియెను. మరణానంతరము తమ కాప్తు డైన మానవుడేమగునో, ఏలోకములు చెందునో, వానికి జీవన మున్నదోలేదో, లేక అదృశ్య రూపమున తమకిష్టులైన మనుష్యుల చెంతను, ప్రీతిపాత్రములైన పరిసరముల యందును తిరుగుచుండునో యను వివిధములగు నాలోచనలే ఆత్మా రాధనకు దారి తీసియుండును. ఈ యాత్మారాధన (Animism) వలన సృష్టి యందలి జీవరాసుల కంతము లేదనియు, నొక రూపమునగాక పోయిన మరొక రూపముననో, లేదా రూపరహితముగనో, ఒకప్పుడు శరీరబద్ధమైన ఆత్మశక్తి మని యుండుననియు, నొక సిద్ధాంతము స్పష్టము చేయబడినది.

ఇట్టి ఆత్మలకు ప్రతీకలుగా పాములను, పిట్టలను నెన్నుకొనుట జానపద మేధా సంబంధి యగు విషయము.

ఆత్మ సంబంధి యగు నంశములు జనన సంబంధియగు నంశముల వలెనే జానపద గేయగాథల యందు విరివిగా కాన్పించుచుండును.

(1) చనిపోయిన వ్యక్తి యొక్క ఆత్మ యితర శరీరము నాశ్రయించి కాన్పించుటయో, కలలయందు సాక్షాత్కరించుటయో, యను నంశము.

మండపేట పాపమ్మ వేరంటాలి కథయందు, పాపమ్మ భర్తతో చితి యందు బుగ్గియాయెను. ఆ రాత్రి పెద తండ్రి రామయ్య నాయుఁడు జొన్న చేను వద్ద, మైమఱచి నిద్రించుచుండగా, పాము రూపమున వీపు దట్టి యిట్లు ప్రబోధించెను.

"ఇంకేటి నిద్దరా లేవరా బాబూ
మీ యల్లుడై తేను చెల్లిపోయినాఁడూ
బాబయ్య, గుండమున నేఁబడ్డనయ్యా
బాబయ్య నా కొఱకు దుఃఖింపవలదూ
పోలేరమ్మ చెఱువు వద్ద బాబూ
పన్నెండు కలుగులాపుట్ట ఉన్నదయ్యా
పామునై నీ ముందు నడిచేను బాబయ్య
నా వెనుక నీవురా నను గన్న తండ్రీ
ఆ పుట్టలోనికీ నే.బోతనయ్యా
ఆ పుట్టమీదనే పందిర్లు వేయించి
ఆ పుట్టనే మీరు పూజ చేయండీ" —యని శాసించినది.

ఆ పాపమ్మ తన్ను కొలుచు వారి, నొకపరి పాము వలెను, నొకపరి బంగారు బొమ్మ వలెను, నిమ్మపండు వలెను, కుంకుమ భరణివలెను నిన్ని రూపములతో వెలయుచు ననుగ్రహించుచుండును.

అట్లే 'కామమ్మ కథ' యందు కామమ్మ తాను దూకిన గుండమున నెఱ్ఱ కలువ పూవై నిలచెను. ఆమెకై కట్టిన గుడి యందలి 'తొట్టెల'లో నిమ్మ, ద్రాక్ష, అరటి, మామిడి పండ్ల యాకారముతో నామె యూగుచుండును.

సన్న్యాసమ్మ కథయందు, గుండమున దూకిన సన్న్యాసమ్మయు నామె పతియు, పుట్టుశిలలై పైకి లేచిరి.

"ఇద్దరూ సతిపురుషులు యాలగొస్తారు వారయిన
బంగారు ప్రతిమలై పుట్టి వస్తారు వారయిన
విగ్రముల లాగున వెలసి వస్తారు''

శ్రీ లక్ష్మమ్మ కథయందు లక్ష్మమ్మ చంపఁబడిన వెనుక, గగన భాగమున నామె జీవాత్మ వెడలి, బావ సుబ్బయ్య నిద్రలో నుండగా, "నన్ను చంపి వేసిగా, ఉన్నారు ఓబావా! పోయి 'ఎత్తుబళ్లు' జరిపించు ఓ బావా!" అని చెప్పెను. తాను కాలిన కాష్ఠము చల్లారిన వెనుక, అందుండి 'పుట్టు శిలయై' లేచి వచ్చెను,

లక్ష్మమ్మ మరణ విషయమున ననుమానము వచ్చిన దాయాది యొకఁడు శవము నెత్తుబడి చేయకుండ 'ఖాయిదా' చేసెను. అంత లక్ష్మమ్మ గణాచారి మీద వ్రాలి,

"పరాయి వారు నన్ను చంపలేదు
నా పురుషుడే నన్ను చంపినాఁడు
మీరు ఖాయిద పరచవద్దు" —యని ఎత్తుబళ్లు చేయించుమనెను.

అట్లే, సహోదరి మరణ వార్త విని యాగ్రహోదగ్రులై లక్ష్మమ్మ యన్నదమ్ములు తరలి వచ్చుచుండగా, నామె గణాచారి మీద వ్రాలి,

"అన్నగారికే దండం బెట్టిరా
తందాన తాన-

ప. అన్నా, రామయ్యగారు: ఒకరి మీద కోపము చేయవలసిన కార్యము లేదు. నీకు కోడలయిన పార్వతమ్మను ఎత్తుకొని, లింగాపురము చేరి క్షేమముగ వివాహము చేసుకుని లక్షణముగ ఉండవలసినదే గాక, మీరు ఇంక ఎంత మాత్రము మీ నాయనగారిని శ్రమ పరచఁబని లేదు."- అని యుద్దు దగిలెను.

(2) నిర్యాణము చెందిన వెనుక వీరులును, మహాత్ముగల వ్యక్తులును శిలలై పూజలందుటయు, లేదా యేదే నొక యాలయమున భగవద్విగ్రహమునకు

పార్శ్వములయందు కుదురుకొనుట, యను నంశము జానపదగేయ గాథల యందు సామాన్యముగా కాన్పించుచుండును

పల్నాటి వీరుల కథయందు, కార్యము పూడి రణరంగమున వెన్నుచూపక వీరోచితముగ మడసిన వారందఱును వీరులైరి. ఆ వీర శిలల ప్రసంగము ప్రకరణాంతరమున గొనిరాబడును.[26]

తెలంగాణము నందు ప్రచారమున నున్న నల్ల సోమనాద్రి కథ, సదాశివ రెడ్డి కథలలో వీరులగు సోమనాద్రియు, సదాశివరెడ్డియు, తిరుపతి వేంకటేశ్వర స్వామి కుడి యెడమల శిలలై నిలిచిరి.

సదాశివరెడ్డి తాను చేయఁదలచిన వీరకార్యము ముగిసిన వెనుక,
"వేంకటేశ్వర్ల ప్రార్థన జేసినాఁడు
స్వామి నాకు ఒక్క కొడుకు ఉన్నఁడయ్య
నరసింహారెడ్డి ఉన్నఁడయ్యా
బీదరు తాలూకాకు రాజు
నేను వైకుంఠం వచ్చెదను" అని ప్రార్థింపగా,
వెంకటేశ్వర్లు రథం దెచ్చినాఁడు
రథం మీద రెడ్డి ఎక్కినాఁడూ
తిరుపతిలో అతనిని నిలిపినాఁడూ
స్వామి ఎడమకు సదాశివరెడ్డి
స్వామి కుడిపక్కన నల్లసోమనాద్రి:"

అట్లే చిన్నమ కథయందు, మద్దులేటి నరసింహస్వామిని గొలుచు వైష్ణవ భక్తురాలగు చిన్నమ తాను, స్వామి చేతిలో ఇంగారుశిలయై నిలచుటయేగాక, తన పెనిమిటి స్వామి యెడమ చేతియందు వెండి శిలయై నిలమనట్లు చేసెను.

---

26. చూ. వీరారాధనాంశములు.

అట్లే 'పర్వతాల మల్లారెడ్డి కథ' యందు (ఇదియే గోపిరెడ్డి కథ యను పేరగూడ లభించినది) మల్లయ్య యను శ్రీశైల మల్లికార్జునుని భక్తుడు, తండ్రియు తల్లియు చేసిన దుష్టకార్యములకు విసిగి,

"పన్నెండు కొప్పెరల ధనము పంచినాఁడు
సొమ్ములు బట్టలు దానము జేసినాఁడు
తనవైన వస్తువల దానము జేసినాఁడు
ఇంక నరలోకము చాలును సామి-"

అని మల్లికార్జునుని పర్వతమునకు వచ్చి తనువు చాలించి ఈశర్వుని సన్నిధి యందు,

"ఈశ్వరుని పక్కన లింగము అయినాడు
పరువతాల మల్లికార్జునుడు ఆయినాడు
తందానతాన-"

(3) చనిపోయిన వారి కోర్కెలు తీరనంత వఱకు, వారి చితి మండ కుండుటయు, కాకులు అన్నము ముట్టకుండుటయు నను నంశము -

ఇది నల్ల తంగాళ్ కథయందు లభించును. ఇందు నల్లతంగ, చెడి పుట్టి నింటికి వచ్చి, వదిన చేసిన తిరస్కారమును సహింపలేక యడవిలోని పాడు బావియందు బిడ్డలతోఁ గూడ దూకి మరణించెను. అన్న నల్లతంబి విషయము గ్రహించి చెల్లెలిని వెదకుచు వచ్చి పాడుబావి నుండి శవముల నుద్ధరించి, దహన సంస్కారము చేయుటకు చితి రగుల్పఁబోయెను. కాని,

"అగ్నియు మండలేదు ఆశ్చర్యమయ్యో జూడ" —అంత నాతఁడు
"ఏమమ్మా చెల్లె, నీకు ఇంత కోపమేలవచ్చె
కోపము నా మీద కొంచెమన్న బెట్టవద్దు
మంటలు లేచెనేని మళ్లి పగదీర్చెదను
నిప్పులేచి మండెనేని నీదు పగదీర్చెదను"

అని చెప్పగా, నపుడు నిప్పలు "తగిలి మండెను"

(4) చనిపోయిన వ్యక్తులు తమ వారికి కష్టములో సుఖములో కలుగం జేయుట యను నంశము.

వ్యక్తి చనిపోయినను, వాని అత్మకు ఆవేశ కావేషములు చావవనియు, దానికి తనవారన్న ప్రీతియు, తనకు వ్యతిరిక్తులైన వారిపై కోపము నుండు ననియు యోచించెడి విధానము పురాగాధా సంబంధి యగునట్టిది ఆ యంశమున కుదాహరణములుగా నెన్నియో జానపద గేయ గాథలను చూపవచ్చును. పాపమ్మ పేరంటాలి కథయందు, పాపమ్మ చితియందు దగ్ధమైన పెనుక, తాను ఆదేశించి నట్లుగా, అత్తింటి వారు తన పుట్టినింటి వారికి, గుంపమున దగ్ధముకాక మిగిలిన మైజారు చెంగీయనందున వారి వంశమున పిలువ పేరు లేకుండ పోవునట్లు శపించెను.

సన్యాసమ్మ కథయందు సన్యాసమ్మ గుండాన పడిన యేడు ఘడియలకు, తనను కష్టముల పాల్జేసిన సవతి తల్లి కళ్లు పేలుటయు, అత్త బాలమ్మ శిరస్సు పక్కున పేలుటయు, బావ రామయ్య కుష్ఠురోగియై దేశాంతరగతుడగుటయు, పెద్దక్క సుబ్బమ్మ 'వేశ్యకారి' యగుటయు జరిగినది.

కామమ్మ కథయందు, పేరంటాలైన కామమ్మ కరుణ వలన వెంకమ్మకు సంతాన లాభము కలిగెను.

చనిపోయిన తరువాత జరుగు నంశము అట్లుండగా, వ్యక్తి తాను బ్రతికి యుండగానే తన యాత్మను లేదా ప్రాణమును తన శరీరమునకు బహిశ్చరముగాం జేసి వివిధ వస్తువుల యందు దానిని నిక్షిప్తము చేసి, యా విధముగా తన ప్రాణమునకు మోసము లేకుండ చేసికొనుట యను నంశము గూడ గేయగాథల యందు విరివిగా కాన్పించుచున్నది.

ప్రఖ్యాత నృశాస్త్రవేత్త Prof. Wundt ఆది కాలమున టోటమ్ (గుంపు) చిహ్నముగా నున్న వస్తువులు, కాలము గడచిన కొలది గుంపును విడిచి, వ్యక్తికి నెలకొనుటయు, నాతని జీవనమును నడుపుటయు, జరిగినదని యభిప్రాయ పడెను. దీనినే వ్యక్తిగతమగు టోటమిజ్మాంశము (Individual Totemism)

గా నాయన గుర్తించెను.[27] దీనిని స్పష్టము చేయుటకే పురాగాథా కల్పన యందొక విచిత్రాంశము చోటు చేసుకొన్నది. ఆపదలను కొనితెచ్చుకొనుట కేగు వీరాధివీరుఁడు, తనకు ప్రాతినిధ్యము వహించునట్లుగా నొక వస్తువును సూచించును. అది యెట్టి యొడుదుడుకులును లేక యథాపూర్వముగ నున్నచో, నా వీరుడు క్షేమముగ నున్నట్లును, లేని యెడల నాపదల పాల్పడినట్లును నియమింపఁబడును. అనఁగా తన కులదేవతల నుండి సంక్రమించిన యా వీరుని యాత్మశక్తి, ఆతని శరీరమును వదలి బహిశ్చరముగా నేదేనొక వస్తువు నందు నిహితమై యుండునను నూహయే యిట్టి కథా కల్పనకు మూలమని యెఱుంగ వచ్చును.

సయామీస్ రామాయణ గాథలో తౌస్సకన్ (దశ కంఠుడు) శాంబర విద్య వలన తన శరీరములోని యాత్మను ఒక పెట్టెలో నుంచి యుద్ధ భూమికి వెడలెడివాఁడు. రామునితో యుద్ధము చేయునపుడు తన యాత్మను అగ్ని నేత్రుఁడను మునికడ నుంచెను. అందువలన రాముఁడు వానిని సంహరింప లేక పోయెను. అప్పుడు రామ పరివారములో నొకండు రావణ వేషధారియై మునికడ కేగి రావణ ప్రాణముల సంగ్రహించి, యా పెట్టెను కాలి క్రింద వైచి నలుగగొట్టుట చేత మాత్రమే రావణుఁడు మరణించెను.

జానపదరామాయణ గతమగు రావణుని నాభియం దమృత భాండ ముండుటయు, మైరావణుని ప్రాణములు తుమ్మెదల యందుండుటయు నిట్టివే. ప్రాఖ్ఖండ వాసులైన జనుల యందేగాక పశ్చిమ ఖండ గాథలయందును ఇట్టి కథాంశము విరివిగా కానవచ్చుచునే యుండును. గ్రీకు గాథలలో కేవలము కంటియందు ప్రాణముగల రాక్షసుని కథ గలదు.[28] ఐరిష్ కథలలో, నొక కథ యందు

---

27. Elements of Folk Psychology -wilhelm Wundt

28. Polyphemus అను నొంటి కంటి రాక్షసుఁడు. - మండుచున్న దూలమును ఎదుట నున్న వీని కంటిలో గుచ్చి 'యులిసిస్' వీనిని చంపెను.

రాక్షసు డొక రాణి నపహరించును. రాణి వానిని సుముఖుని జేసికొని వాని ప్రాణ రహస్యమడుగగా నాతఁడు ఈ విధముగా చెప్పెను.

"నా కుడి బొమ్మపై నున్న పుట్టుమచ్చ నొక గ్రుడ్డుతో రుద్దవలయును. ఆ గ్రుడ్డొక బాతు కడుపులో నున్నది. ఆ బాతొక పెట్టెలో నున్నది. ఆ పెట్టె సముద్ర మధ్యమున నున్నది."

ఈజిప్ట్ దేశమునకు చెంది, 1300 బి. సి. నాటికి సంబంధించిన వని చెప్ప దగిన గాథలలో నీ కథాంశమున్నది. ఇరువురన్నదమ్ములలో తమ్ముని యాత్మ యొక తుమ్మచెట్టు నందుంచబడినది. వంచకురాలైన భార్య తుమ్మచెట్టు కొట్టింపగా, తమ్ముడు పడిపోయెను. కాని అన్న తుమ్మకాయ నొక దానిని కోసి మంచినీటి పాత్రలో వేయగా నా కాయ యందు మిగిలిన యాత్మాంశము వలన తమ్ముడు తిరిగి బ్రతికెను.

అట్లే అరేబియన్ కథలలో, నొకఁడు తాను రాజకుమారుని చేత చత్తునని భయపడి తన ప్రాణము నొక పిచ్చుకలో పొదివి, పిచ్చుకను పెట్టెలో నుంచి, ఒక దాని యందొకటిగా నేడు పెట్టెలను సిద్ధము చేసి సముద్ర మధ్యమునగల చలువరాతి మందిరమున నా పెట్టెను భద్రము చేసెను.

మంగోలియన్ కథయందు 'బోరోదోంగ్' అనువాఁడు తన ప్రాణమును కందిరీగ యందుంచెను. నాయకుడు, పలు కష్టములు పడి యా కందిరీగను గుప్పిట నలిపివైవగా బోరోదోంగ్ మరణించెను.

మఱియొక కథయందు, భూమి క్రింద ప్రాకుచున్న తొమ్మిది సముద్రములును ఏకముఖమై, భూమి మీదికి వచ్చిన చోట నొక రాగిదిమ్మ యుండును. దాని యడుగున రాగిపెట్టె. ఆ పెట్టెయందు బంగారు బుట్ట. ఆ బుట్టలో నున్న యేడు పక్షులలో నొక స్త్రీ ప్రాణము నిక్షిప్తమై యుండును.

(5) ఇట్టు విశ్వవ్యాప్తమగు నీ కథాంశము, తెలుగు జానపద గేయ గాథల యందును చిత్ర విచిత్ర రూపములతో ప్రవేశ్యాని నిలిచిపోయినదని నిరూపించ వచ్చును.

ఏడు సముద్రములకావల జీవిగడ్డ, ఆ జీవిగడ్డలో రాతిగోడ, రాతిగోడలో రాతికోట, నడుమ నుక్కుకోట ఆ ఉక్కుకోటలోని నూరు వెలగచెట్లు, మున్నూరు ములగచెట్లు, నన్నూరు తాటిచెట్లు, ఏనూరు వేపచెట్లు, వీని నడుమ ముంత మామిడి చెట్టు. ఆ ముంతమామిడి తొఱ్ఱలో నేడుదొంతరలు, అడుగు దొంతరలో బంగారు పంజరము, ఆ బంగారు పంజరములోని పంచవన్నెల చిలుక కంఠమున మాయలపకీరు తన ప్రాణములను దాచిపెట్టెను.[29] అనఁగా వాని యాత్మశక్తికి చిలుక చిహ్నము (Individual totem symbol) దానికి మసి బూసినచో వాని బుద్ధి మసకబారును.[30] దాని కాళ్లకు బంధములు వైచినచో మాయల పకీరుకు అడుగు ముందుకుపడదు. చిలుకతో బాలవద్దిరాజు గానుగపై నెక్కి తోలగా, నచట పూలతోటలో పచారు చేయుచున్న మాయల పకీరు గిరిగిరతిరుగ సాగెను. చివరకు దాని గొంతుగొట్టము బాలవద్దిరాజు చేతిలోనికి నూడిరాఁగా, చిలుక మరణించుటయు, తోడనే పకీరును, బోరుకొండవలె విరుచుకుపడి ప్రాణ ములు విడుచుటయు జరిగినది.

ఈ కథయందే బాలవద్దిరాజు తాను తల్లి చెఱ విడిపింపబోవుచు, తన పెద తల్లులకు ధైర్యము కలుగుటకై యొక నాగమల్లె చెట్టును నాటి దానిని తనకు మారుగా చూచుకొమ్మనమని చెప్పెను.[31] తనకెన్ని మాఱు లన్నము పెట్టుదురో దాని కన్నిమాఱులు నీరు పోయుమని చెప్పెను. ఆ చెట్టు కాయలు.

---

29. బాలనాగమ్మ కథ– పేజీలు 106, 107 (ఎస్. వి. గోపాల్ అండ్ కంపెనీ ప్రచురణ 1951)

30. బాలనాగమ్మ కథ.

31. Ibid.

పువ్వులతో విజ్జువీగు చున్నచో తాను బ్రతికి సుఖముగానున్నట్లుగను, ఎండినచో, తాను చనిపోయినట్లుగను, నెంచుకొమ్మని చెప్పెను.

బాలవద్దిరాజు గండభేరుండ పక్షుల పిల్లలను రక్షింపబోయి నాగేంద్రుని కాటునకు ప్రాణములు విడువగా, నిచట పెదతల్లుల వద్దనున్న నాగమల్లె చెట్టు నిలువున నెండిపోయెను. తిరిగి పక్షులు సంజీవిపుల్లతో వానిని బ్రతికింపఁగా నిచట యెండిన చెట్టు తిరిగి యిగురు పెట్టినది. ఈ విధముగా బాలవద్దిరాజు ఆత్మశక్తికి ఆ చెట్టు నివేశనమై నిలచి యాతని వ్యక్తిగత చిహ్నమై (Individual totem) యఌరారినది. ఇట్టి యంశము కామమ్మ కథయందును,[32] ఎలనాగిరెడ్డి కథ యందు[33] గలవు.

ఈ వ్యక్తిగత చిహ్నమును తెలియజేయు పద్ధతి మఱియొక విధముగాఁ గూడ కథలలో స్పష్టము చేయఁబడినది, శివకుమారుని కథయందు. దేవేంద్రుని కూతురు దేవాంగన సరోవరమున స్నానమాడుచుండగా, శివకుమారుఁడు చూచి మోహించి గట్టుననున్న యామె చీర యెత్తుకొని వచ్చును. చీర యిమ్మని దేవాంగన, "తల్లి గర్భము నుండి యెట్లు వెలువడెనో" యట్లే వెనుక పరుగిడి వచ్చుచుండెను. వాని శ్రేయఃకాంక్షియగు చిటిముటియోగి వానిని బల్లిని చేసి, సరంబీ కంటించి, చూచుచుండెను. దేవాంగన శివకుమారుని పోకడను గూర్చి వానిని ప్రశ్నింపఁగా చిటిముటియోగి మెల్లగా నామెను మాటలలో పెట్టి, శివ కుమారుని వివాహమాడునట్లుగా బాసలు చేయించి, వానిని తిరిగి మనుష్యుని చేసి వారి పెండ్లి చేసెను. కాని, యామెకు తెలియని విధమున, వాని పిక్క చీరి యామె చీర నందుంచి కుట్టివైచి, ఆ చీర చేతఁబడినచో, దేవాంగన భూమిపై

---

32. కామమ్మ కథ — పేజీ. 2 (ఎస్. వి. గోపాల్ అండ్ కంపెనీ వారి ప్రచురణ—1952)

33. ఎలనాగిరెడ్డి కథ— కర్నూలు జిల్లా రుద్రవరమున నాచే సేకరింపఁబడినది. — చెప్పెడివారు పిచ్చుకుంట్లు—

నుండదనియు, దానిని భద్రముగ కాపాడుకొనుమనియు నుపదేశించెను. వేఁట కేగునపుడు మాత్రము చీరను పేసి యాపులును నమ్మకము కలవారును నగువారి చెంత దాయఁబెట్టి యేఁగుమని యాదేశించెను.

శివకుమారుఁడు సుఖముగా రాజ్యము చేసికొనుచు, నొకనాఁడు మృగయా వినోద మనుభవింపఁగోరి తన పిక్కలలో దాచిన చీరనుదీసి తల్లికిచ్చి యెవ్వరికి నీయకుమని చెప్పి యేగెను. దేవాంగనా పరమాంగన లిది గ్రహించి, యత్తకడ కేగి, తమ కాచీర కట్టుకొనుటకై మనసు కలదనియు నిచ్చినచో నొక్కసారి కట్టుకొని తిరిగి యిత్తుమనియు ప్రార్థించిరి. అడుగువారు కోడండ్రే కాన, మర్మ మెఱుగని ముదుసలి యత్త. కరుణాతరంగితమానసయై యాచీరనువారి కైవసము చేసెను. అంత వారిరువురును ఆ చీరను మీద కప్పుకొని, దేవలోకమున కెగసి పోయిరి. వారి తోడనే, వారి శక్తివలన కావింపబడిన రాజ్యము, పరివారము, రాజభోగములు, అన్నియును నదృశ్యములై యిచట తల్లియు, నచట నరణ్య మధ్యమున కుమారుఁడును బికారులవలె నొంటరులై నిలువఁబడి పోయిరి. (శివ కుమారుఁడు అనేక శ్రమల నోర్చి, పరీక్షల కాగి, స్వర్గమున కేగి, దేవేంద్రుని మనస్సు నాకట్టుకొని, తన యిరువురుభార్యలనేకాక వారియొక్క మరియైదుగురు చెల్లెండ్రను గూడ వివాహమాడి తిరిగి వచ్చుట, తరువాతి కథ). ఇచట నీ చీరె దేవకన్యల యొక్క వ్యక్తిగత చిహ్నము (Individual Totem). అందే వారియొక్క సర్వశక్తులును, ఆత్మయు, నిహితములై యున్నవి. అదిలేనివారు జీవచ్ఛములవంటి వారగుటచే స్వర్గముననైనను నడుగు పెట్టలేక యశక్తులైరి. వారి ప్రాణశక్తిని భద్రముగా కాపాడుకొన గలుగుట చేతనే శివకుమారుడు వారిపై నధికారము నెఱపఁగలిగెను.

(8)ఒక వ్యక్తి యితరులచేత బలవంతముగా చంపఁబడినను, అతని శరీరాంగములు వివిధ వస్తువులుగా రూపొంది, యందాత్మ యునికి యేర్పరచుకొని. సమయము వచ్చినపుడు తన శత్రువుపై పగదీర్చుకొనుట యను నంశమును జెప్పదియే. ఇదియు ప్రాచీన మానవ మేధా సంబంధియగు విషయమే. ఈ

యంశము నాధారముగా జేసికొని యనేక జానపద గాథలు ప్రపంచ పరివ్యాప్తముగా కలవు.[34]

అట్టిదే భూపతి రాజుకథ భూపతిరాజు కేడుగురు కొడుకులును, ఒక్క కూతురును. కూతురు అక్కమ్మను మండలము రాజైన భీమరాజునకిచ్చి వివాహము గావించిరి. కూతురింకను పుట్టింటి నుండి యత్తింటి కేగలేదు. అక్కమ్మ గౌరినోములు నోమును, ముచ్చటపడి పెద్ద వదిన చీరయడిగి తీసుకొని కట్టుకొనెను వదిన చీర యిచ్చును.

''చీర జినిగిన గాని
చింగులే రాలినా
చీర జినిగినట్లు
చిరిగేవు ఓ యక్క
రైక జినిగిన గాని
రంగులే కదిలినా
రైక జినిగినట్లు
చిరిగేవు ఓ యక్క'' అని భయపెట్టెను.

వదిన భయపెట్టినట్లే చీర జిరిగెను. అంత నా వదిన, తలకు వాసెన కట్టుగట్టి, మంచమున కడ్డుగా బండుకొని, భర్తరాగా, తనకు తలనొప్పి మిక్కుటముగా నున్నదనియు, నతని చెల్లెలిని జంపి యామె కనుగ్రుడ్ల రక్తమ్ము దెచ్చి పూసినగాని యా నొప్పి తీఱదనియు వానితో చెప్పెను. అన్న, భార్య కెదురు చెప్పలేక, చెల్లెలిని అత్తగారింటికి తోడ్కొనిపోయెదనని యింటఁజెప్పి యరణ్య మధ్యమునకుఁ గొనిపోయి చంపివైచెను. అప్పుడామె డొక్క కోనేరుగా మారెను. పేగులు మల్లెతీగలాయెను. చేతులు చెఱుకుతుంటలాయెను. కాళ్ల అరటి

---

34. Folk Motif Index – E. 121. 6.1. Resuscitation by Demon's entering corpse. F. 406 : Habitation of Spirit
G. 303.8 – Devil enters body of another.

బొందెలాయెను. శిరసొక్క గుడియై, కనుగ్రుడ్లు రామచిలుకలాయెను. అక్కమ్మ ఆత్మ భర్తకలలోని కేగి తనకు వాటిల్లిన స్థితిని చెప్పగా, భర్త దిగ్గునలేచి యడవి బాటలుపట్టి వచ్చుచుండెను. రామచిలుకలు అక్కమ్మకథను చెప్పగా, రాజు అత్తయింటికి వచ్చి బావమరిదిని దండించి, యీ రాజ్యమేల ప్రాణమేల యని అక్కమ్మను గూడఁబోయెను ఈ కథయందును, చనిపోనవారి ఆత్మకు కల ప్రాతినిధ్యమును, దానియొక్క ఆవేశ కావేషములును, కార్యఘటనాచాతుర్యమును, ఆదిమ మానవ మేధా సంబంధియై రూపుకట్టిన పద్ధతి, స్పష్టము చేయ బడినది.

(7)ఒక్కొకచో, నీ కథలయందు ప్రతివీరులైన వారితో వీరులు పోరాడు చుండగా, ప్రతి వీరులు ఖడ్గక్షతదేహులై రక్తసిక్తాంగులగుట వర్ణింపఁబడును. అట్టియెడ, నద్భుత శక్తులు గలిగిన యా వీరుని రక్తపు చుక్కనుండి యనేకు లాతని బోలిన వారుద్భవించుట చెప్పఁబడును.[35]

ప్రాచీన మానవుని యూహలలో, రక్తము, హృదయము, మూత్ర పిండములు, కాలేయము ఆత్మవాహికలగు వస్తువులుగా ప్రాధాన్యము సంతరించు కొన్నవి. అన్నిటికంటెను రక్తమునకుగల ప్రాధాన్యమెక్కువ. ఈ నమ్మకమే జానపద గాథల యందొక రక్తపు చుక్కనుండి యనేక వీరులుద్భవించుట యను కల్పనకు దారితీసిననదనవచ్చును.

ఈ విధముగా, ప్రాచీన మానవునకు ఆత్మయొక్క అస్తిత్వమును గూర్చియు, దాని ప్రభావమును గూర్చియు నేర్పడిన యభిప్రాయములన్నియు జానపద గేయగాథలయందు కథాంశములుగా రూపునందిన వనుట కెన్నియేని యుదాహరణములను చూపింపవచ్చును.

---

35. మైరావణపదము – పేజీ. 41 (ఎస్. అప్పలస్వామి అండ్ సన్స్ వారిచే ప్రచురింపబడినది, 1950)

(8) జనన మరణముల తరువాత, ప్రాచీన మానవ మేధయందు ప్రముఖ స్థానము వహించి రూపులు దిద్దుకొన్న యంశము 'మంత్రచర్య'—ఇట్టి మంత్ర చర్యను గూర్చియు, నతి మానుషమైన యద్భుతావహ క్రియలను గూర్చియు, ననేకానేక కల్పనలు, పురాగాథలయందు తొలుతను, ఆ మీదట జానపదగాథల యందును నశింపక నిలచియున్నవి.

ఒక వ్యక్తియొక్క జీవ మెడలిన శరీరమున గుప్తముగా నాత్మ యుండు ననియు, నది కొంత పైని గాలిలోఁ దిరుగుచు, నా వ్యక్తి నివసించిన పరిసర ముల యందును, పూర్వ జీవితముపైనను, మోజుచూపుననియు ప్రాచీనమానవుడు నమ్మెను. ఈజిప్షియనులు మమ్మీలకు సకల పదార్థములను సరఫరా చేయుట కును, హైందవులు శ్రాద్ధకర్మను నిర్వర్తించుటకును, కారణ మిదియే. ఇట్లు పైన దిరుగు నాత్మలో భాగమే బ్రతికియున్న మనుష్యుని యందు భయమును రేకెత్తింపఁగలుగుచున్నది.

ఈఆత్మ పిశాచలక్షణములనుగలిగి కనపడనివిధముగా దిరుగాడును.తనకు పూర్వ జీవితమున నిష్టులో, శత్రువులోయైన వారి నాశ్రయించి వారి మరణమునకు కారణమై చిట్టచివరకు వారిని తమ లోకమునకు గొనిపోవునను నూహ, మనుష్యుఁ డాదిమ దశనుండి కొంతలో కొంత యెదిగి, కల్పనా వైభవమును సంతరించు కొనుచున్న స్థితియందు, కలిగియుండును. ఇట్టి పిశాచాభిప్రాయము (Demon Idea) ప్రపంచ పురాగాథలన్నిటి యందును కథల రూపమున విస్తరించి యున్నది. ఆత్మయొక్క యునికియు, పిశాచావిష్కారమును, మానవుఁడెపుడు కల్పించుకొని నమ్మకమును ప్రోదివేసికొనెనో, అప్పుడే వానికి గల యధికార కాంక్ష, చుట్టునుగల సకల చరాచర జగత్తు మీదనేగాక, తనకు కాన్పించని యిట్టి యభౌమాంశము మీఁదఁగూడ ప్రభుత్వము నెఱప నిశ్చయించుకొనెను. అందు వలన, ఆత్మారాధన (Animism) యెపుడు స్థిరపడెనో, అప్పుడే ఆత్మశక్తిని అదుపున నుంచుకొనుటకు మంత్ర కలాపము, తాంత్రిక పద్ధతి (Magic and Sorcery) జనించినది. వీనివలన, ఆత్మలను ప్రభావితములు జేసి, వానిని గూడ మానవుల వలెనే జూచి, ప్రాచీన మానవుఁడు వానిని లొంగదీసికొనఁ గలిగితినను కొనెను.

అట్లు చేయుటలో నా యాత్మలను, లేదా పిశాచములను భయపెట్టుట ప్రీతులను జేయుట, వాని శక్తిని తగ్గించుట, వాని నాజ్ఞాపించుట వంటి, సర్వ విధములైన పద్ధతులకును స్థానము గలిగినది.

ఇట్టి యాత్మలు, లేదా పిశాచములు, రెండు విధములుగా విభజింపఁ బడెను. అందొకటి చనిపోయిన పూర్వీకులకు సంబంధించినవై, మనుష్యులనుండి భయమునేగాక, భక్తి గౌరవములను గూడ పొందునవి. రెండవది పూర్వీకులతో సంబంధము లేనిదై, (కొంతవఱకు దైవాంశమునకు, అనుబంధింపబడినవై) తన్ను ఆజ్ఞాపించెడి వ్యక్తియొక్క భావ తీవ్రతను బట్టి, వాని శత్రువులకు చెఱువు చేయుచు, నా విధముగ మనుష్య మానసముల కేవలము భయమును కలిగించునవి.

(9) ఇదియే అనేక జానపద గాథలయందు తొలుత తొలుత, పిశాచ రాజగు భేతాళుని రూపు వహించినది ఉదాహరణకు గాంధారి కథయందు, కథా నాయిక యగు గాంధారి, తనకు చదువు చెప్పు అయ్యవారి వాప క్రిందనుండి, 'మంత్రాల పుస్తకము'' సంగ్రహించి, యందున్న మంత్రములను 'హ్యాత్కవితె' చేసికొనెను.

"ఆ పుస్తకంలో ఏమేమి యున్నవి. శక్తి పంపు శాంభవి పంపు. హనుమంతు పంపు వీరభద్రు పంపు, భేతాళ పంపు, భైరవి పంపు, శక్తి ముగ్గు శాంభవి ముగ్గు హనుమంతు ముగ్గు, వీరభద్రు ముగ్గు భేతాళ ముగ్గు, భైరవి ముగ్గు ఇవి అన్ని చూస్తానే మంత్రాలన్ని ఆకళింపు చేసుకొనెను"[36]

అంతట గాంధారి, ఆయా శక్తులను కరగతము చేసికొని, వారిచే మానవాతీత కార్యములను చేయించినది. తన శత్రువగు సోయత రాజును చంపించినది. వాని పట్టణమును పాడు బెట్టించినది. తన యభీష్టానుసారము, మేనత్త కొడుకును వివాహమాడి సుఖించినది. అట్లే పణతి కథయందు, పణతిని నిరసించి బాలరాజు పారిపోఁదొడఁగెను. వానినే నమ్మకొన్న పణతి,

---

36. గాంధారి కథ – పేజీ. 36 (అమెరికన్ డైమండ్ ముద్రాక్షరశాల 1923)

వ. అయ్యో దైవమా ఇక నేమి చేతును పసుల బాలుని పరువులు పట్టి నా చేతగాకున్నది. ఇక నేది త్రోవయో యని యంగలార్చి

''భేతాళేశు మనమున దలచినది
భేతాళమును భక్తిని దలచినది
తలచినంత భేతాళుడు తావచ్చె
భేతాళుడు తా ఎదుట నిలచెనపుడు'

వ. "అప్పుడు కమ్మవారి పణతి కడు ధైర్యమంది అన్నా నాపై కరుణించి యిటకు వచ్చితివి నను కన్ను మొఱగి యల్లదో పారిపోవుచున్న బాలుని నెటులైన నిలుపుమని యెంతయు ప్రార్థించె''

భేతాళుడంత నామెపట్ల కనికరించి, బాలుని పులియై బెదరగొట్టెను. అంత పడమట పోవువాడు దక్షిణపు బాట పట్టగా, నా దిక్కున కార్చిచ్చై నిలువరించెను.

మఱియొకచో, పణతి తానును బాలరాజును దొంగలము కామని నిరూపించుటకై యగ్ని ప్రవేశము చేయ నిశ్చయించి,

''మ్రొక్కి తాను భేతాళుని మది దలంచి
అయ్యా కావలి వారు పోకుండ
నిలుపవయ్యా మ్రొక్కెదను నీకు సామి''

యని వేడుకొనెను. అంత పణతి, అగ్ని ద్వారా దేవనాధుని లోకమున కేగి, తండ్రిని దేవేంద్రను కలుసుకొని, తిరిగి యగ్నిద్వారమునను బయటికేతెంచి, యట నెవరులేకుండుట గమనించి,

''భూతనాథ భేతాళ వందనంబు
కావలుండిన కాపువారలచట
వారి నెట్లు విడిచితివో దేవ్రుడి'' యని నిలువరించెను.

భేతాళుడంతట,

''అమ్మ వినవె యో కమ్మవారి పణతి
తోటకాపులు ఇండ్ల కేగుచుండి
రపుడు నేను వద్దనుచు జెప్పినాను
నన్ను త్రోసికొనుచు బోయినారు భామ
కోపమెత్తి దిగ మ్రింగినాను వారినని[37] వివరించెను.

కామమ్మ కథయందు, కామమ్మ గుండమున పడనుండగా, నంతకు ముందు పేరంటాలై వెలసి పూజలందుకొనుచున్న చిన్నమ్మ ప్రభావము తగ్గునేమో యని, చిన్నమ్మ తల్లి, కామమ్మపై ప్రయోగము చేయించెను. మాలవాఁడొకడు పసుపు కుంకుమలతో నెఱ్ఱమారెమ్మను పంపుచేసి దానిని కామమ్మ యెదుటికి గొనిపొమ్మనెను. అది గ్రహించిన కామమ్మ, వాడు తాంత్రిక చర్య నెఱపి, మచ్చుపై పండుకొనుట నూహించి వాని నీవలకు తెప్పించి ప్రభావ విరహితుని చేసివైచెను. ఇట్టి యంశముల నెన్నియేని జానపద గేయ గాథల నుండి యెత్తి చూపవచ్చును.[38]

పురాణ కథనముల ననుసరించి, వీరభద్రుడు శివపుత్రుఁడును, హనుమంతుడు రామభక్తుఁడను, భైరవుఁడు సాక్షాచ్ఛివుఁడును, భైరవి, జగదంబికయు నను నభిప్రాయములు పొదుకొని, వీరు దైవీమూర్తులుగా కన్పించినను. జానపద కథావశమున నిట్టి చోట్ల కాన్పించు నీ రూపములన్నియు, ప్రాచీన మానవ మేధాకల్పితమగు పిశాచ విభాగమునకు (Demonology) చెందినవే యనుట స్పష్టము. కాలము క్రమించిన కొలది యిట్టి పిశాచారాధన యందు (Demon Cult) దైవీ భావన జతచేయబడి (Deity Cult) పిశాచములును దేవతలును కల గలసిపోవు ప్రమాద మేర్పడినది.

---

37. కమ్మవారి పణతి - పసుల బాలరాజు కథ -

38. కామమ్మ కథ - పేజీ 46.

అంతేకాక పిశాచ భావన దేవతా భావనతో కలగలిసిపోవుచుండగా మరి యొకవైపీ పిశాచములే (Demons) పురాగాథలయందును, జానపదగేయ గాథల యందును రాక్షసులుగా రూపు చెందుట జరిగినది.[39]

భౌమ జీవులగు మనుష్యులకును స్వర్గవాసులైన దేవతలకును భిన్నముగా వీరికి పాతాళమున నివాసము కల్పింపఁబడెను. వీరుఁడును, ప్రభావాన్వితుఁడును, మహత్కార్యాచరణ దక్షుఁడునగు జానపద కథానాయకునకు ప్రతివీరుని కల్పించు నపుడో లేదా, అతడు సాధింపనెంచు గురుతర కార్యనిర్వహణమునకు ప్రతిబంధ రూపముననో, ఈ రాక్షసరూప కల్పనము చేయుటకు, మానవ మేధ యిచ్చ గించెను. ఏ జాతి పురాగాథా స్వరూపము నందైనను ఇట్టి రాక్షస కల్పనము విరి విగా కలదు.

సిమ్లాకు 60 మైళ్ళ దూరమున నున్న జుబ్బాల్ లోయలోని, హిమాచల జనుల గాథలలో, నీ రాక్షస చిత్రణ మెక్కువగా కాన్పించుచున్నది. ద్వాపరాంత మున శ్రీకృష్ణ మరణానంతరము, ఉత్తర భూములయందు, పిశాచములును, విచ్చలవిడిగా చెలరేగెను. వీరికి నాయకుఁడు కిమ్మీరుఁడను వాఁడు, ఆ లోయ లోని మనుష్యులను తిన నారంభించెను. ఒక బ్రాహ్మణుని యేడుగురు కొడుకు లను మ్రింగి, వాని భార్యను బలాత్కరింపబోయెను. బ్రాహ్మణుడు శత్రునాశము చేయ సంకల్పించి దేవినిగూర్చి కఠోర తపము పూనగా నామె, తలపై జ్వలించు జ్వాలా మాలికలనుండి 'మహాసు' అను సూర్య సమాన తేజుఁడగు వీరుని నిర్మించి యిచ్చెను. వాఁడు 'జుబ్బాల్' లోయలోని రాక్షసుల నందరిని చంపి, యా ప్రజలను బాధా నిర్ముక్తులను చేసి తాను వీరుఁడై యా జనులచే పూజలందు కొనసాగెను.[40]

---

39. Folklore - Jan 1965 – Vol-VI. No. 1.
40. ఈ వీరుని గుడి 'వచ్చల్' అనుచోట 'తాన్స్' నదీతీరమున కలదు. ఈ కథను సాథేలు, జాగీలు. అను జానపదగాయకులు, శివరాత్రి సమయములయందు తంబురా మీటుచు కొన్ని రాత్రులు గానము చేయుదురట.
Folk lore-Jan. 1965. Vol. VI. No. 1.

అట్లే అచట ప్రచారమందున్న మఱియొక వీరగాథ యందు నాయకుడు శిర్‌గుల్ (శ్రీకులుడు) ప్రజలను హింసించెడి రాక్షసులను చంపుటకై తనంతట తానే 'షనల్వి' (Shanalwı) యను గుఱ్ఱమును సృజించి దానిపై నెక్కి యచటి రాక్షసులను హతమార్చెను. తదుపరి మంత్రాక్షతలను చల్లి గుఱ్ఱమును రాయిగా మార్చి తాను కాలాబాగ్ అనుచోట దేవతయై వెలసెను.[41]

రామాయణమందున లంకేశ్వరుడు రాక్షసుడగుటయు, ప్రకృతి శక్తుల పరస్పర వైరుధ్యమును చిత్రించెడి వైదిక గాథయందు, మేఘశక్తి రాక్షసుడగుటయు (వృత్రుడు) నిట్టి పురాగాథాంశముయొక్క ప్రభావము వలననే.

ఈ యంశము జానపద గేయగాథలయందు విరివిగా కాన్పించుచున్నది. శివకుమారుని కథయందు, దైత్య ప్రసంగము కలదు. అతని తాత బావి త్రవ్వింపబోఁగా నీటి బదులు పెద్దబండ పడెను. అందున్న జలరాక్షసుడు, అతని కుమారుని ఆహారముగా నిచ్చినచో నీరు పుష్కలముగా పడుననెను. ఆ వార్త తెలిసి శివకుమారుని తండ్రియు తల్లియు రాజధాని వదలి యడవులఁబట్టిరి. భార్యకు మిక్కిలి దప్పిక యగుటచే చేరువ నున్న నూతిలో నీరుతేఁబోయిన లవుతుని (శివకుమారుని తండ్రి) 'దైత్యుడు' మ్రింగివైచెను. భార్య భర్త జాడ కానరాక చేరువనున్న చెంచుపల్లెను చేరి యచట కుమారుని కనెను. వాడే శివకుమారుఁడు. వాఁడు పెరిగి పెద్దయై, తలిదండ్రుల పూర్వ వృత్తాంతమెఱిగి తండ్రిని మ్రింగిన నూయి జాడ తల్లిచే నెఱిగి, ఆ దైత్యుని చంపుటకై బయలు దేరెను. దైత్యునకీ విషయ మాకళింపై యేడు తాడిచెట్ల యెత్తు పెరిగి, బావి మాయము కావించి, యచట సూర్య వీధులతోడను, సోమ వీధులతోడను చూడ చక్కని పట్టణము కావించెను. బావి జాడ కానరాని తల్లికొడుకు లచట చెఱియొక వీధినఁబడి బావిని వెదుకఁబోయిరి. గిరిజావతిని, 'దైత్యుడు', ఆమె భర్త వేషము ధరించి బుజ్జగించెను. నీ కొడుకును చూడుమని భార్య సంతోషముతో శివకుమారుని చూపఁబోఁగా "వాఁడు నాకెక్కడికొడుకు. వాఁడు చచ్చినఁగాని మన యిరువురకును కుదురదు. నేను చెప్పినట్లు చేయు" మని గిరిజావతిని

41. Folk lore - Ibid.

ఒప్పించెను. దైత్యుని మాట ప్రకారము, తల్లి తలకు వాసెన కట్టువేచుకొని, "ఏడేడు సముద్రముల కావల జీవిగడ్డలోని దూడ నిమ్మపండురసము లేపనము చేసికొన్నగాని నొప్పి తగ్గదు, దానిని తెమ్మ"నును. దూడి నిమ్మచెట్టుకు చెట్టెడు పండ్లు. చెట్టుచుట్టును లక్షన్నర రాక్షసుల కాపు శివకుమారుడు బాలనాగమ్మ కథలోని బాలవద్దిరాజువలెనే, కార్యసాధన యందొకసారి మరణించి, బ్రతికి, యాపండ్లను సాధించుకొని వచ్చును. ఈ మారు తల్లి మరల తలనొప్పి సాకు చెప్పి యోజన గంధి కడనున్న మందులసంచిని దెమ్మనును. ఈ మారు వాడు, మందుల సంచినేకాక, యోజన గంధిని, దొరికిన దేవేంద్రుని యిరువురు కుమారితలను, ఇంటికి కొని వచ్చును. దేవేంద్రుని పెద్దకూతురు, దైవాంగన, అత్తకు దైతుని రహస్యమంతయు వెలువరించును. తన భార్యల మంత్రబలము వలన శివకుమారుడు దైతునిచే, నిదిపరచు మ్రింగబడిన తన తండ్రిని రక్షించి, యా మీద నా రాక్షసుని జంపెను. ఈ విధముగా శివకుమారుడు, తనకు ప్రతి వీరుడగు రాక్షసుని చంపి విజయియై శోభించెను.[42] ఇట్లు కొమిరెల్లిమల్లన్నకథ, కాంభోజరాజుకథ, సూర్య చంద్ర రాజుల కథ, రాయభేతాళ యుద్ధము వంటి యనేక గాథలలో నీ రాక్షసాంశము కలదు.

ఈ విధముగా. ఆత్మలను (Ancestral spirits) పిశాచములను, (Demons) దైవీరూప మాపాదింపబడిన పిశాచములను (Deified demons) రాక్షసులను (Monsters) లొంగదీసికొనుటకై యుపయోగించునదిగా జానపద మేధ తాంత్రికతను, (Sorcery) మంత్ర చర్యను (Magic) నభిమానించెను. ఈ యంశముల చుట్టును అనేకానేక కథలల్లబడి జానపద గాథాంశము పరిపుష్టమై భాసించినది.

తాంత్రికతతోపాటు సరిజోడుగా నడచునది మంత్ర చర్య (Magic) తాంత్రికతకు నియమిత కాల్యాచరణము (బల్యాదికములు) తో నియమిత వస్తు సంచయముతో (ముగ్గులు, అస్థులు నగైరా) గూడిన నిష్ఠ యవసరము కాగా, మంత్రశక్తికి ఏకాగ్రత, జపము, ధ్యానము వంటి గుణములు మాత్రమే యవ

---

42. శివకుమారుని కథ—నాచే సేకరింపబడిన గేయగాథ.

సరము దీని సహాయమున సామాన్య మానవుడు సాధింపలేని గుణ విశేషము లను పొందుటయే సాధకుని యాశయము.

ప్రపంచ జాతులలో నెంత యనాగరక జాతులలోనైనను, మంత్ర చర్యను గూర్చియు, మతమును గూర్చియు నభిప్రాయము లేర్పఱచుకొనని జాతి యుండదని ప్రముఖ నృశాస్త్రవేత్తల యభిప్రాయము.[43] వివిధ జాతుల పురా గాథలయందు మొదటి నుండియు ప్రేళ్లూని నిలచిన మంత్ర చర్యయు తాంత్రిక పద్ధతియు జానపద గేయగాథలయందును స్థానమును పొందినది.

తంత్ర చర్య, పిశాచములను లొంగదీసికొనుట, శత్రువుల కాపదలు ఘటించుట, యను విషయములయందు సహాయకారికాఁగా, మంత్రచర్య జానపద గాథలయందు సాధారణముగా వీరులకు మేలు కలిగించుట యందును, వారి వాంఛితార్థముల సమకూర్చుట యందును తోడ్పడుచున్నది.

జానపద కథా సరళియందు, సజ్జనుల కన్నివిధముల **తోడ్పడుటకై**, దైవమో, మహా పురుషులో, యట్టి మాంత్రికతను ప్రదర్శించుట కలదు. ప్రకృతి సహజమగు శక్తులన్నియు నీ మాంత్రికతకు లోబడియుండును. మనుష్యుల నాపదనుండి, శత్రువులనుండి, ఆశ్చర్యస్ఫూర్తి కలుగునట్లుగా కాపాడునది యీ మాంత్రికతయే. ఇట్టి మాంత్రిక చర్యలేని జానపదగేయ గాథలుండవన్న నది యతిశయోక్తి కానేరదు. ఈ విషయమును స్పష్టము చేయుటకై కొన్ని యుదా హరణములను మనవి చేయుదును. పరమజ్యోతి కథయందు, ఆమె భర్తను దొంగలు చంపివైచిరి. ఆమె భర్తృదేహమును, ముక్కలు ముక్కలుగా నున్న దానిని మూటగట్టుకొని,

"దండమయ్యా ఓహో మారాజా
రాజు మీదా మర్లాబడి నాదమ్మా
కంట కన్నూబెడ్డా ఉన్నాదీ

---

43. Bronislaw Malinowski – Magic Science and Religion & other Essays—Page. 17.

నోట నోరూ బెడ్డా ఉన్నావే
చిన్నప్పుడన్నా చావక పోతీవా
వయ్యో దేవా శివ దైవారామా
అయ్యో రామా దైవారామా"-అని

యేడ్చుచు పోవుచుండగా నామెపై 'మా లింగయోగికి కరుణ గలిగెను. ఆమె యేకాగ్రతను మెచ్చి, "నరము లేని నాగబెత్తం బట్టి, గోరంత వీబూది దీసికొని ముక్కలపై జల్లె" అంత "చచ్చినా మారాజు దిగ్గున లేచిండు"-అట్లు లేచిన వాఁడు ఊరుకొనక, తనకు 'విడియము వేసుకొన'' మనసుగా నున్న దనియు, నాకులు తెచ్చుకొందుననియు నిచటనే యుండుమని భార్యతో చెప్పి చేరువనున్న గ్రామములోని కేగెను. అచట ఆకులమ్మెడి పాపి యను దానినిజూచి యాకు లిమ్మని యడిగెను. వాని సోయగమునకు లొంగిపోయిన పాపి వానిని తన చెంతనే యుంచుకొను నుద్దేశ్యమున

"కాలికింద మన్ను బట్టె
పళ పళ మంతరించె
రాయి మీద గొట్టెనమ్మ
గొఱ్ఱెపోతును జేసెనమ్మ" చేసి

పెరటి యందొక గుంజకా గొఱ్ఱెను కట్టివైచెను.

పాపికి పదికోట్ల మంతరాలు వచ్చుననగా పరమజ్యోతికి పన్నెండుకోట్లు కైవసమై యుండెను. ఆమె భర్తరాక పోవుటకు చింతించి గ్రామములోనికి వచ్చెను. వచ్చుటకు ముందు, కాలికింది మన్ను బట్టి పళ పళ పళ మంతరించుకొని వీపున వేసి కొట్టుకొనఁగా, వీరభట వేషము వచ్చెను. ఆ వేసముతో నూరంతయు వెదకి ఆకుల పాపమ్మ యింటి కడకు వచ్చి గొఱ్ఱె రూపమున నున్న భర్త యవస్థను గ్రహించి, "ఆకులపాపీ చుట్ట దాగడానికి ఇంగలం దేవే'' యని అంకె వైచెను. ఆమే దోసిలితో నిప్పుతేఁగా, దానిని తన బంగారు పాగ చెంగులో ముడిచినది. తనకంటె నద్భుత చర్య నెరవేర్చిన పరమజ్యోతిని జూచి పాపి గుండెకు 'డక్కు దగిలెను'. ఆమీదట పాపి యినప తేళ్ళను మంత్రించి పరమజ్యోతి మీదికి విడువగా, నామె యినుప కోళ్ళను విడిచెను. సర్పములను సృష్టించి విడ

పగా దేగలను విడిచెను. అగ్ని జ్వాలలను మీదికి లేపగా, నీమె జలధార కురి యించెను. చివరకు పాపి నోడించి, తన మంత్రబలముచే భర్తను ఎప్పటివలెచేసి, కాలిక్రింది మన్నుదీసి వీపున గొట్టుకొని తాను "రామ చక్కని శ్రీకాంత" యాయెను.[44]

శివకుమారుని కథయందు, మంత్రమహితములగు వస్తువుల యునికి గలదు. తల్లి, యోజన గంధి కడనున్న మందుల కరాటమును దెమ్మనఁగా నాతఁడు బయలు వెడలి యొకచోట, ధ్యాన సమాధియందున్న చిటినుటి యోగిని చూచెను. అతనికి మ్రొక్కి తాను పూనిన కార్యమును వివరింపగా, యోజనగంధి మంత్రగత్తెయనియు, నది నరుని నల్లరాయిగా మార్చుననియు చెప్పి వానికి నాలుగు 'రౌతుల'ను (రాళ్లు) మంత్రించి యిచ్చెను. "యోజనగంధి యాఱు నెలలు నిద్రయు నాఱు నెలలు మెలఁకువయు కలిగియుండును. అది మెలఁకువతో నున్నచో దానిపై నొక బాయివైచి పెట్టెఁగొనిరమ్ము. అది నీ వెంటఁబడి వెను దిరిగి చూఁడుమని కేకలు వైచినను తిరిగిచూఁడకు" మనెను. కాని శివకుమారుఁడు యోజనగంధి చేయు చప్పుళ్ళను భరించలేక తిరిగిచూచి నల్లరాయియై పడెను. తరువాత బాబాజీ కరుణవలన వాఁడు లేచి వచ్చుచు దారిలో చెఱువునందు స్నాన మాడుచున్న దేవేంద్రుని కన్యలు దేవాంగనా పరమాంగనలను జూచెను. ఒడ్డున నున్న వారి చీరెలలో నొకదానిని సంగ్రహించి బావాజీ కడకు పరువెత్తుకొని వచ్చెను. బావాజీ సంగతి గ్రహించి, వానిని బల్లిని జేసి గోడ కంటించివైచెను. ఆ పైన నా స్త్రీలచే, శివకుమారుని పెండ్లియాడునట్లు ఒడంబడికలు చేయించుకొని వానిని మనుష్యుని చేసి యిచ్చెను. దేవకన్యల వ్యక్తిచిహ్నమైన (Individual-Totem Symbol) చీరెను తిరిగి వారు పొందకుండు నట్లుగా బావాజీ శివ కుమారుని పిక్కచీరి యందుంచి కుట్టివైచెను.

తదుపరి కొంతకాలమునకు శివకుమారుని కికురించి, దేవకన్యలు తమ చీరెను సంగ్రహించుకొని దేవలోకమున కెగసిపోయిరి. వాఁడు మఱల వారిని

---

44. పరమజ్యోతి కథ - నాచే సేకరింపబడిన గేయగాథ.

దెచ్చుకొనగోరి చిటిపుటి యోగి సాయమభిలషించెను. అంత దేవలోకమున కాతఁడేగుటకు వీలుగా, నాయన మంత్రమహితములగు 'పావల' నిచ్చెను.

ఈ రకముగా కథయంతయు నిట్టి మాంత్రికచర్యచే నద్భుతాపాదియై యున్నది.

కాంభోజరాజు కథయందు నాయకుఁడు అన్నలచే చంపఁబడి యోజన గంధిచే బ్రతుకుటయు, బాలనాగమ్మ కథయందలి బాలవద్దిరాజు పన్నెండు శిరస్సుల నాగుచే చంపఁబడి, గండభేరుండ పక్షులచే కొనిరాఁబడిన సంజీవి పుల్లచే జీవము నందుటయు, కుమార రాముని కథయందలి, ఖండింపబడిన రాముని తల ఢిల్లీ ఫౌజును నాశనము చేయుటయు, పల్నాటి చరిత్రయందు, యుద్ధభూమిని పవిత్రము చేయుటకై బ్రహ్మన్న కుంభవృష్టి గురిపించుటయు, పణతి కథయందు పణతి అగ్నిద్వారా దేవలోకమున కేగి తండ్రితో భాషించి తిరిగి భూలోకమున కాయగ్నినుండియే వెడలుటయు, ఎల్లమ్మకథయందు రేణుక ఇసుకతో నన్నము వండి, జల్లెడలో నీరుపట్టి భర్తను మెప్పించుటయు నను నీ యంశములన్నియు మాంత్రికత (Magic) కు సంబంధించినవే. ఇట్లుదాహరించుచు వోయిన జానపదగేయగాథల నన్నింటిని పేర్కొనక తప్పదు.

వీరునకు వాని వీరతా స్ఫూర్తిని పరీక్షించుటకై యీయఁబడెడి పరీక్షలన్నియు మానవాతీత విషయములై కేవలము మంత్ర శక్తిచే మాత్రమే సాధించుటకు వీలుకలిగినవిగా నుండుట సర్వసాధారణముగా నీ కథలయందు చూడ వచ్చును. శివకుమారుని కథ, కాంభోజరాజు కథ, బాలనాగమ్మ కథ, అనుముల బ్రహ్మరెడ్డి కథ మొదలగు కథల యందలి కథాంశ మీ విషయమును స్పష్టము చేయును.

ఈ విధముగా మంత్ర తంత్రములు జానపద గేయ గాథల యందు స్థిరముగా నిలచిపోవుటకు తగిన కథాంశ కల్పనము చేయబడినది.

ఇంకను కాలము గడచిన కొలది జానపద మేధ, కేవల మాత్మారాధన కథన్నాగిపోక ఆ దశగడచి, యాత్మల నుండి, పిశాచములను (Demons)

రాక్షసులను (Monsters) ఎట్లు కల్పించెనో, అట్లే ఆత్మల నుండి మే సమకాలి కముగను, సమాంతరముగను (Simultanious & Parellel) దైవమును (Deity) గూడ కల్పించుకొనెను. అట్లు వాని మేధ యందు దైవ రూపము దాల్చిన తొలిదైవము తల్లి దేవత (Mother Goddess). మాతారాధ నాంశము (Mother Goddess worship) ప్రకరణాంతరమున విపులముగా చర్చింపబడును.[45]

విల్హెల్మ్ ఊంట్ అభిప్రాయానుసారము, బలీయమగు వ్యక్తిత్వమును కలిగి నలుగురిలో ప్రత్యేకతను సంపాదించుకొను వీరునకు జానపదుని యూహ యందు ప్రాముఖ్యము హెచ్చిన సమయమున, అట్టి వీరులను పోలిన దేవతలు గూడ జానపదుని కథల యందు స్థానమును పొందిరి. వీరుఁడు సామాన్య మాన వున కంటె నెట్లు హెచ్చో మానవ గుణములే ద్విగుణీకృతములై వీరున కెట్లా పాదింపఁబడెనో, అదే విధముగ మానవ మేధా కల్పిత దేవ భావనయందు రెండు రెట్లుగను, మూడు రెట్లుగను వీరగుణములే పొందింపబడి మానవాతీత లక్షణము ప్రకాశితము చేయబడినది. అనగా సామాన్య మానవుని వీరమానవు డతిక్రమించి నట్లే, వీరపురుషుని దైవ కల్పన మతిక్రమించినదని ఊంట్ అభిప్రాయము.[46] కాని వీరమానవ కల్పనయు, దైవ కల్పనయు, నొకదాని వెనుక నొకటి యనుట కంటె, నాత్మారాధన దశ గడచిన వెనుక, దైవకల్పన యేర్పడినదనుట సమం జసము. తదుపరి దేవుఁడను వాని యస్తిత్వము నిర్ధారింపఁబడి, జనులలో దైవా రాధన స్థిరముగా పాదుకొన్నది. అట్టి దైవభావన చుట్టును, ననేక విధములుగా జానపద కథాంశము మలచఁబడి తీరు తీరులుగా సోయగములు వెలార్చినది.

దైవమునకుఁ గల యపార కరుణా విశేషమును, తన్ను భక్తితో కొలిచెడి మనుష్యులపై నాయనకు గల ప్రీతి వాత్సల్యములును, వారి కాయన ఘటించు శుభములను, నీ కథాంశము స్పష్టము చేయుటయే కాక, ఆయనకు వ్యతిరేకులైన

---

45. చూ. మాతారాధన.

46. Wilhelm wundt— Elements of Folk Psychlogy

జనుల మీదను, అపచారము చేసిన విశ్వాసరహితుల మీదను, ఆయన చూపు కోపావేశములును, కలుగఁజేయు నాపదలును, నిందు సూచింపఁబడినవి.

ముఖ్యముగా భగవంతుఁడు సంతాన ఫలప్రదాయకుఁడు. కుంటి మల్లారెడ్డి, కొమిరెల్లి మల్లన్న, ఎలనాగిరెడ్డి, గోపిరెడ్డి, బాలనాగమ్మ, శరాబందిరాజు, రాణి మైనావతి కొడుకు ముత్యాలరాజు, కుమార రాముఁడు, బాలచంద్రుఁడు, జలకంటి వీరుఁడు వారేమి వీరేమి, జానపద గేయగాథల యందని ప్రముఖ వ్యక్తులందఱును సించుమించు భగవద్దత్త వరప్రసాదము వలన జన్మనందినవారే. ఇట్లు దేవుఁడు సంతాన ఫలమును దయచేయుట యను కల్పన వివిధ రూపముల తీర్పఁబడి, రమణీయముగా కాన్పించును.

కుంటి మల్లారెడ్డి కథయందు, ఉత్తమారెడ్డి భార్య పెద మంగమ్మకు, ఆరుగురు కొడుకులను, ఇద్దరు కూతుండ్ర నిచ్చిన యీశ్వరుఁడు, ఆతని తమ్ముఁడు సత్యమారెడ్డి భార్య చిన మంగమ్మకు, ఒక కుంటి పిల్లవానిని ప్రసాదించెను. వానికి 'ఎడమ హస్తము'ను 'కుడి పాదము'ను లేవు. దానికి తల్లి, వ్యసనము చెంది, పర్వతమున కేగి (శ్రీశైలము) 'అఘోర' దీక్ష బూని తపము చేయగా నీశ్వరుడు ప్రత్యక్షమై, "నీ బావ కుమారుల కంటె నీ కుమారుఁడు చక్కని వాఁడమ్మా. నీ కుమారునకు నేనే చదువు చెప్పబోతున్నాన"ని ఆ పిల్లవాని నోరు తెఱచి నాలుకపై మూఁడక్షరములు వ్రాసెను. అందొకటి విషవాక్కు, మరి యొకటి అమృత వాక్కు, ఇంకొకటి దేవవాక్కు. అంతట వానికి నాలుగు వేదములు, 18 పురాణములు, తొమ్మిది శాస్త్రములు హృద్గతములైనవి. ఇట్లిచట సంతానకారకుఁడైన శివుఁడు వానిని ప్రసాదించి వానిని పిచ్చుకుంట్ల కులమునకు మూలపురుషుని చేసెను.[47]

రాణి మైనావతి కథయందీ సంతాన విషయకమగు కల్పన కొంత క్రొత్తగ నున్నది. రాణి మైనావతి పాచికలాడుటలో దిట్ట. ఆమె ఎప్పుడును తన పన్నెండు

---

47. కుంటి మల్లారెడ్డి కథ - నాచే సేకరింపఁబడినది. కర్నూలు జిల్లా రుద్రవరమున నొక పిచ్చుకుంట్లవాఁడు చెప్పెను.

మంది దాసీజనముతో నాడుచు తానే గెలుపొందుచుండెను. అట్లే కైలాసమున నెప్పుడును పార్వతీ పరమేశ్వరులాడెడి యీ యాటయందు పార్వతియే గెలిచెడిది. ఇది గ్రహించిన యీశ్వరుడు, "ఆహా! దేవలోకమున నా భార్యయే సత్యవంతురాలు భూలోకమున మైనావతియే సత్యవంతురా"లని మెచ్చి, మైనావతి కలలోనికేగి, "నేటికి మూడవ నాడు శుభ ఘడియ కలదు. అప్పుడు నీవు నీ భర్తతో కూటమాడిన నీకు, సకల సద్గుణ సంపన్నుడు 'ముత్యాల రాజు' జనించును"అని చెప్పెను. అంతతో నూరుకొనక, ఆ ఘడియ దాటినచో నిక నెప్పటికిని నీవు సంతాన లాభము పొందలేవని భయపెట్టెను. కలతెలిసిన రాణి మైనావతికి సంతోషమునకు బదులు విచారము ముంచుకొని వచ్చెను. కారణము భర్తయగు నమర సేనుడు దేశాంతరగతుడై యుండెను. చింతాక్రాంతయై చిన్నబోయి యున్న మైనావతిని జూచి, ఆమె తనకన్నవారింటి నుండి అరణముగా వెచ్చుకొన్న పచ్చ రామచిలుకలు "నీకేల దిగులు? మేము పోయి రెక్కల మీద గూర్చుండబెట్టుకొని నీ భర్తను కొనితెత్తు" మని చెప్పినవి. అంత మైనావతి సంతసించి చిలుకలను పంజరము నుండి వెలికి దీసి, వాని పచ్చని కాళ్లకు గజ్జల కడియములు దొడిగి, ముక్కుకు ముత్యాల ముంగరలుంచి, పాలును పంచదారయును మేపి పంపగా నవి "ఆగవేగము"న మొయ్యమని యాకాశమార్గమున నేగి, ఏడేడు 'పద్నాలు'గు సముద్రాలు దాటి అమరసేనుని జేరినవి. నిద్రించుచున్న రాజును లేపి యసలు విషయమును 'మర్మము పెట్టి' రాజా నీ భార్య మైనావతి దేహము విడిచి పరలోకమున కేగుచున్నది. నిన్ను కడసారి చూచుటకై తపించుచున్నదని చెప్పినవి. "పది ప్రొద్దులును, పది రాత్రులును ప్రయాణించిన గాని చేరని దూరమే: యెట్లు తన భార్యను చేరుటా?" యని రాజు విచార పడసాగెను. అంత చిలుకలు, మా రెక్కలను కలిపి చాప యల్లెదము. దానిపై పడకుండా భద్రముగాఁ గూర్చుండుమని వానిని రెండు గడియలో మైనావతి కడకు చేర్చినవి. చివరి చూపులకై వేచియుండుననుకొన్న భార్య, చిలకపట్టు చీరగట్టుకొని, రాజహంసల అవికెఁ దొడిగి, పెట్టెలలోని సొమ్ములెల్ల 'పెయి' మీద ధరియించుకొని ఎదురుగా బంగారు చెంబుతో నుదకము గొనివచ్చెను. సంగతి నెఱిఁగిన రాజు శుభ ఘడియ దాటనీయక 'కూటమాడి', దేశాంతరమున పనుల ఒత్తిడి యెక్కువగా నున్నదని, తిరుగు ప్రయాణమున కాయత్తుఁయ్యెను. అత్తమామలను కానిపించి పొందన్న భార్య మాటలను సరుకు చేయక తిరిగి చిలుకల నెక్కి వెడలిపోయెను. గమ్యము

చేరగనే అంటు సోకిన మనిషిని మోసి తెచ్చుటవలన, కలిగిన దోషమునకు గిర గిర తిరిగి గ్రుడ్లు తేలవేసి చిలుకలటనే మరణించినవి. సాక్ష్యాధార మట్లు నశించి నది. పతివ్రత యగుటచే మైనావతి తొమ్మిది ఘడియలకే పూర్ణ గర్భవతియైనది. అత్తమామ లిది గ్రహించి, తమ కొడుకు వచ్చిన విధ మెఱుగకపోవుటచే గుణము చెడిన కోడలింటనున్నచో, కులము చెడునని యెంచి యామెను వెడల నడిచిరి. మైనావతి 'యఘోర' మగు నరణ్యముల బట్టి పోవుచు నొకరాజు పట్టణము పొలిమేరలలో ప్రసవించెను ఆ విధముగా ముత్యాల రాజు ఉదయించెను [48] పర మేశ్వరుని సంతాల ప్రధాన గుణ మీ కథ యిట్లు నడుచుటకు కారణమైనది.

ఇంచుమించిదియే కథాంశము గలిగిన మఱియొక కథ రత్నాంగి కథ. ఇది రాయలసీమలో నాకు లభించినది. అందు బ్రహ్మదేవుని ప్రవేశము కలదు. చూడ చక్కని రత్నాంగి అందమును జూచి బ్రహ్మ, ఒకనాడు,

"ఈ ఒక్క రాత్రికీ
నీ మొగడు వస్తేను
ముత్యాల కొడుకునూ
పొందేవు రత్నాంగి
ఈ రాత్రి, రాకుంటె
అడవిలో నీ వొక్క
మానుపై పుట్టేవు
నరులు నిన్నూజూచి
నరికేరు రత్నాంగి" అని భయపెట్టెను.
కథ చిన్న చిన్న మార్పులతో, చేర్పులతో పై కథవలెనే సాగును.[49]

---

48. రాణి మైనావతి కథ — నాచే సేకరింపఁబడినది. హైదరాబాదు నందే, యొక శారదకాఁడు చెప్పినది.

49. రత్నాంగి కథ- కర్నూలు జిల్లా రుద్రవరములో నాచే సేకరింపబడినది

కుమార రాముని కథయందు, 'కంపిడ' (కంపిలి) పట్టణము నేలు వీరకంపిలి రాయని భార్య అరియాలదేవి సంతులేక సంతాపింపసాగెను. ఇట్టి గొడ్డు బ్రతుకు బ్రతుకుట కంటె నింత విషము త్రాగి మరణింతమని రాజుని ప్రాధేయ పడసాగినది. రాజు.

''కాంతా మన్నుదెచ్చి బొమ్మను చేయింతునా
ఒక మానుదెచ్చి బొమ్మను జేయింతునా
శివుండివ్వని సంతెక్కడిది భామా !''

యని భార్యను సమాశ్వసింప బోయెను. చివరకు 'రాణి, రాజ్యమంత విచారించి సంతానమిచ్చే హరుండు ఏ చోట ఉన్నాడో, దొరక బుచ్చుకుని, సంతానం తెచ్చుకుందామా రాజా !'' యని వాపోవగా రాజట్లే కానిమ్మనెను. అంత అరణ్యములు, పట్టణములు, పల్లెలు అన్ని చోట్లను వానికై కలయ వెదకి విసిగి వేసారి, యిక లాభము లేదనుకొని, తన రాజ్యము త్రోవలు బట్టెను.

''వచ్చేది ఆ తోవలోపల
అక్కడొక చిత్రము బుట్టింది.
అక్కడ అంపరాముల గట్టు బుట్టింది.
అక్కడ పంచ అయిదు గుండాలు బుట్టినయ్
అక్కడ రాములవారి దేవలంబు బుట్టె
బంగారి పాంకోళ్ళు బుట్టినయ్
బంగారి అక్షపాత్ర బుట్టె''
ఇదంతయు కన్నుల జూచిన అరియమ్మ
పరమాత్మ యిక్కడున్నవా దేవరా
ఇంత దేశము నేను దిరిగినా దేవరా
ఇక్కడైన నెలకొని ఉన్నావ'' యని సంతసించి,
నేతి గుండములో
నెత్తి గడిగింది అరియమ్మ
పాల గుండములో

పొయ్యి గడిగింది ...అరియమ్మ...
నీళ్ల గుండములో
స్నాన మాడింది ...అరియమ్మ...
అగ్నిగుండమూ తొక్కు-కుంటూ
జీడిగుండమూ తొక్కు-కుంటూ

స్వామి 'దేవళమున' కేతెంచి, శిరసు క్రిందికీ శ్రీపాదం మీదికి నుంచి తపస్సు చేయగా పరమాత్ముఁడు కరుణించి దిగివచ్చి యామె ప్రార్థన విని, తోటలో నున్న యరటిచెట్టుపై చెయ్యిచాపి యొక అరటిపండు తెంపి యొడిలో వైచెను.

మీదు మిక్కి-లి.

"నాయంత బలాఢ్యుణ్ణి యిచ్చినా ఓయమ్మా
అతఁడు పరమ పుణ్యుఁడే హరియమ్మా
అతడూ కాశిలో రామలింగ మయ్యేటి వాఁడే"

యని చెప్పి యామెను సాగ నంపెను.

రాణి యింటికి వచ్చి,
"దేవుఁడిచ్చిన అరటీ ఫలమూ,
ఫలము మీద[50] సిక్కు- దీసిందమ్మా
బంగారు సిడిగిన్నె లోపల నింపిందీ
పాలు పంచదార బోసిందీ అరియమ్మా
అయిదు నాగమల్లె పూలు బెట్టిందీ
హరహరా అని అర్పణ జేసిందీ."

ఆ పైన పండుమీది తోలును, పారవేయుమని దాది సంగకిచ్చెను, ఇచ్చుచు నరులు తొక్కని స్థలమున పడవేయుమని చెప్పెను. దాది సంగ "నరుడు దొక్కని జాగయేది ఓయమ్మ" యని దానిని తాను తినెను. పండు తిన్నందుకు రాణి తొమ్మిది ఘడియల కెల్ల కుమార రాముని గనెను. తోలు తిన్నందువలన దాది, తొమ్మిది ఘడియలలోనే కుమార రాముని పోలినట్టి బిడ్డనే కనగా, పోలిక

50. చిట చెక్కు- - తొక్కు-

రాముఁడని పేరు బెట్టి రాణియే వానిని గూడ పెంచెను.[51] భగవద్దత్తమగు ఫలము ఒక్కటియే యైనను దానిని రెండు భాగములుగా విభజించుటవలన నిట్లి రువురి జన్మకు కారణమైనది. పురాణముల యందలి జరాసంధ కథనమున జానపదకథాంశమే నిక్షిప్తమైనది. ఒకే ఫలమును, బృహద్రథుని యిరువురు భార్యలును చెఱి సగము గొనుటవలన వారికి మనుష్య శరీరార్ధములు జనించినవి.[52] ఇదే యంశము "వీరనాగమ్మ కథ" యందును గలదు

ఎంగమ్మకు ఏడుమంది కొడుకులు. "కులము ధరించు" కొడుకులు కలరుగాని, గోత్రమెంచి పాఁడు ఓడ్డలు (స్త్రీ సంతానము) లేరు. "ఒకరింటి యొడి బియ్యమున నా యిల్లు నిండుచున్నది గాని, నాయింటి యొడి బియ్యము "పరయింటికి" బోవుటలేదని యా తల్లి గోడుగోడున గోడాడెను. ఆడు పిల్లకై నాగేంద్రుని గూర్చి తపస్సు బట్టెను. నాగేంద్రు డామె తపస్సుకు మెచ్చి, వచ్చి, కోరిక విని, నీకు ఆడు సంతు లేదని నచ్చజెప్పఁబోయెను. ఎంగమ్మ మూర్ఛించి కూతురు కలుగనిచో ప్రాణములు విడుతుసని పట్టుబట్టెను. నాగేంద్రుఁడు తిరిగి తన లోకమున కేగి నలుగురు కూతుండ్ర నెవరైన భూమియందు జనించుట కిష్టపడెదరా యని యడిగెను. ముగ్గురు పిల్లలు,

"నరులు బడే బాధల్లు మేము బడలేమూ
నరులు జేసే పనులు మేము జెయ్యలేమూ"

అని నిరాకరించిరి. చివరిపిల్ల యొప్పుకొనెను. అంత నాగేంద్రుఁడు తిరిగి వచ్చి,

"నీ యింటి ముందర గజనిమ్మ చెట్టైయ్యి
చెట్టుకు చెంబెడు నీళ్లుబొయ్యమ్మ

---

51. కుమార రాముని కథ - నాచే సేకరింపఁబడినది - తాండూరు వాస్తవ్యుఁడగు నొక శారదకాఁడీ కథను జెప్పెను.

52. ఆంధ్రమహాభారతము- సభాపర్వము- ప్రథమాశ్వాసము- పేజీలు 1259, 260- ఎడిషన్. 1965

కాయల్లు గాస్తాయి, పండ్లు బడతాయి
పండ్లు బండీనంత ఒక్కటే పండు
ఒక్కటే పండును అనుభవించు తల్లి"

అని యాదేశించెను. ఎంగమ్మ లోపలి తొనలుతిని పై 'పిచ్చ' గూటి యందుంచెను. మైల గుడ్డలు గొనిపోవచ్చిన చాకలి వీరమ్మ ఆ పిచ్చ గొనిపోయి తాను భక్షించెను. ఎంగమ్మకు కూతురు పుట్టగా నామెకు వీర నాగమ్మ యని పేరిడిరి. చాకలి వనితకు కొడుకు పుట్టగా వానికి 'దుడుమన్న' యని పేరు బెట్టిరి. తరువాత కథ యంతయు 'దుడుమన్న' వలన సాగును.[53]

ప్రసిద్ధి వహించిన వర్ణనము కల స్త్రీలందఱును నాగలోకమునుంచి భూమియందు మనుష్య రూపమున జనించిన వారని జానపదుని కల్పన - శ్రీ లక్ష్మమ్మ కథయందలి లక్ష్మమ్మయు, ముందు జన్మమున నాగకన్యకయే-

"ఇద్దరి తోడ బుట్టినాది తల్లీ
లోకశాంభవి లక్షుమమ్మగారు
ముందు తానొక జన్మమందు తల్లీ
నాగ కన్నెకా లక్షుమమ్మగారు
ఎత్తవలసి నరజన్మ మెత్తెనమ్మా-" 54

బాలనాగమ్మ కథయందు సంతు లేని భూలక్ష్మీదేవి పడరాని పాట్లుబడి నాగేంద్రుని గట్టునకేగి బాలమామిడి చెట్టెక్కి, సంతానదాయకములగు పండ్లు గోసికొనెను. కాని ఆ చెట్టుకు కావలియున్న, నాగేంద్రుని యాగ్రహమునకు లోనై, తరువాత, నాయనచే కాటుంది మరణించెను. భూలక్ష్మీదేవి మరణమే బాలనాగమ్మ కథ ముందునకు సాగుటకు తోడ్పడిన ప్రధానాంశము. ఆ యంశమే సంతాన లాభము వలన సాధింపబడినది.

---

53. వీర నాగమ్మ కథ — కర్నూలు జిల్లా రుద్రవరమున నాకు లభించిన గేయగాథ.

54. శ్రీ లక్ష్మమ్మ కథ — పేజీ. 2 — వెస్ వార్డ్ అండ్ కం. 1949

జానపదుని కల్పనయందు జ్వాజ్వల్యముగ ప్రకాశించెడి యీ దైవము యొక్క రెండవ లక్షణము, భూలోకమున నార్తులును, విచారగ్రస్తులును నైన వారిని కనిపెట్టి వారి యాపదలను బాపుట.

భగవంతుని యునికి యూర్ధ్వలోకముల యందు. ఆయన నియమిత సమయములలో రథారూఢుడై, సతీ సమేతుడై యాకాశమున సంచరించుచునే భూలోకమందలి వ్యక్తుల కష్టనష్టములను పరికించి వానికి తరణోపాయమును ప్రసాదించుచుండును. ఒకవేళ దేవుడు బాధా నిమగ్నులైన వారిని చూడక పాలు మాలినచో ప్రక్కనున్న అమ్మవారు వానిని హెచ్చరించి, ఆపజ్జన రక్షణము నకై నడుము కట్టించును. ఈ విధముగా జానపద కల్పనమునందు, మనుష్యులకు, తాము తీర్చుకొనలేని కష్టములు వాటిల్లుటయు, వానిని దేవుడే తీర్చి, యాదుకొనుటయు నను నంశము సర్వసాధారణము.

ఈ యంశము ఒక్కొక్క జాతి పురాగాథల (Myths) యందును కాన్పించుచునే యుండును. ఉదాహరణకు గోండ్‌జాతి యొక్క సృష్టిగాథలలో (Creation myth) నీ యంశ మిట్లున్నది.

మేరు గిరిపైన తొమ్మిది గోడలచే చుట్టబడిన 'దౌరగిరి' (ధవళగిరి) యందు శంభు మహాదేవుడు సింహాసనమునుండి లేచి నాచే పాలింపబడుచున్న భూమి యెట్లున్నదో చూచి వత్తమని భూసంచారమునకు కాయత్తుడయ్యెను. పార్వతియు పరమేశ్వరుడును రథము నెక్కి తూర్పు వైపున దిరుగుచుండగా పార్వతికి సన్నని యేడుపు వినిపించెను. (Whimper). కారణమరియుదము రమ్మనగా, నీవు పోయి చూచి రమ్మని పార్వతిని పరమ శివుడాదేశించెను. 'సాజ్' చెట్టు క్రింద బల్లులవలె ప్రాకుచున్న శిశువుల నామె చూచెను. వారు, 12 కళ్లముల (Threshing floors) గోండు దేవతలును, 88 కళ్లముల తెలుగు, మరాఠా దేవతలును; పార్వతి వారి నందరిని తన బంగారు పైటకొంగున మూట కట్టుకొని, వచ్చెను. భర్తకు తెలిసిన కోపించునేమో యని, వానికి తెలియకుండగనే పెంచ నిశ్చయించి, తన కుడి రొమ్మును గోండ్ దేవతలకును ఎడమ రొమ్మును తెలుగు మరాఠా దేవతలకును ఇచ్చి పెంచెను.[55]

---

55. The Raja gonds of Adilabad.

అట్లే గౌతమ పురాణమునందు, పరమేశ్వర సంచార ప్రసక్తి కలదు.

కైలాసము మీది కథ యెట్టిదనిన
పార్వతీపరమేశ్వరుడు పరగగనపుడు
పార్వతీదేవి,

"ఏనూరు కోట్ల భూమండలం ఏక చక్రముగ
ఏలుచు నుంటిమి ఓ నాథ, మనము
భూపాలన శాయ బూని తిరుగగ వలెను"

అని చెప్పగా.

"మేఘ రథములయందు వేగమే వారు
తిరుగుచు నుండిరి ధీరులై యపుడు [56]

అనంతరెడ్డి కథయందు తిరుమలయ్యయు, గోపిరెడ్డియు నన్నదమ్ములు. కులమున కమ్మవారు, 'సల్లబట్ల వెంకట నరసయ్య' కుమారులు. కృష్ణా జిల్లా యందలి 'తడక' వారి గ్రామము తిరుమలయ్యకు భగవంతుడు 'జెష్టరాత' వ్రాసెను. తమ్ముడు సిరి సంపదలతో తులతూగుచుండగా నన్న యష్ట దారిద్ర్యము లనుభవించుచుండెను. ఈ కథాక్రమమును జూడగా నిది మిక్కిలి యిటీవలి కాలమున జరిగిన కథగా నిర్ధారించుటకు వీలగుచున్నది. అయినను దీని యందు నిక్షిప్తమైన జానపద కథాంశ సరణి మనోహరము. తిరుమలయ్య భార్య రంగమ్మ,

"పెనిమిటి పాలాల కాడ గుంజాలి
అన్నం లేక నవోయుచుండెర.
జీతగాని కన్న లేదాయెను
రెండెడ్లకు మేత లేదాయెను
వలవల రంగమ్మ వాపోవసాగెను

56. గౌతమ పురాణము నాచే సేకరింపబడినది.

పసిబిడ్డ పాలు జీకని యాళ
బసవ దేవుడు గరికి గొరకని యాళ
ఊరంతా మాటు మణిగిన యాళ
అమ్మవారి శోకము పార్వతి దేవికి

విన్నపాలాయెను" —అంత పార్వతి వెంటనే పరమ శివుని కడకు పరుగిడి రాగా నాయన,

"ఏమమ్మ పార్వతి
గోదేవుఁడు మేతమెయ్యనేళ్ల
కాకి పలుక నేళ్ల
చీమ పార నేళ్ల
నన్ను లేప కారణమేమి?" యని యడిగెను.

పార్వతి సంగతి వివరించి చెప్పగా, తిరుమలయ్య 'రాత' 'జెట్టరాత' యగుటచే దానిని బాగుచేయుట తన వశములో లేనిదని పరమేశ్వరుఁడు చెప్పెను. అంత పార్వతీదేవి మొండికెత్తి,

"నీవల్ల గాకుంటే నీవు అన్నవు
నేను చెల్లెను ఆ మాట ఒప్పుకొందువా?" యని మూర్ఛించెను.

తిరుమలయ్య, భార్య రంగమ్మ, వారి జీతగాండ్రు, కడకు వారి కొట్టములోని యెద్దులు, ఎవరికిని 'అంశ రాత' లేనందున, శివుఁడు వానిని భాగ్యవంతుని జేయుట యెట్లా యని యాలోచించెను. భార్య పోరు బడలేక కడకు, తిరుమలయ్యకు అంశగలిగిన మరో సంతానము కలుఁగజేసినచో, కడుపునఁ బుట్టిన వానివలన నైనను వానికింత యన్నము కలుగునని నిశ్చయించెను. అంత, 'యటాయటిన నిరువది నాల్గు గిల్లాల' రథము నాయత్తము జేసికొని దానినెక్కి వైకుంఠమున కేగుదెంచెను. అట బంగరు తూగుటుయ్యేలల నూగుచు సుఖించుచున్న పండ్రెండు మంది భక్తులను చూచి, యందొక్కని నేరి నీవు తిరుమలయ్యకు కుమారునిగా నరజన్మ మెత్తుమనెను. అంత నా భక్తుఁడు, వెనుకటి జన్మమున మనుష్యునిగా చాల కష్టముల జెందితిని గాన,

"మానవ జన్మము నాకు వద్దు తండ్రి
అడవిలో పెద్దపులి నయ్యేను
కాకి జన్మమె త్తేప - గాని
మానవ జన్మమె త్తితే సుఖము లేదయ్యా
వద్దు వద్దు తండ్రీ"

గోయెను. అంత పరమ శివుఁడు

"నీకు మునుపటి రాత గాదు
నీకు కొత్తరాత రాస్తున్న
ఏడుకొట్ల యెండి
ఆరుకొట్ల బంగారము
యాభై మంది గాపగాళ్ల
నీ చేతికింద గలరు - అని సమాశ్వసించి
నీవు పుట్టిన రెండేండ్ల లోన
మీయమ్మ రంగమ్మ మేడలు గట్టును
మూడేండ్ల లోపఁన నాగులకు పెచ్చుల కిచ్చును
గింజమర్ల బడుప
డబ్బు మర్లబడుప".

అని భవిష్యము చెప్పి వాని నొప్పించి, తిరుమలయ్య కడుపున ననంతరెడ్డిగా జనించునట్లు చేయును.[57]

ఇట్లు భగవంతుఁడు, ఆపదలయందున్నవారికి, కష్టము లనుభవించువారికి, నడ్డుపడి వారి నాదుకొనుట యను నంశము ననేక జానపద గేయగాథల యందు మనము చూడవచ్చును.

---

57. అనంతరెడ్డి కథ - ఇది వికారాబాద్ వాస్తవ్యుఁడగు నొక శారదకాఁడు చెప్పినది.

స్వయముగనో, లేక ప్రచ్ఛన్న వేషముతోడనో మనుష్యుల శక్తియుక్తులను, గుణశీలములను పరీక్షించుట జానపదుల గాథలలో కాన్పించెడి దైవముయొక్క మూపవలక్షణము. ఈ యంశము ఎన్నియేని కథలయందు కాన్పించును

అనుముల బ్రహ్మారెడ్డి యనువాఁడు శీలము చెన్నారెడ్డికొడుకు. చెన్నారెడ్డి ఇంటిపుత్రి బోధనముల నేలు మోతుబరి. తంగెడాపురము నేలు మాసిరెడ్డికి పచ్చల కడియాల పార్వతమ్మ శివుని వరమున జనించెను. ఆ పిల్లను 'పరచోటి'కి ఈయ వద్దనియు, నిల్లటము దెచ్చుకొమ్మనియు శివుఁడు మాసిరెడ్డి నాదేశించెను. మాసిరెడ్డి మిక్కిలి కష్టముపై చెన్నారెడ్డి నొప్పించి బ్రహ్మారెడ్డి నిల్లటము దెచ్చుకొనెను. అల్లుడు, మామ యింట, నే వ్యాపారము లేక యుండుట కిచ్ఛగింపక, పోడు భూమిని దున్ని, సేద్యము చేయుటకు నిర్ణయించుకొనెను. భూమి యందంత వఱకును కలియుగమున ప్రవేశ పెట్టఁబడని క్రొత్త విత్తనముల దేవలయునను పట్టుదలతో, నాగలోకమున కేగి తైదులను అనుములను పన్నెండు బండ్లపై నింపుకొని వచ్చెను. (నాగేంద్రుని కడనుండి, సరికి సరియను నొప్పందముపై తైదులను తెచ్చుటచే, వడ్డీ రూపమునిచ్చు, ఈ 'పెచ్చు'నకు నాగులని పేరు వచ్చినది. అట్లే, విత్తనములను నింపుకొని వచ్చినబండ్లు నాగబండ్లని పేరు నొందుటకును, నిదియే కారణము ఈ కథ సేద్యమునకు, అనుములు, తైదులు ప్రవేశ పెట్టుటను గూడ సూచించుచున్నది). ఇంటికి రాగానే బ్రహ్మారెడ్డిని పరీక్షింపవలయునని శివుఁడు ఏడుకోట్ల జంగములతో, జంగమ వేషమున వచ్చి యాకలి యగుచున్న దన్నము పెట్టుమనెను. బ్రహ్మారెడ్డి తాను విత్తనముల కై తెచ్చిన అనుములను 'గుడాలు' చేసి, తైదలు విసిరించి గంజి కాయించి 'సత్తికి పిడికెడు గుడాలను, జుట్టుకు లొట్టెడు అంబలియు' బోయించి తృప్తి పఱచెను అట్లు చేయగా మిగిలిన అతి స్వల్ప ప్రమాణములో నున్న గింజలనే భూమియందు చల్లించెను. చల్లించినంతనే మరల ముగ్గురు మూర్తులును జంగములై వచ్చి, యందఱి కన్నమిడితివి, మాకేమి పెట్టి యాకలి తీర్తువని యడిగిరి. అంత బ్రహ్మారెడ్డి యేమియు జంకక, శివుని దలచి, గోటెడు 'ఆధారము' దీసుకొని భూమిలో గొట్టెను. అంత చీమలు పుట్టలు పుట్టలుగా బయలుదేరి వచ్చి భూమియందు విత్తనములకై జల్లిన గింజల నన్నింటిని ఏరి కుప్ప పోసినవి. వానిని మరల గంజి కాయించి, సుండలు వేయించి వచ్చినవాని యాకలి దీర్చి పంపెను.

ఆ విధముగా బ్రహ్మారెడ్డిని పరీక్షించి, వాడు పడ్డ కష్టము నంతయు వ్యర్థమగునట్లుగా జేసిన శివుడూరకుండలేదు. చింతాక్రాంతుఁడై యున్న బ్రహ్మన్న కడకు వచ్చి,

"అరవై యొక్క నాగబండి
ఏటిలోపలికి కొట్టు కొడకా
దొడ్డు దొడ్డు ఉసికా దీసి
అనుములంటా, పొయ్యి నువ్వూ!
సన్న సన్నా ఉసికా నెత్తి
తైదులంటా నింపూ కొడకా!

యని చెప్పి వానిచే. నా విధముగా నరవై 'బిగా' ల పొలమును ఎదబెట్టించెను. పొలమేపుగా పెఱిగివచ్చి, యనుములును, తైదులు కొల్లలుగా పండినవి [58]

'పర్వతాల మల్లయ్య' కథయందు, గోపిరెడ్డియనువాడు తంగెడాపురి పట్టణమున పేరు మోసిన కాపులలో నొకడు. (ఈ కాపులలో వారుగా తంగెడా పురి మాసిరెడ్డి, అనుముల బ్రహ్మారెడ్డి, శీలం చెన్నారెడ్డి చెప్పబడినారు. వీరి ప్రసక్తి బ్రహ్మారెడ్డి కథయందును గలదు). అతడు మిక్కిలి లోభి. ఆతని పట్టణముననేడేండ్లు కరువు వాటిల్లినది.

అన్నము లేక నరులు చస్తరండి
గడ్డిలేక గోవులు చస్తవండి
మన్ను దిన్నవి కామధేనువులు
మాకుల మీద ఒరిగి చస్తవయ్యా
చెదలు తిన్నవి గొడ్డె పశువులయ్యా
చెట్లమీదనే ఒరిగి చస్తవయ్యా

---

58. అనుముల బ్రహ్మారెడ్డి కథ – వికారాబాద్‌కు చెందిన జంగము ఖాఁడు చెప్పిన గేయగాథ

ఈ ఘోషయంతయు రెడ్డి చూడలేక, కొంగు తలమీద వేసికొని, (మహమ్మదీయాచారము-తురకరాజ్యమున నున్న తెలంగాణా గాయకులకీ యాచారము వంటపట్టి యుండును)

"మొలకల పున్నంబు నాటికేమి
మల్లి పోయిన వర్షాలు కురిసితేను
చెర్లు కుంటలు ఏకంబులై తేను
అయ్యగారికి ఆరగింపు జేసేను
దాసులకు దాసంగం బెట్టేను
బ్రాహ్మలకు సమారాధన జేసేను"-

అని పరమేశ్వరునకు మ్రొక్కుకొనెను. దేవుఁడది గమనించి,

"ఇన్ని మొక్కులు ఇతఁడు తీర్చుతాఁడు
మొక్కిన మొక్కులు తీర్చుతాడొ లేదో
అన్నమాటలు దిద్దుతాఁడొ లేదో
ఇతని భక్తి నేను చూస్తనయ్యా"

అని, గోచెడు విభూతి క్రిందికి వేసెను. అంత వర్షములు కురిసి భూలక్ష్మీదేవికి శివుడిచ్చిన యాజ్ఞవలన రెడ్డి వేసిన కొఱ్ఱచేను విరగఁబండెను. అది చూచిన గోపిరెడ్డి చేనికి కొడుకు మల్లయ్యను కావలి యుంచి, వెనుకటి బాసలన్నియు మఱచి,

"పరువత బాటలో చేను ఉన్నది కొడక
పరువతంబు జంగాలు వచ్చేరు.
ఒక్క జంగము వానికి కంకి నిచ్చేవు
దాసరి వానికి దానము చేసేవు
నీవు దుమికిగాని భిక్షంబు నిస్తేను

కొఱ్ఱచేనులో గొంతుక గోసేనూ
కొఱ్ఱచేనుకూ నరపొలి పెట్టేను"

అని కట్టడి చేసెను. అది విని యీశ్వరుఁడు కిల కిల నవ్వి,

"ఎంత పాప కర్మడే రెడ్డి గోపి రెడ్డి
పాపి కడుపున ధర్ముడు అని యిస్తి
ఈ కొడుకు బుద్ధులు కన్నుల జూచెదను"

అని ముసలి జంగమై రుద్రాక్షల కుళ్ళాయిబెట్టి భద్రాక్షల దండలు ధరియించి, నాగుబాము నడికట్టు కట్టి, జోలె ముంజేత తగిల్చి గంట, శంఖు భుజాన వేసి చేనులో వెలిసెను. పిల్లవాడగు మల్లయ చేత భిక్షము పెట్టించు కొనెను. భిక్షము పెట్టిన నేరమునకు, తండ్రి పిల్లవాని నిండు చేను మధ్యమున నరికి, వాని శరీర ఖండముల తోడను, రక్తము తోడను పంట దేవతకు పొలి పెట్టి యింటికి వెడలెను.

ఈశ్వరుఁడిది చూచి చీమలతోడ రక్తమును, కాకులతోడ మాంస ఖండములను ప్రోగు చేయించి మల్లయ్యకు మరల ప్రాణమిచ్చెను. ఈ సంగతి యెఱిగిన గోపిరెడ్డి కొడుకునకు ప్రాణమచ్చిన జంగము వానిని చంపవలయునని తానును తన భార్యయును గలసి యెదుట ముదుసలి జంగమ రూపియై యున్న యీశ్వరునిపై దూకిరి. అంత

"స్వామి ఆడ పుట్టుతఁడు
ఈడ బోతఁడయ్యా
ఇద్దరి చేతుల సందున బడతాఁడు
పొద్దు మూకులూ చేనులొ దిప్పాఁడు
బండికట్టిన విధముగ కొరచేను
కొఱ్ఱలు అన్ని ధరణి ప్రాలినావి
పర్వతంబు బాట్లలకు తోలుకొని వచ్చె

వాళ్ల యిద్దరిని ఎదురు బదురు జేసె
హుక్కు శిలలుగా చేసినాడు స్వామి"

ఈ విధముగా వారి ధూర్తత్వమును, అవినయమును స్వామి శిక్షించెను.[59]

ఇట్లే కొమిరెల్లి మల్లన్న కథల యందు, ఆదిరెడ్డి యను వానిని, వాని భార్య సీలమాదేవిని పరమ భక్తులని యెఱిగి, శివుఁడు వారిని పరీక్షింప నెంచెను.

"ఫాలమందు భూతి పూసి
చంక నొక్క జోలెకట్టి - శంఖు గంట చేతబట్టి
హరహర మహదేవ యంచు-ఆదిరెడ్డి వాకిటాను
నిలచి భిక్షాందేహి యనుచు-పలుమారిటు పల్కగాను"

ఆదిరెడ్డి,

"వేళగాని వేళ నేఁడు
వృద్ధ జంగ మెందు కొచ్చె
నేడు తిరిగి పొమ్మనియు
రేపు మర్లి రమ్మనియు"

నని యంతటితో నూరకుండక, మెడఁబట్టి గెంటివేయమని సేవకునితో చెప్పెను.

ఇట్టి అభినయమునకు ప్రతిఫలముగా, ఆదిరెడ్డికి సిరిసంపదలు తొలగి బీదరిక మావహించెను. ఉన్న యూరు విడిచి పరసీమల బట్టి పోవలసి వచ్చెను. అష్టకష్టములఁబడి, యీశ్వరుని మనసా, ధ్యానించినగాని, వారిపై తిరిగి శివునకు

---

59. పర్వతాల మల్లారెడ్డి కథ — ఈ పేరిటి కథను శ్రీ బి. రామ రాజుగారు దయతో నిచ్చిరి. ఇదియే కథ 'గోపిరెడ్డి కథ' యను పేర, జంగము వాఁడొకఁడు చెప్పగా హైదరాబాదులో నేను వ్రాసికొంటిని. అతఁడు తాండూరు వాస్తవ్యుఁడు. పై రెంటికిని కథాకథనమున చిన్నచిన్న భేదములు కలవు.

దయ కలుగలేదు.[60] ఇట్టి యంశములు, చిరుతొండనంబి కథ, హట్కూరు కథ-వంటి యనేక జానపద గేయ గాథల యందు ప్రచురముగా గాన్పించుచున్నది.

దైవారాధనకు సంబంధించి, భక్తులు వీర భక్తిని ప్రదర్శించుట, భక్తియు, పరమేశ్వర భావనయు, తమ జీవితాదర్శములుగా మెలగుటయను నంశములు వీరశైవ గాథలయందు స్ఫుటముగా గాన్పించును. ఈ గాథలు ప్రకరణాంతరమున విరివిగా విమర్శింపబడుటవలన నిచట మఱల తడవుట చర్విత చర్వణమగును.

ఈ గాథలయందు కథాంశముగా మలచబడిన మఱియొక అంశము జంతు ప్రాధాన్యము కలిగిన యంశము. మనుష్యుల జీవితమున జంతువులతోడ్పాటు, కార్యాచరణమునందు జంతువు అందించు సహకారము, మనుషులు జంతువులగుట, జంతువులు మనుష్య రూపమునందుట, పశు పక్షి మృగాదులు మానవులకు వర ప్రదాతలగుట, భగవంతుడు జంతురూపియై మనుష్యుల కోర్కెలను నెరవేర్చుట వంటి యనేకాంశముల నాధారముగా గొని, బహుగాథలు రూపుదిద్దుకొన్నవి. ఈ విషయములన్నియు ప్రకరణాంతరమున[61] విపులముగా చర్చింపబడుటచే నిచట మఱల నుడివెడి యగత్యము లేదు. ఆదిమకాలమునుండియు. మనుష్యునకును జంతువునకును విడరాని బంధము కలదు. తాను వేటాడినపుడు, లొంగదీసికొని, పాలించి పనిచేయించుకొన్నపుడు, జంతువులో నేర్పడిన సాన్నిహిత్యమువలన మానవుని యూహల యందును, కల్పనలోను దీనికి మిక్కిలి ప్రాధాన్యము గలదు. ఇట్టి కల్పన జానపద గేయ గాథల యందును ఎడతెగక గ్రహింపబడుచునే యున్నది.

ఈ గాథలయందు ప్రధానమైన మఱియొకయంశము వ్యక్తి ప్రాధాన్యము వలన రూపొందినది. జానపద మేధాకల్పితమగు నీ యంశము, కేవలము అధి

---

60. కొమిరెల్లి మల్లన్న కథ - పేజీ. 14- చెర్వీరాల బాగయ్య (1949)

61. భోటమి కాంశములు - Ch IV చూడుడు.

మానవశక్తులను నిరూపించునదిగా కాక, సామాన్య మానవుని యావేశ కావేషము లను, వాని సాంఘిక జీవన విధానమున నెలకొనియున్న పద్ధతులను సూచించును. అద్భుత కార్యాచరణ దక్షత కలిగి, భగవదంశముయొక్క తోడ్పాటు చేతను మంత్ర తంత్రములయొక్క సహకారముచేతను, మానవాతీత కార్యములనొనర్చు వీరులకు సంబంధించిన కథాంశము ప్రత్యేక ప్రకరణమున విమర్శింపబడుటచే నిచట నట్టి వ్యక్తి ప్రాధాన్యమునకు సంబంధించిన యంశమును పరామర్శించుట లేదు.[62]

అట్లుకాక, సామాన్య వ్యక్తులు, వారివారి మనస్తత్వ ప్రదర్శనమును, వ్యక్తిత్వ ప్రదర్శనమును చేయుచు, కథను నడిపించు పట్టులనెంచి, వారిని మాత్రమే వివరించుటయైనది.

1. ఉదాహరణము, శీలగాఢతలేని చపలలగు స్త్రీలు, కుట్రలు పన్ని వీరుఁడగు కథానాయకుని ఆపదల పాలుచేయుట.

ఈ యంశము చాల విరివిగా జానపదు డభిమానించు నంశము. కుమార రాముని కథయందు, రాముని సవతి తల్లి రత్నాక్షి పాత్ర యీ విధముగా మలచఁబడి, కథ ముందునకు సాగుటకు తోడ్పడిన యంశముగా రూపునందినది.

కుమార రాముఁడు తన తాత ముత్తాతలాడిన చెండుమ కైవసము చేసుకొని దానితో నొకనాఁడు క్రీడించుచుండగా నది పినతల్లి యావరణలో పడెను. దానిని తెచ్చుకొనుటకు పోగా వాని యందమును జూచి మోహించి, తన కోర్కె దీర్చుమని రత్నాక్షి బలవంతముచేసెను. అందుకు ఒప్పుకొనని రాముఁడు తప్పించుకొని పోయిన వెనుక, రత్నాక్షి, వేటనుండి తిరిగివచ్చిన భర్తనుజూచి,

"రాగులు విసురుకోని
ఒళ్లంతా పట్టు వేసుకోని

62. వీరారాధనాంశములు - Ch VI చూడుఁడు.

గాజులు పగలగొట్టుకోని,

ఏమినాథా, నా ప్రాణనాథా

ఇక నీ కొడుకే నా పెనిమిటి"

అని చెప్పెను. తండ్రి యాగ్రహోదగ్రుఁడై మండిపడి కుమారరాముని శిరస్సు ఖండింపుఁడని యాజ్ఞ యీయగా ప్రధానులు పోలిక రాముని శిరఃఖండనము చేసి, శిరసుచూపి కుమార రాముని దాచివైచిరి. రాముని మరణవార్తవిని, ఢిల్లీ నవాబు విజృంభించి కంపిలి పట్టణము కైవసము చేసుకొనుటకై పన్నెండువేల రాణువను పంపును. అదను జూచి రాజునకు నచ్చజెప్పి, రత్నాక్షి దౌష్ట్యమును నిరూపించి ప్రధానులు, కుమార రాముని వెలికిదెచ్చిరి. రత్నాక్షిని రాజు సున్నపు కావునందు విరబోయించెను. ఆమె దౌష్ట్యమంతటితో సమాప్తి చెందలేదు. "మఱు జన్మమున ఢిల్లీ పాదుషా గుఱ్ఱపు చెవియందు మతంగి బూబునై పుట్టి నీ ప్రాణములు గొందునని, కుమార రాము నుద్దేశించి శపథము చేసి యామె మరణించెను. తానన్నట్లే తురకయింటబుట్టి, యవట పెరిగి యుద్ధసన్నద్ధురాలై ఢిల్లీ నవాబు రాణువను వెంటబెట్టుకొని రాముని మీదికి వచ్చెను. తుముల యుద్ధము జరిగిన వెనుక రాముఁడు అరవై పుట్ల ఆయుధములతో బూబును నరుక బోగా బూబు పైన అంగిజీల్చి యెదురు ఱొమ్ము జూపించెను. రాముడు, స్త్రీని నేను కొట్టనని అస్త్రసన్యాసము చేయగా, నీవు కొట్టలేనిచో, నాతో దెబ్బలు తిను మని ఒకే వాలు పోటునకు వాని శరీరమునుండి తలను వేరుచేసెను. ఢిల్లీ నవాబు చేతులలో రాముని యాయుష్యము ముగియుటకీ సవతి తల్లి ప్రేమగాథ జానపమునకిట్లు చక్కఁగ నుపకరించినది. ఈ కథతో పోలిన సారంగధర కథలో, సారంగధరుడే కుమార రాముఁడని జనాభిప్రాయ మున్నది.

కొమిరెల్లిమల్లన కథయందు, మల్లనకు భార్య వైపునుండి రాజ్యలాభము కలుగఁగా నాతఁడు రాజ్యపాలకుఁడయ్యెను. వాని యన్న లార్వురును, ఉన్న భూమి యందు కృషిని నిర్వహించుచుండిరి. ఇది గిట్టని వదిన లందఱును, మల్లన్నను యుక్తిచే ఊరు వెడల నడిపింపవలయునని సమాలోచనము చేసిరి. పెద్ద వదిన వన్నెలక్క పడక గదిలో నుండగా, "నందు పామున్నది, చంపు దువు రమ్మ" ని మిగిలిన వారు మల్లన్నను లోనికిఁ బంపిరి. లోన నున్న వన్నెలక్క మఱదిని బలవంతము చేయఁబోయెను. ఆమె కోర్కె నెఱిఁగి మల్లన

తన కిది తగదని బోధించి వెడలి పోయెన. అంత వన్నెలక్క ఒడలంతయును గీచుకొని, సిగముడి విప్పుకొని నేల మీదఁబడి దుఃఖించు చుండెను ఆమె పడ్డ పాట్లకు అన్నలార్వురును మల్లన కంటఁబడినచో, తల తెగగోయుదుమని పట్టు బట్టిరి. మల్లన రాజ్యపాలనము అన్నలకు వదిలి, అడవి దున్ని సాగునకు తెచ్చుటకై యూరు విడిచి పోవుట కీకథాంశ ముపకరించినది.

మొదిమెకోట నాగిరెడ్డి కథయందు, ఇరువురన్న దమ్ములలో చిన్నవాడు నాగప్ప. పెద్దవాఁడు కాలము దీరిపోగా, నాతడేలు మొదిమెకోట తమ్ముని వశమయ్యెను. పెద్దవాని భార్య 'అంతమ్మ' మరిది కడకు వచ్చి,

"నా కొంగు పట్టుమన్నది-
నాతో భోగము చేయుచున్నది
నన్నుగూడి రాజ్యము ఏలుమన్నది"

అందుకు నాగప్ప అంగీకరింపక,

"ఓ వదినే, వదినె అంతమ్మ
పాపము ముచ్చట ఆడబోకు
దోసపు ముచ్చట తియ్యబోకు
వదిననంగా తల్లితోడ సమానంబు
నా భార్య లేదంట
నిన్ను గూడ బోదునా వదినె
మొదిమెకోట రాజ్యం
పాడు చెయ్యబోకు వదినా" యని మొదలిడెను.

అంత అంతమ్మ దీనిని సహింపక, నా మాట విననందుకు, రెండు నెల్లలో నీకు 'మిత్తిదెత్తు'నని శపథము పట్టి వోయెను-'దుర్గం చెఱువు' అను గ్రామమున నున్న కట్టుబోతు బొందిలి వాని కడకేఁగి, నాగప్పను చంపు క్రియలు నెరవేర్చు మనెను. వాఁడు, భయపడి,

"మొదిమెకోట తాలూకాకు
చుట్టూ పన్నెండామడ,
పన్నెండామట పొంటి
నాగప్ప సరి మొనగాఁడె లేఁడు
నాగప్ప పేరు చెప్పితే
పట్టపగలు దివిటీ మండు
చేరులేని ఉయ్యాల లూగును
పారేటి పాములు నిలుచు
నాగప్ప పేరు చెప్పితే
దొంగతనము ముట్టబోదు
లంజతనము ముట్టాబోదు"

అట్టి వానితో నాకు 'పగలు' చేయకుమని ప్రార్థించెను. కాని అంతమ్మ ధోరణి మారకపోవుటచే బొందిలి వాఁడామెకు లొంగి పోవలసి వచ్చెను. తత్ఫలితముగా, బొందిలి వాని కట్టుబోతు క్రియల వలన నాగప్ప మరణించుట జరిగెను. (ఈ కథ మొదిమెకోట జమీందారీ వంశమునందలి నాగిరెడ్డియను దొరయొక్క మరణ ఘట్టము నాధారముగ అల్లిన కథయై యుండును. దీని యందలి జమీందారీ వంశీయులు రెడ్లు)[68] ఈ విధముగ కథాంశమునకు భిన్నముగా, కథాగత ముఖ్య పాత్రలు బలు కష్టములకు లోనగుటకు వారి సవతి తల్లులో, అత్తలో, ఆడుబిడ్డలో కారణమగునట్లుగా కల్పింపబడిన కథాంశము మీ గేయగాథల యందు విరివిగా కాన్పించుచున్నది.

బాలనాగమ్మ కథయందు నవభోజ రాజు రెండవ భార్య మాణిక్యాలదేవి, పిల్లలను కష్టముల పాలు చేసి చంప ప్రయత్నించుట చేతను, రాజు, భార్యకు

---

68. మొదిమెకోట నాగిరెడ్డి కథ.

దాసుఁడగుట చేతను పిల్లలడవుల పాలైరి వారట్లడవుల బట్టుట వలననే తరువాతి కథ సాగుట కనువయ్యెను.

కాంభోజరాజు కథయందు, ఆయన చివరి భార్య మాణిక్యాల దేవి సవతుల కుతంత్రము వలననే 'చెఱబందె'పాలై యడవులలో వదలి పెట్టఁబడెను. చెఱబందెయందే పుట్టిన, శరాబందిరాజు దేవతల కడపెరుగుటకును, మహా పరాక్రమవంతు డగుటకును అది కారణమయ్యెను.

పుణ్యాపరులును, పవిత్ర వర్తనలును, శీలమే ధనముగా కలవారును నగు, స్త్రీలు నాయికలుగా కల్పింపబడిన (ధర్మ) వీరగాథ లనేకములు గలవు. వాని విషయము విపులముగా ప్రకరణాంతరమున చర్చింపబడును.[64] అట్టివారి శీల గాఢతను నిరూపించుటకై, వారిని మిక్కిలి యొరయు అత్తలును ఆడుబిడ్డలును కొల్లలుగా నీ గేయ గాథలయందు కాన్పింతురు. కైకేయి లేనిదే శ్రీరామ గుణా విష్కారణము జరుగనట్లు, వీరి యాగడములు లేనిదే, శీలవతుల సద్గుణములు రాణించుట కవకాశము కాన్పింపదు.

చిన్నమ్మ కథయందు[65] ఆమెను రాచి అంపమున బెట్టిన యత్తమామల దౌష్ట్యమే ఆమె సహన శీలతను ఇబ్బడిముబ్బడిగాఁ జేసినది.

అట్లే వీర రాజమ్మ కథ యందు[66] పసిపిల్లవాని నెత్తుకొని వీరరాజమ్మ యిల్లు విడచి యడవిన బడుటకును, దొంగల పాలఁ బడుటకును, రౌద్రరూపిణియై సాహసము రూపుదాల్చిన చందమున, వారిని కసి మసఁగి, జానపదుల

---

64. వీరారాధనాంశములు.

65. చిన్నమ్మ కథ-ఎన్.వి. గోపాల్ అండ్ కో-1950

66. వీరరాజమ్మకథ — సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్, రాజమండ్రి.

మనస్సున, చిరంజీవత్వము సంచుటకుసు, అత్త సూరమ్మ దౌష్ట్యమే కారణము.

శ్రీ లక్ష్మమ్మ కథ[67] యందు లక్ష్మమ్మ నీలాపనిందలు చెంది భర్త చేతి బాకుపోటునంది మరణించుట కామె యత్త వెంకమ్మయు నాడుబిడ్డ పిచ్చమ్మయు కారణము.

సన్యాసమ్మ కథయందు,[68] బాలసన్యాసి బహుకష్టముల చెందుట కామె యత్త దాలమ్మ కారణము. ఈ యంశమును స్పష్టము చేయుట కిట్లెన్నియేని యుదాహరణ లిచ్చుచు పోవచ్చును.

ఇతరులపై నిట్టి మాత్సర్యము చూపుట, వారిని సిలుగుల పాలు చేయుట యను నంశము స్త్రీలకే పరిమితము కాక పురుషుల యందును కన్పించుచున్నది.

కాంభోజరాజు కథయందు, 'శరాబంది', సవతి యన్నలు అతడు తమ సవతి తల్లి బిడ్డడని తెలియగనే.

వ. వీనిని ఎలాగయినా నడిమధ్య దోవలో చంప వలసినదే గాని వీనిని ప్రాణముతో పెట్టరాదు. అని యోచనచేసి, బాలుడు తల్లిగారుండే అరణ్యవాసము వస్తూవుండు సమయములో ఆఱుగురన్నలును.

"ఈ బాలున్నాయిన పట్టుకొన్నరయ్య
గొర గొర గొర గొర గొంతు గోసిరయ్య"[69]

బాలనాగమ్మ కథయందు తనకు మేలుచేసిన బాలవద్దిరాజును నాగం బొట్లను బ్రాహ్మణుడు, వాని శరీరముమీది నగల కాసపడి నూతద్రోచెను.

---

67. శ్రీ లక్ష్మమ్మ కథ - వెస్ట్‌వార్డ్-కంపెనీ-మద్రాసు-1949.
68. బాలసన్యాసమ్మకథ-ఎన్.వి. గోపాల్ అండ్ కో-1952
69. కాంభోజరాజుకథ-పేజీ 38-ఎన్.వి. గోపాల్ అండ్ కో 1947.

జానపదుని బుద్ధియందు స్త్రీ శీలమునకుఁ గల విలువ చాల గొప్పది కథ యందు ఏ స్త్రీకై వీరుఁడు సాహసకార్యాచరణముచేసి యష్టకష్టముల పాలగునో, ఎవ్వరిని యితరుల యధికారమునుండి తప్పించి చెఱ విడిపించి, విముక్త బంధ ములు గలదానిగా, జేయునో అట్టి స్త్రీ యొక్క శీలమును పరమ పవిత్రముగ నున్నదని నిరూపించుటకే సిద్ధమగును. పగవాని చెఱయందున్నను, ఇల్లు వదలి యడవులు పర్వతములు దిరిగి యష్టకష్టముల పొందినను, తిరిగి యిల్లు జేరిన స్త్రీ తన శీల పావిత్ర్యమును నిరూపించు కొన్నట్లుగా చెప్పిన గాని జానపదుని బుద్ధికి తృప్తి కలుగదు. అలనాటి రామాయణ గాథయందు సీతాదేవి యగ్ని ప్రవేశ గాథ వెనుకను ఇట్టి జానపద బుద్ధియే ప్రత్యగ్రముగా గోచరించుచున్నది.

ఈ కథాంశ మనేక గాథలయందు కాన్పించును. బాలనాగమ్మ కథయందు పకీరు చెఱనుండి విముక్తురాలై, భర్తను చేరవచ్చిన బాలనాగమ్మను, కార్యవద్ధి రాజు,

"మీ తల్లి బాలనాగమ్మ, పకీరు చేతులో వ్రతము చెడ్డదేమీ దానిని నేనూ ఏలనన్నఁడయ్యా"

అంతబాలుఁడు కళపెళలాడు నూనెలో వ్రేలి యుంగరము వేసి తల్లిని దీయుమనెను. బాలనాగమ్మ ఆ పరీక్షకు నిలచెను.

కాని కార్యవద్దిరాజు,

''ఇంత పర్యంతం పకీరు దగ్గరానూ
వాడి దగ్గరా ఉండి వచ్చినాదీ
చెట్లక్రియలు ఎన్ని నేర్చినాదో
ఆకు పసరులు ఎన్ని నేర్చినాదో"

యని యా పరీక్షను తిరస్కరించెను.

''అప్పుడు బాలుఁడు ఏమి చేసినాఁడూ
రెండుక్రోసులా గుంటము త్రవ్వించె

గుండము నిండా కలప పెంపినాఁడూ
అగ్నిహోత్రము సంధించినాఁడూ
నూనెనెయ్యి పగలఁ బోసినాఁడూ
భగభగభగమని మండుతున్నదయ్యా
ఆ మంటలో తల్లిని దూకమన్నఁడేమి '...

బాలనాగమ్మ, 'తొక్కోటి భూదేవిని' తోడు గమ్మని. 'కాలేటి సూర్యునకు' నమస్కరించి, కుప్పించి గుండమున దూకి, అందుండి నాయుగు గడియలు మాట్లాడివచ్చెను. ఆమె కట్టిన కోక కాలలేదు. పెట్టిన కుంకుమ చెదరలేదు. దేహము బొబ్బలు పొక్కలేదు. అది చూచినంత రాజు పుక్కిట విడెము చెదర నవ్వి, "మీ తల్లినిక నేను నమ్మితిని నాయనా" యనెను.[70]

కాంభోజరాజు కథయందు, మాణిక్యాలదేవి 'చెఱబందె'లో నున్నపుడు స్వామి కరుణవలన శరాబందిని కనెను. చివరికి శరాబందిరాజు తన తండ్రి యగు కాంభోజరాజు రుగ్మతను బాపి తల్లిని తండ్రిని కలుపఁబోగా, తండ్రి, "ఈ కుమారుడు నీ కెట్లు గలిగెను భామా ?" యని యడిగెను.

వ. ''పరాత్పరుడగు ఈశ్వరుడు కృపాకటాక్ష ముంచి యీ బిడ్డ
నిచ్చెను. ఈ మిద్దెలు మేడలు స్వామి యిచ్చెను."

అనగా

''స్వామి కరుణచేత కలిగిన బిడ్డ అయితే పరీక్షలడుగుతాను.
సముద్రమొడ్డుకుపోయి ఓ సముద్రాల దేవి ఆ తలి
ఒడ్డుకు పాయ యివ్వమని బాలుఁడడిగితే,
సముద్రాల దేవి పాయ యిచ్చితే...తందానతాన
అప్పుడు నేను నమ్మెద నన్నాఁడు...తందాన...

---

70 బాలనాగమ్మ కథ - పేజీ. 125

బాలుండా పరీక్ష జయప్రదముగా నిర్వహించుటవలన తల్లి నిర్దోషిత్వము వెల్లడియయ్యెను.

ధర్మాంగద పాము పాటయందు సకల తీర్థముల గ్రుంకి సకల క్షేత్రములు మెట్టిన సుందరి తన భర్తయగు పామును మానవునిగా మార్చుకొని తిరిగి వచ్చినది మామ ధర్మాంగదుడు కోడలిని చూచి,

> "దేశదేశములెల్ల తేటగా వెదకి
> మనసుకొచ్చిన రాజు మగువ నీవు గోరి
> ఆ రాజుతోగూడి యిటు వచ్చితివిగాని
> నీ మాట లెల్లను నిజముగా నమ్మన్'' అనియెను.

అంత సుందరి గగన వాణిని ప్రార్థింపగా, నామె జరిగిన సంగతి వెల్లడియొనర్చి, సుందరి నిర్దోషి యని చాటినది [71] ఈ యంశ మిట్లనేక గాథలయందు చూపట్టును.

ఇట్టి పరీక్షలలో తల్లిబిడ్డల అనుబంధమును నిర్ధారించు పరీక్షయొకటి జానపద మేధాకల్పితమై వికివిగా కాన్పించుచు వచ్చుట గొలుపును.

చాలకాలము క్రిందట విడిపోయిన తల్లిబిడ్డలను గుర్తించుట కిది తోడ్పడును.

బాలనాగమ్మ కథయందు రోజుల బిడ్డ నుయ్యెలలో విడిచి, మాయల ఫకీరు వెంట జూలు కుక్కయై బాలనాగమ్మ నాగళ్ళపూడి గట్టునకు వెడలిపోయెను. బాలుడు పన్నెండేండ్లు పెరిగి, తల్లి చెఱ విడిపించుటకై మాయల ఫకీరున్న నాగళ్ళపూడి గట్టునకు వచ్చి యచటి లంబాళ్ళవ్వ కడ మనుమడై కుదురుకొనెను. తల్లికొక పూలదండకట్టి యందు తనకు, తల్లి పెట్టిన చిటికెన వ్రేలి యుంగరము నమర్చి అవ్వద్వారా దానిని పంపెను. తదుపరి, మెల్లగా ఫకీరు వాని యనుమతినిపొంది, తల్లి సమక్షమునకు వచ్చి నిలచెను.

---

71 ధర్మాంగద - పాము పాట - పేజీ. 109 - వెస్ట్ వార్డ్ అండ్ కం., (1932)

అప్పుడు, వానిని

> ''తలయెత్తిగా చూచెను నాగమ్మ
> గుబగుబమంటా స్తన్యపానమేమి
> బాలనాగుకు పొంగె నమ్మలారా
> అయ్యో కొడకా బాలచద్దిరాజా
> చేతులార తా ఎత్తుకొన్న దేమి
> కన్నులారగా చూచెను నాగమ్మ
> చెక్కిలినొక్కి చేరి ముద్దులాడె''

ఇట్లు స్తన్యము పొంగుట యనునది తల్లిబిడ్డల యనుబంధమునకు బలమైన సూచనగా జానపదుని యూహ.

పరమ జ్యోతి కథయందు, ఆరురోజుల పసిబాలుని పెండ్లాడిన పడతి పరమజ్యోతి. తన స్వయంశక్తివలన ఆరు నెలల బాలుని పెంచి పెద్దవానిని జేసి, విద్యానిధిని జేసి యింటికి గొనివచ్చెను. కాని ఆ బాలుడే యీ యువకుడని యెవరును నమ్మరైరి. అంత పరమజ్యోతి,

> ''ఏడు పరదాలు గట్టండి
> పట్టు పరదాలు గట్టండి
> అవతల మా యత్త మూర్ధాలదేవి
> ఇవతల నా ప్రాణనాథుడు బిర్థోరాజు
> మా యత్త పసిబాలు జప్పునదుంకి
> ఏడేడు పరదాలు దడుసుకోని
> బిర్థోరాజు ముఖంమీద పడెనాంటే
> మీ కొడుకననుకోండి...'' అని సులువు నుపదేశించెను.

ఆ రీతిగనే బిర్థోరాజు మూర్ధాలదేవి కుమారుడని నిర్ధారణమయ్యెను.[72]

---

72 పరమ జ్యోతి కథ – హైదరాబాదులో శారదకాండు చెప్పంగా నేను వ్రాసికొన్న కథ.

రాణి మైనావతి కథయందు, చిన్ననాఁడే తల్లికడ నుండి వేఱుచేయఁబడి ముత్యాలరాజు రాచబిడ్డగా పెరిగి పెద్దయై రాజ్యపాలనము చేయసాగెను. ఆ ఊరి యందే యొక వేశ్యాంగన చేరికలో ప్రచ్ఛన్నముగా రాణి మైనావతి కాలము గడుపుచుండెను. 'ఏడంతరముల' మేడపైన తల యార్చుకొనుచున్న మైనావతి యందమును జూచి, నీ మేడకు వత్తునని రాజు వేశ్యాంగనకు వర్తమానము పంపి యలంకరించుకొని యానాటి రాత్రి బయలుదేరెను. వీనికి బుద్ధి చెప్పుటకై భూలక్ష్మి గంగిగోవును, ఆకాశలక్ష్మి లేగదూడయునై దారి కడ్డముగా బండుకొనిరి. పోవు తొందరలో ముత్యాలరాజు దూడతోకను బంగారు పావలతో 'కసిక్కి'న త్రొక్కెను. "అమ్మా గ్రుడ్డివాఁడు నాతోక త్రొక్కెనే యని దూడ ఆవుతో మొరయిడెను." "వాడు తల్లినే కలియబోవుచున్న గ్రుడ్డివాఁడు. కన్నుపైగాననివాఁడు, నీ తోక త్రొక్కుటయేమి వింత" యని గోవు మందలించెను. పక్షి వాక్కు, పశువుల వాక్కు తెలిసిన ముత్యాలరాజు గిరుక్కున వెనుకకు తిరిగి తన మహలునకేగెను. తల్లిని గద్దించి తన జన్మవృత్తాంతమడిగి తెలుసుకొనెను మరునాఁడు మైనావతిని పిలిపించి ఏడేడు పదునాలుగు పట్టుతెరలు గట్టించి తెరకావల నామెను నిలిపెను. ఈవల తాను నిలచెను. తాను "అమ్మా మైనావతీ" యనఁగా నామె "కొడుకా ముత్యాల రాజా" యనెను. ఆమె చనుబాలు పొంగి పదునాలుగు పట్టు తెరలను తడిపి ముత్యాలరాజు ముఖమును ముంచియెత్తెను. ఆ విధముగా వారిరువురి యనుబంధమును నిర్ధారితమయ్యెను.

వ్యక్తికి ప్రాధాన్యము నిచ్చుచు, అధిభౌమాంశముయొక్క సహాయము లేకుండ, కేవలము స్త్రీ పురుషుల ప్రవర్తనలపై నాధారపడి మలచఁబడిన కథాంశ మిన్ని తెఱగులుగా, మనోహరముగా దీర్చిదిద్దఁబడినది.

ఇట్లు, జనన మరణములు, ఆత్మయొక్క యస్తిత్వము మంత్ర తంత్రములు, రాక్షస కల్పనము, దైవారాధనము, వ్యక్తి ప్రాధాన్యమునను విషయముల చుట్టును అల్లబడెడి కథాంశముల (Motifs) తీర్మానము సర్వసాధారముగా నేజాతి జానపదగాథల యందైనను ఒకదానితోనొకటి కొద్దియో, గొప్పయో పోలికలు కలిగి కాన్పించుట జరుగుచున్నది.

కథాంశ స్వరూపము

ఈ ప్రకరణమున వివరింపబడిన కథాంశములు ముఖ్యముగా తెలుగు జానపద గేయగాథలనుండి యుద్ధరింపబడినవే యయ్యును, ఇతర భాషలలోని గాథలయందును గాన్పింపఁగలవు. కావున నిట్టి యంశములను జానపద కథా నిర్మాణమునందు సర్వసాధారణముగా నుపయోగింపబడు నమూనాలుగా గ్రహింప వచ్చును. మూసలలోపోసిన చందమున నిట్టి నమూనాల ననుసరించియే జానపద గాథ లేర్పడుచుండుటవలన, నివి దేశకాలభాషా విభాగములకు లొంగక యొకదానితో నొకటి మిక్కిలి పోలికలు కలిగియుండుట జరుగుచున్నది. ఈ పోలికలను గుర్తుపట్టి జానపదుఁ డభిమానించిన నమూనాలను గ్రహించుటవలన, ఆదిమ దశయందలి మానవమేధయొక్క ఆలోచనా పద్ధతిని గుర్తుపట్టుటకు కొంత వీలు కలుగవచ్చును.

ఈ ప్రకరణమున అట్టి ప్రయత్నమే జరిగినది.

—: o :—

# టోటెమ్ కాంశములు

జానపద గేయ గాథల కథాకథనమును పరిశీలింపఁగా, దానిని మత ప్రాతిపదికపై కొన్ని విభాగములుగా చేయుటకు వీలున్నది.

ఆదిమ మానవ మత స్వరూపము తొలి ప్రకరణమునందు స్థూలముగా వివరింపఁబడినది. ప్రాఙ్మానవ మతమునందే పితృదేవతారాధనకు (manism) బీజములు నాటఁబడినవి. చనిపోయిన వారి యాత్మలు భూమిపై తాము నివసించిన ప్రదేశములయందు తిరుగుచుండుననియు, వానికి నిత్యావసర వస్తువులును, ఆహారమును, మానవులకు వలెనే యవసరములనియు, అట్టి వస్తువులు తమకు లభించని పక్షమున నాగ్రహావేశమున నవి తమ బంధువుల కాపదలు కలుగజేయుననియు, తమను భక్తితో నారాధించినచో సర్వసుఖములు కలుగఁజేయునంతటి శక్తి కలవియనియు, నాదిమ మానవుఁడు విశ్వసించెను. ఆ విశ్వాసము వలననే వాని మత విధానమున పితృదేవతారాధనమును, దానికి సంబంధించిన కొన్ని పరమోద్దేశ్యములును నెలకొన్నవి. అట్టి యుద్దేశ్యములలో నొకటి, పితృదేవతల యాత్మలు జంతురూపమున కన్పించునని విశ్వసించుట [1] ప్రపంచ వ్యాప్తముగ వివిధ జాతులలో నీ యభిప్రాయము కలదు. మలయా ద్వీపకల్పమునకు చెందిన సెమాంగులు, చనిపోయిన మనుష్యుని యాత్మ పక్షి రూపము వహించి యెగిరిపోవునని నమ్ముదురు. అంతేకాక, అదనునకై వేచి, తన జాతికి చెందిన స్త్రీ గర్భమున ప్రవేశించి మరల నా యాత్మ జన్మమందును. సెమాంగ్ స్త్రీ గర్భవతియైనపుడు, తన గోత్రమునకు సంబంధించిన చెట్టును, చక్కఁగా నలంకరించి వేచియుండును. ఆ చెట్టుపై వ్రాలిన పక్షిని దేనినేని, తన పూర్వుల ఆత్మ నెలకొన్న పక్షిగా భావించి, దానిని పట్టుకొని భుజించును. అట్లు తినుట వలన తన గర్భమునందు, ఆత్మరహితమై నిర్జీవముగా పెరుగుచున్న పిండమునకు, ఆత్మ లభించునని యామె విశ్వసించును. ఆస్ట్రేలియాకు చెందిన కొన్ని యాటవిక జాతులయందును ఆత్మ పక్షిరూపమును వహించి చరించుననుు నమ్మ

1. Animal worship-Encyclopaedia of Religion,

కము కలదు. వారు శవమును పూడ్చునపుడు, విహగరూపము నందిన యాత్మ నిరాఘాటముగ సమాధికిని బయటి ప్రపంచమునకును మధ్య రాకపోక లొనర్చుటకు, ఆ సమాధిపై నొక రంధ్రము నేర్పాటు చేయుదురు.[2]

ఆ యాత్మ తన బ్రతికిన దినములలోని వాసస్థానమునకు రాకుండుటకై, చనిపోయినవాఁడు నివసించిన గుడిసెను తగులబెట్టి వాని వస్తువులను నాశనము చేయుదురు బ్రిటిష్ కొలంబియాకు చెందిన హైడాలలో నీట మునిగి చనిపోయిన వారి యాత్మలు మనుష్యులను వేటాడు తిమింగలములు (Killer whales) గా రూపొందుననియు, యుద్ధమున మృతి పొందిన వారి యాత్మలు వసంత కాలమున పాటలుపాడు పక్షులగుననియు నమ్మకముకలదు, హాటెన్‌టాటులు, చనిపోయిన వారియాత్మలు, సమాధినుండి వెలికివచ్చి, నక్కలుగా రూపొందునని నమ్ముదురు. పశ్చిమాఫ్రికాకు చెందిన దహోమియనులలో ఆత్మయొక్క స్వరూపము సర్పముగా, భావింపఁబడుచున్నది. మానవ శరీర సృజనమున కదియే కారణము. అది వ్యక్తి గత జీవశక్తికిని వ్యవహార దక్షతకును చిహ్నము చిన్నబిడ్డయొక్క 'మాయ చేరు' (Umblical cord) గా నా పాము విశ్వసింపఁబడుచున్నది. అట్లు జననాది, ప్రతి వ్యక్తియొక్క బొడ్డునందును ఆ సర్పము నెలకొని తన్ను నిర్లక్ష్యము చేయు మానవుల సంపదలను దోచి తెచ్చి తన్ను పూజించి గౌరవించెడి వారికిచ్చి వారిని సంపద్యుక్తులను చేయునను నమ్మకము దహోమియనులకుఁ గలదు. ఈ పామే వారిచే, గుడికట్టి పూజింపఁబడి, కులదేవత (Clan deity)గా రూపొందుచున్నది.[3] మన యోగ విద్యయందు, శరీరగత ప్రాణమును కుండలినీ శక్తిగా వర్ణించుట కలదు. ఇది మూలాధార చక్రమున నిద్రించు కులకుండలిని. దీని రూపము సర్పరూపము. ఇదియే జీవాత్మ[4]. ఇది మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక. అనాహత. విశుద్ధ, సహస్రార, చక్రముల నొక్కటిగా గమించి

---

2. George Peter murdock-our primitive contemporaries.
3. G. P. Murdock-our primitive contemporaries.
4. Swami Sankaranda–Rigvedic culture of pre-historic Indus Vol. 1. P. 143.

'సోహం' మంత్ర పఠనముతోడ కపాలచ్ఛేదము గావించుకొని వెడలి పోవు వర్ణింపఁబడినది.[5]

మనలో, వేటాడుచు క్రూర మృగము వాతఁబడి మరణించినవాఁడు పె పులి యగునను నమ్మకము కలదు.

ఇట్టి కథనములను బట్టి చూడఁగా చనిపోయిన వారి యాత్మలు వివి జంతురూపముల నందుచున్న వనెడి యభిప్రాయము ప్రాచీన జాతులలో నెలకొ యున్నదని స్పష్టమగుచున్నది. ఆ యభిప్రాయమునుండియే, పితృదేవత యంశను పొంది, వారి పవిత్ర శక్తికి ప్రాతినిధ్యము వహించునవి కొన్ని జంత వులనియు, నవి యా యా కులముల చిహ్నములనియు భావించి, వానిని మిక్కిలి భక్తి శ్రద్ధలతో పూజించు నాచారము రూపుగైకొన్నది. ప్రాచీన, మానవ మ పరిణామ క్రమమున 'జంతు పూజ' కా విధముగా స్థానము లభించినది-అ కుల చిహ్నమునే పాశ్చాత్యులు 'టోటమ్' (Totem) అని పేరిడిరి ఈ పదము ఉత్తర అమెరికా అటవిక జాతులకు చెందిన 'ఒజిబ్వా' (Ojibwa) భాషలోనిది. దీనిని తొలుదొల్త నుపయోగించినవాఁడు J. Long అను నృశాస్త్రవేత్త. ఉత్తర అమెరికాకు సంబంధించిన ఆటవికుల ఆచారాదులను పరిశీ లించుచు నాతఁడీ పద్ధతిని వివరించెను. ఇట్లొక్కొక్క కులమునకు పూజార్హమై, వారి పితృదేవతల యంశను కలిగియున్న, చిహ్నమే ఆయా జాతుల పురాగాథల (Myths) యందు, వంశకర్తగా స్పష్టము చేయఁబడి, వంశ రక్షణభారమును వహించి యుండునట్లు వర్ణింపఁబడినది.

ఈ పద్ధతిని పరిశీలించును, ఫ్రేజర్ తన తొట్టతొలి వ్యాసమును 1887లో ప్రచురించినపుడీ పదమునకు మిక్కిలి వ్యాప్తివచ్చెను.[6] అతని యభిప్రాయాను సారము టోటమ్ అనఁగా నొక వస్తువు (Material object). అది సాధా

5. శ్రీ పరమహంస సచ్చిదానంద యోగి - జీవబ్రహ్మైక రాజయోగ సారామృతము పేజీలు 1253-1255.

6. J. G. Frazer The Origin of Totemism Fortnightly Review April & May 1887.

రణముగా జంతురూపము కలది. అచ్చటచట వృక్షరూపమును, క్వాచిత్కముగా నిర్జీవ వస్తు రూపమును పొందవచ్చును. ఇకమీదట నట్టి చిహ్నమును ఈ వ్యాసమున 'టోటము' అనియు, తత్సంబంధి విషయమును 'టోటమికము' అనియు వ్యవహరించుట కిచ్చగించుచున్నాను. ఒక గుంపునకు చెందిన టోటమునకును, ఆ గుంపులోని ప్రతి వ్యక్తికిని మధ్య నెలకొనియుండు సంబంధము మిక్కిలి విశిష్టమైనది. అంతులేని గౌరవమును, అత్యధిక భయసంభ్రమములను, తన టోటము పట్ల ప్రతి వ్యక్తియు ప్రదర్శించును. తన టోటము, తన గుంపునకంతటికిని సఖి, రక్షకుఁడు, సహాయకుఁడు, దైవము.

తన టోటమునకుఁ జెందిన జంతువున కాతఁడు హాని చేయఁడు. చంపఁడు[7] ఇతరులు హాని చేయఁబూనినచో సహింపఁడు[8]. టోటము యొక్క రూపములను రంగులతో తన నుదుట, శరీరము నందు చిత్రించుకొనును.[9] టోటము మాంసము తన కఖాద్య వస్తువు. ఈ విధి నుల్లంఘించి టోటము మాంసమును తిన్నచో నట్టివాఁడు నిస్సంతువగుటయో,[10] రోగియగుటయో[11] సంభవించును. తన టోటము పేరును బహిరంగముగా నుచ్చరింపఁడు. దానికి

---

7. Sigmund Freud - Totem Taboo.
8. తన టోటమును మఱియొక గుంపువాఁడు చంపఁబూనినచో, 'నా తండ్రిని నీవేల చంపుచుంటివి' యని యడ్డు దగులును.
Journal Anthropological Insitute - Vol. XIII. P. 300
9. R. C. Mayne - British Columbia -P. 258
10. Bakalai జాతిలో టోటమును మగవాఁడు తిన్నచో నతని భార్యకు గర్భస్రావమగును. Encyclopaedia Britannica Totemism.
11. 'Red Maizye' టోటము వారికి, దానిని తిన్నచో నోటి చుట్టును కురుపులు లేచును. Ibid
సమోవన్లలో తాబేలు (Turtle) టోటముగా కలవాడు దానిని తిన్నచో, తిన్నవాని యుదరమునుండి, "నన్ను తిన్నందువలన నిన్ను చంపుచుంటిని" యను శబ్దములు వినిపించి, వాఁడు రోగియై మరణించునట. అందువలన నట్టివానిని, ఆకులలో చుట్టి, నిప్పులు లేని పొయ్యి మీదునుంచి, వానిని కాల్చుచున్నట్లు, తోడివారు నటింపఁగా, వానికి దోషపరిహారమై యారోగ్యవంతుఁడగునట-
Turner - Samoa - P. 31

బదులుగా, దానికి సంబంధించిన గుణములను బట్టి విశిష్ట నామములు కల్పించి వాడును.[12] టోటము జంతువు చనిపోయినచో దాని మరణము పట్ల నా గుంపు వారందఱును, తమ బంధువు చనిపోయినట్లే భావించి, దానిని సర్వలాంఛనముల తోడను విహిత కర్మకలాపముల తోడను పూడ్చిపెట్టి దుఃఖ ప్రకటనము చేయుదురు.[13]

టోటము పట్ల నిన్ని యాంక్షలను విధిగా పాటించువారు, కొన్ని యేండ్లకో, కొంతకాలమునకో యొకపరి, నిర్ణీత సమయమున నుత్సవములు జరిపి, ఆ యుత్సవమున తమ టోటము జంతువును చంపి యా మాంసము నందఱును విధిగా నారగించు కర్మకలాపము (Ritual)ను నెఱపుదురు. అట్లు దానిని భుజించుట వలన, నా గుంపునకు చెందిన వ్యక్తుల రక్తములో, వారి పితృదేవతా సంబంధమగు శక్తి నిహితమైయుండి, జాతిని కాపాడునను నమ్మకము వారికి కలదు. అట్టి ప్రత్యేక సమయమునందుఁ దప్ప మఱెట్టి పట్టులను టోటమునకు హాని జేయుటగాని దానిని వధించుటగాని నిషేధము.

హిందూ దేశమందలి యనార్య జాతులలో నీ టోటమిక మత స్వరూపము క్రీస్తు పూర్వపు శతాబ్దుల యందు వర్ధిల్లినదనియు, నందులకు ప్రత్యక్షాధారము మొహంజదారో, హరప్పాల సంస్కృతియనియు ఫాదర్ హీరాన్ నిర్ణయించెను.[14] ఎందు నగరములలో బయల్పడిన వివిధములగు జంతువుల రూపముల నాధార

12. తోడేలును, గుండ్రని పాదములు గలది (Round foot) యనియు, తాబేలును, 'ప్రాకునది' (Crawler) యనియు, Turkey ని, 'నములునది' (Chewer) అనియు నాయా టోటముల వారు వ్యవహరింతురు.

Encycolopaedia Britannica - Totemism;

Brinton - The Lenape and their Legends-p.39

13. Sigmund Freud - Totem and Taboo

14. Rev. Heras— 'Vellalas in Mrhey Dev' Indian Histotical Quarterly. Vol. XIV No. 2

ముగాఁ గొని, యానాటి దేశమును, మీనాడ్ (The Country of fish) పరవనాడ్ (The Country of Birds) మరొన్కొటినాడ్ (The Country of Woodpeckers) మొదలగు ప్రాచీన తమిళ దేశాంతర్గత భాగములతో పోల్చి, దానిని ద్రావిడుల నివాస స్థలముగా నాయన నిర్ణయించెను. అట్లే, సింధు నాగరికత యందు టోటమిక దశా చిహ్నములు కలవని యభిప్రాయపడిన వారిలో Gordon childe అను చారిత్రకవేత్తయు నొకడు[15].

హిందూ దేశమందలి యనార్య జాతులలో నీ మత స్వరూపము యొక్క చిహ్నములను విరివిగా గుర్తింపవచ్చును. బెంగాల్‌కు చెందిన ఒరాయన్లలోనూ, ముండా జాతులలోను, ద్రావిడ కుటుంబమునకు చెందిన కొలారీ, తోడా జాతులలోను, ఈ టోటమిక దశాచిహ్నములు కలవు. హిందూ దేశమునకు పరిసర ప్రాంతములైన మలయా ద్వీపకల్పమున, ఆసియా మైనరునందు, జావా ద్వీపమున[16], ఆస్ట్రేలియా ఖండము నందలి యన్ని భాగములయందును, టోటమిక మత మొకనాడు రూపునొందెననుటకు ఉపపత్తులు గలవు.[17] తోడాల పురాగాధలలో వారి దేవతా సమూహమున మిక్కిలి గౌరవింపఁబడు దేవత తాయి కిరిడి. ఆమె తమ్ముఁగు 'ఒన్'. అతఁడు స్వర్గమునుండి భూమిపైకి, 1600 దున్నపోతులను దెచ్చెను. అవియే తోడాల పశు సంపద కంతటికిని మూల బీజములు. అందులో చివరి దున్నపోతుతోక పట్టుకొని మొట్టమొదటి తోడామనుష్యుఁడు భూమి పైకేతెంచెను. కావున వారిక గోష్ఠములు పవిత్రములు. వానిని దేవాలయములుగా వారు భావింతురు. ఉత్తర అమెరికాకు చెందిన Choctaws జాతి పాతాళమున నివసించు చేప (Cray fish) నుండి యుద్భవించినది. పశ్చిమ ఆస్ట్రేలియాకు చెందిన కొన్ని యాటవిక జాతులలో నొకటి బాతు (Duck) నుండియు మరొకటి హంస (Swan) నుండియు జనించినవి. ఆరిజోనాకు చెందిన మాక్విస్ (Moquis) జాతి యొక స్త్రీ ప్రసవించిన పాము నుండి యభివృద్ధి జెందినది. పశ్చిమ ఆఫ్రికాకు చెందిన కొన్ని జాతుల స్త్రీలు దూడలు, మొసళ్లు, హిప్పోలు,

15. Gordon Childe- what happended in History - P. 128 - Ed. 1941.
16. Raffles - History of Jawa - P. 328 - Ed. 1817.
17. Encyclopaedia Britannica - Totemism.

కోతులు, అడవిపందులు మొదలగు జంతువులను కనఁగా నవి యాయా జాతుల కధిష్ఠాన దేవత (Tutelary Deities) లైనవి.

ఇట్టి కథలు మన పురాణములయందును, జానపద సాహిత్యమునందును ప్రాచీన గాథా భాండారము నందును విరివిగా లభించును

హైందవులందఱును, సర్వవిఘ్నోప శాంతికై ముందు పూజించు నేనిక మోము దేవర అనార్యుల దేవుఁడు.[18] సాతవాహన వంశ పురుషుఁడు సింహగర్భమున బుట్టిన వాఁడు.[19] శంతనుని భార్య సత్యవతి మత్స్యగర్భమునుండి వెలువడినది. అనేక హైందవ గాథల యందు నాగరాజు వంశకారకుఁడుగా వర్ణింపఁబడెను.[20] ఫెర్గూసన్ పండితుని అభిప్రాయము ననుసరించి 'నాగులు' ఒకజాతికి చెందిన మనుష్యులేకాని పాములుకారు. వారు సర్పధ్వజులును, సర్పలాంఛనులును సర్పమునందమిత గౌరవమునుచూపువారును అగు నొకజాతికి చెందినవారు.[21] ఈ యభిప్రాయమును సవిమర్శముగా పరిశీలించుచు, శ్రీ ప్రతాపరెడ్డిగా రిట్లనిరి. "నాగులు అనువారు ఒక మనుష్యజాతి వారనియు, వారు సర్పచిహ్నులుగను, సర్పములందు గౌరవము గలవారుగను, నుండిరనియు వారినుండి భారతాదులందు ప్రసిద్ధులైన నాగరాజులుత్పత్తియైరనియు, నీ పౌరాణికనాగరాజులు అనార్యజాతులుగానుండిరనియు, దీనికి నిదర్శనము జనమేజయుని యజ్ఞమనియు, వీరార్యులతో సంబంధములు జేసిరనియు, దీనికి నిదర్శనము అర్జునాదుల వివాహము లనియు, తర్వాత బుద్ధుని కాలమున వీరు బౌద్ధులైరనియు, అట్లైనను వీరు తమ 'జాతీయ చిహ్నము' లగు సర్పములను వదలక బౌద్ధాలయములందును వీనినుంచి పూజించిరనియు వీరి యాచారమే తర్వాత హిందువులును స్వీకరించిరనియు పై ఫర్గూజన్ గారి సిద్ధాంతముల నుండి మన మూహింపవచ్చును"[22] పై వక్కాణమును బట్టి తేలిన దేమనఁగా ననార్య జాతులకుఁజెందిన ఉత్తర హిందూస్థానమున నివసించు

18. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి – హిందువుల పండుగలు – పే. 163.
19. శ్రీ చిలుకూరి వీరభద్రరావు – ఆంధ్రుల చరిత్ర – భాగము 1
20. కాశీమజిలీ కథలు – ఫణిదత్తుని కథ.
21. Ferguson – Serpent Worship.
22. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి – హిందువుల పండుగలు – పే. 215,

నాగజాతివారికి జాతీయ చిహ్నము (Totem Symbol) సర్పము. అది వారి కారాధ్యదైవము వారి పూర్వులు నాగరూపములతో గుడుల యందర్చింపఁబడిరి. తక్షక, వాసుకి, శేష, వాసుదేవ నామములు వీరి జాతికి చెందిన పూర్వుల నామములే.[23] ఈ జాతియందు టోటమిక దశా పరిణామముగా రూపొందిన సర్ప పూజ, ఆర్యమతము నందును గ్రహింపఁబడినది. ఆదిశేషువు శ్రీ మహావిష్ణువు పాన్పగుటయు, వాసుకి, పరమేశ్వరుని జటాభూషణమగుటయు, ఆర్యానార్య మతముల యొద్దికను సూచించు నంశములు. ద్రావిడ దేవతలుగా నిర్ణయింపఁబడిన యెల్లమ్మ, సుబ్బారాయఁడు, పాపరూపమున సర్చింపఁబడుట, సర్పమునకుఁగల యనార్య సంబంధమును సూచించును.

అట్లే మన దశావతార గాథల వెనుకను, అనార్యజాతుల ఆదిమ మత స్వరూపమగు 'టోటమిక స్థితి' తొంగి చూచుచుండవచ్చును. ఒకనాటి ఈ దశా ప్రభావమును సూచించు విషయము లెన్నియేని మనము నిత్యము పాటించు నాచారములయందు, మన గోత్ర సంజ్ఞలయందు, మన జానపద గాథలయందు, కొన్నిచోట్ల మన సాంప్రదాయిక(Traditional)సాహిత్యమునందును కాన్పించు చుండును.

ఈ విషయ మెక్కువగా జానపద గాథలయందు వెల్లడింపఁబడిన యాచార వ్యవహారములయందును, నమ్మకములయందును, కాన్పించుట చేతను జానపద గాథలయందీ, జంతువులు నిర్వహించెడి పాత్రయు, అవి పొందెడి గౌరవమును. ప్రస్ఫుటముగా నుండుటచేతను, ఈ గాథల యందలి టోటమిక కళాస్వరూపమెట్టిదియో కనుగొనుట కనువు పడుచున్నవి.

టోటమిక లక్షణము లెట్టివియో వెనుక పుటలలో వివరింపనైనది. ఆ లక్షణములను ఇదమిత్థమని స్పష్టముగా నిర్ణయించుటకు తగిన యంశములు గేయగాథలయందు కానరాకపోవచ్చును. కాని ఆ లక్షణములను దిఙ్మాత్రముగా సూచించును. వాని ఛాయలు గలిగిన యాచారాదికములను, జానపద గేయ గాథలలో నున్న వానిని వివరించి చూపవచ్చును.

---

23. Ibid పే. 211.

1. పోలు :—

సూత్రధారణ తరువాత, వివాహములయందు, నాల్గవనాఁడు జరుపబడు పూజాప్రక్రియ నాకబలి, లేక నాగవల్లి. ఇందు వివాహ మంటపముననే నాలుగు వైపులను చిన్న చిన్న యైరేణి కుండలనుంచి వాని యంచులను కలుపుచు నాలుగు ప్రక్కలను దారము చుట్టి యొక చవికె వలె నేర్పాటు చేయుదురు. తన్మధ్యమున పంచవన్నెల పిండితో ముగ్గులను తీర్చెదరు ఆ దారమును పోలు దారమనియు, నా ముగ్గులను పోలనియు, జానపదులు వ్యవహరించుట గలదు. ఈ పదముల వాడుక గేయగాథలయందున్నది. కొమిరెల్లి మల్లన్న కథయందు మల్లన్న, రాక్షసి పెంచిన రత్నాంగితో వివాహము చేయించుమని పరమేశ్వరుని ప్రార్థించెను. అందులకు శంకరుఁడు వల్లెయని పోలు దారము కొఱకు చూచెనట. కాని అది లభ్యము కాకుండుటచే విచారించి, తెల్లని యున్నితో దారమునుచేసి పోలుదార మమర్చి వివాహక్రియ నడిపెను అట్లు పోలు దారమునకు బ్రాహ్మణేతరుల వివాహ క్రియయందు సర్వ ప్రథమమగు ప్రాముఖ్యము కానవచ్చుచున్నది. ఆనాఁటి నుండి రత్నాంగి సంతతివారు ఉన్ని కంకణపు కురమలును, మల్లన్న పెద్ద భార్యయగు పద్మాక్షి సంతతివారు ప్రత్తి కంకణపు కురమలునై ప్రసిద్ధి వహించిరి. - ఇట్టి గేయమును 'పోలు దారము' యొక ప్రసక్తి కలదు. జాంబ పురాణమున ప్రసంగవశమున, 'పోలు' యొక్క ప్రసక్తి వచ్చినది.

ప్రాశ్నికుఁడు :— అరె గాడ్డి కొడక, ఎట్ల మాట్లాడుతున్నవురా:

జాంబవంతుఁడు :— అయ్యా గాడ్దికొడుకు బలిజోఁడు. గాడ్డి పోలు ఎవరికి రాస్తున్నరు ? బలిజోల్ల లగ్గాల రాస్తున్నరు - నేను కానయ్యా...

ఉదాహృతభాగము తిట్లతో విసుట కింపుగా లేకపోయినను, ఏమి ప్రాచీన మత స్వరూపసూచకమగు నంశము నిక్షిప్తమై యున్నది - గాడిదల వంశ చరిత్రను గమనించినచో, నందొక కథ చెప్పఁబడుచున్నది. ఒక కాలమునాఁడు పార్వతి బాగుగా నలంకరించుకొని పరమ శివుని రంజింప ప్రయ

త్నించెనట. కాని యామె యందు మాతనిని కలంచ లేకపోయెను. పార్వతి, యేమిచేసిన తన భర్త తనయెడ సుముఖుఁడగునో చెప్పుమని తండ్రి నడిగెను. ఆయన బ్రహ్మనుపాసించి, బ్రహ్మయాజ్ఞ ప్రకారము ఎదుట హోమమును వేల్చి ధ్యానమగ్నుఁడై యుండెను. అప్పుడా హోమ కుండమునుండి, గాజులు, పసుపు, గంధము, తాటికమ్మలు, నల్లలు, దువ్వెనలు మొదలగు నలంకరణ ద్రవ్యము లను మోయుచు నొక కంచర గాడిద వెలువడెను. ఆ ద్రవ్యములను వివిధ దేశములకు గొనిపోయి వ్యాపారము సాగించిన ఆ బలిజయొక్క కుల చిహ్నము (Totem Symbol) కంచరగాడిదయయ్యెను.[24] అందువలననే బలిజల వివాహ సమయములందు కంచరగాడిద యాకారమైన "పోలు" రచింపఁబడును. దీనిని బట్టి చూడఁగా నాడి కాలమున కులచిహ్నమైన దాని యాచారమే, ఆయా జాతుల వివాహ సమయములయందు పోలుగా రచింపబడుచున్నదని స్పష్టమగు చున్నది. వెలమల వివాహముల యందు నాగవల్లి సందర్భమున ఉప్పుతోడను, పప్పుతోడను ఏనుగుల యాకారములు రచింపఁబడును కుఱుమల వివాహముల యందు గొఱ్ఱెల యాకారములు చిత్రింపఁబడును. ఈ జాతినిగూర్చి, టోటమి కాంశములను సూచించు కథలును గలవు. కొమిరెల్లి మల్లన్న కథల యందే, గొఱ్ఱెలు, భూమియందెట్లు జనించినవో చెప్పు వివరములు కలవు.

మల్లన్న, అన్నలనుండి విడిపడి, తాను రేగడినేలను దున్ని సేద్యముచేసెదనని పయనమయ్యెను. ఇట్లు "మల్లేశుఁడు, గ్యాగళ్ల వెదకుచు బోవుచుండఁగా నొక పుట్టలోనుండి మిక్కుటము ధ్వనులు వెలుచుండఁగా విని అందులో నేమున్నదో చూచెదనని త్రవ్వఁబూనుటయు, ఇట్లు త్రవ్వుచుండఁ బుట్టలోనుండి రకరకాల గొఱ్ఱెలు ఒక్కటొకటిగా బైలు వెడలుచుండుటయు అది గనుగొని మల్లేశుఁడు తనలో ఏమనుకొనుచున్నాడన"

"ఎక్కడివో బూరు క్రిములు రామ ఓ రామా రామ
ఒక్కటొకటి వెడలుచుండె ,, ,,
లెక్కలేకుండయ్యె చూడ మిక్కుటముగ నీటి నన్నిటి

24 శ్రీ కోకా కృష్ణారావు - ఆది వెలమ కులచరిత.

నిప్పుడే యీ పుట్టలోనికి నెట్టివేసి నేర్పుతోడ
దక్కకుండ అగ్నిచేత దహనమును కావింతు నిపుడె-"[25]

యని అగ్నిని పురికొల్పి యీ గొఱ్ఱెలను కాల్చుటకై ప్రయత్నించెను. అప్పు డీశ్వరుఁడు మల్లన చేయుచున్న యీ చర్యను మాన్పి, యవి సాధుజంతువులును ఉపకార శీలములునైనవి. వానిని కాపాడుమని యాదేశించెను. మీదు, మిక్కిలి గొఱ్ఱెల యున్నితో జేసిన కంబళ్లలో నల్లగొంగడి కప్పుకొన్నచో భూత ప్రేతాదులు దరిజేరవనియు, తెల్ల గొంగడిఁ గప్పుకొన్నచో దేవతా ప్రసన్నమగు ననియు కసిరె గొంగడిఁగప్పుకొన్నచో కష్టములు తొలఁగుననియు నిర్దేశించెను.

ఎలనాగిరెడ్డి కథ యందీ కథనము సుంత భేదముతో లభించుచున్నది. వచ:-"హేమాపురి పట్టణములో పాపాత్మురాలయిన వన్నమాదేవికి శివ మతస్థులైన జంగమదేవర అంటే గిట్టదు, ఆమె ఒకప్పుడు ఆరాధన పెట్టించి, తొమ్మిది కోట్ల జంగమయ్యలను రప్పించి అన్నములో విషము పెట్టి చంపించెను.

కైలాసము తల్లడిల్లెను
వెంటనే ఆ గరళ కంఠుడూ
జంగం వేషము తాను వేసెనూ
హేమాపురి పట్టణ మొచ్చెను
వన్నమాదేవి యింటికి వెళ్ళెను.
బొంబొంబొం మని శంఖ మూదెను
గన గన గన గన గంట మోగెనూ
ధర్మ కోదండ భిక్షమడిగెనూ-"

బయటికి వచ్చిన వన్నమాదేవిని జూచి యామెను "మఱు జన్మమున పందివై పుట్టి దుర్మరణము పొలగు" మని శపించి, విషాన్న భోజనమున మరణించియున్న జంగములపై, జోలెనుండి చిటికెడుబూది తీసి చల్లెను. వెంటనే తొమ్మిదికోట్ల జంగములును నోరులేని జంతువులుగా మారి, పెద్ద గొఱ్ఱె మంద యేర్పడెను. వానిని శంకరుఁడు కైలాసమునకు తీసుకొని పోవగా. గంగయు,

25. చెర్విరాల బాగయ్య-కొమిరెల్లి మల్లనకథ- పే.45-ఎడి 1949.

పార్వతియు వానికి భూమి యందే చోటు కలదు గాని, కైలాసమున లేదనిరి. అంత నీశ్వరుఁడు భూలోకమున నొకచోట తన త్రిశూలము చేత భూమిని పెల్లగించి యందొక్క వివర మేర్పఱచి వాని నుంచెను. బిల ద్వారమునకు పార్వతీదేవి ముక్కెర తాళము వేసి కట్టుదిట్టము చేసెను. ఆ స్థలమున పుట్టపెరిగి, దానిపై ముని మోదుగ చెట్టు మొలిచెను ఎలనాగిరెడ్డి సేద్యమునకై యీ పుట్టను త్రవ్వి చేనియందు కలుపు ప్రయత్నము చేయఁగా గొఱ్ఱెలమంద బయటికి వచ్చెను. వానిని చూచి భయపడి నిప్పు తగిలించగా నవి మంటలలో చిక్కు కొనుటయు, పరమేశ్వరుఁడా వృత్తాంతము నెఱింగి వానిని రక్షించి, యెలనాగి రెడ్డికే వాని నప్పగించుటయు జరిగెను గొఱ్ఱెలను సంరక్షించు భారము ఎలనాగి రెడ్డి తన రెండవ భార్య సంతతికి నప్ప చెప్పఁగా వారు కురమలైరి. సేద్యమును, పెద్ద భార్య సంతతికి నప్పచెప్పఁగా వారు కాపులైరి. కాపులకును. కురమలకును, నెట్టి సంబంధములు లేకుండునట్లు ఎలనాగిరెడ్డి తీర్చెనని యీ కథాగేయము చెప్పెను.[26]

కురమలకు గొఱ్ఱెలిట్లు దొరికిన గాథను, సయ్యద్ సిరాజుల్ హస్సన్ గారును తమ గ్రంథమున నమోదు చేసిరి.[27]

ఈ కథల సారాంశమును బట్టి. గొఱ్ఱెలను పాలించు కురమ జాతియందు, గొఱ్ఱెల యున్నితో చేసిన కంబళ్ళయందు భూతాదులను పారద్రోలు మాంత్రికశక్తి యున్నదన్న విశ్వాసము కలదు. గొఱ్ఱెలు తమ జాతి కుపకారమును కలిగించునను నమ్మకము కలదు-వివాహముల యందు వోలుగా గొఱ్ఱెల యాకారమును చిత్రించు నాచారము కలదు. వీనిని బట్టి కురమల వంశ చిహ్నము (Totemic Symbol)గొఱ్ఱె యని సూచింపబడినదనవచ్చును. ఇది కేవలము సూచనయే యని

26. దీనిని, కర్నూలు జిల్లాలోని బోయిరేవుల వాస్తవ్యుఁడు పిచ్చుకుంట్ల పెద ఊసేనయ్య (హుసేన్) చెప్పగా వ్రాసికొంటిని.

27. Syed Sirajul Hassan—The castes and tribes of H.E.H. the Nizams Dominions.

యేల చెప్పచుంటి ననఁగా, నిట గొఱ్ఱె, కురుమ జాతిక వంశ కర్తృత్వము వహించి నట్లు చెప్పఁబడ లేదు. కురమలు దైవస్థానమున గొఱ్ఱెనుంచి పూజించుచున్న యాచారము ప్రస్తుతము వారిలో కానవచ్చుటలేదు. ఇట్టి సమాచారము పూర్ణముగ లభించిననే తప్ప నొక జంతువునుగాని, వస్తువునుగాని యొక జాతియొక్క టోటమిక చిహ్నముగా, నిస్సందేహముగా నిర్ణయించుటకు వీలు లేదు కాని యిచట లభించిన సమాచారము లోటమిక మత స్వరూపమును సూచించునదిగా నుండి భావి పరిశోధనను వాంఛించు చున్నదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఆ విధ ముగా వివాహ కార్యమున నంతర్భాగముగా నున్న "పోలుబ్రాయుట" టోటమిక స్వరూపమును వివరించుట కుప బలకముగా నున్నదని సూచింప వీలగుచున్నది.

2. అఖాద్య వస్తువులు :-

టోటమిక మతమునందు మరియొక లక్షణము, టోటమును, భుజింప కుండుట. హైందవుల యాచారముల యందుగాని, కథలయందుగాని యొక్కొక్క జాతి కఖాద్యములుగా కొన్ని వస్తువులను పేర్కొనుట కలదు. ఈ విషయము జానపద గేయగాథలయందును స్పృశింపఁబడినది, అఖాద్యము లనఁగా తినుటకు మనసు కానివి, అసహ్యములైనవి యను నర్థమున నిచట వాడఁబడుట లేదు. కేవల మొకజాతి, లేదా యొక గుంపు, తమకు గల ప్రత్యేక గోత్రముల వలనగాని, తమ కుల ప్రాలను బట్టిగాని కొన్ని కొన్ని వస్తువులు తినకూడదను నిషేధమునకు పాలగుచున్నవి. ఆ విధముగా నిషేధింపఁబడి యఖాద్యములగు వస్తువులే యిచట స్పృశింపఁబడును.

పర్వతాల మల్లారెడ్డి కథయందు .- గోపిరెడ్డి, వర్షములు కురిసిన తటి,

గ్రహించి, తన కుమారుఁడు మల్లన కడకు వచ్చి యిట్లనెను.

ఏడేండ్ల కొడుకా చిన్ని మల్లారెడ్డి
ఏడేండ్ల కీయేడు కాలమా[28]యె కొడక
ఏమి చేను మనము పెట్టుదుము మల్లన్న"

ఆ మాటలకు మల్లన్న.

---

28. కాలము - తటి

"తండ్రిగారు ఓ గోపిరెడ్డి వినుము
నీకు తెలియని పంట యున్న దేమి
నీ మనసు కొచ్చిన చేను పెట్టు తండ్రి" యని

జవాబిచ్చెను కాని గోపిరెడ్డి,
"సద్దలు పెట్టిన నాల్గు నెల్లయ్యె
జొన్నలు పెట్టిన నాల్గు నెల్లయ్యె
వడ్లు పెడ్తె సర్కారు కెల్లునయ్యె
ఆకరిపంట ఏది ఉన్నదండి
మూడు నెలలకు వస్తుం కుహూరకా
ముసాపురి కొఱ్ఱపంట కొడుక
క్రొత్త చేను ఎఱ్ఱ పెడ్తాను"-అని

నిర్ణయించెను. కాని మల్లన్న,
"కొండ్యాలది గోత్రము మనది
ముక్కొఱ్ఱ వంశాదులము మనము
కొఱ్ఱబువ్వ భోంచెయ్యరాదు మనకు
పై గాలికి కొఱ్ఱచేను ఉంటె
దివ్య గాలికి నడువరాదు మనము
కొఱ్ఱచేను పెట్ట వద్దు తండ్రి''

యని తండ్రిని మందలించుటయేగాక, అట్లు మేర మీరినచో
"ఏటిక ఎద్దులు మునిగి పోతవయ్యె
పాడిబర్లు పాడై పోతావి
వద్దు వద్దు కొఱ్ఱచేను పెట్టబోకు''

మని కీడును శంకించెను_

దీనిని బట్టి కొండ్యాల గోత్రమువారు, 'ముక్కొఱ్ఱి' వంశస్థులు, కొఱ్ఱి యన్నము తినరాదు. కొఱ్ఱి చేని గాలియేని వారి మీద సోకరాదు-అని తెలియ వచ్చినది.

ఇట్లే జాంబపురాణమునందు, గౌండ్లవాని ప్రశంస కలదు.

జాంబవంతుడు :- అయ్యా, గౌండ్లవాడు కోడిని సాదరాదు, కోడిని తినరాదు.

ప్రాశ్నికుడు :- ఎందుకోసం తినవద్దు ?

జాంబవంతుడు :- అయ్యా గౌడు గౌడు అంటే పెద్దిరాజుకు సిద్ధిరాజుకు జగడంబడ్డప్పుడు సిద్దిరాజు వచ్చి కలుకోడిని పట్టుకు పోయినప్పుడు - కలుకోడి యనగా గౌండ్లోండ్ల యింట ఆడపడుచు ఆ కలుకోడి ఉండగా అప్పుడు కల్పవృక్షం-అనగా తాటిచెట్లు వంగమంటె వంగేది లేవుమంటే లేచేది. అందరుగూడ దాగేది - ఇప్పుడు, కలుకోడిని సిద్ధిరాజు పట్టుకుపోగా కాటమరాజు జగడ చెయ్యలేదు. ఊరుకున్నం తల కలుకోడి శపించింది. అందువలన తాటిచెట్టు వంగకుండ, లేవకుండ అయినాది. అప్పుడు కలుకోడి ఉండంగ కూతకు పట్టెడు వరహాలు గక్కేది. కలుకోడి పోయి నంక కాటమరాజు దరిద్రుడయ్యె. గౌండ్ల వారికి ఎంత కల్లమ్మినగాని సగం బర్కతు తక్కువున్నది.

ప్రసంగవశమున వచ్చిన కాటమరాజు కథయందలి యీ భాగము, మద్రాసు ప్రభుత్వమువారు వేసిన 'కాటమరాజు కథ' యందు లేదు. భారత మంత గ్రంథముగా పెరిగిన యీ కథాంతర్గతోపకథలను భావి పరిశోధకులు సేకరింపవలయును నాకు కడప మండలమున దీనికి సంబంధించినదే ఆవుల పరస యను భాగము లభించినది - ఇక ప్రస్తుతాంశమునకు వచ్చినచో నిచట కాటమరాజు గౌండ్లవాడుగా చెప్పబడెను.

కురమలకు 'గౌడ' యను నుపపదము చేరుటకొక కథ గలదు. కురమల దేవుడగు వీరన్న[29] కొకసారి కల్లు త్రాగవలయునని కోర్కె జనించెను.

---

29. ఈ వీరన్నయే ఆది జాంబవుని యవతారమని కాటమరాజు కథ చెప్పుచున్నది.

చెంత నేమియు లేనందున తన మీసము దీసి, గౌండ్లవాని చెంత కుదువబెట్టి, తదుపరి, యా మీసము నిమ్మని యడిగెను. కాని యింతలో నొక యుడుత యా మీసము నెత్తుకొని పోయెను. అందువలన గౌండ్లవారానాటి నుండియు 'గౌడ'యను తమ బిరుద నామమును కురుమలకు కోల్పోవలసివచ్చెను. ఆ విధముగా కురుమలు గౌడులయిరి.[30] గొల్లలకును, కురుమలకును మధ్య పెద్ద యంతరములేదు. ఇరువురకును మల్లన్న దేవుఁడు కిలడు. ఇరువురును పీరన్నను గంగను పూజింతురు. కాటమరాజు వీరిరువురకును పూజార్హుఁడైన మహా వీరుఁడును, దేవుఁడును. ఇంతకును నీ గేయమువలన దేలినదేమనఁగా, కలు కోడి గౌండ్ల వారి యింటి యాడపడుచను విషయము. అది యున్నందువలననే, వారి సిరి సంపదలు పాలు పొంగిన ట్లింటిని పొంగించినవి. వారు వంగు మనఁగా కల్పవృక్షమనఁదగిన తాటిచెట్టు వంగెడిది. కలుకోడి వంశమునుండి యితరులచే నపహరింపఁబడగా నా శుభ చిహ్నము లన్నియు మాసిపోయినవి. గౌండ్లవారు కోడిని దినకపోవుటకు కారణము, ఆది వారి యింటి యాడపడుచగుటయే.

ఇందలి యంశము నిస్సందేహముగా టోటమికాంశము. ఇచటి కోడి గౌండ్లవారి టోటమిక చిహ్నము. దానిని చంపకపోవుటయు, తినకపోవుటయు, అది యుండుటచే వంశమునకు శుభము గలిగి, లేనందువలన నా వంశము నిర్భాగ్యమగుటయు నను విషయములు టోటమిక మత సంబంధి విషయములు.

గేయగాథలయందు లభించిన సమాచారమిది – దీనికి తోడు జనవ్యవహారమున నున్న కొన్ని యుదాహరణముల నీ విషయమున కుపబలకముగా నీయ వచ్చును.

రాయలసీమ ప్రాంతమునకు చెంది, నేనెఱిగిన రెడ్డి కుటుంబము వారి గోత్రము కుక్కుట గోత్రము. వారు కోడిని చంపరు, తినరు. మరియొకరి గోత్రము సొరకాయల గోత్రము వారికి ఆనపకాయలు నిషేధము. పూర్వము అద్దంకి నేలిన రఘుపతి, రామచంద్రరాజు మొదలగు క్షత్రియులు, కాకతీయ

30 Syed Siraj Ul Hassan – The Castes and Tribes of H.E.H the Nizam's Dominions,

సంబంధులు వారింటిపేరు మందపాటివారు, వారు తమకుగల 'కాకతి' సంబంధముచే గుమ్మడికాయ నుపయోగింపరు. తత్సంబంధమైన వరుగును, వడియములను తినరు.

బొందిలీలు కోడిని తినరాను. ఒరియా దేశములోని గోసాయిలకును అది నిషిద్ధమే. కాళింగులు చేపలను తినరు. శాకాహారులలో కొందరికి అల్లము నిషేధము. మరికొందరికి నీరుల్లి నిషేధము.

ఇట్లు కొన్ని వస్తువులు, గోత్రములతోడనో, వాంశికమగు ప్రత్యేక కారణములతోడనో జతకూర్పఁబడి. నిషిద్ధములైనచో, వానిని టోటమిక వస్తువులుగా ననుమానించుటకు వీలున్నవి.

3. గోత్రము :-

గోత్రమునకును, టోటమిక చిహ్నమునకును సంబంధమున్నట్లు గ్రహింపనైనది. టోటమిక దశా పరిణామ కాలమున నాదిమ మానవుల యందేర్పడిన గుంపులే నేడు గోత్ర సంజ్ఞచే సూచింపఁబడినవా ? హైందవుల గోత్ర సంజ్ఞ యొక్క చరిత్ర మేమియని యాలోచించినచో, వింత గొలుపు సమాచారము లభించును.

ఈనాడు కాన్పించుచున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య గోత్రములును కొన్నియెడల శూద్రుల గోత్రములును[31] ఋషి సంజ్ఞకములై యలరారుచున్నవి. ఆర్యమతమున లబ్ధప్రతిష్ఠులై నిలచిన ఋషులందఱును గోత్రపురుషులుగా నెంచఁబడిరి. అట్టి ఋషులపై, ముఖ్యాంశములను సమర్థించుటకు సూత్రజ్ఞులేర్పడిరి. మఱికొందరు ప్రవర ఋషులుగా నేర్పడిరి. ఇది నాగరక మానవుని గోత్ర సూత్ర ప్రవర సంజ్ఞల రహస్యము.

---

31. వెలమలలో, క్షేత్రజ్ఞ, శ్రీవత్స గోత్రములు కలవు. భట్రాజులలో కశ్యపాది, ఋషి గోత్రములు కలవు. యాదవులలో కాటమరాజు తాత వల్లురాజు ఆత్రేయ గోత్రోద్భవుడు.

ఈ ముప్పురి యందును సూత్రజ్ఞులే ప్రధానులు. సూత్రజ్ఞులలో బోధాయనుఁడు మొదటివాఁడును, ఆపస్తంబుడు తరువాతి వాఁడునుగా పరిగణింపఁబడిరి.[32] వీరి కాల మించుమించు క్రీస్తు పూర్వము నాలుగవ శతాబ్ది. ఆ కాలమున నాంధ్రులలో గోత్ర సూత్ర ప్రవరలు ఋషిపరముగా నేర్పడినవని నిర్ణయించినచో నంతకు ముందు ప్రాచుర్యము నందిన గోత్ర నామముల చరిత్ర యెట్టిది ? గోత్ర శబ్ద స్వరూపమేమియని యాలోచింపవలసియున్నది.

గోత్రమనఁగా స్వర్గమును రక్షించునది. అనఁగా అపత్యము అను నర్థము చెప్పుదురు అనఁగా ఉత్తమ లోకముల నుండి పతనము లేకుండఁజేయునది యని యర్థము. ప్రకృతార్థమున నీ వివరణము సరిపోదు.

గోత్రమనఁగా గోవులను రక్షించునది. 'పశువులసాల' యను నర్థమును కలదు. గోసమూహము తొలి కాలమున ప్రత్యేక సంపదగా భావింపఁబడినది.[33] గోవులకున్న ప్రత్యేకత వలననే ద్విగు (రెండు గోవులు కలవాఁడు) చిత్రగు (చిత్రమైన గోవులు కలవాఁడు) వంటి సమాసములు ప్రాచుర్యమును పొందె, గోవులు కలవాని నుద్దేశించి వాడఁబడినవి.

మానవునకు వ్యవసాయము, పశుపాలన యలవడిన దశలో నా రెంటికిని నుపయోగపడి మానవ జీవితము తోడ సాన్నిహిత్యము నొందిన గోజాతియే వాని ప్రత్యేక ధనమయ్యెను. అట్టి గోసంపద నాధారముగాఁగొనియే, గృహపాలకుని ప్రత్యేకతను గుర్తించు పద్ధతి యేర్పడియుండవచ్చును. గోత్రమనఁగా గోష్ఠమనియు నర్థము కదా ! "ఇన్ని గోష్ఠముల పశుధనము కలవాఁడు" అను ప్రత్యేకార్థ స్ఫురణను కలిగించుచు గోత్ర సంజ్ఞ వంశ సూచకముగా కుదురుకొని యుండవచ్చును.

గోష్ఠమునకు అనాగరక జాతులయందు మిక్కిలి గౌరవ ప్రదమగు స్థానముకలదు. ద్రావిడ జాతికి చెందిన తోడాలలో వారి పశువుల కొట్టములే

---

32. George Bhuler- Sacred Books of the East No.1 II
33. తెలుగున దూడలకు నావులకు సొమ్ములు' అను వాడుక నేఁటికిని జన వ్యవహారమున నున్నది.

వారికి దేవాలయములు. పశుపాలకుడే వారి పూజారి. అతఁడే వైద్యుఁడును. తోడాలు నివసించు గ్రామమున కంతటికిని మూక ఉమ్మడిగా నొకగోష్ఠముండును దానిపై నధికారము నెఱపువాఁడు మిక్కిలి గౌరవపాత్రుఁడు. పాలుపిండుట, మజ్జిగ చిలుకుట, వెన్నతీయుట మొదలగున వన్నియు నతి పవిత్ర కార్యములు. మిక్కిలి శుచి తోడను శ్రద్ధ తోడను చేయఁదగినవి. ఒక గ్రామమునకుఁజెందిన తోడా మఱియొక గ్రామమునందు ప్రవేశింపవలసి వచ్చినచో మొట్టమొదట నాతఁడు గ్రామకంఠమున నెలకొనియుండు గోష్ఠము కడకేగి సాష్టాంగపడి ప్రార్థించి యూరిలోని కేగుట కనుమతి తీసికొన్నగాని లోని కేగరాదు.34

ఇట్లనాగరక జాతులయందు గూడ గౌరవ స్థానమును నొందిన గోత్రమే (గోష్ఠమే), సంపదకల వ్యక్తులయొక్క విశిష్టతను సూచించుటకై నామ సామాన్యముగా(General Term) నలరారిన దనవచ్చును.

గోత్ర శబ్దము వంశ సూచకముగా కుదురుకొన్న పరిస్థితి యెట్టిదైనను, గోత్రనామములు నాగరకులైన యార్యులచే ఋషినామకములుగా రూపొందినవి. నాగరకత యొక్క స్పర్శయు, పాండిత్య ప్రకర్షయు నెక్కువగా సంటని శూద్రుల గోత్రములను పరిశీలించినచో నాశ్చర్యదాయక విషయములు లభించును.

వారి గోత్ర నామములు కొన్ని పశుపక్ష్యాదులవి జన్ని యావుల, తుమ్మెదల, పైడిపాల, వంటివి. కొన్ని వృక్ష సంబంధి నామములు, వట్టివేళ్ల, వేళ్ళమడి, మేడిపళ్ళ, వెలగల, ధాన్యాల, ఆవాల వంటివి, కొన్ని ప్రకృతియందలి సహజవస్తువులు-అవి. దొలుకు నీళ్ళ, పాలు నెయ్యి - వంటివి.

ఇట్లు జంతువులు, పక్షులు, వృక్షములు, ప్రకృతి సహజవస్తువులు, మను ష్యుల యందలి ప్రత్యేక సముదాయములను (గోత్రములను) సూచించు చిహ్నము లుగా నెట్లెన్నఁబడినవి యని పర్యాలోచింపఁ బూనుకొన్నచో, నాదిమ మానవ మత విధానమగు టోటమిక స్వరూపము స్మృతి పథమున కదలాడక మానదు.

---

34. F. Murdock - Our Primitive Contemporaries.

సృష్టియందలి ప్రతివస్తువును ఆత్మ నివేశన స్థలమగు నను ప్రాచీన మానవుని యత్మారాధనా (Animism) పూర్వకమైన భావనను బట్టి, ఆయా వస్తువులు పితృ దేవతల యాత్మలకు నివేశన స్థలములై, ఆయా సమూహము లకు ప్రత్యేక చిహ్నములై (Totem Symbols), విరాజిల్లి యుండవచ్చును.

వాని యందలి ప్రత్యేక గౌరవము వలననే, తమ టోటము చిహ్నమును, బాధించుట గాని, దానిని భుజించుటగాని చేయకూడదనెడి యాంక్ష ప్రబలముగా నుండెడిది.

అంతేకాక, సగోత్ర వివాహములపట్ల, హిందూ సంఘము నిషేధమును ప్రకటించినది. ఇట్టి నిషేధము టోటమిక మత స్వరూపమున నంతర్భాగముగ నున్నదియే. ఒక టోటమునకు జెందిన వ్యక్తి, అదే టోటమునకు సంబంధించిన వారితో వైవాహిక సంబంధములను కలిగియుండరాదనెడి యాంక్ష ప్రాచీన మానవునకు జెందిన టోటమిక దశయందు కలదు [35] ఈ కట్టడి నుల్లంఘించిన వారి కొక్కొకచో మరణమే ప్రాయశ్చిత్తముగా నుండెడిది. ఈ యంశము కూడ హైందవ గోత్రములకును ప్రాచీన టోటములకును గల సంబంధమును సూచించు శక్తి కలదిగా కాన్పించుచున్నది.

ఆర్యసంప్రదాయవ్యాప్తియు నాగరీకరణమును(Civilization)మనుష్య సంఘములను ప్రభావితములుగాఁ జేసిన ఘట్టముల యందీ గోత్ర నామములు ఋషి నామకములైనవి. అబ్రాహ్మణులలో నిప్పటికిని కొన్ని యెడల నొకే వ్యక్తికి ఋషి నామకమగు గోత్రమును, సహజ వస్తు నామకమగునదియు, రెండును కాన్పించుచుండును. [36]

---

35 J. G. Frazer - Totemism and Exogamy-

36. వెలమల గోత్రములలో కొన్నిచోట్ల నొక్కొక్కరికి రెండు గోత్ర నామములు కలవు.

| | | |
|---|---|---|
| వేళ్ళపుడి | — | వేదవ్యాస |
| అతిరస | — | హరితస |
| నైషధీకల | — | నిర్మలఋషి |

ఈ విధముగా గోత్రముల చరిత్ర కొంతవఱకు స్పష్టాస్పష్టముగ ప్రాచీన మానవుని టోటమిక దశాస్వరూపమును సూచించుచున్నది.

4. ఆచారములు :-

ఈ నాటికిని జానపదుల యందును, నాగరక మానవులయందును కొన్ని యాచారములు పాటింపఁబడుచున్నవి. ఇట్టివి గేయగాథలయందు విరివిగా కన్పించు చున్నవి. వీనిని నిశితముగా పరిశీలించినచో, వీని వెనుక నొకనాటి టోటమిక మతచ్ఛాయలు కాన్పించుచున్నవనుటకు వీలు కలదు. అవి

1 పచ్చ పొడిపించుకొనుట :- పచ్చ పొడిపించుకొను నాచార మిప్పటి కిని జానపదులయందు తీవ్రముగనే యున్నది. వ్యక్తి చనిపోయి ఆత్మ పై లోక మున కేగినపుడు, దేవుఁడా యాత్మ శరీరమును జూచి, "పదివేలు చేయు పచ్చ పొడుపు లేదు గాన నరకమునఁబడు" మని దానిని క్రిందికి త్రోసివేయునట. ఆ నమ్మకమువలన జానపదులు విధిగా పచ్చ పొడిపించుకొందురు. దీనిపై జానపద వాఙ్మయమున ననేక గేయములును ప్రచారములో నున్నవి.

శరీరముపైన, ముఖముపైన బొమ్మలను రంగులలో చిత్రించుకొను పద్ధ తిని పాశ్చాత్యులు Tatooing అందురు. ఆస్ట్రేలియా ఆఫ్రికా, అమెరికా-ఇండియా దేశములకు జెందిన యాటవికులలో నీ చిత్ర రచనా పద్ధతి కన్పించు చున్నది ఈ బొమ్మలకు, మత సంబంధమగు ప్రత్యేకత కలదు. అది టోటమిక మత సంబంధమగు ప్రక్రియ తమ టోటము చిహ్నములనే రంగులతో శరీరము లపై చిత్రించుకొను నాచారముగా నీ కళ జన్మనంది, రాను రాను అలంకరణ సాధనముగా రూపు చెందినది. మన ప్రాచీన కావ్యముల యందును, అందగత్తె లయిన స్త్రీలు చెక్కిళ్ళపైనను, వక్షస్థలము నందును వివిధ సుగంధ ద్రవ్య ములతో (కస్తూరి, గంధము మొదలగునవి) మకరికా పత్ర రచన కావించుకొనెడి వారు. ఇచటి 'మకరిక' ఒకనాటి టోటమిక చిహ్నమా? ఇదియే పచ్చబొట్టుగా జానపదులలో నిలిచియున్నది.

2. కొన్ని జంతువులను చంపరాదను నాంక్ష :- జంతుపరముగా, పిల్లిని, బల్లిని, కాకిని గోవును, చంపగూడదను నిషేధములు కలవు. ప్రాచీన టోటమిక

విధానమున. టోటము చిహ్నమును చంపరాదను కాంక్ష యింకనూ నీ రూపమున జన వ్యవహారమున జీవించుచున్నదనవచ్చును.

పామును చంపినచో, దానిని మనుష్యునకు వలె, మంచిగంధపు చెక్క-తో నోట రాగి నాణెముంచి దహనక్రియ నిర్వహించు నాచారము కలదు. టోటమ్ జంతువు గతించినపుడు, తమ కులమునకు జెందిన వృద్ధుని దహనక్రియలను నిర్వహించు నంతటి శ్రద్ధతో, దాని దహనాదికములను జరుపు నాచార మీ రూపమునంది యుండవచ్చును.

3 టోటమ్ జంతువులు సరి నడచినచో శుభము. అడ్డము వచ్చినచో నశుభము. వాని యరుపులు భవిష్యత్సూచకములు - అను నమ్మకములను టోటమిక మత ప్రాధాన్యముగల యాటవిక జాతులయందు గమనింపవచ్చును.

అట్టి నమ్మకములే, ఈ నాటికిని మనకు కలవు, నక్క- దారికడ్డముగా పరుగెత్తిన యశుభము. కాకి యరచిన చుట్టములు వత్తురు. పైడికంటి ఒకటి పలికిన నశుభమును రెండు పలికిన శుభమును, - జంతుసంబంధియగు నిట్టి శకునములలో నొకనాటి టోటమిక స్థితి సూచింపబడుచున్నది.

జానపదగేయగాథలలో నిట్లు టోటమికాంశములను స్పృశించుటయే గాక, జంతుప్రాధాన్యము గూడ కథాంశమునందు పొదుగఁబడి యున్నది. వీని యందలి జంతుప్రసక్తి నాల్గు విధములుగా కాన్పించుచున్నది. 1. కొన్ని గాథలు జంతు నాయకములగుట 2 కొన్ని గాథలయందు జంతువు, వరప్రదాతయై, దైవ స్వరూపమై,కథను నడిపించుట, 3. కొన్ని గాథలయందు కథాగత ముఖ్యపాత్రకు చిన్నవియు పెద్దవియునగు జంతువులు ఉపకారకములుగా నుండుట. 4. కథాగత వ్యక్తులు జంతురూపముల నందుట.

జంతువు పేరిట వ్యవహరింపఁబడెడి గేయగాథలలో ముఖ్యమైనది జాంబ పురాణము, ఇది సృష్టికి ఆదియై పుట్టిన జాంబవంతుని పేరఁజెప్పఁబడినది.

దీనిని ప్రచారము చేయువారు ఆసాదీలు. వారి కులదైవము జాంబవంతుడు. వారు తమ్ము "జాంబవదాసు"ల మనియు చెప్పుకొనుట కలదు. కులమున కాది మూలమైన జాంబవంతునిగూర్చి వారిట్లు చెప్పుదురు.

"అందరికన్న ముందు బుట్టినవాడు తాతా జాంబవంతుడున్నాడు -
ఎక్కడున్నాడు తాతా జాంబవంతుడు - నట్టేడు
సముద్రాల నట్టనడుమ అరచేయి అంత దామర కమలము
దామర కమలము మీద శిరసు కిందికి శిరిపాదాలు మీదికి
బెట్టి వరతపసు బట్టుకొని తాతా జాంబవంతుడుండెను."

ఆయన ఆది పురుషుడు. సృష్టియందలి ప్రాణులకు నెట్టి యాపద వచ్చినను వారు జాంబవంతుని కడకేగి ఓరణోపాయము విచారింతురు

పార్వతీదేవి కొడుకు, చెన్నంగి వృక్షము క్రింద బుట్టిన చిన్నవాడు సత్యగోవును, వెంట దిరిగి సంరక్షించెడివాడు, దాని పాలుద్రావి,

"గోగా, ఓ సత్యగోగా నీ అమృతమే
యింత శృంగారమున్నది నీ మాంస
మెంత శృంగారమున్నదో" యని 'శపించెను'.

''శపించగనే నోట్ల మాట నోట్ల వుండంగ గట్టుకుపోయిన గోగు దిగదిగ దిగి వచ్చెను. శివుని మరము కాడిక్కిపోయి 'పరదక్షణ' తిర్గి పడమట మొకాన మొకంబెట్టి, అంబో అని వర్లి, కొండ బడ్డట్లుబడి, గోగు తీరిపోయెను" - అంతట

"పార్వతీదేవి పరమేశుడు, దేవాది దేవతలను ఎంబడించుకొని సత్య గోగుకాడికి" పోయిరి. "సత్యగోగు కాడికి పోయి అంబో" అని అల తేరిరి. అప్పుడు దేవతలు, "సచ్చిన పీనుగు ఉండదు. వండిన కుండ ఉంటదా ? వండిన కుండ పాసిపోతది, సచ్చిన పీనుగు మురిగి పోతది అని.

ఈ గోగును ఖండించుకొని భోంచేతాము ని సచ్చిన శాన కొయ్యకూడదని గోగునుబట్టి గుంజుతున్నరు. దేవాన దేవతలు గుంజినగాని సింతాకు మంధము

గోగు కదుల్తలేదు అప్పుడు దేవతలు వచ్చి తాన కోస్తే పటకు హెచ్చు ఉండదు. దొడ్డికి హెచ్చు ఉండదు అని దేవతలు ఏమని యిశారపడ్తున్నరు, ఈ గోగును తర్ల గుంజేవారెవరని ఇశార పడుతున్నరు. ఇశారించుకొని యెవరు లేరుగాని అందరికన్న ముందు బుట్టిన తాతా జాంబవంతుడున్నాడు ఆ జాంబ వంతుని దగ్గరకు పోతే ఏదన్నా పంపు కాగలదు అని దేవతలు ఇశారపడు తున్నరు" – వారి సమస్య పరిష్కారమగుటకు సకల దేవతలు నీ జాంబవంతునే యాశ్రయింపవలసివచ్చినది. ఆయన వచ్చి,''దేవాన దేవతల నందరిని ఓరకు జర్గమని సత్యగోగు దగ్గరికిపోయి, తొడ సర్సి మీసం దిద్ది సూడండి దేవత లారా, అని ఎడమచేత పిల్లగెటికబట్టెను. పిల్లగెటికబట్టి,లేపర మేశా! లే గోయిందా! యనెను. గోయిందా యనగానే గోగు లేసి యిసంటబడెను." – అట్లా కష్టము తీరుటకు భూమికన్నముందు బుట్టిన తాతా జాంబవంతుడు కావలసివచ్చెను.

మరియొక పరి విశ్వబ్రహ్మకు, తిత్తియు కత్తియు కావలసివచ్చెను. చేసి యిమ్మని తాతా జాంబవంతు నడిగెను. అప్పుడు ఆవులు, లేగలు, దూడలు, దుస్కలు, కత్తెలు, అరెలు ఏమియు లేవు "అప్పుడు జాంబవంతుడు గుడ్డెల్లు అవతారముండెను. ఉండి, యిశా బ్రహ్మను ఊకె తోలితినా 'పెంటి పుట్టుబడి' అయితదని ఏమి సేతునని, తన కుమారులు ఇద్దరు ఉండగా, పెద్దవాడు జగ్గి అన్నను దగ్గర బిల్చుకోని, కాళ్ల చేతులు పొదగ బట్టుకోని, ధర్ని కేసికొట్టినాడు. వాడా వతిన పానం ఇడిసెను. అప్పుడు జాంబవంతుడు ఆరు ఆరు ఉక్కుగోర్ల తోడి తిత్తి దీసెను. తిత్తిదీసి కడుపుల కసను, చెక్కజేసినాడు నెత్తిల మెదడు సున్నము జేసినాడు. ఎర్రగ కాకరాకు పండువలె తిత్తి పోతము జేసినాడు. ఆశ్వావులు కాళ్లు,సంబెళ్లు, చేతులు పట్టుగర్రలు, ఎదనే డాకలి మొద్దు, తలడాకలి, గొంతు సరము చేసిండు. సుల్లిసుత్తి చేసిండు. పేగులు సలాకులు చేసిండు. చేసి తట్టలో బెట్టి యిసాబ్రహ్మ యింటికి ఎత్తి పంపినాడు. ఎత్తి పంపి ఏడు పూస బొక్కలు మిగిలితే మరము వెనక వేసినాడు"–ఈ విధముగా సృష్టికి ముందు బుట్టిన తాతా జాంబవంతుఁడు, విశ్వబ్రహ్మ కోర్కెను దీర్చి, కావలసిన పరికరములను సృష్టించి యిచ్చుటలో కథా నాయకుఁడయ్యెను. ఇచట జాంబ వంతుఁడు, తన కుమారుని చంపి, వాని శరీరాంగములనే పరికరములుగా చేసి యిచ్చుట యను నంశమునందు, టోటమిక దశలో, ప్రత్యేకమగు టోటమునకు

చెందిన మనుష్యులు, తమ టోటము జంతువును చంపి, యా మాంసమును, రక్తమును ఆరగించి, ఆ జంతువు యొక్క ఆత్మశక్తి యా విధముగా తమ రక్తములో కలిసి తమకు శక్తిని, అభ్యుదయమును, వంశాభివృద్ధిని ప్రసాదించుచున్నదని నమ్మెడి తంతు యొక్క స్థూల రూపము కాన్పించుచున్నదని నా యనుమానము. టోటమిక దశాస్వరూపము, హైందవ మత పరిణామ స్వరూపమునందు, వైదిక మత ప్రాబల్యము వలన, మఱుగు పడి పోవుటచే, నొక నాటి యీ దశయొక్క స్వరూప స్వభావములను ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలు లేకున్నది. ఆఫ్రికన్ మోటు జాతుల మత స్వరూపమునందును, అమెరికన్ ఇండియనుల మత విధానము నందును, ఆస్ట్రేలియన్ జాతుల యనాగరకమత స్వరూపమునందును, స్పష్టముగా కాన్పించు నీ దశ హైందవ జాతుల ప్రాకృత స్వరూపమున మసక మసకగా కాన్పించుచున్నది. వైదిక మతాచ్ఛాదితమైనను విధ్యుక్త ధర్మములుగా చెప్పబడిన కొన్ని యాగములలో నశ్వమేధయాగము నందలి కాండ యంతయు నీ టోటమిక దశా ప్రాభవమునే వెల్లడించుచున్నదన వచ్చును. అశ్వమేధమున, నశ్వమును యాగార్థమై నవరంధ్రములు మూసి చంపిన వెనుక నొకరాత్రి, యజ్ఞము చేయు వాని భార్య ఆ యశ్వముతో నిద్రించవలయును. అంతియేకాక నాయశ్వ శరీరగత మాంసమును సోమయాజియు, భార్యయు నుపయోగింపవలయును. అ విధముగా, నా యశ్వశరీరమం దావిష్కృతమగు నాత్మ యాజ్ఞికుని, వంశగతమగు నాత్మ శక్తియనియు, నది తిరిగి మాంసభక్షణము వలన యాజ్ఞికుని చెంగి యాతనికి తుష్టిని పుష్టిని కలిగించుననియు పెద్దల నమ్మకము. ఈ యశ్వమేధము నిందువలననే ప్రాక్ప్రాక్తనవ మేధావిలసితమైన టోటమిక దశకు చెందిన కర్మకాండగా చెప్పుకొనవచ్చును. మన పురాణములయందు కథితమైన దశావతార స్వరూపము విజ్ఞుల యూహ ననుసరించి మానవ పరిణామ వాదమునకు చక్కని యుదాహరణముగా భాసించుచున్నది. కాని మానవుని ప్రాకృత స్థితియందు, వాని విశ్వాసమును, భయభక్తులును దేవతాస్వరూపముల నుద్దేశించినవి కాక జంతు స్వరూపగతమగు నాత్మశక్తి నుద్దేశించినవని చెప్పుటకు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహావతారములు బలము నిచ్చును. ఇట్టి జంతు ప్రాబల్యమును స్పష్టము చేయుచు జంతు నాయకముగా విలసిల్లిన జానపద గేయగాథ మరియొకటి కలదు. అది "వరహావతార చరిత్రము." ఇందలి కథ దశావతారముల యందలి వరాహస్వామి గాథ కాదు. వీరశైవ, వైష్ణవ స్పర్థలను తెలియజేయుచు చివరికి శివ

కేశవా ద్వైతమును బోధించు కథగా నది పరిణమించినది. కాని మొదలి చిత్ర మేమనగా విష్ణు స్వరూపముగా వరాహమును, తత్ప్రతీకక్షిగా, శైవ ప్రతీకగా, భైరవమూర్తియు నిందలి కథయందు ప్రధాన పాత్రను వహించినవి. కాని శివకేశవ స్పర్ధలు మిక్కిలి ప్రాచీన కాలమునకు చెందినవి కాక యాధునికము లగుటచే, నీ యితివృత్తమున కితి ప్రాచీన మత స్వరూపము గు టోటమిక స్థితిని సమకూర్చుట కష్టము. కాని యిచట నొక విధమగు సమర్థన చేయవచ్చు ననుకొందును. ఇతివృత్తము ఆధునికమైనను, దానిని మలచిన పద్ధతియు, దానికి జంతు ప్రాధాన్యము కలుగునట్లుగా తీర్చిన వైనమును నాధునికములు కావు. జాంతవమగు నిట్టి ప్రాధాన్యము ప్రాఙ్మానవ మస్తిష్కమున, టోటమిక దశ యందు రూపుకట్టినదనుట నిర్వివాదాంశము ఆ దృష్టితో చూచినచో నీ గేయగాథ యందలి జంతు ప్రాధాన్యము వెనుక, ప్రాచీన కాలమునకు చెందిన టోటమిక స్వరూపము లీలగా భాసించుచున్నదనిపించును.

"అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుం డాదివిష్ణు సింహాచలమందున వరహావతార మెత్తెను. కార్తవీర్యార్జునని కొఱకై పరశురాముఁడే వరహావతార మెత్తెను." అని యవతార పరమార్థమును వెల్లడి చేయుచు దానిని వర్ణించుట మొదలిడెను.

"అరికాలున తామరపద్మం వీపునాను వింజామరలండి
కల్వదోక, నొష్టా చుక్కండి కన్నులాను చింతామణి కలదు
తిరుమణి శ్రీ చూర్ణంబు మెండు శంఖ చక్రగదాధరుండై
తొండ మొక్కటి లేదా మృగము దొడ్డ యేనుగంతా లావండి"

అట్టి పందిని వేటాడుటకై సహస్ర బాహువులు కలిగినవాఁడు 'శివభక్తుఁడనే ధురంధరుఁడు' కార్తవీర్యార్జునుఁడు సమకట్టెను. రాజు దగ్గఱి సరదార్లలో మొనగాఁడయిన గండుపల్లి బయ్యన్న లింగము, "మహాప్రభో పందియనఁగ మాకెంత, కొట్టి సంహరించి పత్తును సెలవిమ్మని రాజు దగ్గర సెలవుగైకొని, చలవ చలీఁబు దొడిగి, బిళ్లల మొలత్రాడు వేసి, పాలపూల వంకీలు వేసి, పిడి బాకుదోపి, తొమ్మిది మణుగుల గదను బూని, బయలుదేరెను- అప్పుడవతార మూర్తియైన పందియందు ఆదివిష్ణు బ్రహ్మాదులెల్లరును ప్రత్యక్షమైరి సూర్యం

డును చంద్రుడును పందికి వింజామరలు వేయుచుండిరి. అట్టి "పంది యొక్క ప్రతాపానికి పిడుగువచ్చి మీద పడ్డట్టు పర్వతంబు పయిబడ్డట్టు కన్నులు చెదిరి గుండెలు పగిలి కాలు కాలును పెనచు కున్నరు బాకులయిన పారేసుకున్నరు పీటికర్రలు విడుచుకున్నరు చెట్టుకొక్క బంటయి పోయెను, పుట్టకొక బంటయి పోయెను".

బయ్యన్న లింగము, ఎట్టఎదుట నున్న మద్దివృక్షము నెక్కి, చేతనైన చెట్టును పడగొట్టి నన్ను పట్టరమ్మని పందిని సవాలు చేసెను. పంది యా మాటలకు రోషించి, "కుడికోరకూ పదును బెట్టెను ఎడమ కోరకు పదును బెట్టెను కట్ట మీదను కానుగవృక్షం మట్టెతోడ తెగనరికివైచెను ఎదురుగనున్న చెంద్ర మొద్దును, ఏటవాలుగ తెగనరికింది పదును బూని బయల్వెళ్ళిందండి" -వెడలి, "ఏడు కావిళ్ల'' మద్ది వృక్షమును పిండి పిండి చేయగా చెట్టుమీది బయ్యన్న లింగము రెక్కలు లేని పక్షిచందమై గడగడ వణకి, పంది పాదములు పట్టుకొని సాష్టాంగ పడెను. తదుపరి 'వరహావతారము' వానిని విడిచి పుచ్చి, కార్తిక సోమవారమందున నూరిమీదికి ముట్టడి వత్తునని చెప్పుమని బయ్యన్న లింగమును పంపెను. రాజు పంది నెదుర్కొనుటకై తాను పన్నెండేండ్ల నుండి పెంచుచున్న భైరవుని సిద్ధము జేయించెను. భైరవుడు సామాన్యుడుకాడు. తల్లి గర్భము నుండియే రుద్రాక్షల తోడను, విభూతి రేఖల తోడను జనించెను. అట్టి భైరవునికి బిరుదులు వేసి, నాలుగు కాళ్లకును అందెలు తొడిగి, 'పన్నెండు కాళ్ల' ఎడ్లు బూన్చిన బండిపై నుంచి, 'అరవై నలుగురు బెస్తా బోయలు' వింజామరలు వేయుచు కచ్చేరికి దెచ్చిరి. తెచ్చి

"రావే నీవు పుల్లభైరవా. ఇన్ని రోజులు పెంచినందుకు ఈ ప్రొద్దున సమయము వచ్చినది జోడు రెండు కోరలతో తట్టు ఎక్కడ నుండో కొమ్ము పంది మనతో వూరి మీదికే యుద్ధానికి వచ్చెను. దాని మీదికి ఈ ప్రొద్దున నీవు యుద్ధానికి వెళ్లవలసినది" యని విన్నవించుకొనిరి.

రాజు కూడ "రావయ్యా ఓ పుల్ల భైరవా శివమతము నిలిపి, మానము దక్కించి, భూమియందు కీర్తినుంపు" -మని వేడెను. పందికిని, భైరవునకును ఘోర యుద్ధము జరుగగా, చివరకు భైరవుని బలము తరుగగా, కోరల పంది,

''కుడి కోరను గుండెల కునిపెను
ఎదురు కోరతో ఖండించింది.

జోడు రెండు తుండెములు నరికెను కోపగించి తల త్రుంచివేసెను"-ఆపైన అడ్డు వచ్చిన బలము నంతయు కసిమసంగి కార్తవీర్యార్జునుని, సహస్ర బాహువులు తెగనరికి, చౌకలించి పై దూకి, నవ రంధ్రములు బిగియ బట్టి, తన తొడలపై జేర్చుకొని, ఆగ్రహించి తలపెరికి వేసెను. వాని రక్తము భూమిపై పడినచో నొక్కొక్క బిందువు నుండి నూఱుగురు రక్కసులు పుట్టుదురు! కాన తన నాలుకను ''కళ్లం వెడల్పున పెంపు చేసి'' భూమిపై పరచి వాని రక్తమాంసములను జిహ్వయందు గ్రహించెను ఈ విధముగా కార్తవీర్యార్జున సంహారము చేసి, శివ గురువైన కోటయ్య లింగమునకై వెదుకసాగెను.

కోటయ్య లింగము తమ్ముఁడు పిల్లన్న లింగము. వారి తల్లి పాపమ్మ లింగము. కోటయ్య లింగము పేరు చెప్పినచో గుఱ్ఱములు నీరు త్రాగవు ఏనుఁగులు మేత తినవు. పసిపిల్లలు పాలారగించరు. ఆతఁడు నాలుగు బారల మనుజుఁడు, నన్నూరేండ్లాయువు గలవాఁడు. హాటము పూనినచో చట్రాతిన నార తీయువాఁడు. అట్టి వానిని జయింపవలయునని 'యవతారము' బయలు దేరెను. కోటయ్య లింగము కంటెను ముందు వాని తల్లి పాపమ్మ లింగము, అవతారమును చూచెను. చూచి, "శివ స్థలములోకి వస్తివి శివపూజలు చేసేటి వారము శివుని యందు భక్తిగలవారము ఇట్టి చోటికేల వస్తి"వని, పందిపై దుమికి,

"అయిదు మణుగుల బల్లెం బట్టి
మూడు మణుగుల డాలు తోటి
వెనకా ముందూ చూడకుండను
రెండు మూడు లఘువులు చేసిందీ
నాలుగైదు గదుములు గదిమిందీ
మానుషానికి కొమ్ము పంచిపై
ఝామున్నర యుద్ధము చేసిందీ"

అట్టి స్త్రీ యొక్క మానుషము చూచి మెచ్చుకొని, "నన్ను ...ట్టుకొని నేను కొట్టితే స్త్రీ హత్యలు నే చెందిపోదునూ'' - నీ కుమారుని కొఱకై వచ్చితిని వానిని పంపుమని యవతారము పలికెను. కోటయ్య లింగము తల్లిపలన వృత్తాంత మంతయు విని, యట్టి మృగముపై పోవుట వలన తనకు పరువు లేదని తన తమ్ముఁడు పిల్లన్న లింగమును బంపెను. వాఁడు వరాహమూర్తితో నైన భీకర సమరమున చెల్లిపోఁగా, కోటయ్య లింగము గుండె ఝల్లుమని లేచి, శివునియందు చిత్తముఁజేర్చి యేడు ఘడియలు ప్రార్థింపఁగా శివుఁడు ఎదుట నిలచెను. నిలచి, 'రారవోరి కోటయ్య లింగము మా యందు భక్తి గలవాడవు, నీవు పిలిచినా వర్తమానము ముందు మాకు గోచరమైయున్నది. అది పందియనుకున్నావేమో పందిగాదు పరమేశ్వరుఁడు శివకేశవులకు భేదమెంచిన శత్రువులను జంపి మిత్రులను రక్షింపవచ్చినది హరియని ధ్యానించిన వారిని ఆదరించి రక్షించుచున్నది శరణని మ్రొక్కినచో కరుణతో రక్షించి పోవును. మా మాటలు నీవు వినక పోతివా దాని చేతులో నీవు చెల్లేవో నీ చేతులో అది చెల్లేనో, ఉన్న వాస్తవము ఎరుగజెప్పితిమి'' అని బుద్ధులు చెప్పెను. అందుకు కోటయ్య లింగ మీసడించు కొని, "మిమ్మును ధ్యానము చేసినందుకు, మిగుల భక్తి పూజించి నందుకు, తగిన మాట సెలవివ్వక పోతిరి పౌరుషంబు నే విడువ" నని పలికి యుద్ధమునకు సిద్ధ మయ్యెను ఇరువురకును తుముల యుద్ధము జరిగెను. కోటయ్య ప్రతాపమును, సహనమును, చివరి వఱకును నవతారము పరీక్షకు పెట్టి, వానిని యష్టకష్టముల పాలు జేసెను. పట్టు విడువని ప్రతి కక్షిని మెచ్చుకొని, తన సంకల్పముచే, నంత్యకాలమున వాని హృదయమందున హరిమంత్రముపొంగుచు వచ్చునట్లు చేసెను. జిహ్వకు ద్వాదశ నామములు వచ్చునట్లు చేసెను. అపుడు, త్రిమూర్తులు తమ వాహనములపై నెక్కి యచటికి వచ్చిరి. 'ఆదివిష్ణు సింహాద్రి రూపమగు నవతారము' వారిని కన్నుల జూచి, తన కళేబరమును దిగవిడచి కోటయ్య లింగ మున కభయ మిచ్చుచు, నంబరవీధిన నెగిరి పోయెను. కోటయ్య లింగము, పంది మీద తన శిరము నుంచుకొని ప్రాణము వదిలెను. పంది వరాహమూర్తియు, కోటయ్య కళేబరము పానవట్టమునై శివకేశవులకు భేదము లేదని తెలియజేయుచు వెలసిరి. చూడవచ్చిన దేవ మానవులు వారికి గుడిగట్టి శిఖరము నిలిపిరి. ఈ నాటికిని, ఒక వైపున వరాహరూపము, మఱొకప్రక్క లింగరూపమునై,

అహోబిల దివ్యస్థలమునందు పరమేశ్వరుఁడు పూజలందుకొనుచుండును. ఇది 'వరహావతార'గాథ శివకేశవ స్పర్థ నాధారముగా గొని యీ పదము వెలసినదని చెప్పవచ్చును. కాని యిందు శివకేశవులను శైరవ వరాహములుగా, కేవల జంతు రూపములుగా, మంచుటలో దాగియున్న రహస్యము మనలను టోటమిక మతస్వరూపము కడకు కొనిపోవును. పురాణముల యందు హిరణ్యాక్షుని సంహరించుటకై విష్ణువు వరాహ రూపియైన కథనము కంటె నీ కథనము భిన్నముగ నున్నది. ఇందడుగడుగున ఆది విష్ణువు అవతారమై భాసించిన వరాహము నెడల జానపదులు వెల్లడించిన భక్తి గౌరవములు ప్రస్ఫుటముగా కన్పించును శంఖ చక్ర గదా శార్ఙ్గ పరిశోభిత చతుర్భుజుఁడును, శ్రీ వత్సలాంఛనుఁడును పీతాంబర ధారియు. నాజానుబాహుఁడును, పీన వక్షస్థల సుందరమూర్తియునగు విష్ణువుయొక్క రూపము కంటెను, జాంతవ మగు నాయన యవతారము పైననే వారికి గల మక్కువ చక్కగా వెల్లడింప బడినది. ఇది, ఆదిమ మానవ మస్తిష్క నిర్గతములైన మౌలికమగు మత సంబంధమగు జంతు ప్రాధాన్యముతో గూడిన నభిప్రాయమును పొదిగించుకొన్న పదముగా నిస్సందేహముగా నిర్ణయింపవచ్చును.

విశాఖ జిల్లాకు సంబంధించిన దశావతార గాథలను శ్రీ దొణప్పగారు సేకరించియిచ్చిరి. అందున్న వరాహావతార కథ పౌరాణిక గాథకంటె భిన్నమగు కల్పనతోఁగూడియున్నది. ఇదియు జంతు నాయకమై నెగడిన కథయే.

వాలి కొడుకంగదుఁడు ఎఱుకఁడై 'నడికొండ పర్వతమును' దున్ని, పోడు, చేసి దేవలోకములోని కేతెంచినాఁడు. 'సామలు, కొఱ్ఱలు, సబ్బన్న దినుసులు', దేవలోకమునుండి తెచ్చెను.

"దేవలోకము నుండి దెచ్చినా విత్తనం
ఏడు గుజ్జల వోవ పోడేసినాఁడు
అదును దప్పకుండ వర్షాలు గురిసి
మూనాల కాయాకు మును మొక్కనాటి
ఏడు రోజుల నాటి కెల్లి నాటింది
పది రోజులాయింది పసరు కొన్నాది
యిస్తరించెను చేను ఈతదవిలాగ

గామకొన్నది చేను గాతడవి లాగ
ఈనింది ఆ చేను యీ చిత్రముగను"

అట్లు పైరు ఈనఁగా

"పైరు తూరుపుగాలి పట్టి విసిరేను
మదన వాసనలాయె మరి సముద్రాన్ని
మచ్చావతారుడికి మాలి మాయింది''–

ఆయనకు తెలియఁగా,

"వద్దున్న శేషన్న కెరుక లేకుండ
మల్లెలా పానుపు మెల్లిగా డిగెను''

ఎంత మెల్లగా దిగినను, శేషుఁడు మేల్కొని, యెంతవఱకు వెళ్ళెదవని, పడగలు విప్పి, పాదములు చుట్టుకొని యడిగెను. అడుగఁగా పద్మనాభుఁడు,

"రామావతారాన్న వాలినేసినాను
వాలి నేసిన పగలు వెంటనున్నాయి
ఇల మీద వాలి పగ లిచ్చివస్తాను''

అని యుత్తరమిచ్చెను. ఇదియే ఆయన వరాహరూపియగుటకు బలమైన కారణముగా భాసించును. వరాహమైన స్వామికి.

"నాలుగే పాదాలు నాలుగేదాలు
సాయి కత్తులు బోలు స్వామి పాదాలు
ఎండు కత్తుల బోలు ఎన్నుని పాదాలు''

ఆయన ఎఱుకల వాని పంట దాపునకు కదలుటకై పాదములు కదపఁగా,

"కులగిరి పర్వతము కుదిలి కదలాడె
మమ్మేరు పత్వతము మట్టు కదలాడె"

అట్లు జప జపలాడుచున్న పర్వాశముల కభయ మిచ్చి,

"సడసడా నా స్వామి సాగి నడిచేను
ఆటగాటగ వెన్నులందుకొని మేసె
ఈనిన కొర్రంత ఇరగ దొక్కేను
పైకొని పండిన పసరు కొర్రలు మొదలు
అయ్యారగించినా డానందభోగి
గాదుకొని పండినా గారకొర్రలు మొదలు
అయ్యారగించినా డానందభోగి

ఆరగించి

'పాతాళపుట్ట'లో పవళించెను ఊరకోళ్ళు గూసిన వెనుక లేచి, యెఱుక పాడరిపోయిన చేనును జూచుకొని దుఃఖించి, పందిని, మట్టుపెట్టుటకై వివిధా యుధములను నిర్మించుకొనెను. పొలమున పందికొఱకై మాటుపెట్టి, కన్నుల వత్తులు వేసికొని చూచినంత సేపును అది రాలేదు. వాఁడు నిద్రకూరినవేళ, స్వామి పుట్టబయలు వెడలి, మాటు ముందున్న కొట్టను ముట్టుకొని మేసి, "తొంగున్న యెరుకోని తొడసరసి లేపెను." లేచిన యెఱుకు, ససంభ్రముఁడై స్వామిని కోలలతో నేసెను. ఎఱుకు వేసిన వ్రేటునకు నిలువలేని నీలవర్ణుఁడు, 'పాతాళపుట్ట'లో పవ్వళించెను. తెల్లవారఁగా నేటు పడినచోట వెదకి 'మాయపంది' కానరాకపోఁగా నడుగు జాడల ననుసరించి యెఱుక, 'పాతాళ పుట్ట'లో పంది పవ్వళించినట్లుగా గుర్తించెను. దానిని సాధించు టకై పాఱను, గునపమును గొని, పుట్టను త్రవ్వ నారంభించెను.

"యోజనము యోజనము పుట్టతవ్వేను
రెండు యోజనములు సామెల్లిపోయె
మూడు యోజనాలు పుట్టతవ్వేను
నాలుగోజనాలు పందెల్లిపోయె
నాలుగోజనాలు పుట్ట తవ్వేను
అయిదు యోజనాలు సామెల్లిపోయె
పన్నెండు యోజనములు త్రవ్వగా

"గునపాల పోటులకు గుడిగోపురము-
తగిలి కంగు కంగున మ్రోగె కంచు దేవలము"—అ మ్రోత విని యెఱుక గడ గడ వణకి,

"నివ్వంట నేనెరుగ నీలవర్ణుండ
పందంట ఏసితిని పర్వతము మీద," యని చెప్పెను.

వరాహ రూపియైన స్వామి వాని కభయ మిచ్చుచు,

"నీకు బయ్యము లేదు బాలుడెరుకోడ
తండ్రి నేసిన పగలు తనయునా కిస్తిని"

యని చెప్పెను. ఆ విధముగా నా వరహావతార పరమోద్దేశ్యము నెఱవేఱినట్లుగా గలదు ఇందు వరాహ ప్రశంసతోపాటు, పందివేటలోని కష్టనష్టములను విపులీకరించుటకై కుతూహలమును జూపించిన జానపదుని మనస్సు స్పష్టముగా కాన్పించును. ఇట్లు మత్స్య, కూర్మ, నారసింహావతారముల చుట్టును కథలల్లుటకు ముచ్చటపడిన జానపదుని మనస్సు వెనుక నాదికాలపు జంతు ప్రతిపత్తి యొక్క వాసన యున్నదని నాయభిప్రాయము.

సరీసృపములలో నగ్రగణ్యమైన 'నాగము' ప్రాచీన కాలము నుండియు మానవుని యూహలలో మెదలి భయగౌరవములను సంతరించుకొన్నది. ప్రపంచమందలి యేదేశపు పురాగాథలను (myths) పరిశీలించినను 'నాగము' యొక్క పొలకువ కాన్పింపక తప్పదు మానవులకు వరప్రదాతయై, దైవస్వరూపమై నెగడిన సరీసృపము నాగము. జానపద కథా కథనము నందిది నిర్వహించు పాత్ర గొప్పది. జానపద గాథలయందు పాము చుట్టును అల్లబడిన కథల నమూనా లనేకములు కలవు.

1. సర్పము సంతాన కారకమై యిలవేల్పగుట; తన వరముచేఁ బుట్టిన కథానాయకుని అపదలనుండి కాపాడుచు అభయ ప్రదాతయై మహిమా ప్రకటనము చేయుట,

2. పూర్వులుంచిన నిధులను కాపాడుచు, అన్యహ స్తగ స్తము కాకుండ వానిని కాచుకొనియుండుట.

3. ఏదే నొక క్షేత్రమున దైవీ మూర్తుల యావిష్కరణమునకు ముందు ఆ మూర్తులు పుట్టయందుండగా, వానిని నాగము పడగయెత్తి కాపాడుచుండుట.

4. ఒకడు మున్ముందు మహా వ్యక్తియో, మకుటాధిపతియో కాఁబోవు నట్టి కథ నడువ నుండఁగా వాని శిరస్సున సూర్యాతపము సోకనట్లుగా, పండ్రెండు శిరస్సుల నాగు పడగ విప్పి నీడ పట్టుట.

5. కథా నాయకుడో, నాయికయో, అవితర్కితముగ నూత బడియో, సముద్రమున దూకియో నాగలోకము చేరి నాగరాజుచే నాదరింపఁబడి సకల శుభముల నందుట.

6. కథా నాయిక సర్పావిష్టయై యుండుటయు రాత్రివేళ ఆమె నిద్రించు తఱి నాసికా రంధ్రముల నుండి నిర్గమించుటయు చివఱ కొక యసమాన ప్రతిభాశాలిచే నా సర్పము తుండెములుగా నఱుకఁబడి యామె శాప నిర్ముక్తయగుటయు.

7. గండ భేరుండ పక్షుల పిల్లలను దినిపోవు సర్పరాజు కథానాయకుని చంద్రహాసమున కెఱయై మరణించుట. తత్కృతజ్ఞతా సూచకముగ పెద్ద పక్షులు కష్టతరమగు కథానాయకుని కార్య సాఫల్యము నొనగూర్చుట.

ఈ విధముగా జానపద గాథలలో నెన్నియో నమూనాలు పాములు చుట్టును నల్లఁబడినవియు, వాని ప్రాధాన్యమును కలిగినవియు కాన్పించును. దీని కంతయు ప్రధాన కారణము హైందవ హృదయగతమైన సర్పనివిష్టమగు దైవ భావనయేయని చెప్పవచ్చును. ప్రాఙ్మానవునిచే పాము ఆత్మప్రతీకగా నారాధింప బడుటయు, నది కొన్ని గుంపుల కధిష్ఠాతయై భయభక్తి గౌరవముల నందుటయు నన్ని దేశముల జానపద గాథల యందును కాన్పించును.

సర్పము సంతాన ప్రదాతయను వంశమునకు తోడు, వర్షము నిచ్చెడి శక్తి కలదియను నమ్మిక ఉత్తర భారతదేశమందే కాక, ఇతర దేశములయందును కలదు. పర్షియాదేశస్థులకు ఆకాశమున వివిధ వర్ణములతో మెఱయు హరివిల్లే సర్పదేవత. ఆఫ్రికనుల నమ్మకము ప్రకారము, ఇంద్రధనురాకారుఁడైన సర్పదేవుఁడు తన తలను మేఘముల యందుఁజొనిపి వర్షము నాకర్షించి నేలమీదికి దింపునట్టి ప్రతిభా సమన్వితుఁడు. ఆఫ్రికనులలో, తమ యింట పాము కాన్పించినచో తమ పెద్దల యాత్మయే యా రూపమున వచ్చినదను విశ్వాసముతో గౌరవ ప్రవత్తులు చూపెదరు. జావా, బలి ద్వీపములలో, క్షత్రియులు మరణించినచో శవముతో పాటొక పామును దహనము చేయు నాచారమును కలదు. చనిపోయిన వాని ఆత్మకు తోడుగా నీ పామును బంపుటలో పరమార్థము, దాని యాత్మయందుగల ప్రత్యయమేగాని మఱొక్కటి గాదు.

కథా గేయములలో నీ నాగప్రాశస్త్యము గలిగిన కథలను రెండింటిని ముఖ్యముగాఁ బేర్కొనవలయును. అవి (1) పాము పాట అను ధర్మాంగద చరిత్ర, (2) బాలనాగమ్మ కథ.

మొదటి కథయందు, పాము యొక్క ప్రాధాన్యము మొదటి నుండియు కాననగును. కాశ్మీర పుణ్యదేశమున కనకాపురము నేలుచు ధర్మాంగదుఁడను రాజుకలఁడు. ఆయన భార్యయగు నర్మిలీదేవి బహుకాలము సంతానము లేక, వ్రత, దాన, తీర్థయాత్రా, దేవతా పూజాదికముల వలన నెట్టకేలకు గర్భమును దాల్చెను. నవ మాసములు మోసి చివరకు. "రెండు నాలుకలతో నిండు పడగను గల్గి చిఱ్ఱుబుఱ్ఱూమనెడి "శేషుని గనెను. "పాము మనిషికి బుట్టె పాపంబు నదియేమి విశ్వంబులో లేని వింతొకటి బుట్టె" నని యా దంపతులు కుమిలి చిట్టచివరకు చేయునది లేక యా 'పాప పాప' నే పుత్త్రి నిర్విశేషముగా పెంపసాగిరి. పుత్త్రుఁడే పుట్టెనని పురములో చాటించి యసలు విషయము బైటికి పొక్కనట్లుగా జాగ్రత్త పడిరి. ధర్మాంగదునకు తనయుఁడు పుట్టెనని దేశాధిపతులెల్ల విని, గొప్ప యేలికయగు వానితో వియ్యమందవలయునని యొకరి కంటెను ముందొకరు వార్తల నంపసాగిరి.

కొన్ని వత్సరములు కడ చనిన వెనుక, తన కుమారునకు తగిన కన్యను వెదకుటకై రాజు, బ్రాహ్మణులను దేశము నలు మూలలకును బంపెను. వారు సర్వదేశములకును బోయి యెచ్చటను సరియైన కన్యను గానక, చిట్టచివరకు సౌరాష్ట్ర దేశమున మాణిక్యపురము నేలు రత్నాంగుని కూతును, త్రైలోక్య సుందరియను పేరి దానిని, జూచి యామెయే తమ యువరాజునకు తగిన కన్య యని నిర్ణయించిరి. ఆ కన్యను తమ యువరాజు కోఱకుగా నడుగఁగా, రాజు యువరాజును చూచిన తదుపరి నిశ్చయింతుమని వారి వెంట తన ప్రతినిధులుగా బ్రాహ్మణులను బంపెను. మంత్రి యీ యాపద గడవ బెట్టుటకై తన కుమారుని, రాకుమారుడని, చూపించి వారిని సమాధాన పరచెను. అంతేకాక,

''భూసురోత్తములార బుద్ధిమంతులు మీరు
మారాజు గారింట మఱి యొకటి గలదు
వారింటి యిలు వరస వేరుగా నున్నది
లోకమున లేనట్టి యాచార మొప్పు
పేరైన వారైన పెండ్లి కొడుకును వీరు
పరదేశమునకును పంపుటయె లేదు
కత్తికిని బాసికము కట్టి తర్లించుకొని
కత్తికిని, కాంతకును కరమొప్ప తలఁబ్రాలు
పోయించి, తగ పెండ్లి చేయింతు రపుడు
ఇలువరస నడవడి యిలలోన నెవరైన

తప్పింపజాలరు ఎప్పటికైన'' యని సమయస్ఫూర్తితో రానున్న యాపదకు ముందే నివారణము నాలోచించి తన ప్రభువును కాపాడఁగలిగెను. ఆ విధముగా ధర్మాంగదుని పుత్రునకును త్రైలోక్య సుందరికిని వివాహమయ్యెను. పడతి అత్త యింటికి వచ్చినను భర్త సందర్శనము కలుగదాయెను. కొన్నాళ్ళు వేచి యుండియు, నెట్టి పర్యవసానమును కలుగక, ఓటమి నశించిన సుందరి అత్తమేడఁకు వచ్చి,

"అత్తరో మాయత్త ఆలింపు మా మనవి
ఉన్న చందము నేను విన్నవించెదను
నేను వచ్చిన మొదలు నేటి పర్యంతంబు
నా విభుని గనలేదు నా భాగ్యమేమొ
తల్లి దండ్రులు మీరు తలవ రెన్నడు సుతుని
దాసదాసీలును తలచ రెన్నడును
పర దేశములకైన పంపించి యుంటిరో
ఏమాయెనో నాథుఁడెక్కడున్నాఁడో

ఉన్న దున్నట్లుగా నొప్పుగా జెప్పండి" యని నిలదీసి యడిగెను. అత్త ఉన్న సంగతి వెలువరించెను. ఆ వార్తవిని మొదలు తెగిపోయిన కదళీ తరువట్లు నెలత నిలుచున్న పాటున పడిపోయెను. కొంతవడికి మూర్ఛదేరి దిగ్గున గగ్గోలు పడుచు లేచి, దుఃఖించి, చివఱకు తన భర్తతో తాను నూట యొక్క దివ్య తిరుపతులను సేవింప నిర్ణయించుకొనెను. కాని మామగారి యభిప్రాయము నామోదింపక,

"అడవులను కొండలను అతిదుర్గమంబైన
నదుల పొదలను గడప నాతులకు వశమె
పురుష సాయము లేక పొలతులకు భువిలోన
తీర్థయాత్రలు బోవ తీరు గాదమ్మ"

యని వాదింప బోయెను. అందుకు మృదువుగా కోడలు,

"ఏకచిత్తముతోడ నే లోక మేగినను
సాంబమూర్తియె నాకు సాక్షియైయుండు

నా విభుండైనట్టి నాగరాజే నాకు సాయమై యుండు" నని పాము పెట్టె కడకేగి, ముమ్మారు ప్రదక్షిణ మాచరించి, రెండు చేతులతో దానిని నిండు గౌగిటను జేర్చి నెత్తిపై బెట్టుకొని తీర్థయాత్రా కుతూహలియై ముందునకు సాగెను. అతి శ్రమకోర్చి యన్ని పుణ్యక్షేత్రములను దర్శించుచు పుణ్యవాహినులందు

క్రుంకులిడుచు, విసుగుజెంది, నైమిశారణ్యమున మహామునులను చూచి తనగోడు వెళ్ళబోసుకొనెను. ఋషులామెను సమాశ్వసించి, ఆమె భర్త వెనుకటి జన్మమున భూపతి యనియు, దుష్పరిపాలకుఁడై బ్రాహ్మణ స్వత్వములను సంగ్రహించి, వారి యగ్రహారములను లాగుకొని, వారిని పీడించుటవలన, శాపగ్రస్తుఁడై నాగ జన్మము నందెనని యు, తన పతివ్రతా మహత్త్వమువలన శాప నిర్ముక్తుఁడై యిరువురును సుఖులై చిరకాలము ప్రజారంజకముగ భువిని పాలింతురనియు చెప్పిరి. ఆమె చివరకు పశ్చిమాంబుధి చెంతనున్న బ్రహ్మకుండమున పతితో పాటు మునుగగా పాము రాజయ్యెను. అంత సతిపతు లిరువురును తమ తమ తలి దండ్రులను గూడి వారు పెట్టిన పరీక్షల కాగి, తమ పవిత్రతను నిరూపించుకొనిరి. ఇట్టి కథయందు పతివ్రతా మాహాత్మ్యము ను తెలియజేయు ముఖ్యోద్దేశ్యమునకు 'పాప మగఁడు' పరికర ప్రాయుఁడై చిత్రింపఁబడియెను అయినను పాము రాజగుట, పడతి పాముని భర్తగా నెంచి తీర్థాటనము చేయుట, యనునంశము జానపద మనోజన్యమగు జంతు ప్రాశస్త్యమునకు సంబంధించిన కల్పనయే యని చెప్పుటలో సందేహము లేదు.

జానపదునకు పాపఱేనిపై నున్న భయగౌరవములను ప్రస్ఫుటము చేయు మఱియొక కథ బాలనాగమ్మ కథ. ఇచట ఆదిశేషుని యవతారమైన నాగరాజే సంతాన కారకుఁడును, అవిధేయురాలై ప్రవర్తించిన పిల్లల తల్లిపట్ల సంహార కారకుడుఁనై, జానపదుని మనస్సునందు భయ సంభ్రమములను పెనవేయుట జరుగు చున్నది.

భూలక్ష్మిదేవి భర్త యాజ్ఞగొని సంతానము దెత్తునని, అడవులు 'నఘం తర'ములును దాటి జటంగి మహాముని పర్వతమునకు వచ్చెను. ఆ మునిని ప్రసన్నుని జేసి సంతుకలుగు నుపాయమును గ్రహించెను. ఆ కొండ కీశాన్య మున, నాగమునీంద్రుని గట్టున్నది. అ గట్టుపై మద్దిమానుల చవికె. ఆ చవికె నట్టనడుమ నాగేంద్రుని పుట్ట. పుట్టమీద బాలమామిడి వృక్షమును గలవు. ఆ చెట్టునిండ పండ్లున్నను ఏడే పండ్లు గోసికొని తిరిగి పట్టణమున కేగి వానిని యనుభవించినచో నీకు సంతు కలుగునని ముని చెప్పెను.

ఆమె పుట్టకడకేగి చెట్టును పారజూచి, "కాసెబోసి వడిగట్టి పుట్టకును, చెట్టునకును, దండముబెట్టి యాశకు పడినిండ పండ్లు కోసికొనెను. దిగివచ్చి చూచుకొనఁగా ఒడిలో నేడు పండ్లే మిగిలియుండెను.

"దేవత మహిమలు మ.మ్మాటి కేమి
ఒకటా రెంటా మూట జూతుమేమి"

యని యామె మూడుసార్లు చెట్టెక్కి పండ్లు గోయుటయు, నా పండ్లు మాయమగుటయు సంభవించెను. మూడవ తూరి యెక్కినపుడు,

''తానే వచ్చెను కాలసర్పమేమి
చెట్టుకు తొమ్మిదిచుట్లు వేసినాడు'' వేసి,
''తోటకు నేను కావలియున్నాను
నాకు తెలియక వృక్ష మెక్కినావు
నీ ప్రాణము నే పుచ్చుకుంటనమ్మా"-యని,
"పన్నెండు శిరస్సులు విప్పెను నాగన్న
కొమ్మకొమ్మకు ఎక్క సాగినాడు''

అది చూచి భూలక్ష్మిదేవి గడగడ వణకి నాకు పుత్త్రివాంఛతీరలేదు గాన, బిడలుగలిగిన తొమ్మిది నెలలకు, శేషపౌర్ణమినాఁడు,తన మేడకు వచ్చినచో కంఠ మందున కాటిచ్చెదనన్నది. అందుకు నాగేంద్రుఁ డంగీకరించి యామెకు ఏడు మంది యాడుపాపలు కలుగునటుల వరమిచ్చెను. చివరిదానికి బాలనాగమ్మ యని పేరు బెట్టుమనెను. అందుకు భూలక్ష్మి కొంతలో కొంత సంతోషించియు, నేడుగు రాడుపిల్లలేనా, యందొక మగపిల్లవాని నిమ్మని కోరెను. అందుకు నాగేంద్రుఁడు

' మొగబాలను నీకు ఇస్తైనమ్మ
నీ పెనిమిటి మరణం ఒప్పవె శ్రీ లక్ష్మి" యని చెప్పఁగా
''పెనిమిటి లేని భాగ్య మెందుకయ్య
బిడ్డలు లేకపోయిన మానేను
పెనిమిటి మరణం ఒప్పనయ్య నేను"

అని శ్రీ సంతాన వరమునే గ్రహించి తిరుగు పయనమయ్యేను ఈ విధముగా నీ ఘట్టమున నాగేంద్రుడు ఆగ్రహానుగ్రహ సమర్థుడును, వరప్రదాతయు మృత్యుకారకుఁడునై ప్రముఖ స్థానము నాక్రమించుకొనెను.

నాగేంద్రుని కాటునుండి యెట్లైన భూలక్ష్మిని తప్పింపవలయునని మంత్రులు తగిన కట్టుదిట్టములు చేసిరి. రెండు స్తంభములపై మొగ దూల మమర్చి, యా దూలమునకు బంగరుతొట్టి యూయెలను వ్రేలగట్టి, యందు రాణి నుంచిరి. స్తంభమునకు చుట్టును కావు త్రవ్వించి, కొలిమి చేసి, నూనె సిద్దులు గ్రుమ్మరించి, మంటలు పెట్టిరి. ఆ చర్యకు

"నాగమునీంద్రుని గట్టుకాడనైన
పుట్టలోనే మంటలు మండించి
పన్నెండు శిరసుల ఆదిశేషుడైన
కోపము చేత పుట్టా విడిచేను"

విడిచి భూచక్రపట్టణము చేరవచ్చి, యచటి పారాను, బందోబస్తును తిలకించి, యాగ్రహోదగ్రుఁడై మండపడెను.

"ఎంత అంతకురాలవె లక్ష్మీదేవమ్మా
నాకే నీవు యత్నం పెట్టినావా
అప్పటి మాటలు ఇప్పుడు లేవమ్మ
అయితే మంచిది కానియ్యి మనెను
అక్కడ నాగేంద్రుడు మాయమైనాడు
స్తంభాల మొదట పుట్టెను నాగన్న
భుగ భుగ భుగ మని మంటలైన లేచె
ఎంత సాహసురాలవె లక్ష్మీ దేవమ్మ
ఈ మంటలో నేను మాడిపోదునని
అట్లా నాకు యత్నం చేసెదవా

అక్కడ నాగేంద్రుడు మాయమయ్యేనయ్యా
ఏడు నిలువులా తొట్లో బుట్టేనూ"

పుట్టి, నీ వన్నమాట తప్పవద్దని లక్ష్మీదేవిని నిలువరించెను. అంత చేయునది లేక భూలక్ష్మి నాగేంద్రునకు కంఠమున కాటు నిచ్చెను. ఆమెను నాగన్న ఒడసి పట్టి గుక్కెడు నెత్తురు, బొక్కెడు కండగా కాటు పట్టి తొట్టిలో లేచి, పుట్టన బుట్టెను. ఎట్లు వచ్చెనో యట్లే పోయెను. అ విధముగా నాయన తనకై నిర్దేశింపబడిన యాహారమునుగొని, అందుకై చూపిన శక్తి యుక్తులచే జానపద చిత్తాకర్షణము చేయును. తల్లిని ఆహారముగా గొని యామె మరణమునకు కారకుడైనను, ఆ నాగేంద్రునకు ఆమె సంతతియందు మక్కువ లేకపోలేదు తన వరమున బుట్టి, తనచే నిర్దేశింపబడిన పేరు కలదగుటచే నాయనకు బాల నాగమ్మ యన్న ప్రీతి. ఆమె సంతానము బాలవద్దిరాజు, తన తల్లి చెఱవిడి పించుటకును, మాయల పకీరును హతము గావించుటకును, కంకణము గట్టి పోవుచు, నాకచో. ప్రొద్దుకుంకుటచే, మఱ్ఱి చెట్టు క్రింద కంబళి పఱచి' యీశ్వరా పరమేశ్వరా నీవే కలవనుకొని, 'సన్నపు నెల్లా' ముసుగు పెట్టుకొని, నిద్ర బోయెను వాని గాలి సోకి యా యడవి యందలి కొండ చిలువలు, పెంజఱలును కదలి రాసాగినవి. పన్నెండు శిరసులుగల యాదిశేషుడును, వానికి దక్కనిత్తునా యను పంతముతో తానే ముందు చర చర కదలి వచ్చెను. వచ్చి చిన్నవానిని కన్నుల జూచి,

"ఈ చిన్నవాని తల్లి గనకాను
మా నాగ మునీంద్రుని వరమున బుట్టేను
చిన్నవాడు నాకు మనమడు కావలెను"

అని విచక్షణాశీలియై

"పడగ యెత్తి నీడ పట్టెను
చిన్న వానికి మంచు కురవకుండ
గొడుగు సర్పం పట్టి ఉన్నదయ్యా"

పట్టి, చిన్నవాడు నిద్రలేచిన వెనుక. "నీవు పకీరు మీదికి పోతావు కాబోలు

నీ చేతిలో వానికి ''మరణము, గట్టిగ సిద్ధమయ్యినాది, మీ తల్లిని నీవు తెస్తావు బాలుడ"యని దీవించి బాలున కన్ని యానుపానులను జెప్పి పొమ్మనెను. ఆ విధముగా నొకరి మరణ కారకుఁడైన నాగేంద్రుడు మరియొకరి పట్ల యుపకారశీలియై తన యాగ్రహముతోపాటు సౌదార్యమును గూడ చాటు కొనుట యన్నది జానపద కల్పనయందు ద్వంద్వములపైగల మక్కువను చూపించుచు వారికి గల జంతు ప్రీతిని గూడ సూచించుచున్నది.

బాలనాగమ్మ కధయందలి నాగేంద్రుడు భగవత్స్వరూపుఁడై పూజలు గొనఁగా, కాటమరాజు కధయందు జానపదునిచే మిక్కిలి యగ్గింపఁబడిన ''బొల్లి యావు'' వీరత్వమునకు ప్రతీకయై మన్ననలు గొనెను దీనిని గూడ నాదివిష్ణుని యవతారముగనే జానపద కవి వర్ణించెను సిద్ధిరాజునకు యాదవులన్న నెట్టి వెఱపును లేదుగాని, యవతారమూర్తియని యావు నెన్నుటచే నది యనిన భయము. శత్రువుల గుండెలలో దిగులు పుట్టించిన యట్టి యావన్న కాటమరాజు ప్రభృతులకు మిక్కిలి గౌరవమును, భయమును. దాని కన్నియు రాజ భోగ ముగా జరుగును. దాని 'సింగార' మిట్లున్నది.

గోవు రూపంబైన గోపాలకునికి
పసిడి బిందెల నీళ్ళ పాదములు గడిగి
యావు రూపంబైన యాది విష్ణునికి
నందంబుగా వెదురాకు చందమున
తిరుమణి శ్రీచూర్ణము దిద్దిరి తోడ
నలదిరి మేనున నగరు గంధంబు
నటు పున్గు జవ్వాది యలదిరి చాల
సురయించి కస్తూరి సురటుల విసరి
గుమ గుమ వాసనల్ గుబులుకొనగాను
ఝుణ ఝుణ యనుచును చెలగుచు మ్రోగ
నాల్గు పాదంబుల నాదులందెలను
నావు శృంగారించె నైతమరాజు

మేడుగా వేసిరి మేలుగంటలను
రత్నాలు దాపిన రావిరేకలను
తళ తళ మెరయంగ ధరియింపజేసి
కొమ్మున బంగారు కుప్పెను దొడిగి
రహిమించ మెడచుట్టు రంగుగా నపుడు
గోమేధికంబుల గొలుసును వేసె
మురువైన ముత్యాల మువ్వలపేర్లు
మూపురమునకు జుట్టు మురుపు గజ్జెలును
సన్నగజ్జెలు వేసె సందు సందులకు
పాతాళ గణపతి పంతంబు దెలిసి
యావుకై దెచ్చిన యర్థణాల్ గంట
బొడ్డు గంటగ వేసె పొందుగా నపుడు"

అట్లు శృంగారించి, నివాళి పళ్లెములు బట్టి, హారతు లిచ్చి సాంబ్రాణి పొగలు వేసి, ప్రార్థించిరి.

"పరతత్త్వరూప శ్రీ హరి, బొల్లియావ!
గోపి నామముగల గోవింద మూర్తి
యోగుల బ్రోచిన యో కామధేను!
హరులకు నరులకు నాదర్శ నీవు
మాకు కేవలుడవె మరి విష్ణుడవును,
పుడమిలో జనులెల్ల పొడగని పొగడ
నరుదుగా వెలయరె దాపుగా మంద
నిరతము జూడమె నీ రూపమెల్ల–''

అని స్తుతించి,

''అల్లదె పగవాడు నాముకొన్నాడు
మనకు ఎదురు నిల్చి మార్కొనినాడు
బలు యుద్ధమును జేయ పంతంబు గెలువ,

నీవ చిక్కని చాల నెరనమ్మినాము
మాకు సహాయమై మడియించినపుడు
ఆద్యుండవని యెంతు రావు గాదనుచు
కలియుగంబున నీదు కథ నిల్పవలెను
భువి కంటకుల జంప బుధులను నిలుప
నీకు చెల్లెను గాక యెవ్వరి వశమె''
యని వేడు కొనిరి.

బొల్లి యావు యుద్ధమును మిక్కిలి విపులముగను, పరాక్రమ స్ఫోరకముగను కవి వర్ణించెను. ఆవు కోపాన మించి కొమ్ముతాతను తీడి పాదమ్ము తాటించి భూమి కోరాడగా. నేనెత్తు గడ్డలు ఎగసి శత్రుపక్షము మధ్యమునఁ బడెను. ఆ పాటునకు,

"తలలు పుచ్చెలు పగిలి తరల కాడాడ
మెదడు చిందిన యంత మేదిని పైన
పటిగిరి వజ్రీలు వసుధపై నంత"

బలగ మంతయు వానలేని పిడుగు మీదఁబడెననియు, మిన్ను విఱిగి పడెననియు, మిత్తి దగ్గరించెననియు, తలకొక విధముగా తలపోయుచుండఁగా సంధ్య గోపాలుఁడను వాఁడు,

''ఓరాజ వినుమిది యొక వింతగాదు
ఈ గడ్డ పడుటేమి వింతగాదయ్య
మన దండు మీదికి మఱి కదిలివస్తు
తామసంబున కొమ్ము ధర గ్రుచ్చి యావు
వనర జిమ్మిన గడ్డ వసుధేశ్వరుండ''
యని వివరించెను.

12)

అట్టి మహత్త్వము కలిగిన బొల్లియావు కుప్పించి దూకి మెండెమును కూలదన్ని మన్నీలపై నుఱికి, సేనల పాలిట పిడుగుపాటుగా నమరి, కొమ్మున పొడిచియు, కాళ్ళదన్నియు, నెదిరి బలమును అల్లకల్లోలము చేయసాగెను. తన వాల మునకొంత దళమును జుట్టి యెత్తి నేలపై గొట్టుటవలన, హనుమంతుని పరాక్రమ స్ఫూర్తిని విడంబించెను. అట్లు చతురంగ బలములను నుగ్గుచేసి, మన్నీలను కసి మసంగి, వీర విక్రమస్ఫూర్తి మెఱయగా, నావు విజృంభించెను. అప్పుడు రాజు సర్వదళముల వారిని సభకు పిలిపించి, యిట్లు మెల్లన బలికెను.

విచ్చుకత్తుల వార విలుమూకలార
గడిమన్నె మూకలు, కాల్బలములార
కంచుటరిగెల వార; కనుగొని నార!
పోటు కాంద్రుడుర వెంటబోయి సరిపోరి
పనిబడి చంపగ పైనమై రండి
యిబ్బడి బత్యాల నిప్పింతు మీకు
నన రాజునకు మ్రొక్కి యప్పు డిట్లనిరి
రాజ యీరే యావు రణమందు జొచ్చి
హెచ్చుగా జంపెను వేలు లక్షలును
గదలుచుండగ నావు ఘంట నాదులకు
కొండలు ధ్వనులిచ్చె కుంభిని యదర
నపుడు సమసిన మూక లంతంత గాదు
ఘంటధ్వనుల కేము కల్లుపడ్డాము
ఇబ్బడి బత్యాల నిచ్చినా వద్దు
ప్రాణాలు కలిగితే బలుసు కూరమ్మి
యిబ్బడి బత్యాల నిటు దెత్తు" మనిరి.

మఱియు నా బొల్లియావును రాజు నెదుట ప్రశంసించుచు, దాని పాద ములు నాలుగును చక్రములనియు పిల్లగిట్టలు బాణములనియు, తోక "హను

వంతు వాల'' మనియు ఒంటి కొమ్ము వజ్రాయుధమనియు, ఆ యావు నరసింహ రూపియనియు, నెన్నుచు, దాని ముఖము పద్మమనియు, కన్నులు కల్వరేకు లనియు, నది శ్రీహరి గరుడ వాహనముపలె నున్నదనియు వర్ణించిరి

అట్టి యావు స్వపక్ష రక్షణార్థమై, ప్రతికక్షులతో, "పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు సాహసంబున పోరు చందాన" పోరి, గొరిసెల మట్టి కొమ్ముల జిమ్ముచు నాకొని యలుగులు దిని, రక్తధారత్రావి, ప్రతికక్షులను తిప్పలుపెట్టి. వారితో ''వింతగా బున్నమ వెన్నెల గాయ నంతంత పిల్ల దీపులాడినట్లు''. క్రీడా మాత్రముగా సంగరకేళి నెఱపసాగెను. ఈ యుద్ధ వైభవమును తిలకించి యమ రులు ఆశ్చర్యమగ్నులు కాసాగిరి. అంత నారదుఁడు వైకుంఠ నగరము చేరి శ్రీహరిని వివిధ భంగుల స్తుతించి.

గొల్లల మందలో గోవువై పుట్టి
పల్లవ నలసిద్ధి బలములనెల్ల
అదరించి వారల నవనిపై గూర్చి
కదనంబులో వారి గర్వమణచితివి
పగలు రేయను ఒక్క పగిది పోరితివి
జగదీశ ఆ రూపు చాలించు మనుచు
పంపించు వేవేగ పసిడి రథములను' -

అని విన్నవింపఁగా, శ్రీహరి యా మాటలను మెచ్చి, ఘన విమానము లను, కనక దుందుభులు మ్రోయుచుండఁగా, కిన్నరులు పాడుచుండఁగా బొల్లి యావు కడకు పంపించెను. విష్ణుదూత లటునిటు వింజామరలతో నిలువగా సుర కాంత లక్షతలు చల్లఁగా దేవ దుందుభులు మ్రోయఁగా, కుసుమవర్షము కురియు చుండగ బొల్లియావు పసిడి విమానముపై నెక్కి విష్ణులోకమున కేగెను.

ఇట్లు కాటమరాజు పదమునందు ఆవు మానుష కార్యము లాచరించుచు తన పక్షమువారి నుద్ధరింపజూచుటయు, దానిని విష్ణునంశముగా భావించి గౌర వించుటయు కాననగును. అంతియేకాక ఈ పదమునందే మఱియొక యంశమును

గలదు గోసంగులకు మూలపురుషుడు జాంబవంతుడను విషయము 'జాంబ పురాణ' పర్యాలోచనమునందు తెల్లమయ్యెను. ఆ జాంబవంతుడే వివిధ యుగముల యందు వివిధావతారములను దాల్చుచు, కలి ప్రవేశించునాటికి, గోసంగి కులమున బీరన్నయై పుట్టెను. తండ్రి మసిలన్నయు, తల్లి మారసానమ్మయు, వీరభద్రుని తీర్థము సేవించుటకై రాగా, నాదేవుని వరమున బీరన్న పుట్టెను. శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తిన సందర్భమున నాగ్రహోదగ్రుడైన సురరాజు పిడుగులు కురిపించెను. ఆ సమయమున కృష్ణమూర్తి డాసివచ్చిన పిడుగులను డాచేతబట్టి విశ్వకర్మను తలచుకొని, యాతడు రాగా, నా పిడుగుల నుపయోగించి. గౌంగవాల్ కత్తి నొకదానిని చేయుమని చెప్పెను.

"జాంబవుడాది కులమందు
గడచి జన్మము లెల్ల, కలియుగమందు
వీరన్న వరమున బీరన్న యనగ
నాది కులమున బుట్టు, నతడు చేపట్ట
వీరభద్రుని కత్తి కీడగుచుండ
గోసంగి పేరిట గౌంగవాల్ కత్తి"

కావింపుమన్న శ్రీకృష్ణుని యాజ్ఞ ప్రకారము విశ్వకర్మ చేసిన కత్తియే బీరన్న చేతి 'గోసంగి కత్తి' యైనది అట్లే బీరన్న ఆది జాంబవుడును మాతంగ గోత్రుడును.

ఈ పదమునందే, కేవలము హరి యవతారముగా భావింపబడిన బొల్లి యావుపై ప్రశస్త భావముండుటయేగాక, యాదవుల మందలోని యావులును, ఎద్దులును గూడ వారికి యుద్ధమునందు తోడ్పడి విజయమును కలిగించుటకు శ్రమించుట చెప్పబడినది. ఇట్లు ప్రాజ్మానవుని యూహలలో ప్రముఖ స్థానమును వహించిన జంతు ప్రాశస్త్యమీ కథాగేయమునందు మనకు తీరు, తీరుల కాన్పించుచున్నది.

మఱికొన్ని పదములలో ప్రధాన కథయందు ప్రధాన పాత్ర వహించి జంతులోకము రాణింపకపోయినను, కథా గమనమునకు పట్టుగొమ్మ లనదగిన

యంశములు జంతువుల చేతను, పశుపక్ష్యాదుల చేతను నడుపఁబడుట కాననగును. సాధారణముగా నద్భుత రసాపాది యగు కథనను నందీ విధమగు జంతు ప్రాధాన్యము కానవచ్చును.

రాణి మైనావతి కథయందు, దేశాంతరగతుఁడైన భర్తను, ఒక నిర్ణీత ముహూర్తమున భార్య కడకుఁదెచ్చి వదలి యామె సంతానవతి యగుటచే పెందల పాలగుటకు, ఆమె పెంచిన చిలుకలు కారణములైనవి. బాలనాగమ్మ కథ యందు బాలవద్దిరాజు గండభేరుండ పక్షుల సహాయమున మాయల పకీరు ప్రాణ రహస్యమును కనుగొనఁజాలెను. అట్లే రాజకుమారిక ప్రాణములను కాపాడునట్టి యౌషధ క్రియకూడ జంతు సంభాషణము నుండియే తెలిసికొనఁజాలెను. శివ కుమారుని కథయందు దేవేంద్రుని పరీక్షలను కథానాయకుఁడు చీమలు, కప్పలు, పాముల సహాయమున నెగ్గఁగలిగెను. అనుముల బ్రహ్మరెడ్డి కథయందు, కథా నాయకునకు కావలసిన క్రొత్త విత్తనమును నాగలోకము నందలి నాగేంద్రుఁ డనుగ్రహించి యాశీర్వదించెను. ఇట్లు లెక్కకు మిక్కిలియైన పదములయందు జంతు సహాయముచే కథానాయకునకు మేలు కలుగుట యను నంశము మిక్కిలి విరివిగా కన్పించును.

ప్రాఙ్మానవుని ఆత్మారాధన (Animism) దశయందు జంతువుల నాశ్రయించుకొనియు. వృక్షములను, రాళ్ళను ఆశ్రయించుకొనియు, మానవ శరీరమును వదలిన యాత్మ, నాశము లేకయుండునను నమ్మకము ప్రబలినది. ఆ నమ్మకమే మెల్లగా నొకవైపు టోటమిక దశను, రూపొందించి జంతువుల యెడల గౌరవ భావమును, వంశతారక భావమును కలిగించుటకును, మఱియొక వైపున దేవతా (చెట్లను రాళ్ళను ఆశ్రయించిన గ్రామదేవతలు) భావమును కలిగించుటకును నాధారమైనది.

ఈ యాత్మ స్వరూపమును మననము చేయుచు, జానపదుఁడు తన మేధచే కల్పితమైన కథలలో నాయకునకు శరీరగతమైన యాత్మయేకాక బహిశ్చరమగు నాత్మనుగూడ కట్టిపెట్టెను. అట్టి యాత్మ బయటి ప్రపంచమునందే చెట్టునో, జంతువునో యాశ్రయించుకొని యుండవచ్చును. అట్లాశ్రయించిన జంతువునకు ప్రాణభంగము వాటిల్లినప్పుడును, చెట్టు వాడి యెండిపోయినప్పు

డును, నాయకుని యాత్మకుఁగూడ క్షతి గలిగి, యాతఁడు మరణించుట జరుగును. ఇట్టి కల్పనలు కథాగేయముల యందు కొల్లలుగా గలవు.

బాలవద్దిరాజు తల్లిని చెఱవిడిపించుకొని వచ్చుటకై పయనమయ్యెను. ఆఱుగురు తల్లులును, మాకేమి యాధారమని గోడుగోడున దుఃఖము నందిరి. అంత బాలుఁడొక నాగమల్లె వృక్షము నాటి, దానికి నీరుపోయుచు, తనకు మారుగా దానిని చూచుకొమ్మని తల్లులకు చెప్పెను. ఆ చెట్టు వాడినచో, తన కాపద కలిగినట్లును, అది యెండిపోయినచో తాను మరణించినట్లును, అది కలకల మనుచు పూపులతో శోభించినచో, తానెట్టి యపాయమును చెందక సుఖముగా నున్నట్లును భావింపుఁడని కట్టడి చేసెను. బాలుఁడు గండభేరుండపక్షి యొక్క పిల్లలను రక్షింపఁబోయి పాముకాటు నంది మూర్ఛితుఁడైన తఱి, యివట చెట్టు వసివాళ్ళు వాడెను. పక్షులు సంజీవి పుల్లను తెచ్చి బాలుని బ్రతికించిన తరుణమున తిరిగి కలకల విరిసెను. అట్లే మాయలఫకీరు ప్రాణములు చిలుక యందుండుటను గూడ నన్వయింపవచ్చును. దాని కాలికి పోగుల జత తొడుగఁగా మాయలఫకీరు కాళ్ళకు బంధములు పడెను. అది గానుగపై గిరగిర తిరుగఁగా, వీనికి తలతిరిగి నడుచుచున్నవాఁడు బోర్లపడెను. చివరకు దాని తల పెనుగులాటలో బాలుని చేతిలోనికి నూడి రాఁగా పకీరు ఊపిరాడక గిలగిల లాడి మరణించెను. మైరావణ పదమునందు మైరావణుని ప్రాణములు తుమ్మెదలో నుండుటయు నిట్టి యూహవలన కల్పింపఁబడినదే. ఇట్టి యుదాహరణముల నెన్నేని చూపింపవచ్చును.

దీనికి కొంత విభిన్నముగా మఱియొక యంశముగూడ కథా గేయముల యందుఁజొప్పింపఁబడినది. అది పరకాయప్రవేశ ప్రక్రియ, నాయకుని యాత్మ సందర్భము ననుసరించి, యేదేనొక జంతువు శరీరమునందు చొరబాఱుటయు, మఱల నవసరము వచ్చినప్పుడు స్వ శరీరగత మగుటయు నిచట ప్రయుక్తమగును.

దీనికి కొంత భిన్నముగా కథలోని ప్రముఖ పాత్రలను కథాగతి ననుసరించి వివిధ జంతువులుగా మార్చు మాంత్రిక ప్రక్రియాంశముకూడ నీ కథా కథనమునందు చోటు చేసికొన్నది.

బాలనాగమ్మ కథయందు, బాలనాగమ్మ మాయలఫకీరు చేత నల్ల కుక్కయయ్యెను. పరంజ్యోతి కథయందు బిర్దోరాజు ఆకుల పాపియింట పొట్టేలుగా మారిపోయెను. శివకుమారుని కథయందు శివకుమారుఁడు యోగిచే బల్లిగామారి గోడకు హత్తుకొని యుండెను.

ఇట్టిగాథలను పరిశీలించినచో, ననాదినుండియు, ప్రాఙ్మానవుని మస్తిష్కమున చోటుచేసుకొన్న జంతు ప్రాశస్త్యము వివిధ పద్ధతులలో కథాంశములుగా పొదుగబడి జానపద గేయగాథలయందు విశ్వరూపము వహించి యెల్లెడను కాన్పించుచుండుట తెల్లమగును.

జంతువులు వంశకర్తలుగా కలిగినవియు, జంతు ప్రాధాన్యమును, జంతువుల యెడ పూజ్యభావమును, కలిగినవియునైన గాథ లింకను మాఱుమూలల నుండి వెలికితీయుట సంభవించినచో, అనాదినుండియు ద్రావిడజాతి యందలి యనాగరక మానవ సంఘమునందు నెలకొన్న టోటమికదశయొక్క అవిర్భావాభివృద్ధులను ఇంకను నిశ్చితముగ పరిశీలించుట కనువగును. నాకు దొరికిన 'పరిమిత కథాగేయముల' యందలి కథాంశముల పరిశీలనము వలన నీ టోటమిక దశ స్వరూపము దిఙ్మాత్రముగ మాత్రమే సూచింపఁగలిగితిని. భావి పరిశోధకు లీ యంశమును చేపట్టి పారము చూడఁగలుగుదురని యాశించుచున్నాను.

—: o :—

# మాత్రారాధనాంశములు

ఒక జాతి పురాగాథల యందు (myths) ప్రస్ఫుటముగా నొక యాకృతిని దాల్చిన మానవుని తొలుదొల్లటి మత బీజములన్నియు జానపద గేయ గాథలలో స్పష్టాస్పష్టముగ కాన్పించుచునే యుండును. మరణమువలన ప్రాఙ్మానవుని యందాత్మారాధన (animism) ముద్భవించి, మెల్లగా నట్టి యాత్మనుండి మనుష్య రూపమునకు ప్రతి రూపకల్పనను సంతరించుకొన్న దేవతా భావన రూపు దాల్చినది. మనుష్యులను పీడించు ప్రేతాత్మల నుండి రక్షణకై ఆ మనుష్యుడే భగవద్రూపమును కల్పించుకొని, తనకు సంరక్షకునిగా నిలువఁబెట్టుకొనెను. ఇట్టి భగవద్రూప కల్పనమునందు మొదటి కల్పన 'తల్లి దేవత'. (Mother goddess)

మాత్రారాధన మనుష్యునకు ప్రాక్ చారిత్రక యుగమునందే లభించినది. ఆదిమ మానవ సంబంధియగు మాతృ దేవతా కల్పనము యొక్క సూచనలు అతి ప్రాచీన కాలమునకుఁజెందిన త్రవ్వకములలో లభించినవి. తూర్పు మధ్యధరా ప్రాంతమునకుఁ జెందిన నాగరికతలో దక్షిణ ఉత్తర దేశములయందు ఈ యారాధ నాంశములు తమ ముద్ర నతి ప్రాచీన కాలముననే వైచినట్లు పురాతత్త్వవేత్తలు నిర్ణయించిరి. ఈజిప్ట్ దేశీయుల 'ఐసిస్', రోమనుల 'సిరిన్', గ్రీకుల 'డెమెటర్', మొదలగు తల్లి దేవతలకు మధ్యధరా సంస్కృతి యందలి మాతృ దేవతయే మాతృకయని నిశ్చయింపఁబడినది. ఈ మెను, ఉదార రూపిణి యగు విస్తృత భూమాతగా గుర్తించి గ్రీసులు 'గియా' యనియు, రోమనులు 'తెల్లస్' అనియు పిలుచుకొనిరి. ఈ విశ్వమాతయే ఆమె యందుఁగల స్త్రీత్వ పరిగణనము వలన, దేవనాథుఁడగు జూయస్ మాతయగు నెబెల్ గను, జూపిటర్ తల్లి Ops గను భావింపఁబడినది. కాలము గడచిన కొలది యీ విశ్వమాతృభావన

సంకోచము చెంది, కేవల దేవతగా తీర్చిదిద్దబడినది[1]. ఈ విధముగా తూర్పు మధ్యధరా ప్రాంతమునకు, జెందిన విశ్వజనని భావన, దగ్గఱి దేశముల సంస్కృతి యందు నెలకొనుటకు అనువైనది. మెసపొటేమియా, ఇరాన్, ఇరాక్ మొదలగు దేశములయ దాదికాలమున రూపునందిన సంస్కృతి యొక్క ఛాయలు, మొహంజొదారో, హరప్పా త్రవ్వకములలో బయలుపడిన ద్రావిడ సంస్కృతి యొక్క లక్షణములతో పోలుచున్నవని కొందరి సిద్ధాంతము. కొందఱు, ఇది వైదికార్య సంస్కృతికి మాతృకయని భావించుటయు కలదు. కాని యిటీవల హిందూ పత్రికలో ప్రకటింపఁబడిన యొక వార్త ఈ సంస్కృతిని ద్రావిడ సంస్కృతిగా నిర్ధారించుచున్నది. ఒక జట్టు ఫిన్నిష్ శాస్త్రజ్ఞులు, కోపెన్ హాగన్ నుండి ప్రకటించిన సమాచారము వలన, సింధులోయ నాగరకత ద్రావిడులకు సంబంధించినదే యని స్పష్టము చేయఁబడినది.[1 A] ఇంతవఱకును నవిదితములుగా నున్న కొన్ని ముద్రికల (seals) యందలి లిపిని తాము చదువఁగలిగితి మనియు తన్మూలమున నీ సంస్కృతి ద్రావిడ సంస్కృతి యనియు, నిందలి కొన్ని యాచారములు ప్రాచీన ద్రావిడ సంఘమునందలి వర్ణవ్యవస్థను ప్రస్ఫుటము చేయునవిగా నున్నవనియు, వారు ప్రకటించిరి. ఏది యేమైనను ఆ నాఁటి సింధు లోయలో ప్రకటితమైన ద్రావిడ సంస్కృతికిని ఈజిప్ట్,సుమేరు, క్రేట్, బాబిలన్, హిట్టైట్ తెగల సంస్కృతికిని దగ్గరి పోలికలు కలవు. ద్రావిడులు, క్రీ.పూ. 4000 సంవత్సరములనుండి 2500 సంవత్సరముల వఱకు భారతదేశమునకు, పైనుండి, తడలు తడలుగా వచ్చియుందురని మఱియొక సిద్ధాంతము. మాతృభావన వీరి మత పరిణామ క్రమమునందు, ఆనాటికే రూపుగొని యున్నవనుటకు మొహంజొదారో, హరప్పా త్రవ్వకములలో కాన్పించిన కొన్ని ఫలకములు కారణములు[2] ఇచట కాన్పించిన స్త్రీ ప్రతిమలను మతాచార సూచకములుగా, చిహ్నములు (Cult Objects) గా, మార్షల్ వివరించెను.[2 A]

---

1. The Great Mother evolved through the centuries into the Totemic Mother, the Mother of God"—
Dictionary of Folklore, Mythology & Legend.

1.A: The Hindu-Feb 26–1969.

2. D. H. Gordon - The prehis'oric Background of Indian Culture. P 45 -Ed. 1960

2.A. Sir John Marshall-Indus Valley Civilization.

ప్రాచీన వ్యవసాయ ప్రధాన జాతులు కావున సఫలత (Fertility) యను నంశముపై వారికి ప్రీతి యెక్కువ. అట్టి యంశమును పొందించు కొన్నట్లుగా తాము నమ్మిన అధిమానవ శక్తుల నారాధించుటయే వారి కిష్టము. ఆబోతును, లింగమును, సృజన శక్తికి ప్రతీకలు. అట్లే స్త్రీయును. కావుననే లింగములు, ఎద్దులు, తలపై నెద్దు కొమ్ములు జోడించిన దైవములు, గర్భమునుండి చిగుళ్లు వెలికివచ్చుచున్న స్త్రీ రూపములు హరప్పా మొహంజదారో ఫలకములలో కానవైనవి.

ఇట్టి మాతారాధనము వేద ఋక్కుల యందు కానరాదు. ఆర్యులు యుద్ధోపజీవులు. వారిది అశ్వములు, రథములు వినియోగింప నేర్చిన జాతి. వీరారాధించెడి దేవతలకు భూమి మీది వివిధ వస్తువుల తోడఁగాక, ప్రకృతిలోని మౌలిక వస్తువులతో సంబంధమెక్కువ. వరుణుఁడు, ఇంద్రుఁడు, పృథ్వి, ఆకాశము, వాయువు, త్వష్టి, మరుత్తులు మొదలగు వారి దేవతలందఱు నట్టివారే. కావున ఆర్యమతము యొక్క ప్రాథమిక దశలో దుర్గ, పార్వతి, చండి, భైరవి యను నామాంతరములు గలిగిన మాతృశక్తి యొక్క యునికి కానరాదు. ఇట్టి మాతృశక్తి, అనార్యదైవమైన శివుని యర్ధాంగముగా గుర్తింపఁబడినది. ఈమెను ఆర్యదైవముల కోవలోనికి చేర్చి, యార్యానార్య మత సమైక్యమును పురాణములు సాధించినవి. అట్లే తంత్ర శాస్త్రము సాధించినది.

ప్రాచీన సంస్కృత సాహిత్యమున స్థిరత గన్న దేవియొక్క ఉమా, అంబికా నామములు ద్రావిడుల 'అమ్మ' శబ్దమునకు మాఱు రూపములు. ఈ మాతృదేవతయే వీరతావైభవము మూర్తిగొన్న దుర్గగా పలువిధముల మార్కండేయ పురాణమునందలి దుర్గా సప్తశతియందు స్తుతింపఁబడినది. ఈ యమ పేర దేవీ భాగవతము, దేవీ పురాణము, వంటి పురాణస్థాయికి చెందిన గ్రంథము లుద్భవించి యీమెకు ఆర్య దేవతల కోవలో స్థానము లభించినది. అనంత నామ రూపములలో నొప్పారెడి జానపదుని గ్రామ దేవతలందఱును, శంకర పత్నియగు దుర్గాదేవి యంశముగా గ్రహింపఁబడి యొక స్థాయిని పొందుట జరిగెను.

అవైదికములని చెప్పఁదగిన అసుర, వ్రాత్య, వృషల, ప్రాచ్య, దస్యు, శూద్ర, యక్ష, నాగాది [illegible]

విశ్వాసములు వైదిక మార్గమున కంటె విభిన్నములు. కాని యీ పద్ధతులను నిరసింపలేని వైదిక మతానుయాయులు, పరిష్కార మార్గముగా, తాంత్రిక పూజా విధానము నామోదించి తమ మత విధానమునకు దానిని గూడ నంగ ముగాఁ జేసికొనిరి. అంతేకాక, అవైదికములైన జానపదులకు సంబంధించిన, జాతి యొక్క పురాగాథలను (Myths), మతపరములగు నమ్మకములను, ఆచారములను, బ్రాహ్మణ మతము తనలో జీర్ణించుకొనుటకే సంకల్పించినది. కావుననే యీ బ్రాహ్మణ మతమున నతివేగముగా పురాణ రచనము సాగి యనేకానేక జానపద గాథాంశములు వానియందిమిడి పోవుట సంభవించినది. అందువలన సృష్టియందలి ప్రకృతి శక్తులనే పూజించెడి వైదిక మతమునందు సగుణారాధనయు, భగవద్రూపకల్పనయు, జరుగుట కవకాశము లభించినది.

తాంత్రిక పూజయందు ప్రముఖాంగముగా నెగడిన దేవీ పూజయు, జానపదుల మాతృదేవతారాధనమును, పోలికలు గలిగిన ప్రక్రియలు. తాంత్రికుల దేవి, కాళి ,జగద్ధాత్రి, చండి, భైరవి, భద్రకాళి మొదలగు నామములతో విరాజిల్లు చుండును. స్త్రీ దేవతా పూజన మిట పరమోత్కృష్టమైనదిగాఁ జెప్పఁబడెను.[3]

అందును మిక్కిలి గణుతి కెక్కినది కుమారీ పూజ పదునాఱేండ్లలోపు కుమారీ గణమును పూజింపనిదే యే దేవతా పూజనమును పరిపూర్ణము కాదని తాంత్రికుల నియమము. ఇట్లు పూజింపఁబడు కుమారీ గణమునకు కులాచార ప్రతిబంధములు లేవు[4] కుమారి సర్వ దేవతా సమన్వయ రూపము. అమెను

3. స్త్రియో దేవాః స్త్రియః ప్రాణాః స్త్రియశ్చైవ విభూషణమ్ — స్త్రీ ద్వేషోనైవ కర్తవ్యో విశేషాత్ పూజనం మహత్ - స్త్రీ మయశ్చ జగత్ సర్వం తదాత్మానంచ భావయేత్.— కృష్ణానందుని తంత్ర సారము - కులాచార ఖండము.

4. దేవీ బుద్ధ్యా మహాభక్తస్తస్మాత్తాం పరిపూజయేత్
సర్వవిద్యా స్వరూపా హి కుమారీ నాత్ర సంశయః
తస్మాత్తాం పూజయేద్ బాలాం సర్వజాతి సముద్భవాం
జాతిభేదో న కర్తవ్యం కుమారీ పూజనే శివే.
రామతోషణ విద్యాలంకారుని ప్రాణతోషిణి.

పూజించుటవలన నన్ని దోషములును పరిహరింపఁబడి సాధకునకు సకల శుభములును కలుగును. కుమారిని నైవేద్యముచే సంతృప్తి నందించినవాఁడు మూఁడు లోకములను తృప్తి నందించిన వాఁడగును

తాంత్రికుల శక్తి స్వరూపము నవగతము చేసికొన్నచో జానపదుల మాతృశక్తికిని ఆమెకును గల సన్నిహితత్వము గుర్తించుటకు వీలగును.

'ఛిన్నమస్త' వీరర్చించు దేవీ గణములో నొక్కతె ఆమె యొక్క ఛేదింపఁబడిన శిరమామె చేతియందే యుండును. ముండ గళిత రక్తధారలు ఆ శిరస్సు నోటియందే యవిరళముగ జారుచుండును. 'ఉచ్ఛిష్ట చండాలిని', శవాసనస్థయై, స్మశాన స్థితయై, యఖాద్య వస్తు ఖాదనము చేయుచుండును. ఒక చేతి యందు ఖడ్గమును మఱొక చేతియందు కపాలమును ధరించిన యీామె మిక్కిలి భయంకరురాలు 'ధూమావతి', జీర్ణ వసనధారిణియు, తగవులమారియు, చేతులయందు చేటను చీపిరిని ధరించినదియు, వాయస రథము నెక్కి చరించు నదియునై, శత్రునిరాసనము చేయుచుండును. కర్ణపిశాచినీ దేవత, కాలరూపి, మఱుగుజ్జ, కుండోదరి, అరుణ జిహ్వాక, మఱియు కరాళవదన. ఈయమ రెండు చేతుల యందును ఆయుధము లుండును. వీరి దేవీ శ్రేణి యందు ప్రథమ స్థానము వహించునది కాళిక.

కాళికోత్పత్తిని గూర్చి పురాణములు[5] పేర్కొనుచున్నవి. పరాశక్తియొక్క కోప ఘూర్ణిత భ్రూమధ్యము నుండి కాళిక యుత్పన్నమయ్యెను. భయంకర వచనయు, ఖడ్గ పాశాంకుశ ధారిణియు, వ్యాఘ్ర చర్మాంబర ధారియు, మానవ కపాల హార భూషితయునైన యీామెను జగములు తేరిపాఱ జూడ లేవయ్యెను. ఆమె కన్ను లరుణారుణములు. కరాళ జిహ్వా అటునిటు నూగుచుండెను. ఆమె చేసిన భయదారావము దిక్కటాహముల నిండిపోయెను.-ఇంత భయదాయిని యగు నీ కాళిని, సుందరిగను శాంతగను విష్ణు ధర్మోత్తర ఖండము ప్రశంసించినది. మహాకాళి, భద్రకాళి రూప వర్ణనము భవిష్య పురాణమునందును, దేవీ పురాణమునందును చేయఁబడెను.

---

5. మార్కండేయ పురాణము—దేవీ మాహాత్మ్య ఖండము.

తాంత్రికుల 'గుహ్యాకాళిక' నాగ యజ్ఞోపవీతయు, నాగాభరణయునై భాసించును నాగాసనయైన యీ దేవికిని నాగములకును విడరాని బంధము కలదు. ఆమె తలపైన సహస్ర ఫణములను విప్పి, సర్పరాజు నీడ పట్టుచుండును. అన్ని వైపులను ఫణి ఫణములచే నామె విరాజిల్లు చున్నట్లు చిత్రింపఁబడి యుండును. తక్షకుఁడామె వామహస్త కంకణము కాఁగా ననంతుడామె సవ్యహస్తము నాశ్రయించి యుండును. ఆమె యెడమ వైపున శివుఁడు శిశుప్రాయుఁడై చిత్రింపఁబడి యుండును.

'భద్రకాళి' అనవరత క్షుద్బాధా పీడిత. అమె కనులు నిస్పత్తువచే వ్రాలి యుండును. ముఖము నల్లనై భయము గొలుపు చుండఁగా, దంతములు జంబూ ఫలములవలె నల్లని సౌరు గలిగి యుండును. ఆమె యెప్పుడును, కాతర స్వరమున రుదిత యగుచు "నాకు తృప్తిలేదు. ఈ ప్రపంచము నొక్క కబళము చేసి మ్రింగి వైచెదనని యఱచు చుండును.

'స్మశాన కాళి' భయదయు, శీర్ణ కుంతలయు, ఆసవ భరిత కపాల ధారిణియు, నవిరళ మాంస ఖాదన తత్పరయునై, స్మశానములయందు నెలకొని యుండును.

తాంత్రికుల దేవీ రూపకల్పన మిట్లున్నది.

హిందూ దేశ మెల్లెడల గ్రామ గ్రామమునను నెలకొనిన జానపదుల మాతృదేవతా (Mother Goddess) లక్షణముల నీ క్రింది విధముగా క్రోడీకరింపవచ్చును.

1. ఈ యమ భయంకర స్వరూపిణి. చతుర్భుజిగా చిత్రింపఁబడిన యీ యమ శూల, కపాల, గదా ఖడ్గ హస్త. లంబ జిహ్వాక యగు నీమె వికట దంతయు విస్ఫారిత నేత్రయు, కరాళ వదనయునై, భయమును గలిగించు చుండును.

2. ఈమెకు బలి జంతు మాంసఖాదనమున, రక్త పానమున, ఆసవ సేవనమున, ప్రీతి మెండు.

3. మానవుఁడీమెను భక్త్యావేశము కన్న భయ విపశత తోడనే కొలువ బూనును

4. తన్ను మఱచిన జనులను కష్టముల పాల్జేయుటయు, రోగముల బారిఁ బడ చేయుటయు నీమెకు ప్రీతి.

5 పాలిత జనముపై నీమెకు సంతానబుద్ధి యుండుటచే నీమె జగద్ధాత్రి.[6]

6. భక్తుల కోరికపై నీమె గ్రామములను పరిరక్షించును చెలరేగిన యంటు వ్యాధుల నదుపునఁబెట్టును. పశువులను, జనులను, పీడనుండి. గ్రహ బాధ నుండి, శత్రువులనుండి కాపాడును. ఊరి పొలిమేఱల రక్షించును, పంట పొలములను, చెఱువు కట్టలను రక్షించును.[7]

7. ఊరియందు వేపచెట్ల క్రిందను, త్రాచు పుట్టల యందును, నెలకొని యుండును. కేవలము నాగ రూపమున నీమె జానపదులచే నర్చింపఁ బడుటయు కలదు.

ఈ లక్షణములన్నియు నార్య దేవతా లక్షణముల కంటెను విరుద్ధములును తాంత్రిక దేవీలక్షణములతో పోలికలు కలవియు నగు చున్నవి. తాంత్రికత యందలి మదిరాపాన ప్రాముఖ్యము, జానపదుల మాతృ దేవతా రాధన వలన సంక్రమించినదే. దేవ్యారాధనా సమయమున నంతులేని యుత్సాహమును, మైకమును, పొందుటకై తాంత్రికులు సురాపానము నాశ్రయింతురు.[8] దానినే దేవీ ప్రసాద

---

6. G. D. Boaz - The Terrible Mother - J. Madras University-July 1944 - Pp 64, 69.

7. H. White Head-The Village Gods of South India.

8. Taylor - Primitive Culture Vol. 11.

ముగా భావించి దేవి కుపహారముగా నిర్ణయించు పద్ధతియు జానపములదే - ఈ దేవి కిచ్చు బలులును, లింగ వివక్షను సూచించుచు, జరుపు నాచారములును జానపములవే. బాణుఁడు తంౖత్రాచారముల నగ్గడించుచు, నరబలిని, రక్తతర్పణమును పేర్కొనెను. నాగరక జన మానసములకు జుగుప్సాభయ హేతువులగు నీయాచారములు పామరజన ౖప్రయుక్తములని యగ్గడించెను చండీ దేవత యాలయమున బల్యాదికములను నిర్వర్తించు పూజారి ముదుసలి ౖద్రావిడుఁడని వివరించెను[9].

ౖప్రాచీన సాహిత్యమున నీ విధముగా స్పృశింపఁబడిన యంశములను పరిశీలింపఁగా శక్తి పూజయు, తదంగములగు బల్యాదికములును, ననార్య సంౖప్రదాయములని స్పష్టమగుచున్నది ౖద్రావిడులలో నొకనాఁడు పటిష్ఠముగ నుండిన మాతృ ౖప్రాధాన్య సంఘముల వలననో, బిడ్డల మన స్తత్త్వముల ననుసరించి, వారి జీవన విధానమున చెఱగని విధముగా ముౖద్రింపఁబడిన మాతృ భావ ౖప్రాముఖ్యము వలననో, యీ మాౖతారాధనా పద్ధతి వారి మత పరిణామ దశయందు స్థిరతఁ బూనినది. అది నాగరకత యెంత పెరిగినను, అధ్యాత్మిక జ్ఞాన మెంత విస్తృతమైనను, జానపద జన జీవితమున ౖగామ దేవతా రూపమున క్షితిలేని స్థానమును పొంది నిలచిపోయినది. ఒక మతము యొక్క నూతన పరిణామము నందే, ౖప్రాచీన మత విధాన సూచకములగు నాచారములను జేరి, యీ రెండు మార్గములకును సమన్వయ స్వరూప మేర్పడుట యెప్పటి కప్పుడు మనము గమనింప వచ్చును. జీవునకును, దేవునకు భేదము లేదను విషయమునందు నమ్మకము గల యద్వైతి, ౖప్రాచీన మతాచార చిహ్నములైన శకునములయందు ౖప్రత్యయము కలిగిన వాఁడుగా నుండవచ్చును; ఇంట నెవ్వరికేని మశూచికము సోకినచో ౖగామదేవత కుపాహారము పంపించు నాచారమును కలిగిన వాఁడుగా నుండ వచ్చును. ఇట్టిపట్టుల నాగరక మత లక్షణములపై నెప్పుడును ౖప్రాచీన మత పద్ధతి యధికారము నెఱపుటయు, వానితో సమన్వయ స్వరూపము సాధించుటయు జరుగుచుండును_ కావుననే వేదములయందలి అదితి, వాగ్దేవతలును శ్రీ

---

9. బాణభట్టు - కాదంబరి.

సూక్తములలోని శ్రీయు లక్ష్మియు, వాజసనేయ సంహితయందలి అంబిక, తైత్తిరీయ, శతపథ బ్రాహ్మణములలోని ఉమ, దుర్గ కాళికలు, ముండకోపనిషత్తునందలి సప్త మాతృకలు, గృహ్య సూత్రాదుల యందలి సినీవాలి పురంధి, వాశిని, భవాని, భద్రకాళి, దుర్గలు, జానపద గ్రామ దేవతలగు, పోశమ్మ, ఈదెమ్మ, మైసమ్మ, ఎల్లమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ, పెద్దమ్మ మొదలగు వారినుండియు, స్ఫూర్తిగైకొని, యేక సమాహారముగా నేర్పడి పురాణకాలమున లక్ష్మి దుర్గా, సరస్వతీ రూపమున, త్ర్యంబికా స్వరూపముగా పూజలందుకొనుట జరిగెను.

జానపద మాతృ దేవతలను పరిశీలించినయెడల, ఒక్కొక్క దేవత ఒక్కొక్క ప్రదేశమునకో, కులమునకో సంబంధించినదై వెలసి, తదుపరి ప్రాచుర్యము నంది దేశము నలుమూలలనుండి యేతెంచెడి వ్యక్తులచే పూజింపఁబడుట కాన్పించును. బెజవాడ కనకదుర్గ, శ్రీశైల భ్రమరాంబ, కొల్హాపుర లక్ష్మి, మాహురమ్మ, మొదలగు శక్తులు ఆయా స్థలముల యందు నెలకొన్న మాతృదేవతలు. మారమ్మ, ఎల్లమ్మ, మాహురమ్మ యని పిలువఁబడు రేణుక మాదిగవారి కులదైవము కాఁగా, గంగ, గొల్లవారి దేవత. ఈదెమ్మ గౌండ్ల వారి దేవత. గ్రామ దేవతలలో కొందఱు దేవతలకు పౌరోహిత్యము నెఱపు హక్కు చాకలి వారికిని, మంగలి వారికిని గలదు. ఈ విధముగా నీ గ్రామ దేవతాంశ మనార్యాంశముగా స్పష్టమై ప్రాచీన మానవుని మత పరిణామ క్రమము నందు సుస్థిర స్థానమును బొందియున్నది.

ఆత్మారాధన (Animism) దశలో చెట్లులను, పుట్టలను ఆశ్రయించిన ట్లూహింపఁబడిన, మరణించిన వారి ఆత్మలే, దైవారాధన దశలో దేవతలై (గ్రామదేవతలు) అట్టి చెట్లులను (వేపచెట్లు, రావిచెట్లు) పుట్టలను (పోశమ్మ, ఎల్లమ్మలకు నిలయములైన పాప పుట్టలు) నాశ్రయించుకొని తమతో పాటా నిర్జీవ వస్తువులను గూడ గౌరవ భాజనములు చేసినవి.

గ్రామ గ్రామమున, ఊరి బయటను (మైసమ్మ) ఊరిమధ్యను (ఎల్లమ్మ, పోశమ్మ) వెలసిన గ్రామ దేవతల యొక్కయు, అంటువ్యాధులు చెలరేగి గ్రామము నుఱ్ఱూత లూగించునపుడు దైవాగ్రహ విశేషముగా తలంచి గ్రామస్థులు కల్పించుకొని పూజించెడి (మారెమ్మ, ముత్యాలమ్మ, పోలేరమ్మ) దేవతల యొక్కయు, త్యాగ సాహసముల చేతనో, వీరౌదార్యముల చేతనో, మానుషమైన దేహమును త్యజించి పల్లె ప్రజలలో దైవ ప్రతి రూపములుగా నిలచిపోయిన పేరంటాండ్ర యొక్కయు (కామమ్మ, లక్ష్మమ్మ) కథలు పల్లెపట్టులయందు కోకొల్లలుగా దొరుకును. ప్రతి కథయు గ్రామవాసియైన జనునకు మిక్కిలి పరిచితమై వాని రక్తమున జీర్ణించుకొని, సముచిత గౌరవ సమాదరణములను పొంది వెలుఁగుచుండును. ఏ పల్లె మనుష్యునైన కదిపి యా కథలు చెప్పు మన్నచో, వాఁడు చెప్పెడి తీరునందు వాని హృద్గత భక్తి గౌరవములు వెల్లి విరియుచుండును. ఇట్టి కథలు ప్రతి జాతి యందును ప్రతి దేశము నందును కలవనుట కాయా ప్రాంతముల జానపద గాథలే ప్రత్యక్ష ప్రమాణములు. ఇట్టి గాథలును, పూజా విధానమును కొన్ని వేల సంవత్సరములనుండి వైదికమతము కంటె భిన్నముగను ప్రత్యేకముగను రూపొందిన దనుటలో విప్రతి పత్తిలేదు.

తెలుగు దేశమునకు చెందిన జానపద కథాగీతములలో 'జాంబ పురాణము'న దేవీ ప్రాశస్త్యమును, సృష్టికి ఆ శక్తియొక్క మూల కర్తృత్వమును వర్ణింపఁబడినది. ఆసాదీలు, లేక పంబలవారు ఈ కథను చెప్పుదురు. వీరినే చిందుల వారనియు నందురు. ఇందలి శక్తి కథ యిట్లున్నది.

"సట్టెడు సముద్రాల నట్టనడుమ
సత్తికి వరసత్తి బుట్టెను
కోడి గేరినట్లు గేరెను.
నెమలి పొద్దినట్లు పొద్దెను
తొలుగుడ్డు మలిగుడ్డు బెట్టెను
ముగ్గురు మూర్తులు బుట్టిరి
అప్పుడు బ్రహ్మ ఎట్లు పుట్టిండు

మొదటి గుడ్డు తెల్లగ పత్తి వర్ణము
పాలమీగడ తీరు బ్రహ్మపుట్టిండు
అమావాసనాడు రాత్రిరి యెట్లున్నదో
ఆ విధమున నున్న నీలి దేహముతోను విష్ణు బుట్టెను.
ఇష్ణు బుట్టిన గుడ్డుల సూర్య చంద్రాదులు బుట్టిరి
ఆతలి గుడ్డుల ఈశ్వరుడు బుట్టెను
ఎట్లా అంటె పున్నమనాటి చంద్రునివోలె
గోపి చంద్రం ఎట్లనో ఆ విధమున ఈశ్వరుదు బుట్టెను
ఆదిశక్తి అప్పుడు ఈ ముగ్గురు మూర్తులను జూచెను.
చూచి అప్పుడు ఎవ్వరు మగవారు అగుపడలేదు
అగుపడ నందున ఈ శక్తి అమ్మవారు
ఈ ముగ్గురిని జూచి, గుడ్లు నా బిడ్డలు
గుడ్లల్ల బుట్టిన కందులు నా మన్మలు
వీరితో రతి చేస్తనని విచారించెను
అప్పుడు బ్రహ్మ యేమన్నడు, ఓ తల్లి, శక్తి, అమ్మవారు
ముందుకు కల్లా కలియుగం నడిచే పంతమున్నది
ముందు కన్నతల్లుల పట్టుకునె దినమొస్తది అని పలికెను
ఆ శక్తి ఆగ్రమై మండిపడెను
ఆ శక్తి నెదుట చిత్రకన్ను ఉండెను
చేతుల గంట గద శూలం ఉండెను
ఈపున ఝంజామణి అరచేతిన దామరకమలం
ఇవి పెట్టుకోని మూడు మంత్ర యోగము లుండెను
ఆ మూడు మంత్రయోగముల జప్పున జదివి బ్రహ్మను గొట్టెను
బ్రహ్మ అప్పుడు తీరిపోయెను."

విష్ణువును తీరిపోయెను. శివుడు మాత్రము

"ఓ తల్లి ఓ శక్తి అమ్మవారా
నీవు కోరిన కోరిక నేను ఇవ్వగలను
నేను కోరిన కోరిక నీవు ఇవ్వగలవా"
"ఓ యీశ్వరా ఏమికోరినావో కోరుమా యిచ్చెదా" - యనెను.

అప్పుడు ఈశ్వరుఁడు
"ఓ తల్లి శక్తి నీ నొష్టనున్న చిౖత్రకన్ను
నా నొష్ట బెట్టుమనెను.
అమ్మవారు 'తననొష్ట చిౖత్రకన్ను' దీసి యీశ్వరుని నొష్టబెట్టెను
"ఓ తల్లిశక్తి అమ్మవారా! నీ చేతులో ఘంట, గద, శూలము, నాచేతి
కివ్వుమనెను

అపుడు శక్తి అమ్మవారు, గదా శూలము ఈశ్వరుని కిచ్చెను
"మూడు మంౖత్రయోగములు ఈశ్వరుని నాభియందు వేసెను"
"ఎయ్యగనె" ఈశ్వరుఁడు ధైర్యముతో నిలబడెను
నిలబడి యేమంటున్నాఁడు, ఓ అమ్మవారా గుడ్లుబెట్టి
అంటుతో నున్నావు గంగకు ఉరికి తానముచేసి వచ్చినట్లైతే
నీతో రతి చేయగలను ఆ శక్తి అమ్మవారు
గంగకు పోగా ఈశ్వరుడు యోగమున ౖబహ్మను
ఇష్ణును లేపుకొనెను అపుడు శక్తి అమ్మవారు తానం
జేసి కొండ్ల వచ్చునట్లుగా ఉరికి వస్తుంది ఉరికి వచ్చిన
శక్తిని ఈశ్వరుడు బాగా సూసి మంౖత్రయోగముచే ఓం
చదివి శక్తిని గొట్టెను అప్పుడు అడ్డం ఆరు మూళ్లు
పొడుగు, పొడుగు 12 తాళ్లు పొడుగు కొండ బడినట్లు బడి
తీరిపోయెను, తీరిపోగనె యిష్ణు ఈశ్వరుడు ౖబహ్మ ముగ్గురు
ఏమనంటున్నారు సుతులు బుట్టిందే గతుల కొఱకు మన

తల్లి శక్తి వచ్చింది మనము కాష్టం జేమాం అని
గంధం చెక్కలు దెప్పించి కాష్టము జేయించి ముగ్గురు మూర్తులు
మూడు దిక్కుల గూర్చుండిరి కాష్టము కాలి కూలగనే మన తల్లి
ఆదిశక్తి మనలను బుట్టించెను తల్లి సంపాదించిన
భాగ్యమున్నది బూడిదె మనము పంచుకుందాము అని
యీ ముగ్గురు మూర్తులు దాన్ని నాలుగు కుప్పలు చేసిరి
చేసి ఈశ్వరుడు ఇష్ణుమూర్తిచే నీళ్లు దెప్పించెను. బ్రహ్మతో
పోయించెను ఈశ్వరుడు 'ఓ' చదివెను ఆ నాలుగు బూడిదె
కుప్పల్ల నీళ్ళు పొయ్యంగనె అప్పుడు అండ్ల ఏమి బుట్టె అంటే
బ్రహ్మకు భార్య సరస్వతి ఇష్ణుమూర్తికి భార్య లక్ష్మి
ఈశ్వరునికి భార్య పార్వతి బుట్టిరి ఇంకొక కుప్పల, ముందుకు

కల్లా కలియుగం నడవ దైతుంది అందుకు ఓంకార శక్తి అనేది పుట్టెను.
ప్రాశ్నికుడు — ఓం కార శక్తి అనగా ఎవరు

జాంబవంతుడు — ఓంకార శక్తి అంటె అప్పుడు ఒక్కటే శక్తియేగాని
దునియా మీద పోశమ్మ మహంకాలమ్మ దుర్గమ్మ
అని ఆరం చాలక మారుపేర్లు పెట్టుకొని ఉన్నాది"

ఈ కథయొక్క స్వరూపమిట్లు కాకపోయినను, పరాశక్తియగు జగన్మాత లోక సృజన చేయనెంచి మూడు గ్రుడ్లను పెట్టెననియు, అందొక దానినుండి లక్ష్మి బ్రహ్మలును, మరియొక దాని నుండి శివసరస్వతులును, ఇంకొక దాని నుండి విష్ణు పార్వతులును నుద్భవించిరనియు, వీరేకోదరు లగుట వలన, మొదటి జంట యొక్క దేహకాంతి హరిద్రావర్ణమును, రెండవ జంట గౌరవర్ణమును, మూడవ జంట నైల్యమును కలిగిన వయ్యెనని, సంప్రదాయ సాహిత్యమున కలదు.

బళ్ళారి ప్రాంతమునకు చెందిన మాల పూజారులు (అసాదీలు) దేవీ మహాత్మ్యమును, సృష్టికి ఆమెయొక్క మూల కర్తృత్వమును కొనియాడుచు,

నొక కథా గేయమును పచరింతురు. అందలి కథ యిట్లున్నది. సృష్టికి మూల కారకురాలైన పరాశక్తి మూఁడు గ్రుడ్లు పెట్టెను. అందు రెండు మఱిగిపోగా నొకదానినుండి త్రిమూర్తులుద్భవించిరి వారామె పాలుత్రాగి పెరిగిరి. ఆమె వారిని పెంచి పెద్దచేసి 'పట్నములు' కట్టి యిచ్చెను శివుని పట్టణము దేవగిరి. అవిధేయులైన పుత్రులు పెద్దవారై తల్లిని పూజించుట మానివేసిరి. అమ్మవారు పండ్రెండు శిరసుల నాగుబాముగా మారి, దేవగిరిని చుట్టివైచెను. లోపలి త్రిమూర్తు లోడిపోవఁగా నామె వారి శిరస్సులను ఖండించి, తిరిగి యతికించి, వినయులను, సజీవులను చేసి బుద్ధి చెప్పెను.

మఱియొక కథయందు, రేణుక గిరిరాజు కూతురు. ఈమె తల్లి జమిలికా పార్వతి. రాజునకు రాక్షసులతో యుద్ధము సంభవించి యాతఁడు జయాపజయము తెలియఁగక పోరు చుండెను. నారదుఁడు రాజునకు, రేణుక సేనా నాయకత్వము వహించినచో యుద్ధమున జయమగునని యుక్తి చెప్పెను కాని రాజట్లు చేయు టకు సంకోచము చెంది, తానే రాక్షసులకు చాలలేక యుద్ధమున నోడి గుహలలో దాగుకొనెను. ఈ విషయము గ్రహించిన రేణుక తపశ్చర్య నెఱపుచున్న తన భర్తయగు జమదగ్ని యనుజ్ఞ వేడి యుద్ధము చేయ సంకల్పించుకొని, భర్తకడకు పయనము కట్టెను. భర్తకై కుండలలో నీరుచు బియ్యమును కలిపి యేడు కుండ లొకదానిపై నొకటి యుంచుకొని, తలపై పెట్టుకొని యేగుచుండఁగా నామె శీలగాఢత వలన కుండలలోని బియ్యము కుతకుత యుడుక సాగెను. నారదుఁడును, విష్ణువును, ఆమె శక్తి యుక్తులు గ్రహింపఁగోరి బిచ్చగాండ్ర రూపమున వచ్చి యన్నమడిగిరి. ఆమె పెట్టెను. తపశ్చర్య నెఱపుచున్న జమదగ్ని, తనకై యుద్దేశింపఁ బడిన యాహారము నామె యెంగిలి చేయించెనని భావించి, యాగ్రహావిష్టుఁడై తల్లిశిరము ఖండింపుమని పరశురామున కాజ్ఞయిచ్చెను. పరశురాముఁ డట్లు చేసి, మాతృవధ చేసిన తనచేతిని నఱకుకొనెను. రేణుక తల నాగు బాము పడగ యాయెను. పరశురాముని చేయి పుట్టగొడుగై "యుప్పలి మైసమ్మ" యని జానపదులచే పూజ లందసాగెను. తదుపరి పునర్జీవితయై రేణుక భర్తను యుద్ధము చేయుట కనుజ్ఞ యిమ్మనగా జమదగ్ని హేళన చేయసాగెను. ఆమె ఒకసారి భర్తను వెనుదిరుగు మనెను. అతఁడు తిరిగి ఒక నిముషము తరువాత మఱలిచూడఁగా, నామె శక్తి రూపమున కాన్పించెను. సహస్ర బాహుల

తోఁగూడిన ఆమె ప్రతి హస్తమునందును, ఒక్కొక్క శూలముండెను. ప్రతి శూలను చివఱను లెక్కకు మిక్కిలి జంతువులు సిక్కెత్తబడి యుండెను. ప్రతి శరీరము ప్రక్కను నొక్కొక్క శక్తి చేత కొఱవిని, ఖడ్గమును, ధరించి యుండెను. ఇట్టి విజృంభిత వీరాకారమును గని జమదగ్ని భయ కంపితుఁడై పాతాళ లోకమున కేగి దాగబోయెను. రేణుక వాని చేలాంచలమును పట్టి యాపి నిజరూపమును ధరించి, భర్తృ వాక్యము ననుసరించి రాక్షస హననమున కుపక్రమించెను. కాని ఒక్కొక రాక్షసుని చంపునపుడెల్ల వాని రక్త బిందువునుండి 6000 మంది రాక్షసు లుద్భవింప సాగిరి.[10] అపుడామె తన సహోదరుఁడగు పోతురాజును బిలిచి, నాలుక చాపి రక్తము క్రింద పడనీయకుండ పట్టుమని యాజ్ఞయిచ్చి, రాక్షస సంహారము చేసి విజయిని యయ్యెను. ఈ విధముగా దేవి విజయ కథనము 'రేణుక యుద్ధ' మను జానపద కథాగేయము నందు వర్ణింపబడినది.

దేవీ ప్రాశస్త్యమును వర్ణించు మఱియొక కథ 'అంకమ్మ కథ' దీనినిగూడ పంబల వారే చెప్పుదురు. "శిలానదిలో మొదలు లేని వృక్షమున కాధారము లేని కొమ్మ, ఆ కొమ్మకు త్రాడు లేని యూయెల. ఆఊయల యందు అంకమ్మదేవత యూగుచుండగా, తినుటకు తిండిలేక గర్భదరిద్రులై నవయుచున్న 'మా రాచ వార'ను తొమ్మిది మంది యన్నదమ్ము లామెను గుర్తించి కొలువసాగిరి. ఆమెను బ్రతిమిలాడి పిల్లలు పుట్టినచో నీ పేరు పెట్టుకొందుమని, తమ రాచగిరి కోటకు తీసికొని పోయిరి. అచట పాలవెల్లి చవిక కట్టించి, రత్నాల గద్దెపై ముత్యాల ముగ్గు పెట్టించి, అమ్మవారిని ప్రతిష్ఠించిరి." దాని వలన వారి దారిద్ర్యము తొలగి పట్టినది బంగారగుట యందలి కథ. ఇదే కథ అంకాళమ్మ కథ యను పేర ఒంగోలు తాలుకాలో ప్రచారములో నున్నది.

మఱియొక కథ మాత పురాణము. ఈ కథకు నాయిక 'మాత' యని పిలువబడెడి మాహరమ్మ. ఈమెయే రేణుకయు నెల్లమ్మయు. ఈమెనే 'అక్కలిదేవి' యనుటయు కాననగును. ఇందలి కథ యందంతర్నిహితముగ నొక్క చరిత్రాంశ మున్నట్లు కానంబడును. ఇది భువనగిరి తాలూకాలో నొక బవనీని (బైండ్ల)

10. దేవీ భాగవతము నందలి రక్త బీజుని వృత్తాంతము తోడ పోలిక.

వ్రాతపుస్తకములో దొరికిన కథ. దీనిని బైండ్లవారే చెప్పుదురు. ఇది ఇష్టదేవతా స్తుతితో ప్రారంభింపఁబడినది.

గద్దరి జగమాత కమలాక్షి జంత
వినుతి కెక్కిన యట్టి వీర సేవ్యులకు
మదము లణంగించి మర్దించినట్టి
కథ విన్నవించెద క్రమమెల్ల దెలియ" యని యీ కథ సాగును.

దీనిని జెప్పినవాఁడు బడబాగ్ని రామచంద్రుఁడు. కథాస్థానము ఓరుగల్లు. ప్రతి వీరుఁడు ఓరుగల్లు నేలు వీరప్రతాపరుద్రుఁడు వీర ప్రతాపుని పుట్టుకకు ముందు ఓరుగల్లు నేలెడి కాకతిరాజగు రాయ భల్లాణు (?) నకు తనయు లేగురు. ఆరవ సారి పట్టమహిషి గర్భవతియై, యెనిమిది నెలలు నిండిన వెనుక గర్భము నందలి పిండము,

"మానవుని గర్భాన మలినంబు తోడ
హీనమై పుట్టుట ఇది యెంత ఘనత
యనుచు బాలుఁడు తన యాత్మ నూహించి
తుదమాట గుమ్మడి తోటలో నయిన
పుట్టెదనని వేడ్క పురహరుని దలచి
ఆవేళ బాలుండు హరుని మాయలను
భూవర సుతు దపుడు పుట్నిల్లు వెడలి
పదపడి గుమ్మడి పంటిలో దాగె
నవమాసములు వెళ్ళ నరరుద్రుడయ్యె"

నరరుద్రుఁడున్న పండు తొడిమబుచ్చి యుండుటచే 'చేటు లేని తోటకు చేటు బుట్టు'నని దలచి తోట కాపరులు పండును పదిలముగ ద్రెంచి పారవైచిరి. అంత నొక్క విప్రసతి యా పండును గొనిపోయి కరకరన దరిగి యందు నరరుద్రుని గన్గొనెను. ప్రేమతో నానిని బెంచు కొనుచుండఁగా, కాకతిరాజునకు 'ఆయువలు' తగ్గి రాచపుండు బుట్టెను. ఆయన యప్పగింతలు పెట్టుచు తన తనయు లేగురిలో తగిన వానిని జూచి పట్టము కట్టుడని చెప్పి మరణించెను. మంత్రులకు నిర్ణయము కుదురక, పట్టపేనుగను శృంగారించి తగినరాజు నా యేవురిలో నెన్నుకొమ్మని

వదలఁగా నది బ్రాహ్మణ వీధులయందు బొంగరము లాడుకొనుచున్న బాలుని మెడలో పుష్పహారము వైచి తొండముతో వాని నెత్తి మూపున నుంచుకొని రాజాసనస్థు కావించెను. అందుకు కోపించి రాజు పుత్రులును, సామంతులును, బాలుని వధించుటకై చుట్టి రాఁగా,

హెచ్చరికతో బలికె నా రాజసుతుడు
మతిగల జనులను మంత్రుల బిలిచి
ఘన మేది పెద్దల ఘన విప్రవరుల
ధరణీశ్వరుడు క్షణమె దాయంగ బిలిచి
ధరయేలు రాజుకు తనయుండ ననెను
తామస గుణముల మీకు తమ్ముండ నౌదు
నేమంబుతోడ మీకు నిజము చెప్పేను
భక్తవత్సలు పూజ పరగంగజేసి
పరగ గుమ్మడి కాయ జన్మించి నోడ
తన తండ్రి గండాన తరుణి గర్భమున
నిండార జన్మించి నిముషమున వచ్చి
మంచి గుమ్మడి పంట పుట్టిన వాడ
నాడెమై కలిగిన నర రుద్ర హరుడ
కడిమి మెరసిన ఘనుడ వీరశైవుండ"

అని తన్ను తా నెఱింగించు కొనెను. తల్లి పద్మాక్షీ దేవియు తాను ఎనిమిది నెలలు గర్భమును మోయుటయు, నాపైన నది మాయమగు టెఱిగి యెవ్వరి తోడుత నెఱింగింప బోక రవ్వ చేయక యుండుటయును జెప్పి, తన పుత్రులతో "మీదు భాగ్యంబున మీ సహోదరుఁడు, కాకతన జనించె గౌరవ సుతుడు" అని చెప్పి, వానికి పట్టము కట్టించెను. ఈ కథయందలి వీరభల్లాణుఁడు కాకతికుల భూషణుఁ డగు ప్రతాపరుద్రునకు తండ్రి యనుట జానపదోక్తి. కాకతీయులకును గుమ్మడి పండునకును సంబంధము కల్పింపఁ బడిన యీ జానపద కథాంశమే యని తల్లి కలువ చేరు శాసనమున స్ఫురింపఁబడినది [11]

---

11. కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండ వల్లికా కాచిత్పుత్ర మసూత తదేత జ్ఞాత మనఘమ్ కాకతీయ సంజ్ఞ మభూత్.

అట్టి నరరుద్రుఁడు వీరశైవుఁడై, శివపారమ్యము దప్ప మరియే దేవతల యునికిని మహత్త్వము నంగీకరింపని వీరావేశము కలవాఁడై యుండగా మంత్రు లందఱును వానిని మందలించి, దేవీ మహత్త్వమును తెలియఁజేయుచు నిట్లు కథ చెప్పఁదొడఁగిరి.

"వినవయ్య ఓ రాజ వీర రుద్రుండ
బాలరాజువు గాగ పలికితివి గాని
యీలాగు దూషణలు ఏల అడితివి
సకల బ్రహ్మాండములు సకల వేదములు
అకలంకముగ బుట్టు ఆ క్రమంబెల్ల
తెలియక నీ విట్లు తిమిరి పలికితివి
కొలదిగ బ్రహ్మాండ కోట్లు గావించె
తగ నిజంబై నట్టి తత్త్వ స్వరూపి
యుగములుగ సాకెను జగదీశ వినుము
బ్రహ్మాండ నాయక, పతియైన వరుడ
బ్రహ్మకులాత్మయో పరమాత్మ రాజ
పృధివి యాత్మలు మున్ను, పుట్టని నాడు
సుందరంబుగ ముఖ్య సూర్య చంద్రులును
అవతరించని నాడు ఆదిమహాశక్తి
హృదయంబు లోపల ఉత్పాతమైన
మది నహంకారమున మనసు రహించె
జీవిగానక మేటి జలరాశిపైన
పొదుగగ్గిన యొక పక్షి రూపమున
ఉదకంబుపై ప్రాలి యుత్పత్తిగాను
హృదయ కమలంబున నెలమి నూహించె
రతిగల్గి సట్లాయె రమణి హృదయమున
అతి వేగమున మూడు అండముల గనియె

తామర పద్మముల దాకొని యుండె
తెక్క చాటున తానె రేయును బగలు
మక్కువతో పొదిగె మాయా వినోది
పెక్కు యుగంబులు పేర్మితో గడిపె
ఒక కొన్ని యుగములు వనరంగ గడిపె
అంతలో నొక యండ మవిసిన జూచి
పరికించి బాలుణ్ణి బ్రహ్మయని బిలచె
అజుడు బుట్టిన యట్టి అండంబు జూచి
అజుని పేరిట బ్రహ్మాండంబు నిలిపె
బ్రహ్మతో ననియె నా బ్రహ్మాండ జనని
బ్రహ్మదేవుడ నీవు భర్తవూ నాకు
పురుష వాంఛన కొఱకు బుట్టించినాను
సరగున తన కోర్కె సమకూర్చు మనిన"

వెనకటి కథయందువలెనే బ్రహ్మ, కన్న తల్లివి నీవిట్లు కోరుట పాడి గాద" నెను. అంత నాదేవి కోపదృక్కులతో వానిని జూచి, మూర్ఛితుని జేసెను. తదుపరి కొన్ని యుగములు పొదుగఁగా నున్నతాకారుఁడొక యండము నుండి యుద్భవించి యా 'యేకవీర'చే విష్ణువను నామమును పొందెను. అతఁడు పుట్టిన గ్రుడ్డు యొక్క రెండు డిప్పలను సూర్య చంద్రులను చేసి యాదేవి ఆకసమున నిలిపెను. విష్ణుని "నీవు నా పురుషుడౌ. నిజము తోడుతను, కావలెనని నిన్ను కల్పించినాను క్షణము లోపల నాకు సంతోషముగను కోర్కె రహించి నా కోర్కెలు దీర్చు" మనఁగా, నాతఁడు

మక్కువ మము గన్న తల్లివి నీవు
ఆధారమైనట్టి అమ్మవు నీవు
బాధించి నిన్ను నే పొందగా వెఱతు'

నని నిరాకరించి యాయమ యాగ్రహ దృక్కులకు లోనై మూర్ఛిల్లెను. మూఁడవ గ్రుడ్డును పొదిగి యందుండి శంకరుఁడు జనించిన వెనుక నా గ్రుడ్డును

మెదిపి పొడి చేసి పైకి విరజిమ్మఁగా నక్షత్రము లుద్భవించెను. శివుని గూడ వెనుకటి వారిని కోరినట్లే కోరఁగా,

చెప్పినా నీ మాట చేసెదనమ్మ
ఎనిమిది హస్తాల ఏకాంగివమ్మ
ఒక వాలు హస్తాన ఒక త్రిశూలంబు
ప్రాకటంబుగ వెండి పైడి జందెంబు
కమలాక్షి నీ చేతి కమండలంబు
క్రమ మొప్ప వేదములు కనకాంబరములు
సంజీవి మొదలైన సకల విద్యలును
కొమరొప్ప నీ చేతి కోదండ మొకటి
భుజమున భూషణములు భోగ భాగ్యములు
నిజముగా ముఖాన్న నిండు తేజంబు
ఇమ్మని పల్కిన"

నా దేవి యిచ్చెను. అంత శివుఁడు తనకు క్రొత్తగా లభించిన శక్తి విశేషముచే నా దేవిని మూర్ఛితను చేసి పడవైచెను మునుపు మూర్ఛితులైన బ్రహ్మ విష్ణువులకు తెలివి దెప్పించెను. బ్రహ్మను బిలిచి, "నీవు పెద్ద వాఁడవు ఈమె యందు నీకు రావలసిన పాలు గైకొను" మనఁగా 'శిరము' నా భాగమని యాతఁడనెను. ఆ శిరమే భారతియై బ్రహ్మ వాక్కున నిలచెను. విష్ణువు వక్షము నా భాగమనగా, నా వక్ష స్థలము లక్ష్మియై విష్ణు వక్షమున జేరెను. అంగమే నా భాగమని శివుడు పార్వతిని పొంది వామాంగము నిచ్చెను. తరువాత ముగురు మూర్తులును మంత్రోదకములు చల్లగా పరాశక్తి దిగ్గన లేచి సర్వ సృష్టికిని మూలకర్త్రియై చరాచర జగత్తును సృజించెను. సృజియించి అమ్మ వారు తనరూపముడిగి కృత యుగమున క్షితియేలు రాజులకు శత్రువై, రేణుక యను పేర రిపులను ద్రుంచఁగా జనించెను. ఆమె పట్టణము భూలోకమున మాహూరి పురము. నాలుగు బాహులును, ఫాలాక్షమును గల యామె అక్కలి దేవమ్మ యనియు, మాత యనియు పిలువఁబడును. తన పట్టణమున బంగారు బొమ్మయై యుయ్యాల లూగు చుండును. ఆ శక్తి పట్టణము బంగారు కోటలును,

ఇత్తడి కోటలును, ఇనప, ఉక్కు కోటలును కలిగి, చుట్టు కందకములు గలిగి, దిట్టముగా నుండును. ఆమెను సేవింప సిద్ధగణములును, నిర్జరులును నాపురి చుట్టును తిరుగుచుందురు కోటకు, భైరవుండును, దుర్గయు, వీరభద్రుండును, తమ్ముడు పోతురాజును నాలుగు వైపుల కాపుండి రక్షించు చుందురు." ఈ విధముగా మంత్రులు దేవీ ప్రాశస్త్యమును వర్ణించి చెప్పగా, నర రుద్రుండు మండి పడి, "ఆడదైవాన్ని ఆస్థానమందు రాణింప జేసేవ"ని తూలనాడి, యా రేణుకా శక్తి పరుసను చెడగొట్టుటకై కదలిపోయి యుత్సవ మెల్ల చెఱచి, జమిడికెలు తునియగొట్టి, వాద్యములు, సంభ్రమములు, కట్టు కుంచెలు, పల్లికెలు, ముద్రగడలు, అన్నియు చెల్లచెదరు జేసి వెడలి పోయెను. ఈ సంగతి కోల కాండ్రెరింగింపగా నాగ్రహావిష్టయైన రేణుక,

"బహుళమై శీమకుర్తి పట్టణంబు తూర్పు
పుడమి అరుంధతి పుట్టిల్లు మరియు
మహిమతో ఉన్నాది మాతంగవాడ
ఆదియుగముల నాడు ఆ వాడలోన
వేదంబులకు ముందు వెలసిన వేము
యాపవృక్షము క్రింద ముద్ద రూపమున
అక్షయముగా మణులు అమరిన గద్దె
పచ్చల గద్దె మీద పరమాత్మురాలు
మచ్చికతో ఉన్నాది మచ్చల మాత"

యని చెప్పి కోలకానిని తన చెల్లెలిని బిలుచుకు రమ్మనెను. ఆమె రాగా, నామె సాయమున, "నరరుద్రుని రాజ్యము నాధి వ్యాధులకు లోనుజేసి రాజును రోగ పీడితుం జేసి, వాని యహంకార మణచివైచెను. రాజు, దేవియొక్క మహత్తును గుర్తెఱిగి తాను బంగారు జమిడికెను ధరించి బవనీండయ్యెను. రాజు భార్య జేగంట చేపట్టి వాయించెను. అతని పుత్రు లేగురును దేవియెదుట కోలకాండ్రయిరి. కూతు లందఱును పల్లికలు చేతంబట్టి, బొట్లు వన్నె చీరలు గట్టి మాతంగులైరి, రాజు మిక్కిలి భక్తితో,

''ఓ లోక పావని ఓ జగదాంబ
ఓ యాది మాశక్తి ఓ పరంజ్యోతి
ధారుణికి నీవె ఆధారంబు తల్లి
అండపిండ బ్రహ్మాండమ్ము నీవె
లక్షించి బ్రహ్మాండమంతయు నీవె
మతములు నీవె సమ్మతములు నీవె
సురలెల్ల నీవె మర్మములు నీవె
వ్రతులెల్ల నీవె శ్రీ వ్రతులల్ల నీవె
నీ యందు బుట్టెను నిఖిలలోకములు
ముగురు మూర్తుల గన్న మోహిని నీవె
రక్షించు రక్షించు ఓ లోకమాత

అని వేడఁగా నా మాహూరమ్మ,

అవునోయి రుద్రుడ అతి భక్తుడావు
నీవంటి రాజేడి నిఖిల లోకముల
మాతను గొల్చితివి మహ సంతోషమాయె
ఇల కీర్తి బొందుమీ విశ్వంబులోన
చెలగి మంగళ మహాశ్రీ జేయుచుండు''

నని, దీవించి కథను శుభాంతము చేసెను.

ఇందలి కథకును, జాంబపురాణ మందలి దేవీ మహత్త్వ సూచకమగు కథకును నొక్క భేదము కాన్పించుచున్నది. మాత్రారాధన యను నంశము స్థాపించుటకై సకల దేవతా ప్రపంచమును సృజించిన మాతృరూపమును కొని యాడుట జాంబపురాణ మందలి కథయందుఁ గానవచ్చును. ఇచట మాతృదేవత లకు సంబంధించినదైనా తమ్మొప్పరికించిన భక్తులను కష్టముల పాలుజేసి వారిని లొంగదీయుట, యను లక్షణము స్పష్టముగాఁ గాన్పించుచున్నది. రాజును లొంగఁ దీయుటకై యూరియం దంటు వ్యాధులను చెలరేగునట్లు చేయుట, రాజును రోగ పీడితుని జేసి కదలలేని వానిగా రూపొందించుట, యీ గ్రామదేవతలకు రోగము

లపైఁ గల యధికారము 'సుదాహరణ పూర్వకముగా స్పష్టము చేయుచున్నది. ఇట్టి మాతృ ప్రాధాన్య మత బీజములే వైదిక మతమునందలి స్త్రీ భావన యందు బలము నూని, త్రిమూర్త్యాత్మకమగు దైవీ రూపమునందు పరిణమించి, తదుపరి విజృంభించిన శాక్తేయమున నొక నిశ్చిత రూపము నందినవి. ఈ కథలయందు, దేవికిని, త్రిమూర్తులకును మధ్య కలిగిన ఘర్షణ, గ్రామ దేవతా రూపమున నున్న జానపదుని దేవీ భావనకును, సంస్కృతి నందిన నాగరకుని త్రిమూర్త్యాత్మక భావనకును మధ్య కలిగెడి ఘర్షణ యనియు, దేవికిని వీరరుద్రునకును మధ్య కలిగిన ఘర్షణ, జానపదుని దేవీ భావనకును, వీరశైవ ప్రతిపాదనమునకును మధ్య కలిగిన ఘర్షణ యనియు వివరించుకొనవచ్చును. వైదిక జానపదముల మధ్య కలిగిన ఘర్షణ శైవ జానపదముల మధ్య కలిగిన ఘర్షణ కంటె ప్రాచీనము. వీరశైవ సంబంధియగు కథాంశముండుటను బట్టి మాత పురాణమును 12 వ శతాబ్ది తరువాత వెలసిన కథయని నిర్ధారించుటకు వీలున్నది. గాని, జాంబ పురాణము నందలి యంశమును బట్టి దాని కాలమునట్లు నిర్ణయించుటకు సాధ్యము కాదు.

దేవీ ప్రాశస్త్యమును చెప్పు మఱియొక కథ ఈదెమ్మ కథ. ఇది నల్లగొండ జిల్లా రేగట్టి యందు తాళపత్ర గ్రంథ రూపమున లభించినది.

ఇందును కథానాయకత్వము దేవిదే. ప్రతి వీరుఁడు మాంధాత. ఇతఁడును మాతపురాణము నందలి బాలరుద్రుని వలె నయోనిజుఁడు. మాంధాత అయోనిజత్వము పురాణముల యందును ఉగ్గడింపఁబడినది. మంత్ర పూత జలము త్రావఁగా పురుషుఁడు గర్భవంతుఁడయ్యె ననుట జానపద కల్పన యనుటయే సత్యమునకు దగ్గఱి విషయము. పురూరవ 'ఐయ్యప్రదే'ల కథయు, నలదమయంతుల కథయు కొంత కొంత ఇందు గాన్పించును. మాంధాత స్త్రీ గర్భమున జనింపనివాఁడు. సూర్యునికి మ్రొక్కని వాఁడును చుక్క బొట్టు పెట్టనివాఁడును. పారెడి నీటిలో ముఖమార్జనము చేయని వాఁడు. అతఁడు తన పరాక్రమోద్ధతిని చాటుకొనుటకై సూర్య చంద్రుల మీదికిని, ఇంద్రుని మీదికిని, యుద్ధమున కేగెను. మీకు పోరువలదని యీశ్వరుఁడు కల్పించుకొని, భక్తుని శౌర్య స్ఫూర్తికి మెచ్చి, యతని శాంతుని గావించి, వెనుకకు పంపెను. రాజు బలోద్ధతుఁడై యుండగా,

"మంత్రులు ఏమనిరి మాంధాత తోను

సతుల గర్భములందు పుట్టిరి రాజులు
పురుష గర్భము చీరి పుట్టిన వాఁడ
సరిరారు నీతోను సమరంబు నందు
ఇటు విను మాంధాత జనపాల తిలక
కడలేని విధి మహా ఘన మందు రయ్యా
ఉత్తర కాంభోజి ఉజిణి వీరమహంకాళి
శివాదేవి శామంతి కుందనపు శిత్రాళి
(పట్నాన ఉన్నాది)
అనంత కాలాల నాటి అకాల విధి యనే శక్తి
ఉసికె తత్వము ఆవల ఉమ్మ తత్వములు
ఉమ్మ తత్వం ఆవల కోతం
నిప్పుల సముద్రం నీళ్ల సముద్రం
పాల సముద్రమని యేటి భాగీరధియు
కచ్చ కోరింద అల్లుదామర
కలె మెలిగి యున్నాది కానరాకుండ
మనసు గిరి కొండలు మహ మేరవలు దాటి
ఐదాకుల మర్రి కింద ఏడాకుల దోత్రాసం బరచుకోని
కొందరి రాజుల శిరసుల తెగబార నరికినాది
లేదన్న రాజుల లేమిడి చేస్తున్నాది
తూర్పున సుల్తాన్లు పడమట ఖిల్లాండ్లు
ఆ ధీర్లు గాంభీర్లు ముఖా మూడు ఖండాల రాజుల
కంటిలో పుట్టే నెరుసు నన్నాది
ఎన్నున పుట్టే గాలం నన్నాది
పక్కల బుట్టే రణాసూరి నన్నాది.
అటువంటి ఘన శక్తి వత్తి లేక తైలం లేక అఖండ వీర
జ్యోతై ఏనూరు కోట్ల భూమండలం ఎలుగుతున్నాది

కొలిచిన రాజులకు కొంగున బంగార మిస్తాది
కొలవని రాజుల బట్టి కోర్లకు దార్పన జేస్తున్నాది.

ఈ మాటలు విని రాజు 'ఆగ్రుడై' మండి

"రై మంత్రి శేఖర రాజ ప్రధాని
సభలోన ఆడదాన్ని సాటి దెచ్చితివి.
సవుకుల వేయింతు, సై సుమనె, దాన్ని
అడుపదాని కాల దాన్ని గట్టించి
వీధిలో వేగింతు ఇల కంపటిల్ల
కుమ్మ ద్రొక్కించి తల కోట బెట్టింతు
కొమ్ము ఏనుగు కాల గట్టి కొట్టింతు
ఆడ దైవము తొత్తు అది యనగ నెంత
విధి వెరబొమ్మను జేయించి ఏనుగ
కాల కట్టి కొట్టింపగ అమ్మవారికి
యారగోలంత దెబ్బ యీపున దేలె – అందుకు

ఉత్తర కాంభోజి ఉజిని వీర మహంకాళి శక్తి ఉలికిపడి లేచి, పక పక నవ్వి పండ్లుకొరికి,

"ఓరోరి మాంధాత ఓడక నువ్వు
కావరంబున నన్ను కానక నీవు
కంటికి మదమెక్కె కావరంతోటి
వెంటబడి రాజ్యంబు లేక తొలిగింతు
పంట విషములు బట్టి పద్మాక్షి విధియు
మన్నీల నురుమాడి మాంధాత నిపుడు
పనిబడి మాంసంబు పట్టి తరిగింతు
భద్రేశి ఆయుధాలు పట్టిన చేతుల
కొడవలి బట్టించి కూలి చేయింతు

చెట్టికి సతి నిలచి చెడి యట బోగ
మట్టి ఉసికాలోన మట్టుదు వీని

అని ప్రతిన బట్టి, రాజుతో "మూడు వుత్తరాలు మాట్లాడి వత్తునో" యని యమ్మవారు 'పంచమా రూపులు' ధరియించెను.

" వలుపల కొన్ని కోకలు గట్టెను
దాపల కొన్ని కోకలు గట్టెను
కట్టెను అమ్మవారు కత్తుల వడ్డాణం
తొడిగెను అమ్మవారు తొమ్మిది గొలుసుల దంతావళి రవికె
వేసెను బంగారి పుష్పాల దండ
నెత్తిన నోరు పెడతల కన్నులు
నడి నెత్తిన కుంభజడ
ఈపున జవనం
రొమ్మున రొమ్ము చిప్పలు
నెష్ట చిత్రకన్ను అరికాల దామర పద్మం
వలపట స్త్రీరూపు దాపట పురుష రూపు
ఒక చౌన కొమ్ముకమ్మ ఒక చౌన లక్కాకు
ఒక చేత దంతపు గాజు
ఒక కాల పరములేని గొడుగు మెట్టి
కాళ్లకు గజ్జెలు కశింద రుమాల
కొప్పులో కొమరమిశి మల్లెలు
నిప్పుల వార ముసుగు
అటుగాక నాల్గు అస్త్రాల శక్తి
నాల్గు అస్త్రాల్లో నాల్గు ఆయుధాలు బట్టె
నందుల వీరము పిడి వజ్ర దండాయుధం

సింహ తలాటం రాయారంపం శిరసుల
గండ గావు క త్తెర

ఒక చేత పటు బల్లెం బట్టెను. దగ్గు దిగ్గున మార్గాన రాజున్న కొలువుకు వచ్చెను" ఈ వర్ణన యందు దేవి యొక్క కలహ శీలము, క్రోధ పరీత మానసము, దానికి ఆలంబనమగు సముచితాకార వర్ణనము కాన్పించుచు తంత్ర శాస్త్రము నందు వర్ణింపఁబడిన భయంకర దేవీ వర్ణనముల పోలిక కాన్పించును

రాజామెను 'గద్దరించి,'
"పోవె బహురాం
ఆడదానివి నీవు అసురవు నీవు
నీ అరచేతికి పండ్లు వచ్చిన్నాటికి కరచేవు గాని
నా పట్నం బయలు వెళ్లు" మనెను-

ఆడిన పంత మీడేర్చుటకై విధి బ్రాహ్మణ వేషమున వచ్చి రాజుతో జూదమాడి వాని రాజ్యమును గ్రహించి పత్నీపుత్ర సమేతముగా వానిని ఊరువెడల నడచును. అరణ్యము నందు రాజష్టకష్టములు పడును. రాజును భార్యయు కూలి చేయుదురు. రాజు భార్య సౌందర్యమున కాసపడి, సెట్టి యొకఁడు ఆమెను చెఱచబోఁగా, నామె దగ్గరనున్న పెద్ద పెట్టెలో దూరి తలుపు వైచుకొని పతి హస్త స్పర్శమున గాని యది విడరాదని యాజ్ఞలు పెట్టి యందుండి పోవును. భార్యా వియోగ భారమున క్రుంగుచు రాజు, తన యిరువురు పుత్రులను గొని యేరు దాటచుండఁగా నొకఁడద్దరిని, మఱియొక డిద్దరిని మిగిలి, రాజు మధ్యయేటిలో నిసుకలో కూరుకొనిపోయి జలసమాధి పొందును. అట్లు చిక్కుకు పోయిన రాజు సకరుణముగా నెలుగెత్తి

"బాపు ఈశ్వర యంటి, ప్రత్యక్షమైనట్టి
మా యొక్క భక్తిని మరిచితి వీవు
స్వామి నీ పాదనూ శంభుడా, నిలువు
నేను నిను దలచినా నిటుయొక్క వస్తి

పూని యిచ్చట మాకు పుట్టగత చెప్పు
ఓ కాలకంఠుడా ఓ కాలమూర్తి
ఓ పరమేశ్వరా జగదేకవీర
ఓ విశ్వనాథుడా ఓ వీరభద్ర
ఓ నంది వాహనా ఓ ప్రమధనాధ" యని వేడుకొనెను.

ఆ రీతి వేడిన, నీశ్వరుఁడు వెల్లనంది నెక్కి ప్రత్యక్షమాయెను విధి గూడ నచటికి వచ్చి మాంధాతను మెచ్చి, యాతనిని తొంటి యట్లు భోగభాగ్యము లందుమనియు, భార్యాపుత్రుల పొందుమనియు, నయోధ్యారాజ్యము నేలుమనియు దీవించి చనెను. ఇట్లు కథయంతయు శుభాంతముగా ముగియుచున్నది. ఇట, దేవి శంకరుని యాదేశమునకు తలయొగ్గుటయు, రాజు శివుని వేఁడఁగా నాతని కష్టములు తొలఁగి పోవుటయు వీరశైవ ప్రాబల్యమున, జేరిన యంశములు. మాత్రారాధన యుచ్ఛ స్థితిలో నుండఁగా దానిని అణచి శివ పారమ్యమును నిరూపించుటకై వీర శైవులు కల్పించుకున్న గాథలలో నొకటిగా నీ కథ నుదాహరింపవచ్చును.

శ్రీ దోణప్పగారు సేకరించి యిచ్చిన యిదే కథ 'మాంధాత కథ' యను పేర ఒంగోలు ప్రాంతమున ప్రచారములో నున్నదట. వారి కథ కాద్యంతములు లేక మధ్య కొన్ని కమ్మలు మాత్రమే యుండి. తైపారు వేయుటకు వీలులేక యున్నను ఆంధ్ర దేశ మందంతటను ఈ కథ యల్లుకొని యున్నదని దీనివలన చెప్ప వీలగుచున్నది.

మఱియొక కథ మాహురమ్మ కథ. ఇదియు తెలంగాణమునందలిదే. ఇందు మాహురమ్మయను నామాంతరము గల రేణుక పుట్టుక వర్ణింపబడినది. కాని కథ యసంపూర్తి యగుటచే నిందలి కథాంశము యొక్క తీరు తెన్నులను స్పష్టముగా చెప్పుటకు వీలు లేకున్నది.

ఇందలి రాజు, రాయకుంభిణి, రక్త కుంభిణి, గజ కుంభిణి, కలిగి అయిదు గిరులనేలెడి గిరిరాజు. ఈయన భార్య గౌతముని చెల్లెలగు జమిలికా పార్వతి. ఆమెకు పుత్ర సంతానమేగాని 'ఆడ సంతానము' లేదు. అందున

సతి పతి యిద్దరును 'ఆడ సంతానము' కొరకు నోమరాని నోములు నోమిరి. పట్టరాని వ్రతములు పట్టిరి. పచ్చని వృక్షాఁను పత్రిగా నోమిరి. నిండు బిందెలు నీరాళ్ల నోమిరి. వీరి శ్రమను పరికించుచున్న ఆదిమహాశక్తి యగు నమ్మవారు ఒక పక్షి రూపము వహించి భోగాపతికి వచ్చెను. అచటి సంపదను శృంగారమును జూచి, చెదపురుగులుగా మారి పట్టణమంతయు వ్యాపించెను.

"కోటకొమ్ము సందున కోటి యాల శిడె పురుగులు
అకాకు సందున అరవయి కోట్ల శిడె పురుగులు
రెబ్బ రెబ్బ సందున డెబ్బయి కోట్ల శిడె పురుగులు
ఏరు పెల్లగించి చూస్తె ఎనభై కోట్ల శిడె పురుగులు
రేపు చూసిన పువులు మాపు లేవాయె
మాపు జూసిన పువులు రేపు లేవాయె"—

తోట పాలకులు ఈ వృత్తాంత మంతయు రాజునకు విన్నవించగా రాజు వచ్చి చూచెను. దేవి అవతార మహిమ వలన రాజు కంటి కామె మేఘమునందు తొలకరి మెఱపు మెఱసినట్లు కాన్పించెను. ఇంతలో, గరుడ పక్షియై తెల్ల జమ్మి వృక్షము మీద 'జమ్మాకు పాన్పు' చేసికొని యీ పరమకల్యాణి పవళించి యుండెను. ప్రధానులతో రాజు ఆమెను పట్టి తెమ్మనఁగా,

ప్రధానులు, "సల్వ సల్లడాలు దొడిగి, దట్టీలు గట్టి, జానడేసి సుర్వ కటార్లు వరలు దూసి, వీర గంధములు పూసుకొని, తెల్ల జమ్మి వృక్షానికి నిచ్చెనలు వేసి "యెక్కఁ దొడఁగిరి. అంతలో 'అమ్మవారు ఆదిమహాశక్తి' వేగముగా, వేయి జిహ్వలు గలిగిన ఆదిశేషుని యవతారమెత్తి బంగారు ప్రతిమయై నాగుల పుట్టలోఁ జొరఁబడి పోయెను. ఇది యేమనఁగా "పన్నెండు కోమల పసిడి నాగుల పుట్ట'లో బాల మాహురమ్మ పుట్టునని సామంతులు విప్పి యర్థము జెప్పిరి. అప్పుడు గిరిరాజు ఒడ్డె రాజులను పిలిచి, పుట్ట త్రవ్వమనెను. ఏదుము మైసాక్షి, పందుము గుగ్గిలము ధూపనైవేద్యములు పెట్టఁగా పుట్ట యోజనముల యెత్తు పెరిగెను. అంత ఆదిమహాశక్తి రన తండ్రి గిరి రాజుకు లభింపనెంచి, 'పన్నెండు కోవుల పసిడి నాగుల పుట్ట'నుండి బాల పాప యై వచ్చి యెదుటఁబడెను. ఆ విధముగా మాహురమ్మ జననమందెను. ఇచట జానపదుల

మాతృదేవతకును నాగమునకును అభేద మున్నదను నంశము ఉదాహరణ పూర్వకముగా వివరింపఁబడినది. మాహురమ్మయే రేణుక. పరశురాముఁడు పితృవాక్యము వలన తల్లి తలను ఖండింపఁగా నామెతల నాగ ఫణముగా మారినదను నమ్మకము జానపదులలో కలదు. ఈ యంశమును దేవితోడ నాగ రూపైక్యమును సాధించుచున్నది.

మఱియొక కథ రేణుకా యెల్లమ్మ కథ. ఇది కర్నూలు జిల్లాలోని రుద్రవరమున దొరికినది, చక్కని పార్వతికి[13] ఆరుగురు బిడ్డలు, ఆమె తమ్ముఁడు మునిరాజు. 'పెదమారి, చినమారి, పెదపోశి, చినపోశి, పెద్దీది, చిన్నీది వారి పేర్లు పార్వతి తమ్ముని బిలచి తన యాఱుగురు బిడ్డలను పెండ్లియాడు మనెను కాని మునిరాజు వారిని నిరాకరించి యేడవ గర్భమునఁబుట్టు ఎల్లమ్మను వివాహమాడెదనని చెప్పి సముద్రాల యొడ్డునకు పండ్రెండేండ్ల తపశ్చర్య నెఱపఁ బోయెను

పెద్ద బిడ్డ పోశమ్మ 'ఎద్దుల మాలున కేగి పెండల్లు' దీయఁబోఁగా నచట వీపున జడలు విరియ బోసుకొని, గ్రుడ్లు దిప్పుచు నాదిశక్తి కానవచ్చెను. అప్పుడు పోశమ్మ దద్దరిల్లి తల్లికి వచ్చి చెప్పెను తల్లి పార్వతి తానై పెండ దీయవచ్చి, మాయవాదియైన ఆదిశక్తి వేషము చూచి దద్దరిల్లి క్రింద బడెను. శక్తి పార్వతి కడుపున జొరఁబడి ఏడవ కానుపై జనించెను ఆమెను పెద్ద బిడ్డ పోశమ్మ అల్లారు ముద్దుగాఁ బెంచెను. పెరిగి పెద్దదై యెల్లమ్మ, యొక నాఁడు, అందఱును నిద్రపోవు చుండఁగా,

అందరికి ఆ తల్లి మచ్చుల్లు జల్లింది
ఊరికి ఆ తల్లి వాకట్టు గట్టింది
మొరసేటి కుక్కల్లు అవి మొరవ కుండంగ
కూసేటి కోళ్లల్ల అవి కుయ్యకుండ

---

13 ఈ పార్వతిని జగన్మాతయు, శివార్థాంగమునగు పార్వతిగా గుర్తించుటకు వీలులేదు.

ఊరికే ఆ తల్లి వాకట్టు గట్టింది
ఆణ్ణుంచి ఎల్లారి సద్దుల్లు జేసింది
అచ్చన్న లాడేటి రచ్చల్లు దాటింది
సీమలు దూరని చిట్టడవి దాటింది
గద్దలు దూరని పెద్దడవి కొచ్చింది
సముద్రాల ఒడ్డుకు వచ్చింది యెల్లారి"-

మునిరాజునకు వీపున వెదురు తడలు, ఎదన వెదురు గుమ్మలు, మొలిచినవి. ముక్కులందు గిజిగాళ్ల గూళ్లు గట్టినవి. మునిరాజు లేవలేకపోఁగా ఎల్లమ్మ వానిని విఱుగ ద్రొక్కి మునిరాజును లేపెను. వానితో ముందు ముందు తనను కార్తిక రాజున కిచ్చి వివాహము చేయుటకు ముహూర్తము బెట్టుకొందురనియు, నా సమయమున 'నీవు వచ్చి జంగము వేషమున నా యెదుట నున్నచో, నీ వెంట వత్తు" ననియు చెప్పెను. మునిరాజట్లు చేయఁగా ఎల్లమ్మ పెండ్లి వారి కన్నుల దుమ్ము జల్లి మునిరాజుతో సముద్రాల ఒడ్డుకు వచ్చి చేరెను. కార్తిక రాజులు వెనుకఁబడి వచ్చి మునిరాజును కత్తికొక కండగా నఱికి పోగులు బెట్టఁగా ఎల్లమ్మ విజృంభించి, ఆదిశక్తియై నాలుగు చేతులయందును గంట, గద, శూలము, కత్తి ధరించి వారి నందఱిని చంపివైచెను. జీవగడ్డ నుండి సంజీవి పుల్ల దెచ్చి మునిరాజును లేపి, తాను రేణుకా ఎల్లమ్మయై వెలసి పూజలందుకొనెను. ఇచట మాతృ దేవతా లక్షణముగాఁ జెప్పఁబడిన శత్రు హననతత్పరత కాన్పించును. ఆ లక్షణమున కీ కథ యుదాహరణ ప్రాయ మగు చున్నది.

స్త్రీ మహాత్మ్య ప్రతిపాదకమగు మఱియొక కథ కామేశ్వరి కథ. ఇది నాకు అక్కల కథయను పాట రూపమున దొరికినది. దీనిని రుద్రవరము (కర్నూలు జిల్లా) లో నొక బైండ్లవాడు పాడఁగా వింటిని. ఇందలి కథకును, 'కామేశ్వరి పాట' యని 1930 లో కర్రా అచ్చయ్య అండ్ సన్స్ వారిచే ముద్రింపఁబడిన పాటకును భేదము కలదు. అచ్చయిన కథ బ్రాహ్మణుల యిండ్లయందు పెండ్లి, వడుగు మొదలగు శుభకార్యములు జరిగినపుడు, ముత్తైదువలు జేరి చక్కఁగా అలంకరించుకొని పాడుకొనెడిది. ఈ పాట పాడుచు వారు 'కామేశ్వరీ కల్ప' మను నోము నోముకొందురట. దీనినే 'అక్కల కొలుపు'నియు నందురు. ఇందలి కథ యిట్లు ఇది.

అన్ని ౖవతముల యందును ధన కనక వస్తు వాహన శుభములను, ధాన్యాది బహువస్తు సంతానమును కలుగజేయు పుణ్య కథ యెద్ది యని నైమి శారణ్యమందు సూతుని మును లడిగిరి. అప్పుడు సూతుఁడు ౖబహ్మ నారద సంవాద రూపమున ౖబహ్మ కుల హితమైన పార్వతి కథ యొకటి గలదని యీ కామేశ్వరి కథను చెప్పసాగెను.

కైలాస గిరిపైన శివ పార్వతులు కొలువుండి యుండఁగా పార్వతికి దాహమాయెను అంత నామె తన చేతి శూలాన కొలను ౖదవ్వించెను పార్వతి యా కొలను నుండి "ముంచి మూడు దోసిళ్లు, ముంచక మూడు దోసెళ్లు, ఎంచి యేడు దోసిళ్లు, ఎంచక ఏడు దోసెళ్లు," జల మారగించెను. అంత నామె గర్భము ధరించిన తొమ్మిది ఘడియలకు, "చిరుదొడల నుండి సిరివేణి, పెందొడల నుండి పేర్వేణి, వీపున వీరభౖదుడు, అరికాళ్ల అనకమ్మ, మణమల్ల మహంకాళి, మణు కుల్ల ముద్దరాలు, కటియందు కనకమ్మ, బొడ్డున పోతన్న, పేరురమున పేరిం దేవి, జంఘన జక్కులమ్మ, కోసల కొండవేణి, వెన్నున ఎన్నెమ్మ, రొమ్మున రత్నమ్మ, చెక్కుల చేమంతి, కన్నుల కామన్న" యను పదునేను మంది సంతా నమును గనెను. కామన్న కేడుగురు అక్కలును, ఇరువురు తమ్ములును, ఐదు గురు చెల్లెండ్రును అమరిరి ఈ కథ యందు నాయిక కామన్న యని చెప్పుకొను కామేశ్వరి. ఈ కామన్న యందఱితో కలసి మెలసి పెరుగుచు, నొకనాఁడు పువ్వుల పొదల నెక్కి ఒడి నిండ పువ్వులు గోసెను కోసి యీశ్వరుని నేౖత ములపై పడునట్లు చల్లఁగా, నామెకు 'కనుదృష్టి మధ్యమై' కానరాకపోయెను. కానరాని కామన్నను శివుడు కాపాడుచుండెను. కథాంశ మీ పాట యందింత వఱకే యున్నది ఆపైన, నందఱిని కొలనాడ రమ్మను ౖపార్థనయు, స్థానకము లును నున్నవి.

రుౖదవరము బైండ్లవాడు చెప్పిన కథలో, పార్వతి దాహము గొని కొల నిలో నేడు దొసెళ్ల నీరు ౖతాగుటయు, నందువలన నేడుగురు కూతుళ్లామె కుద్భ వించుటయు నున్నది. వారు, కొండవేణి, విరివేణి, జక్కులమ్మ, ముసానమ్మ, పోశమ్మ, అదెమ్మ మఱియు నెల్లమ్మలు. వీరికి తోడుగా శివుఁడు పోతురాజును సృజించి కాపాడుమని చెప్పెను. వీరేడుగురును పెరిగి పెద్దవారై మునిరాజును వివాహమాడ నిశ్చయించుకొనిరి, మునిరాజు పార్వతి తమ్ముడు. పెండ్లి యొల్ల

నని తపసులు పట్టుటకై యాతడు కీకారణ్య మధ్యమునకు వెడలిపోయెను. మునిరాజు తమ్ము గ్రహింపలేదను కోపమున పెద్ద వారారుగురును ఆగ్రహో దగ్రులై ప్రపంచమంతయు జ్వరమయమును, రోగమయమును, చేసిరి. ఎల్లమ్మ ఎట్లయినను మునిరాజును సాధింతునని చెప్పి అరచేత వడ్లు నింపి, మోచేత పోటు వేసి, అడుగులేని కుండలో నన్నము వండుకొని కుండపై కుండగా నేడు దొంతులు పెట్టుకొని, యరణ్య మధ్యమున సాగిపోయెను. పండెండ్రేండ్లు పట్ట వలసిన మునిరాజు తపమునకు కొఱవలుండి పోయెను. నా తపము చెఱచుటకై వచ్చుచున్న దీనిని భంగపరతునని మునిరాజు ఏనుగులు కారిపోవు జల్లెడలో నీరు పట్టి తెమ్మని యాజ్ఞ యిచ్చెను. ఎల్లమ్మ ఎంత ప్రయత్నించినను జల్లెడ యందు నీరు నిలువదాయెను. అంత ఎల్లమ్మ జాలారి గంగను ప్రార్థన చేయఁగా నామె కూతురునకు తోడై నిలచి జల్లెడలో నీరు నిలుచునట్లు చేసెను. ఈ రీతిగా ముని రాజు పెట్టిన యాంక్షల నన్నియు దాటి, యాజ్ఞలను పాటించి, చివఱకు వాని నోడించి తన మనోరథ మీడేర్చుకొనెను. తన యక్కలతోపాటు ఎల్లమ్మ 101 దేశములందు నెలకొని యందరిచే పూజ లందుకొనసాగెను.

ఈ కథ యందు కామేశ్వరి ప్రసక్తి లేదు. కాని 'కామేశ్వరి పాట యందలి యంశములకును. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఎత్తి చూపిన ఆదిలక్ష్మి విలాస, కామేశ్వరీ చరిత్రముల యందలి కథకును, ఈ బైండ్ల వాని కథతో కొన్ని పోలికలున్నట్లుగా కానవచ్చుచున్నవి.

ఆ పోలిక లివి :-

1 పార్వతి కొలనిలో నీరు త్రాగగా నామె 'కక్కలు' జనించుట

2. ఏడుగురికిని తమ్ముడు పోతు రాజగుట

౩. రెండు కథలయందును, కథానాయికకు (ఒకచో కామేశ్వరి, మఱొకచో నెల్లమ్మ) వివాహ విషయమున తొలుదొల్త ప్రతి బంధకములు తోచుట, చివఱకు వాని నామె ప్రతి లంఘించి కోరిన ప్రియుని బడయ గలుగుట,

భే ద ము లు :-

1. నామ విభేదము :- మొదటి కథలో నాయిక ఆదిలక్ష్మి యపరావతార మైన కామేశ్వరి, లేక కామన్న. బైండ్లవాని కథలో నీ పాత్రకు సరివచ్చు పాత్ర ఎల్లమ్మ.

2. ఆదిలక్ష్మి విలాసమునందు నాయకుఁడు రామావతారమును, కృష్ణావ తారము నెత్తిన శ్రీ మహా విష్ణువు కాఁగా, బైండ్ల వాని కథలో ముని రాజు. కామేశ్వరి పాట కథలో నెవడు నాయకుఁడో తెలియరాదు.

ఈ కథలను తైపారు వేయుటకు ముందు, నాకు దొరికిన మరి రెండు కథల నుటంకించుట యవసరము. ఒకటి రేణుకా యెల్లమ్మ కథ. వెనుక పేజీ లలో నుదాహరింపఁబడినది. అందును పార్వతి సప్త సంతానములలో ఎల్లమ్మ కడగొట్టు బిడ్డ. తల్లి తొలుత బుట్టిన తన మూర్వురు బిడ్డలను, తన తమ్ముఁడైన మునిరాజును పరిణయ మాడుమని చెప్పఁగా నాతఁడు నిరాకరించి నీకు పుట్టబోవు నేడవబిడ్డ 'ఎల్లును' వివాహమాడుదునని పండ్రెండేండ్లు తపస్సులు పట్టఁబోయెను. ఈ కథ యందును, ఎల్లమ్మకును మునిరాజునకును జరుగబోవు, వివాహములో ప్రతి బంధకములు కానవచ్చును. కాని యిచట నవి తల్లిచే కల్పింపఁబడినవే గాని వివాహ విముఖుఁడైన మునిరాజుచే గాదు. ఈ కథయందలి మునిరాజును, ఎల్లమ్మయు, రుద్రవరపు బైండ్ల వాని కథలోని మునిరాజును, ఎల్లమ్మయు నగుటకు ఆక్షేపముండరాదు.

పార్వతి తమ్ముఁడుగా జానపదుల కల్పనయందు వెలసిన 'మునిరాజు' నాగరకుల కావ్యముల యందు (ఆదిలక్ష్మి విలాసము, కామేశ్వరి కథ) శ్రీ మహా విష్ణువయ్యె నేమో! విష్ణునకును పార్వతికిని సోదర సోదరీ సంబంధము ప్రసి ద్ధము కదా! ఆదిలక్ష్మి విలాసమందలి, ఆదిలక్ష్మి శ్రీరాముని మోహించి విఫల యగుటయు శ్రీ కృష్ణునకు రుక్మిణ్యంశమగు భార్యయై యందున కొంత శాంతి నందుటయు నను నంశము కామేశ్వరి పాటయందు లేనేలేదు. పువ్వులు కోసి యవి శివునిపై చిమ్మగా నామె 'కనుదృష్టి' మందమగుట. ఆమెను శివుడే కాపాడ బూను కొనె ననుట. మొదలగు శివపరమగు నంశములతోడనే కథ సాగుచున్నట్లు

కాన్పించినది గాని యిచట విష్ణు ప్రసక్తి యున్నట్లు కానరాదు. మఱి కామేశ్వరి నాదిలక్ష్మని జేసి, విష్ణుగత బుద్ధియు, తద్విరహ పీడితయు నగునట్లు కథ నల్లుట యే విధముగా జరిగెనదో తెలియదు. పార్వతీ సహోదరుఁడు మహా విష్ణువని పురాణ గత కల్పనము ననుసరించి, జానపదుల గాధలలోను పార్వతి తమ్ముఁడగు 'మునిరాజు'ను, కావ్యకర్తలు విష్ణువుగా స్వీకరించి యుందురనియు నూహింపవచ్చును. కాని జానపదుల 'మునిరాజు' పురాణములయందు జమదగ్నిగా ప్రవేశము సంపాదించిన మునిశ్రేష్ఠుఁడు ఈయన భార్య రేణుకయే జానపదుల మాతృ దేవత. జానపద కథాంశమునందు లేని విష్ణు ప్రియత్వమును కామేశ్వరి కంట గట్టుటకు ఆదిలక్ష్మి విలాస కర్తయు, కామేశ్వరీ కృతి కర్తయు కారకులేమో తెలియదు ఈ ఇరువురి కృతులకైనను, క్రీడాభిరామ మందు పేర్కొనఁబడిన "కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు" ముఖ్యాధారము కానోపు.

గ్రామదేవతల కథలను సేకరించిన Elmore సేకరణ[14] యందు 'అక్క దేవతల' ను గూర్చి యొక కథ కాన్పించినది. వీరు అక్కచెల్లెండ్రేడుగురనియు వారిలో వారు పోట్లాడుకొని మరణించిరనియు, అంతట లోకమునందు వ్యాధులు వ్యాపించెననియు, ప్రజలు పూజలు చేసి వేడుకొనఁగా వారు దేవతలై వెలసిరనియు నా కథయొక్క సారాంశము. ఇది బైండ్లవాని యక్కల కథలోని యంశముతో సరిపోలుచున్నది.

క్రీడాభిరామము నందలి 'కామవల్లి' కథయు నీ యక్కల కథయు నొక్కటగునో కాదో చెప్పుట కాధారములు లేవు ఏ యింటి యజమానుఁడేని సంతాన కాంక్షియైనచో ప్రతిబంధక పరిహరణార్థమై యేడ్వురు జక్కుల పడుచుల నలంకరించి పీటలపై గూర్చుండబెట్టి 'పరీక్షారాధనంబు' చేయుట క్రీడాభిరామమునఁ గలదు. యక్షకులోద్వహులైన దేవతలు కామవల్లి శ్రీ మహాలక్ష్మితోఁగూడి యపేక్షిత కార్యము నందించుట యందుకు ఫలము. మాతృదేవత సంతాన ఫలప్రదాయిని యనియు సఫలత (Fertility) యను వరము నిచ్చు దాతయనియు గుర్తించుట కీ కథ తోడ్పడుచున్నది. ఈనాటి బ్రాహ్మణుల యిండ్ల

---

14. Elmore - Dravidian Gods in Modern Hinduism - Pp. 76-77 (1925)

యందు శుభ కార్యములైన మరుచటి నాఁడు ముత్తైదువు లేవురు చక్కఁగా నలంకరింకొని, యుపవాస దీక్షనంది, యీ యక్కల కొలుపు సాగించుచు కామేశ్వరి పాటను పాడుట నేటికిని కలదు. ఇంటి ముత్తైదువులకు బదులు వల్లభా మాత్యుని కాలమున జక్కుల పురంధ్రులే యుపవాస వ్రతమూని, చేత పింఛపు కుంచె ధరించి, యుడుమ చప్పుళ్ళకును, బిల్లదురుల మ్రోతకును, ఉద్రేక మతిశయింపఁగాఁ బీటలపై నుండి లేచి యాడు చుండెడి వారు గాఁబోలు. అదియే యానాడు జక్కులపాటయు, యక్షగానము నను పేర విశిష్టతను పొందియుండును.

ఈ యేడుగురు అక్కలకును, పురాణాంతర్గత లయిన సప్తమాతృకల కును పోలికలున్నట్లు కాన్పించును. దేవీ భాగవతమునందు, మాతృకలలో శ్రేష్ఠురాలైన దేవసేన, నాగేశ్వరుఁడగు ననంతుని చెలియలును, నాగమాతయు, నాగభూషణ భూషితయు, నాగశాయినియునై. పరమేశ్వరి యంశమున జనించిన స్త్రీగా కీర్తింపబడినది. అక్క లేడుగురిలో చివఱిదైన రేణుక (ఎల్లమ్మ) నాగరూపిణియు, నాగలోక వాసినియు, ఫణము చిహ్నముగా కలిగినదియునై శోభించుచున్నది.

కుమారస్వామిని చుట్టి కొలిచిన సప్తమాతృకలు బాలరోగములను వ్యాప్తి నందించువారును బాలుర కరిష్టదాయకులునని చెప్పఁబడినది.[15] జానపదుని 'యక్కలు' రోగములను వ్యాపింపజేయుటకును, పురాణ కథితమైన యా యంశ మునకును గల సాదృశ్యమెట్టిదో యూహ్యము. జానపదుని మాతృదేవతలుగా ప్రతిభాసించిన యీ సప్తదేవీ స్వరూపములు పురాణములకెక్కి సప్తమాతృకా స్వరూపములై నెలకొనియుండును. మాతృకలు పరివేష్టించి కాపాడిన కుమార స్వామియు ననార్యదైవమే. జానపద దైవమైన సెయ్యన్. వేలన్. మురుగన్, సుబ్బరాయఁడు, మొదలగు నామములుగల పురుషదైవము, సమాహారము చెంది యార్యులచే సుబ్రహ్మణ్యుఁడై, స్కంధుఁడై। మయూర వాహనుఁడై, వల్లీదేవ సేనా సమేతుఁడై, దేవతల సేనాధిపతిగా మన్నింపఁబడి, శివపుత్రుఁడై యార్య దైవముల కోవలో ప్రథమ స్థానమును బొందెను.

15. ఆంధ్ర మహా భారతము

ఇట్టి మాతారాధన ప్రధానముగా కలిగిన కథలలో కొన్ని యంశములు సూక్ష్మముగా పరిశీలింపఁదగినవిగా గోచరించును. అందు ముఖ్యమైనవి యా యా దేవతాపూజనము నందు జానపదు లనుసరించు పద్ధతులు.

దైవభావనకు తొలుదొల్త ప్రత్యేకముగా స్త్రీరూపము వచ్చుటకు కారణము లెట్టివియో యని పలువురు విజ్ఞులు చర్చింపకపోలేదు. ఆదిమ మానవుని మత విషయకమగు నీ స్త్రీ పారమ్యమును చర్చించుటకు ముందు, తనతో కలిసి జీవించెడి స్త్రీ పట్ల నాతని భావన యెట్టిదో గ్రహించుట యవసరము. అందులకు ఆదిమ మానవుని వివాహ చరిత్ర యిట్టిదని చెప్పుటకు మన కాధారములు లభించుట కష్టము. జానపదుల పురా గాథలలో (Myths) ఆదిమ మానవుని వివాహాచారములను గూర్చి యెట్టి సమాచారమును లభ్యము కాకపోయినను, తఱుచు వీనియందు ఆయా జాతుల పుట్టుకకు కారణభూతులైన మొదటి స్త్రీ పురుషులను (Primal Pair) వర్ణించుట కలదు. ఆ జంట నుండి జాతి సముత్పన్నమై విస్తరించినట్లు కథనము చేయఁబడును.

కాని తొలుత కాలమున స్త్రీ బహుభర్తృకయై భర్తమీదకంటె సంతానము మీదనే మమకారము కలిగి తన యధికారమును తన సంతానముపై ప్రసరించి యుండునని యొక యూహ కలదు 16 దీనిని బట్టి ఆదికాలమున స్త్రీల యందు ఏకభర్తృక నియమము లేక, వివాహ వ్యవస్థ యనునది స్థిరముగా నిర్ణయింపఁబడరాక యుండుటయు, స్త్రీ పురుష లిరువురును వాంఛాపూర్తికై తాత్కాలికముగా కలసి విడిపోవుచుండిరనియు, అట్టి స్త్రీపురుష మేళనమునకలిగిన సంతానమును పెంచు బాధ్యతయును, బరువును, దానితోపాటు కలిగిన యధికారమును స్త్రీలకే స్థిరమై యుండెడిదనియు తన్మూలమున ఆటవిక జాతులన్నియు మాతృత్వాధికారమును వహించువారనియు నంగీకరింపవలసివచ్చును. దీనినిబట్టి యీ నాఁడు సంఘమున పటిష్ఠముగా కాన్పించు పురుషాధికార మానాఁడు లేదని నిర్ణయింప వచ్చును. అట్లే నేటి వివాహ వ్యవస్థకు ప్రాతినిధ్యము వహించు వ్యవస్థ యొక్క జాడలును అనాఁడున్నవో లేవో చెప్పుట కష్టము.17

16. J. Bachotan - Mother Right

17. Lewes Morgan - Ancient Humanity - 1870

ఈ విషయము నుదాహరణ పూర్వకముగ చెప్పుటకై పురాతత్త్వవేత్తలు జంతుజీవన పరిశీలనము చేసిరి మానవునితో పోలికలు గలిగిన గొరిల్లాలు, చింపాంజీలు, మొదలగు జంతువులు, స్త్రీ జంతువులను మందలుగా తమ వెంట త్రిప్పుకొనుటయు, వాని కొఱకై సాటి పురుష జంతువులతో యుద్ధములు నిర్వహించుటయు కలదు. స్త్రీ జంతువు సంతానవతియైన వెంటనే ఆ సంతానమును తనకు పగగా చూచు తండ్రి మృగము, తన సంతానమునే సంహరించు ప్రయత్నము చేయుటయు, తల్లి పురుష మృగము బారి నుండి పిల్లలను రక్షించుకొను నిమిత్తమై దూరముగా పారిపోయి కష్టములు చెందుటయు, పరిశోధనవలన తేలిన యంశమే కాక, ప్రాచీన కథలయందును స్థిరపడిన సత్యమైనది. దీనిని బట్టి స్త్రీ తన సంతానముపై నపేక్షయు, నధికారమును కలిగియుండుటకు కారణమేర్పడుచున్నది. మనస్తత్త్వవేత్తలు, తండ్రికి తన పురుష సంతానముపై నంతర్గతముగా, అసూయావశమైన యయిష్టము నెలకొని యుండునని నిర్ణయించిరి. తండ్రి హృద్గతమై వర్ధిల్లెడి యీ విముఖత వలన కుమారుని మనస్సున పితృద్వేష రూపమున, సుప్త చైతన్య స్థితియందు నాటుకొను భావమునకు Oedipus Complex [18] అని పేరు తండ్రి కొడుకుల మధ్య నిట్టి భావ వైరుద్ధ్యముండుట వలననే కుమారుఁ డెప్పుడును తల్లికి చేరువగుట సంభవించు చున్నదని విజ్ఞుల యభిప్రాయము. ఆ విధముగా తొలి మానవుని యూహలలో దైవ భావనకు పురుష రూపము కంటె స్త్రీ రూపమే సంక్రమించుటలో సామంజస్య మున్నదని తీర్మానింపవచ్చును.

కొందఱు సాంఘిక వేత్తలు, మాతృదేవతారాధనము హైందవులలో నతిశయించి కాన్పించుటకు కారణము, వారి చిన్ననాటి పెంపకమని తీర్మానించిరి[19]. హైందవ బాలుఁడు తన బాల్యమున తల్లికి మిక్కిలి సన్నిహితుఁడై యుండును. బిడ్డల ప్రవర్తన యెడల తల్లి శిక్షించు ధోరణిని మాని, క్షమించు ధోరణితో చరించును. హైందవ గ్రామీణ జనని తన బిడ్డకు నాలుగేండ్లు పచ్చువఱకు

18. James Drever-A Dictionary of Psychology-pp. 77.

19. P. Spratt Hindu Culture and Personality-pp.181-185.

స్తన్యమును కుడుపుచుండును. అతఁడు చేసిన మంచి పనులను, గోరంతలను కొండంతలుగా వర్ణించి మురియుచుండును. తప్పులను చూచియు చూడనట్లూర కుండును. అతఁడేదేని కోరినచో, నడిగినదే, తడవుగా సమకూర్చి యానందించు చుండును. ఈ విధమగు గారాబముతోడను, ప్రేమాధిక్యము తోడను, తల్లులు పిల్లలను పెంచుట హిందూ దేశమున సర్వసాధారణముగా కాన్పించు నంశము. చిన్ననాటినుండియు బిడ్డకు వాని తల్లితోఁగల యనుబంధమే, వాని మత పరిణామ పద్ధతి యందు మాతృదేవతారాధనను స్థిరపఱచి యుండవచ్చును. బిడ్డ తాను వాంఛించినది తల్లినుండి లభించనపుడు అలుగును. ముఖ్యముగా నాహారము మాని సత్యాగ్రహము చేయును. కొన్ని యెడల కోపము పట్టలేక తల నేలకు బాదుకొని యేడ్చి సాధింపఁబూనుకొనెను. తనకేదో విధముగా బాధను కలిగించు కొని తల్లియొక్క జాలిని, సానుభూతిని తన వైపునకు త్రిప్పుకొన ప్రయత్నించును. ఈ లక్షణములే మాతృదేవతారాధనయందు భక్తుని ఆత్మ హింసా చర్య (Self-immolation) గా రూపొందినవి. మానవ సంఘము నాగరకత వైపు పయనించుచున్న కొలది మాతృత్వాధికారముగల ఆదిమ మానవ సంఘములు తిరిగి మెల్లగా పిత్రధికారము గలవి(Patriarchal Societies)గా మారఁజొచ్చినవి. ప్రపంచ పరివ్యాప్తముగా మగవాని యధికారము సంఘము నందు, నాగరకత వ్యాప్తి వలన స్థిరము కాఁజొచ్చినది. ఈ యధికారమును గట్టి చేసికొనుటకై హిందూ సంఘమున నెన్నియేని ధర్మశాస్త్రములు వెలసినవి. మనుస్మృతి యందు భర్తకును భార్యకును ముప్పది పదునాఱు లేక పదునెనిమిది వర్షముల వయో భేద ముండ వలయునని నియమింపఁబడెను. ఎనిమిది వర్షముల యాడుపిల్ల వివాహ యోగ్యయని నిర్ణయింపఁబడెను. మగవానికి తన భార్యపై నధికారము నెఱపుట కామాత్రము వయోభేద ముండ వలయునన్న యాలోచనయే. యీ నిర్ణయమునకు కారణము కావచ్చును. మగవాఁడు తన సమయము నంతటిని తోటి మగవారి మధ్య గడుపుచుండుటయు, భార్యను గృహకృత్యములకు మాత్రమే అంకితమైనదానిగా తీర్చుటయు జరుగుట వలన స్త్రీ యొక్క అలన పాలనలు, శ్రద్ధాసక్తులు, ప్రేమాభిమానములు తన సంతానము నెడ, కేంద్రీ కరించుట సహజమయ్యెను. తల్లికి అల్లారు ముద్దు బిడ్డఁడై పెరిగిన పిల్లవాఁడు తల్లినంటి పెట్టుకొని యుండు మనస్తత్వముతో తండ్రియెడన్న వైముఖ్యమును భయమును పెంచుకొని పెద్దవాఁడగును. ఇట్టి పిల్లలుగల జాతికి మాతారాధన

యందాస్థ జనించుటలోను, మాతృ దేవతా పూజన మిట్టి జాతులలో నెగడి యభివృద్ధి కాంచుటయందును, నసామంజస్యము లేదు ఈ విధముగా మాతృ పూజా పద్ధతి ఆదిమ మానవునకు, అతని తొలినాటి మాతృత్వాధికార దశయందు లభించినను, ఆతని పితృత్వాధికార దశయందు కూడ, పైన జెప్పిన కారణముల వలన నశించిపోక, మఱింత బలము సమకూర్చుకొని వానినంటి పట్టుకొని, వాని మత పరిణామ పద్ధతియందు చెఱగని స్థానమును పొందుచున్నది.

ఇట్టి మాత్రధికార స్థాపనయందు అంతర్గతముగా, స్త్రీకి గల పిల్లలను కని, పెంచెడి సృజనాత్మక శక్తిపైగల వ్యామోహము ప్రబలమై వ్యాపించియుండును. అట్టి శక్తి (Fertility) యందభిమానాదరముల మూలమున ఆదిమ ప్రపంచమున తల్లి దేవతయొక్క స్థానము సుస్థిరమై నిలిచినదని కొందఱి విశ్వాసము [20] "సృజన శక్త్యారాధన" మన్నది (Fertility Cult) ప్రపంచమున నలు మూలల యందున్న యాదిమ జాతులలో వ్యాపించిన మత పద్ధతి. హారప్పా శిధిలములయందు గాన్పించిన ఫలకములలో నొకవైపు చెక్కబడిన నగ్న స్త్రీ ప్రతిమ, యీ భావమునకు సాక్ష్యమై నిలుచుచున్నది అట్టి స్త్రీ రూపముయొక్క గర్భమునుండి చిగుళ్ళతో శోభించుచున్న మొలక వెలికి వచ్చుచున్నట్లుగా చెక్కబడినది. ఈ చిగురు మొలకయే ఫలవంతమగు గర్భమునకు ప్రతీక. ఆ ఫలకమున కావలివైపున నరబలి యిచ్చు కర్మకాండ చిత్రింపబడెను. దీనిని బట్టి యిప్పటికి దాదాపు క్రీ పూ. 3000 ఏండ్లకు ముందు నాటివగు సింధునదీ నాగరకత యందే స్త్రీ రూపమునకు దైవీభావము నాపాదించి నరమేధము లొనర్చుటయు నామెను సంతాన ఫలప్రతీకగా, సృజనాత్మక శక్తియుతగా నిర్ణయించి పూజించుటయు కాన్పించుచున్నది. ఆంధ్రదేశమందంతట ను నిరివిగా వెదజల్లబడిన ప్రాచీనశిల్పములను గమనించినచో, కొండాపురము, ఎల్లేశ్వరము, సంగమేశ్వరము అలంపురము వంటి అనేక శిల్పఖనులైన స్థలముల యందలి ప్రతిమలను పరిశీలించినచో. స్థానికులు రేణుక, భూదేవి, నగ్నకబంధ యను వివిధనామములతో పిలిచెడి స్త్రీ ప్రతిమ లనేకములు కానవచ్చును. చేతుల యందు మామిడి పండ్లు ధరించి కానవచ్చెడి యీ ప్రతిమలు, స్త్రీ యందు నిహితమైన సృజనాత్మక

20. Wilhelm Wundt - Elements of Folk Psychology.

శక్తికి చిహ్నములై రూపు దాల్చినవి అలంపురమున దక్షిణపు గదిలోనున్న 'నగ్నకబంధ' ప్రతిమను జూచి, హరప్పా త్రవ్వకములను జరిపించిన శ్రీ M.L Watts, హరప్పాయందు లభించిన మాతృమూర్తికిని దీనికిని పోలికలు గలవని చెప్పిరి.[21] రేణుకా యెల్లమ్మ కథ యందీ విగ్రహ స్వరూపమును సమర్థించు నంశము కలదు. పరశురాముఁడు పితృ వాక్పరిపాలనకై తల్లియగు రేణుక తలను ఛేదింపఁగా నది యెగిరి మాలవాని లందలో పడెనట. తల్లిని బ్రదికించు మని యాయన తండ్రిని కోరినను, అస్పృశ్య వాటిక యందున్న యా తలను దెచ్చి యతికించుటకు వీలుకాలేదు. తల "యెల్లమ్మ" యై గ్రామదేవతగా నారాధింపఁ బడెను. అట్లే శిరములేని మొండెము కూడ గ్రామ దేవతయై జానపదులచే నారాధింపఁ బడెను. ఈ దేవత ప్రత్యేకముగా సంతానము లేని స్త్రీలకు సంతానదాయిని.

ఇట్లు ప్రాచీన కాలమున నేర్పడిన మాతృపూజా విధానమున విశిష్టముగా కొన్ని యంగములు కాన్పించును. అవి (1) ప్రార్థన (Prayer), (2) బలి విధానము (Sacrifice), (3) పవిత్రీకరణ (Sanctification), (4) ఆత్మ హింస (Self-immolation) ప్రార్థనకు అతి ప్రాచీనమైన మూలరూపము భూత పూజాపద్ధతి నాటి (Demon Cult-Fetishism) మంత్రోచ్చారణము (Conjuration). ఇది భగవదారాధనా పద్ధతి (Deity-cult) వఱకును క్రమ పరిణామము చెందుచు వచ్చినది. ఆత్మారాధన (Animism) యొక్క పరిణామదశలో, నది యొకవైపు భూతారాధనకును (Demon Cult) మఱి యొకవైపు భగవతారాధనకును దారితీసినది. భూతారాధనకు సంబంధించిన ప్రార్థనము (Prayer) నందు అభ్యర్థనయే (Petition) కాక మంత్రవిధానము (Magic) గూడ నిహితముగా నున్నది. ఒక మంత్రమును పదేపదే యావర్తించుట వలన తన్నిహితమైన శక్తి పటిష్ఠమగుచున్నదని యాదిమ మానవుని భావన. వేదమంత్రముల యందును. అవెస్టా ప్రార్థనల యందును నీ యావర్తన పద్ధతి (Repetition) కాన నగుచునే యుండును. మానవున కంతర్గతముగా,

21. గడియారము రామకృష్ణశర్మ - అలంపుర క్షేత్రము.

సహజముగా లభించిన యధికార కాంక్ష, తన చుట్టును కాన్పించుచున్న చరాచర సృష్టియందలి సకల జీవ వర్గము మీదను మనుష్య వర్గము మీదను మాత్రమే కాక, తన యూహలో ప్రతి వస్తువు నందును నునికి యేర్పరించుకొన్న ఆత్మలపై గూడ ప్రభుత్వము నెఱప నిశ్చయించుకొనెను. అందువలన నాత్మారాధన (Animism) పద్ధతి యెప్పుడు జనించినదో దానితో పాటే ఆత్మశక్తి నదుపులో నుంచుకొనుటకు వలసిన మంత్రశక్తియు (Conjuration), తాంత్రిక పద్ధతియు (Sorcery) జనించినవి. దీనిని బట్టి తాంత్రిక క్రియా కలాపమును, మంత్రోచ్చారణమును, ఆదిమ దశలో ఆత్మలను లొంగదీసికొని వానిని మానవుల యధికారముక్రిందికి దెచ్చెడి పద్ధతులుగా నిర్వచింపవచ్చును. అట్లు చేయుటలో వానిని భయపెట్టుట, ప్రీతులను చేయుట, వాని శక్తి తగ్గించుట, ఆజ్ఞాపించుట, ప్రార్థించుట వంటి సర్వవిధములైన పద్ధతులకును స్థానము కలిగినది. దైవారాధన యందు కేవలము ప్రార్థనకు సర్వ ప్రథమ స్థానము లభింపగా, భూతారాధన యందు (Fetishism) మిగిలిన యంశములు ప్రముఖములై నిలిచినవి. మాతారాధన యందును స్తుతి రూపములైన మంత్రములు పదే పదే యుచ్చరించి తల్లి దేవతను ప్రీతి పాత్రను చేసికొను పద్ధతులెల్ల యెడల నున్నవి.

తెలుగు దేశమున నాగరక జనము, తమకును భగవంతునకును మధ్య బ్రాహ్మణు నొకని లంకెగా నేర్పరచుకొని వానిచే సంస్కృత మంత్రములు చదివించుకొనుట మనకు తెలియును. గ్రామ దేవతలకు సంబంధించిన పూజా కలాపములయందు బ్రాహ్మణ ప్రాతినిధ్యము లేదు. ఆయా దేవతల స్వరూప స్వభావములను, జనన చరిత్రలను అనుసరించి, ఒక్కొక్క తెగవాడు పూజారిగా కుదురుకొనును. రేణుకా యెల్లమ్మ పూజారి బైండ్లవాడు. గంగమ్మ పూజారి పూజగొల్ల. పిన్నమ్మ పోశమ్మ వంటి దేవతలకు చాకలివాడు కూడ పౌరోహిత్యము చేయుట కద్దు. వీరుచ్చరించు మంత్రములన్నియు తెలుగు మంత్రములు. స్తోత్రములు, ద్విపదలుగను, కీర్తనలుగను నాకృతి నందినవిగా కాన్పించును.

ఉదాహరణకీ క్రింది స్తుతి విధానమును గమనింపుడు.

కీర్తనలు :-

"పాలించగలవె పోశమ్మా నీ పాదపూజలు చేతునమ్మా

పాలించగలవె నను ఫాలలోచను పుత్రి
వర మునీ రాణివే మమ్ముకడతేర్చు మా తల్లి
ఎప్పుడూ నీ భజన తప్పక జేతుమమ్మా
నీరూపు నాగ పడగమ్మా నీ మహిమ ఎవరికీ తెలియదమ్మా
ముత్యాల స్థలముల నీవు తల్లి సత్యమై నిలచి యున్నావు
అక్షయా కృపచేత ఆదరించుము తల్లి
నారీ మణిరో జనుల చాల శ్రమ పెట్టకమ్మా.

ద్విపదలు :-

మాంకాళి నినుబోలు మా శక్తి గలదె
పొంకముతో నీకు భూలోక జనులు
పురములో పల్లెలో భూరిగ్రామములో
తఱచుగ గుళ్ళను తగ నిల్పిరంత
పొందించి బంగారు బొమ్మను జేసి
వందనంబుగ నిన్ను వాంఛతో నిలిపి
పట్టువి జల్తారు పట్టెల చీర
గట్టివి పోలేరు గట్టిన చీర
మూడు కొంగుల చీరె మొంగల చీర
దాడి బొమ్మల పితాంబ్రము నారచీర
..........................
ములుక పువ్వుల రవికె మొగ్గల రవికె
తెల్లదామెర పూల తెల్లావి రవికె
వంక సౌరపు కుప్పె వసుధపై మెఱయు
ముత్యాల చేర్చుక్క ముద్దు టుంగరము
రత్నాల రాకినీ రావి చంద్రవంక
కలిమియు బంగారు గాజులు మెఱయ

ఎల్లనూ అందెలూ మోయంగ దేచ్చి............
ఎల్లమానవులు నీ కెంతటి వారు
తల్లి మాపై నీకు దయ బుట్టవలెను
ఆరంబు గైకోని ఆటు తృప్తిచెంది
తిరుగగా మానవుల తెలువు బోకమ్మా"

దక్కన్ పీఠభూమియందలి ఆటవిక తెగలలో వేఱువేఱు సందర్భము యప్పుడు వేఱువేఱు దేవతలను కొలుచుచు, వారు, చేయు ప్రార్ధనలు గమనింప దగినది.[22] పంటకై గింజలు ఎద బెట్టునపుడు వారు లచ్చమ్మ దేవతను గొలుచుచు "సామి అమ్మ, లచ్చిమి అమ్మ, మంచిగ పండితె నీకు బాగా పెద్తం" -అందురు. పండినచో కోతలముందు, అన్నము వండి మూడు రాళ్లచే నిర్దేశింప బడెడి లచ్చమ్మ దేవతముందు పెట్టి "సామి తల్లి లచ్చమ్మ తల్లి పండిన మట్కుమేము పెట్టినాము దండం" -అందురు.

పెండ్లి వేళ—

"బోరమ్మ (భ్రమరాంబ) తల్లీ మంచిగె బతకాల,
నా బిడ్డ నా బావ పిల్లర్ కందొమి మంచిగ
బతకాల బోరమ్మ తల్లీ" —యని ప్రార్థింతురు.

ప్రసవ సమయమున గార్లమైసమ్మ నుద్దేశించి,
"పిల్లగాగు ఊరిపత్తే సేరు జొన్న తెచ్చి
మీకు మొక్కుతాము, మీకు దణ్ణం—" అందురు.

గత్తర చెలరేగినపుడు పోశమ్మ నుద్దేశించి,
"పోశమ్మ తల్లీ తినిపో పటుకు శాయకు, మాకు
ఏమి దొర్కింది మీకు పెడ్తాము." అని యర్థింతురు.

పిల్లల పుట్టు వెంట్రుకలు దీసి గంగలో వైచి, గంగమ్మకు మొక్కుచు,

22. Christoph Von Furer H. D. Chenchus - Vol. 1 Jungle folk of the Deccan.

"గంగిమ్మ తల్లి పుటుగెంటికల్ నీ పొట్టల
ఏశ్నా మా పిల్లలు మంచిగ ఉండాలి" అని వేడుకొందురు.

వేటలో జంతువు దొరికినపుడు దాని ముందరి కాలి యందు కొంత ముక్కను, కాలేయమును, ఖండించి అడవిలో విసిరి వేయుచు,

''సామి తండ్రి మేము తింటున్నాము, నీవు తిను''

అనియు

''సామి అంతా సామిదేవుడు నీవు ఇచ్చిన
మట్కుపెట్టినాము, దేవుడు నీకు దండం" అనియు కృతజ్ఞత చూపుదురు.

చెట్టుయొక్క తొలి పంటను (ఫలరూపమున) కోసి గార్లమైసమ్మ యెదుటనుంచి

"సామి తండ్రి మా మొక్కు మాకు సరింగ దుక్కింది
చెట్టు ఎక్కుతె పడకొట్టవద్దు''- అని విన్నవించుకొందురు.

మానవుని ఆటవిక దశయందలి ప్రార్థనా స్వరూపమిట్టిది. ఇందా దేవతల యంగాంగ వర్ణనలు గాని, మహత్త్వ ప్రశంస గాని యుండదు. పైగా నీ ప్రార్థన యందు మానవునకును దైవమునకును మధ్య 'ఆహార నివేదనము' మాత్రమే ప్రముఖాంశముగా కాన్పించును. మానవుఁడు తనకున్నది భగవంతునికి కానుకగా (Gift) నివేదించుటయు, అధిమానవాంశము ఆ కానుక వలన సంతుష్టుఁడగునని తలంచుటయు, ప్రాథమిక ప్రార్థనా భావమునందలి విశిష్టత.

ఆదిమ మానవునిలో మత బీజములు మొలక లెత్తుటకు కారణము ఆహార పౌష్కల్యముకూడ సామాన్యమైన సుఖ జీవనమునకు, ఆహార సమృద్ధి ప్రాథమిక కారణము. కడుపు నిండిన నాడే దైనందిన సమస్యల నధిగమించి కంటికి కాన్పిం చని విషయములను గూర్చియు, నధి మానవ పరిస్థితులను గూర్చియు నాలో చించుటకు వీలగుననునది సత్యము. మనుష్యునకును చుట్టునున్న పరిస్థితులకును, మధ్య నొక గొలుసు కట్టుగా ఆహారము పని చేయుచున్నచో అట్టి అహారము సమృద్ధిగా లభించుట వలన నాయాటవిక మనుష్యునకు, తన కాహార పుష్టిని సమ కూర్చిన మానవేతర శక్తిపైనను, తత్ప్రతిభావము పైనను నూహాలు సాగించుట కవకాశమున్నది. అదృష్టముపై నాధారపడుట, దానికి కృతజ్ఞత చూపుట,

దానిపై విశ్వాసము కలిగి యుండుట యనునవి, ఏ ప్రాథమిక మత స్వరూపము నందైనను నమ్మకముగా పాతుకొనిపోయిన యంశములు. అధి మానవాంశమును తన యెడల సుముఖము చేసికొనుటకై కృతజ్ఞతా పూర్వకముగ, తన సర్వ జీవన పరిశ్రమకును గమ్యమైన, యాహారమునే కానుకగా నర్పించుట యాదిమ కాలముననే మొదలైనది. ఇదియే మత సంబంధియగు కార్యకలాపముల యందు నాగరక భక్తుడు భగవంతు నర్పించు షోడశోపచార పూజలలో నైవేద్యమను నంశముగా స్థిరపడినది

ఆ విధముగా మాతృపూజాపద్ధతి యందలి ముఖ్యాంశములగు ప్రార్థనయు, నాహార నివేదనమును కలగలుపులై విడరానివిగా నున్నవి. రెండవ యంశము 'బలిక్రియ':– వేదపారము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూత బలియను నీ యైదు పంచ మహా యజ్ఞములలో 'బలి' ని యమరము పేర్కొనుచున్నది.

అమరమునందు 'భూత బలి', పిపీలకలు, పశు పక్ష్యాదులు నగు భూత వితతి ప్రీతికై మనుష్యు డర్పించు నీవారాన్న పిండాదికములును, ధాన్యమును, అను నర్థమిచ్చును గాని, జీవమును గొనివచ్చి అధిమానవాంశము నెదుట చంపి యర్పించు నాహార విశేషమునకు నన్వయించదు. మాతారాధన యందీ 'జంతుబలి' ప్రాముఖ్యమును సంతరించుకొన్న యంశము. జీవిబలికి తొలి బీజములు ఆత్మారాధన యందారంభమై యుండునని విజ్ఞుల నమ్మకము. మరణము వలన, నొక వ్యక్తి యందలి యాత్మ నివసించుట కవసరమగు నిల్లు (శరీరము) నశించి పోవుచున్నది. కాని యాత్మ నశించదు అది యా వ్యక్తి నివసించెడి పరిసరముల యందే గాలిలో తిరుగుచు, పూర్వ జీవితముపై మోజు చూపుచుండునని యాదిమ మానవుని నమ్మకము.

శరీరము నశింపగా మిగిలిన యాత్మశక్తికి బలము కలుగుటకును, భూమి యందది విడిచిపోయిన బంధుమిత్రాది జనముల సాహచర్యమునకు ప్రత్యామ్నాయ ముగను, మఱియొక జీవము యొక్క యాత్మవాహికలైన (Soul carriers) అంగముల నర్పించి, ఆ యాత్మను గతించిన యాత్మతో సాహచర్యము చేయ మని, బలి నిర్వహణము వలన పంపుట అనునది ఆత్మారాధన దశలోనే

ఆరంభమైయుండును. ఈ విషయమును స్థాపించుటకు వివిధ దేశములకు చెందిన కొన్ని యాచారములను గమనించుట ముఖ్యము. ఈజిప్టు దేశమున చనిపోయిన వారి దేహములను మమ్మీలను చేసి, వారికి సకల పదార్థములను సమర్చి యుంచుటతో పాటు, వారి భార్యలను, దాసీజనమునుకూడ సజీవ సమాధి చెందించుట గలదు. భారతదేశమున తొలినాటి సహగమన క్రియకును, నిట్టి యర్థ మాపాదింపవచ్చును. మనకు నాగరక వాఙ్మయము నుండి తెలియ వచ్చిన తొలి సహగమనము. మహాభారతమునందలి మాద్రీ సహగమనము.

గారుడమున సహగమనమును గూర్చి కలదు. మరణించిన వాని పత్ని పతివ్రత యగునేని యామెను గూడ భర్త చితిపై నుంచి దహనము చేయవలయు నని యట చెప్పఁబడెను. అట్లు సహగమనము గావించిన యాడుది అరుంధతితో సమానురాలై స్వర్గమును పాలించునంత కాలము భర్తతో స్వర్గమున సుఖించును.

చనిపోయిన వారి యాత్మలు దశాహము వఱకును ప్రేతత్వమును వదలక తమకు పరిచితమైన పూర్వ ప్రదేశముననే తిరుగుచుండునని మన వారు నమ్ముదురు. దహనకాండ నిర్వహించిన మఱునాడు, సూర్యాస్తమయము తరువాత, మట్టి మూకుటి యందు పాలును, నీరును, మూడు కఱ్ఱలతో త్రికోణాకారముగ కట్టిన యుట్టియందు గ్రహించి దహన ప్రదేశమున కేగి "శ్మశానానల దగ్ధోఽసి పరిత్యక్తోఽసి బాంధవైః ఇదం నీరం ఇదం క్షీరం అత్ర స్నాహి మితం పిబ"23 అని చెప్పి వాని నచట నుంచి వచ్చుటయు మొదలుగాగల మన శ్రాద్ధ కర్మ యంతయు ప్రేతారాధనమును (Anastral worship) తెలియఁజేయుచున్నది.

ప్రేతములకు తోడుగా నుండుటకై జీవములను బలి యిచ్చుటయే దైవా రాధన దశయందు, బలిక్రియగా మారినది. దైవారాధన స్థితియందు భక్తుఁడు తన్ను భగవంతునితో నభేదము చెప్పుకొని యైక్యము సాధించితిననుటకు చిహ్న ముగా నీ బలిక్రియ భాసించినది భక్తుడు భగవంతునకు, తనను తానర్పించుకొను చుంటినని భావించి, ప్రత్యామ్నాయముగా జంతురక్తముచే తర్పణము కావించుట యిచట గమనింపఁదగిన యంశము. అనఁగా జంతు రూపమున తానర్పించు ఆత్మ

23. గరుడపురాణము — దశమాధ్యాయము. పే. 139. Ed. 1951.

తన యాత్మతో నధ్యాహారము నెందుచున్నదని యిచ్చటి భావన. ప్రాచీన మానవుని 'టోటమ్ దశ' యందు 'టోటమ్' గుర్తులుగా పూజింపఁబడిన జంతువు లన్నియు నాయా మానవ సంఘములకు ప్రాతినిధ్యము వహించినవి. అందు కొన్ని వేగముగా పఱుగులెత్తుటలోను (గుఱ్ఱము) గాలిలో ఎగురుటలోను (గ్రద్ద) చుఱుకుగా నుండుటలోను (మొసలి) ఆత్మను పోలిన వనెడి తృప్తి, మానవునకు కలుగుటచే వానిని ఆత్మ ప్రాతినిధ్యము వహించెడి జంతువులుగా నా దశయందలి మానవుఁడెన్నుకొనుట జరిగినది. అట్టి పిట్టలు, పాములు, ఎలుకలు, బల్లులు, దున్నలు, మేకలు మొదలగునవన్నియు నొకనాటి Totem జంతువులు. ఇవి ఆత్మ ప్రతీకలు (Soul Animals). మానవుఁడు జంతువులలో నొకదానిని తన గుంపున కాది మూలముగా గుర్తించి భయభక్తులతో దానిని పూజించుచునే, నియమిత పర్వదినముల యందా 'టోటమ్' జంతువును, విహితమగు కర్మకాండతో చంపి, దాని మాంసమును, రక్తమును నైవేద్యముగ స్వీకరించును. ఇట్టి యాచార మాదిమ జాతులలో నున్నది. అట్లు దాని రక్తమును మాంసమును, ఆ గుంపు నందలి వారలెల్ల యుపయోగించుట వలన, దానియందు నిక్షిప్తమైన వంశకారక మగు శక్తి తమయందును ప్రరోహమగునను నమ్మక మొకటియు, అట్లు దానిని తిని జీర్ణించుకొనుటవలన తమ వంశకర్తయగు నా జంతువుతో తమ్ము అభేదముగా చెప్పుకొనుచుంటిమను విశ్వాసము మఱియొకటియు, నీ యాచారము వెనుకనున్న కారణములు. ఇట్టి జంతువుల యాత్మలతో ఆదిమ మానవుఁడు అభేదమును చెప్పుకొనుటవలన కూడ తరువాతి దైవారాధన దశయందు జంతుబలి చోటు చేసికొన్నదని కొందఱి యభిప్రాయము. ఆత్మరక్తములో నున్నదను నభిప్రాయము వలననే రక్తము చిందనిదియు, శరీరమున నెచటను పూర్వగాయములు లేనిదియునగు పశువునే దేవతల కుపాహారమిచ్చు శ్రద్ధ గైకొనఁబడుచున్నది. అట్లే గుండె, మెదడు, కాలేయము మొదలగు వానిలో నాత్మయుండునన్న భావనయే బలిపశువు చంపఁబడినపు డాయా యంగములే ప్రత్యేకముగ దేవతల కాహార భూతములగుటకు కారణము.

ఇట్లు కేవలము తమకు ఆహార పుష్టిని సమకూర్చిన దైవముపై కృతజ్ఞత చూపుచు ఆహారమును కానుకగా నర్పించు పద్ధతియు, భక్తుడు దైవముతో నభేదమును చెప్పుకొనుటకై తన్నే యర్పించుకొనుచుంటిననను భావనతో నొక ప్రత్యా

మ్నాయము నర్పించు పద్ధతియు - నీ రెండును దైవారాధనమునందు కలగలసి పోయి, నైవేద్యమును, బల్యర్చనయునై భాసించినవి.

మాతారాధన యందు బలి పశువులు సాధారణముగా మేక, కోడి దున్నలై కానవచ్చుచున్నవి. మాతారాధనా పద్ధతి యందు తల్లి దేవతను రక్త ప్రీతి కలదానిగను, బలులను కోరుదానిగను మానవుఁడు చిత్రించుకొనెను. జానపద గేయ గాథల యందలి గ్రామ దేవతల వర్ణనమున నీ విషయములు స్పష్టములగు చుండును.

"ఎత్తు గొర్జెలు, చాల ఏటలు, కోళ్ళు
మేక పోతులు గొప్ప మైసమ్మలూనూ
సాకబోసిన కల్లు సారకావళ్లు
ఆరంబు గైకోవి అటు తృప్తి జెందు''

నది యీ మాతృదేవత. బలి క్రియ యొక్క యునికి వేదములయందును గలదు. అశ్వమేధము, శూలాగవము, అను సవన క్రియలు గుఱ్ఱములను, వృషభములను బలిపశువులుగా నర్పించు క్రియలు. సర్వమేధమున, గుఱ్ఱము, పొట్టేలు, గొర్జెపోతు, వృషభము మొదలగు జంతువులు బలియీయఁబడుటయేకాక నరుఁడు కూడ బలి పశువుగా యజనము చేయుట చెప్పఁబడెను - అంతేకాక సర్వయజ్ఞ ప్రక్రియయందు ఆత్మ హననము సూచింపఁబడినది - ప్రాచీన సాహిత్యమునందును నరమేధ ప్రశంస కలదు. హర్షచరిత్రమున బాణభట్టు నరమాంస విక్రేతలను సూచించెను. శ్మశానము నందు నిర్వర్తింపఁబడిన నరహనన రూపకమగు భయంకర కర్మకాండను వివరించెను. భవభూతి మాలతీ మాధవమునందును ఈ ప్రసక్తి కలదు. కథాసరిత్సాగమున నరబలి ప్రసక్తితో గూడిన కథలు గలవు. కలికి పురాణమున నరబలులను గూర్చిన ప్రకరణ మొదటి ప్రత్యేకముగాఁగలదు. శ్రీశైల భ్రమరాంబికాలయమునను, బెజవాడ కనకదుర్గ యాలయమునను ఒకప్పుడు నరబలులు సాగెడివని చెప్పుట కుపపత్తులు గలవు. భ్రమరాంబికయు, కనకదుర్గయు శక్తులే. వీరు ఒకప్పుడు గ్రామ దేవతా విశేషములుగా ప్రజలచే పూజింపఁబడిన దేవతలు. భ్రమరాంబికాలయమున గర్భ గృహములో రహస్య ప్రదేశ నిర్మాణము ఒకనాటి నరబలుల యునికిని సూచిం

చునని విజ్ఞుల యభిప్రాయము. అట్లే కనకదుర్గాలయము నరబలులు జరుగు శక్తిస్థానము కాఁగా, నచట దేవిని శాంతింపజేసి యచటనున్న బగళాముఖి చక్ర మును తీసివైచి, శ్రీ చక్ర స్థాపనమును శ్రీ శంకరు లొనర్చిరని కథ కలదు. నరజలులు ఈనాడు కాన్పింపక పోయినను, ఒకనాడు భారతదేశమున, విరివిగా నుండెడివనియే కథనములు చెప్పుచున్నవి. కాళీమాతకును, పంట దేవతలకును, నీ నరబలులు జరుగుచుండెడివి. మాతారాధక ప్రధానాంశముగా గల కథా గేయములలో జంతుబలుల ప్రసక్తి కానవచ్చినంత విరివిగా నరబలి ప్రసక్తిలేదు. ఒక్క ''మైరావణ చరిత్ర'' పదమున మాత్రమీ ప్రసక్తికలదు. పాతాళ లంకాధిపతియు రావణ సఖుఁడునైన మైరావణుఁడు, రావణునకు ధైర్యముచెప్పి రామ లక్ష్మణులను "కాళికి బలిగా కడతేర్తుననుచు" వారిని దొంగిలించుకొని పాతాళ లంక కేగెను. హనుమంతుఁడు వారిని విడిపించుటకై రాక్షసులతో ఘోరయుద్ధముచేసి వారినందరిని జంపి, కాళిక చెంతకేగి,

''ఓ తల్లి యో యమ్మ ఓ జగదీశ్వరీ,
నీకు వందనమమ్మ నిగమ సంచారీ
నీ మహా కరుణచే నేమి లోపము లేక
సంహరించితి నెల్ల శత్రుసైన్యంబు
ఇదిగో నైవేద్యంబు నిచ్చితిని గైకొనుము
నీదు సంతోషంబె నాదు విజయంబు
అని కాళికాదేవి కర్పణము కావింప
సంతోషమున నామె చప్పరింపుచును
వేనోళ్ళచే ద్రాగు విధమున ద్రాగెను.
తనిసి గొంతుక నిండ త్రాగె రక్తంబు"

ఈ పట్టున దేవీకృతమగు మనుష్య రక్తపానము వర్ణింపబడినది. మఱియొక కథా గేయమునందలి కథా సంవిధానమున, గోపిరెడ్డి యను వాడు, కొడుకు మల్లారెడ్డిని, పొలముమధ్య కీడ్చి చంపి, వానిని ముక్కలుగా కోసి రక్తము పొలి చల్లెనను నంశము కలదు.

"మచ్చె మీద కొడుకును దించినాడు
జల్లెడు రాళ్లు మీద పోసినాడు
పరువత బాటలో చేను ఉన్నది కొడక
పరువతంబు జంగాలు వచ్చేరు
ఒక్క జంగము వానికి కంకి నిచ్చేవు
దాసరి వానికి దానము చేసేవు అని తండ్రియనగా,
ఎన్నో మొక్కులు మొక్కితివి నా తండ్రీ
మొక్కిన మొక్కులు ఎక్కడ పోయినావి
పిలిచి బిక్షము ఇస్తనంటి వయ్యా
అది తప్పితివె తండ్రి గోపిరెడ్డి
ఒక్క కంకి ఇస్తె మనది ఏమి పోతదయ్య

అని కొడుకు బుద్ధులు చెప్పబోయెను

"నేను వద్దు అని చెపితె యిస్తనని అంటడు" అని తండ్రియనుకొని,

''మచ్చకు కల్ల కంపకొట్టినాను
నీవు దుమికి గాని భిక్షంబు వేస్తేను
కొట్టి చేనులో గొంతుకోసేను
కొట్టి చేనుకు పొలి బెట్టేనూ'' అని బెదిరించెను.

కాని పరమేశ్వరుడే జంగము వేషమున భిక్షమడుగగా నిరాకరింపలేక మల్లారెడ్డి భిక్షము పెట్టును. తండ్రి యిది చూచి యాగ్రహావేశముతో,

పొలము మధ్యన మూడు మూళ్ళభూమి అలికినాడూ
నైవేద్యము అప్పుడు అక్కడ బెట్టినాడూ
తెచ్చిన యాటను అక్కడ నరికి నాడూ

ఏమని మ్రుక్కుతడు గోపిరెడ్డి – ప్రతి సంవత్సరము చేను ఇట్ల పండితేను నర పొలి ఇచ్చెదను.

మొక్కి దిగ్గన లేచె గోపిరెడ్డి
ఇంక రారా కొడుక చిన్న మల్లరెడ్డి
పొలిదేవరకు మొక్కుదువు రమ్మ
గుప్పున మచ్చె కిందకు దిగినాడు గోపిరెడ్డి
పొలిదేవత దగ్గరకు వచ్చినాడు
బొక్కబోర్ల బడుకున్నడయ్యా
ప్రతి సంవత్సరము చేను పండితేను
ఎప్పుడు ఇట్లె నీకు మ్రొక్కెదము
చెప్పుల కాల వీపు దొక్కినాడు
కొడుకు జడలు బట్టి గోపిరెడ్డి
గొంతుమీద కొడవలి బెట్టినాడు
మొక్కిన విడువక గొంతు గోసినాడు
దోసిట్లో రక్తము బట్టినాడు
కొఱ్ఱచేనులో పొలి జల్లినాడు
నాల్గు తుంటెలు శవము నరికినాడు
కొఱ్ఱచేనులో పూడ్చిపెట్టినాడు

పంట దేవరకు (జానపదుల మనస్సులలో స్త్రీ దేవత.) విత్తునపుడు, పంట పండి మునుములు కోయబోవునపుడు, బలియిచ్చు నాచారము మీనాటికిని పల్లెపట్టులందు కలదు. పొలిబెట్టిన జంతువు రక్తము నీ నాటికిని ఇట్లే పొలములో చల్లెదరు. కాని యీనాటి బలి నరబలికాదు. పురాతన కాలమున హిందూదేశ మంతటయు నీ నరబలి యాచారము క్రమ్ముకొని యుండెడిది. ఇవి శక్తి కర్పించు బలులును పంటదేవత కర్పించు బలులునునై భాసించెడివి.

ఛోటానాగపూర్ వద్దను, బ్రహ్మపుత్రలోయ యందును ఆటవిక జనులు పంటలను కోయు సమయమునందు, పరదేశి ప్రజలను పట్టి తెచ్చి కాలుచేతులు నరికి యా ముక్కల నచట ప్రేలాడుదీయువారట. చిన్న పిల్లలను చంపి

చర్మము నొలిచి ముక్కలు చేసి యా ముక్కలను గాదెలలో దాచినచో, పంట యక్షయమగునను విశ్వాసముకూడ వీరి కుండెడిదట.

ద్రావిడ జాతికి చెందిన గోండులు, బ్రాహ్మణ బాలురను దొంగిలించి పొలము మధ్యమున చంపి యా రక్తమును పొలి జల్లెడివారు. ద్రావిడ జాతికి చెందిన ఖోండ్‌లు కూడ 'తరిపెన్ను, బెరపెన్ను' అని పిలిచెడి, వారి పంట దేవతలకు మనుష్య బలి యిచ్చెడివారు. మనుష్య రక్తము చిందనిదే పసుపు కొమ్ములకు చిక్కని యెఱ్ఱరంగు రాదని వారి నమ్మకము. భారతదేశ మందే కాక, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా ఖండములయందును, ఆటవిక జాతులలో నీ యాచారములొక కాలమున ముమ్మరముగా నుండెడివని పరిశోధకు లుదాహరణ సంగ్రహణము మూలమున తెలియ బఱచినారు[24].

నేఁటికిని రైతులు చేను పంట మీదికి వచ్చిన వెనుక, మునుములు కోసి, పంట కుప్ప నూర్చి, తూర్పార పట్టి ముద్రలు కొట్టుదురు. ఆ పైన 'యాటను' పొలములో కోసి, తోలును, ఎముకలను పొలము మధ్యకుననే పూడ్చి పెట్టుదురు. ఆ మాంసమును, అన్నము నచటనే వండుకొని, తామును, తమ పాలివాండ్లును భోజనమచ్చటనే చేయుదురు ఈ యాహారము బిచ్చగాండ్లకు పెట్టరాదు. ఇంటికి కొనిపోరాదు. మిగిలిన దానిని పొలమునందే గోయి తీసి పూడ్చివేయుదురు. వేదములయందు చెప్పఁబడిన శూలాగవ యాగమున వృషభ మును ఊరిబయటనే చంపవలయును. దాని మాంసముగాని, శరీరావశిష్ట మేదేని యూరి మధ్యకు కొని రారాదు. వాని నన్నిటిని ఊరి బయటనే పూడ్చివేయ వలయునను నియమము కలదు. ఈ పోలిక గమనించుటకు కుతూహల జనక ముగా నున్నది. ప్రాచీనాచారమైన నర విశసనము పర్వతాల మల్లారెడ్డికథయందు పంటకిచ్చు నరబలిగా కాన్పించుచున్నది. "అనుముల బ్రహ్మరెడ్డి" కథయందు కాన్పించు నరబలి తీరు వేరు. 'నాగ శేషుని' కడనుండి బ్రహ్మరెడ్డి కొఱ్ఱ విత్తనములు దెచ్చి తానిల్లరికమున్న తంగెడాపురికి తర్లించుకపోవుచుండెను. కాని ఊరి పొలిమేరయందు, మొరమైసమ్మ యటకాయించి, "నాకు హావతి పెట్టండి హావతి పెడ్తె బండ్లు బోతయి లేకుంటే బండ్లు బోవ"న్నది. బ్రహ్మరెడ్డి

---

24. J. G. Frazer, The Golden Bough.

యప్పుడు "అమ్మా రావే మొరమైసమ్మా ఏ మావతి బెద్దునమ్మా" యనఁగా,

"యాకట మనిషిగావలె-మాకూ హారం బెట్టవలెను-అట్లయితే బండ్లు దర్లుతయ్ అంతట్లనె పూడూరు కెల్లి ఒక గొల్లది. గొల్లామె కిష్టమ్మ నిండు ఉత్కలాడ పోతున్నది. అంబడి గంపా దీసుకోని మొగుడి పొలానికి పోతున్నది కాపులు అడ్డము వచ్చినారు.

"దండమమ్మ ఎవరు తల్లి
కులాన గొల్లోల్లమయ్యా-నా పేరు కిష్టమ్మ
నా మగని కంబలి తీస్కపోతున్న
మీరు అడ్డ మొస్తిరయ్యా
ఏమి ముచ్చటో చెప్పండయ్యో
అమ్మా ఆకలయితున్నాది
మాకూ అంబలి పొయ్యండమ్మా
అంబలి గంప కిందికి దింపె
నెత్తికి డొల్ల అంబలి పోసె
జుత్తుకి సగము రొట్టె యిచ్చె
అంబలి రొట్టె అయిపోయినాది
గొల్లామె ఎనకుక మల్లె
ఇదే సమయ మనుకునిరి కాపులు
అమ్మారావె మొరమైసమ్మ
తీసుకుపో నీ-ఆపతి"

అని యా "యాకటి మనిషిని" క్రిందికి త్రోసి పైనుండి బండ్లు పోనిచ్చి బలి క్రియ నిర్వహించిరి. ఇట్టి సంఘటనయే యెఱుకల నాంచారి' కథయందును వర్ణింపఁబడినది.

"పన్నెండు మేకాల పట్టుకు రావయ్యా లంబాడి
అయిదు దున్న పోతుల ఆహార మివరా"

పందుము పచ్చముగ్గు పట్టు వెయ్యాలె
మానెడు ఊదు పొగ మైసమ్మకు వెయ్యాలె
మూడు తూముల కుంకుమ ముందుగ జల్లాలె
అయిదు పుట్ల అన్నము అపుడు రతిపొయ్యాలె
బాలమ్మ కెదురుగ వాదం దీయాలె
చెలక పారలబట్టి సిద్ధం గుండాలెర
మట్టి పారలు చేత పట్టి ఉండాలెర
ఆరునెలల గర్భిణిని అందుంచవలెర
పారల చేత మన్ను బాగ బొయ్యాలర
గడ్డపారల చేతి గట్టిగ దట్టించాలె
వత్తిజేసి దీపము నెత్తిన భెట్టాలెర
బోనము కుండా నెత్తిన బోర్లకెయ్యాలిర
నేను జెప్పిన పనులు నువ్వు జెయ్యాలిర"

అని యెఱుకల నాంచారి లంబాడి తండా నాయకునకు సలహానివ్వఁగా, వేరొకటి మానిసి దొరకక, ఆ నాయకుఁడు ఆఱునెలల గర్భవతియైన నాంచారినే గోరి లోనికిఁద్రోసి బలిక్రియ పూర్తి చేసెను.

మఱియొక చోట గూడ నీనరబలి ప్రసక్తి కానవచ్చుచున్నది. అది "జాంబ పురాణ" మను కథాగేయమున. ప్రాజ్మానవుని టోటమ్ దశయందలి యభిప్రాయములీ కథయందు నిక్షిప్తములై ప్రచ్ఛన్నముగా నున్నవి. ఇది ఆసాదివారు చెప్పెడి కథ. సృష్టి పుట్టిననాడే జాంబవంతుఁడు పుట్టెను. విశ్వ బ్రహ్మ కోరఁగా, 'కొలిమి తిత్తి' చేయుటకై జాంబవంతుఁడు కొడుకును జంపి తిత్తి యొలిచెను. అతని చేతులు పట్టు కర్రలు, కాళ్లు రెండు సంబెళ్లు, ఎదయొక డాకలి మొద్దు, గొంతుసరము, తలడాకలి, కడుపు నీళ్ల తొట్టి, చేసి జాంబ వంతుఁడు విశ్వబ్రహ్మకిచ్చెను. ఇచట మాతారాధనకై యిచ్చిన బలిగా దీనిని గుర్తించుటకు వీలులేదు. కాని బల్యర్చన యనునది టోటమ్ దశయందే ఆ టోటమ్ జంతువులను, ప్రత్యేక సమయములయందు చంపుటయను పద్ధతితో

నారంభమైన దనుట కీకథలోని యీ బలిక్రియ కొంత యాధారమగు చున్నది.

కథా గేయముల యందలి నరబలి ప్రసక్తి యిట్లుండఁగా, జంతుబలిని గూర్చి కొంత పరామర్శించుట యొప్పును. బలి జంతువులుగా సాధారణముగా స్వీకరింపఁబడునవి కోళ్లు, గొఱ్ఱెలు, దున్నలు మేకలును. గ్రామ దేవతలను, తమ పట్ల ప్రసన్నలను చేసికొనుటకై వీరులును నుపాయశాలురు నగు కథానాయకులు, బలు లిచ్చి, కుంభము పోసి పూజాతంత్రము నడుపుట యీ కథాగేయముల యందెల్లెడలను విరివిగా కలదు.

బాలనాగమ్మ కథయందు, బాలవద్దిరాజు తన తాతలాడిన బొంగరమును, ఉజ్జయిని మహాకాళి దేవళము ముందట నాలుగు నిలువుల లోతున పాతుకొని యున్న దానిని, తెచ్చుటకు ముందు ఆ శక్తిని ప్రసన్నురాలిని చేసికొన యత్నించెను.

అందుకు,

"గాడి పొయ్యిలు పెట్టించెను, బాలుడు
ముప్పై పుట్ల బియ్యము వండించి
మహాంకాళికి కుంభము పోయించి
పైన వక జ్యోతి వెలిగించినాడు
ముప్పై రెండు దున్నల గొట్టించె
గొర్రె పోతుల కొట్టించెనేమి
దానికి ధూపము వేయించెనేమి
సాష్టాంగముగ దండము బెట్టేను
దాని కాహారము పూర్తి యాయె నయ్యా"

పాతాళ హోమము పదమునందు రావణుడు రాముని జయించుటకై హోమము చేయుచు సర్వములగు నాహార పదార్థములతో పాటు కాకులు, దేగలు, గ్రద్దలు, రాబందులు, కోకిలలు, కోడి పుంజులు, వనమయూరములు, పావుర

పిట్టలు, పరమ హంసలు, సింహములు, నక్కలు, పిల్లులు కుక్కలు, పెద్ద పులులు, గజ సమూహము, ఎలుకలు, జింకలు, నెలుగు గొడ్డులు, చేపలు, తాబేళ్లు మొదలగు జంతువుల నన్నిటిని హోమములో వేల్చెనని కలదు. హోమము వేల్చెడి వాఁడు రాక్షస రాజగుటచే జానపదుని కల్పన సత్యమును విడిచి యతిశయోక్తి పాలైన తీరిచట కాన్పించుచున్నది.

మాత్రారాధన యందలి మూడవ యంశము పవిత్రీకరణ (Sanctification) పంచభూతాత్మికమగు మలమయమైన మానవ శరీరమును పవిత్రము చేయునది నిప్పు. నిప్పున క్రాగి సత్యమునకు నిలువబడిన వ్యక్తిపై జానపదునికి గల గౌరవము హెచ్చు. ఆది కథయగు రామాయణము నందే సీతాదేవి యగ్ని నిఁజొచ్చి పరమ పరిశుద్ధయు, పతివ్రతయు నని తన సత్యమును వెల్లడి చేసికొన్నది. ఈ జానపద కథాంశము వాల్మీకి యంతటి మహర్షి హృదయమునే యాకట్టుకొన్నదనఁగా, జానపద గాథలయందు దీనికి గల స్థానమును మనము సులువుగా నూహించు కొనవచ్చును. సాధారణముగా నీ యగ్ని స్నానము స్త్రీల పవిత్రతను నిరూపించుటకే వర్ణింపఁబడుట గమనార్హము. కథాగేయములయందు, పేరంటాండ్రై వెలసిన స్త్రీ లందఱును నించుమించు అగ్నితో సాహచర్యమును నిరూపించి తమ పవిత్రతను చాటుకొన్నవారే.

మాత్రారాధనకు సంబంధించినంత వఱకు జాతరలయందు, బలిప్రక్రియతో పాటు, నిప్పు గుండములు త్రొక్కుటయు, నిప్పు ఒడిన మూటగట్టుకొనుటయు, కాన్పించును. తలయందు గండ దీపము లెత్తుకొనుటయు, దండలకును, చేతి వ్రేళ్ళకును, కనుఱెప్పలకును, మాంసములైన భాగముల, సూదులు గ్రుచ్చుకొని వత్తులు జుట్టి నూనెలో ముంచి భక్తులు జీవద్దీపములై వెలుగుటయు, కాననగును. మాత్రారాధనకు సంబంధించినంత వఱకు నీ నిప్పు త్రొక్కు ప్రక్రియ 'ద్రౌపదీ దేవి' గుడుల వద్దను, గంగజాతరల సమయమందును కాన్పించు నాచారమై యున్నది. థర్‌స్టన్ తాను, 1901లో మద్రాసు నందలి సెంట్ థామస్ మౌంట్ కడనున్న ద్రౌపదీ దేవి గుడి దగ్గర నీ గుండము త్రొక్కిన సంరంభము చూచి నట్లుగా వ్రాసెను. పాండవులైదుగురును, అజ్ఞాతవాసానంతరము తమ భార్యయగు ద్రౌపది శీలమును పరీక్షింపఁగోరి యామెచే గుండము త్రొక్కించిరట. కొన్ని సంవత్సరముల కొక్కమారు గుడియందలి దేవీవిగ్రహముచే నీ నిప్పుత్రొక్కించు

సంరంభము కొట్టి కోలాహలముగాఁ జరుపబడును. ఈ ప్రక్రియ వలన దేవి తమయందు చల్లని చూపులు ప్రసరించి, తమ పశువులను పంటలను చల్లగా వర్థిల్లజేసి యీతిబాధలు కలుగ కుండఁజేయునని జానపదుల విశ్వాసము. ప్రజలు తాము అంతులేని ఆపదలలో చిక్కుకొని, మాన్పరాని వ్యాధులకు లోనైనపుడు, నిప్పు త్రొక్కుదుమని మ్రొక్కుకుందురట. ఇది దేవీ ప్రీత్యర్థమై చేయు క్రియ. భాగ్యవంతులు మ్రొక్కినచో తామే ధనవ్యయము చేసి నట్టి యుత్సవము సమకూర్చి మ్రొక్కు తీర్చుకొందురు. బీదవారు మ్రొక్కుకున్నచో, నట్టి యుత్సవము జరుగు నంతవఱకును వేచియుండి మ్రొక్కు తీర్చుకొందురు

ఇది పదిరోజుల యుత్సవము. నిప్పు ద్రొక్కుటకు ముందు రోజు సాధకుఁడు స్నానమాడి కాషాయ వస్త్రములు ధరించి, ముంజేతికి కుంకుమ నలదిన తోరమును ధరించును ఆరోజు రాత్రి గుడియందే పవళించి, నిరాహారముండును, మరునాడు స్నానియై, శుచియై, శక్తి పూజనము చేయును. మధ్యాహ్న సమయ మగు నప్పటికి గుడి కొలుపు వారు గుండమును త్రవ్వి పెద్ద పెద్ద మొద్దులు వైచి యగ్నిని ప్రజ్వలింప జేయుదురు.

గుండము త్రొక్కుటకు ముందంతయు సరిగా నున్నదా లేదా యని చూచుటకు పూజారి కొన్ని పరీక్షలు చేయును. అవి 1. మట్టికుండ అంచు (Brim) పై కత్తిమొనను మోపి నిలువ బెట్టుట. 2. పసుపు గుడ్డలో నిప్పులు మూటగట్టుట. 3. దేవి యొడిలో మూట కట్టిన పూవులు నిమ్మకాయ వాడకుండ నున్నవా లేదా యని చూచుట. 4. దేవి చీరకొంగున నిప్పులు మూటకట్టి చీర కాలకుండ నున్నదిగదా యని చూచుకొనుట. ఈ శకునములన్నియు చూచుకొన్న వెనుక ద్రౌపదీ కృష్ణార్జున విగ్రహములుత్సవ సమారోహణమునకు ముందు ఊరేగింపున తీసికొని రాఁబడును. పూజ జరిగిన వెనుక పూజారి పసుపుగుడ్డలు కట్టుకొని మెడలో దండలువైచుకొని, మంద గంభీర గమనమున నిప్పుగుండమున నా చివరినుండి యీ చివరికి నడచివచ్చును. తరువాత మ్రొక్కులు తీర్చుకొను భక్తులందఱును నాయన ననుసరింతురు. ఉద్రేకము గలిగించు వాద్యములు మ్రోగుచుండగా దేవీ కథలు గానము చేయఁబడుచుండఁగా, నా కోలాహల మధ్య

మున కొన్ని యెడల తడిగుడ్డలు చుట్టుకొని నిప్పుపైన నడచి, మూకుటిలో నిప్పులు గ్రహించి తలపై దిమ్మరించుకొని యగ్ని స్నానము కావింతురు. నిప్పుత్రొక్కు పద్ధతి ఆంధ్రదేశమందంతటను కాన్పించును. నెల్లూరుదగ్గర "పాండవుల పరస" జరిగిపుడీ గుండములు త్రొక్కుట జరుగును. అప్పుడచట జేరిన మాలవారును, పాండవుల వారను తెగవారును, మహాభారత కధలు పాడుట యాచారము. ఇది యొక్కొక్కమారు పండ్రెండేండ్ల కొకసారి జరుగుటయు కలదట. ఆ గుండము చల్లారిన వెనుక నా బూడిదను తలా యింత గ్రహించి గృహస్థులందఱును నిండ్లలో భద్రము చేయుదురు. అది యున్న యింటిలో దయ్యములును పిశాచములును చేరవని జానపదుల నమ్మకము. అనంతపురం జిల్లాలోను, గంజాము, గోదావరీ ప్రాంతములందును, కృష్ణా, నెల్లూరు మండలములందును, పల్నాడు నందును. ఈ అగ్న్యుత్సవము లీనాటికిని జరుగుచున్నవి. గ్రామ దేవతా పరములై భాసించిన యిట్టి యుత్సవములు వీరశైవమెక్కి వచ్చిన నాటికి తద్భక్తుల వీరత్వ ప్రకటనకు చక్కని మార్గములై భాసించినవి. క్రీడాభిరామమున, "అవ అవ మండు నెజ్జని చంద్రమల్లెల చోద్యంపు గుండాల చొచ్చెడివారును నెడమ కుడి చేత హారతులిచ్చువారు నైన ధీరహృదయులు మైలార భటుల ప్రశంసకలదు.

దక్షిణమున కేరళయందు 'తీయాట్టి' యను తెగవారు, ప్రత్యేకముగా జాతరలయందు, నిప్పుదొక్కుదురట. వారికి నిర్ణయింపబడిన వృత్తి యది యగుటచే వారికా పేరు వచ్చినది. క్రీ పూ శతాబ్దులకు చెందిన శిలప్పదిగారమున గూడ నీ గుండములు త్రొక్కు నాచారము పేర్కొనబడినది.

మనుష్యులిట్లు అగ్ని గుండము మీదనుండి దాటుట, పశువుల నా కుండము చుట్టును ప్రదక్షిణము చేయించుట, అందువలన పంటలు వృద్ధి యగుననియు, పశువులు వృద్ధి యగుననియు తలంచుట, పాశ్చాత్య దేశములయందు కూడ నెలకొన్న యాచారముగా కాన్పించుచున్నది. ఊంట్ శీతుబాధ కలిగిన యాదేశములలో, నీ అగ్ని కార్యమునకును సూర్యునకును సంబంధమున్నదని యభిప్రాయపడెను.[25] అనగా నీ యగ్ని ప్రజ్వలనము సూర్యకాంతి ప్రసారమునకు చిహ్నమై

25. Wilhelm Wundt - Elements of Folk Psychology.

(Mimic) యావిధముగా సూర్యకాంతి నాహ్వానించు న దగుటచే నిది పంటల యభివృద్ధికి సూచక మైనదని యాతని భావన - అట్లుకాక, అగ్ని కేవలము పవిత్రతకు చిహ్నమనియు, చెడ్డతనము (Trechery) తాంత్రికత్వము (Sorcery) రోగములు, కష్టములు - ఇట్టి వానిని కాల్చివేసి మానవునకు ప్రకాశమానమగు భవిష్యత్తును కలిగించు చిహ్నమనియు Dr Edward Wester Mark అభిప్రాయపడెను. J G. Frazer మొదటి దానినే బల పఱచు చున్నను. అగ్న్యారాధనము మొదట సూర్యునకు ప్రాతినిధ్యము వహించి జానపదులచే చేపట్టఁబడి, యా పైన, పవిత్రతకును చిహ్నమై స్వీకరింపబడి యుండునని, రెండు వాదములకును సమన్వయము కలిగింప జూచెను.

శీతుబాధలేని భారతదేశమునకు చెందినంత వఱకీ యగ్నిపూజ పవిత్రతకు ప్రతినిధియై నిలిచినదనియే యనవచ్చును. భక్తుఁడు, తన పావిత్ర్యమును వీర దీక్షను, బాధా సహనమును, దేవి యెదుట ప్రదర్శింపవలయునను గాఢ కాంక్షయే యిట్టి కర్మకాండ కాధారమై యుండునని నేను భావించుచున్నాను.

దేవ్యారాధనలయందు ప్రముఖమై నెగడిన మఱియొక యంశము "సిడు లెత్తుట"- కథాగేయములయందు, దేవీ పూజా ప్రసక్తి వచ్చినచోట నెల్ల యీ సిడుల ప్రసక్తి యుండక తప్పదు - దక్షిణ భారతమున, ముఖ్యముగా, తెలుగు తమిళ, మళయాళ దేశముల యందీ యాచారము ముమ్మరముగా నున్నట్లు కాన్పించును. 1854 లోనే తంజావూరు జిల్లాలో, బాదాపు 125 స్థలముల యందు ఈ ఆచారము అవలంబింపఁబడినట్లు థర్స్టన్ సూచించెను.[26] ఆంధ్ర దేశమునకు చెందిన నెల్లూరు, కృష్ణా జిల్లాల యందీ యాచారము ముమ్మరముగా నుండెడిది. కాళికాదేవి దారుకుని చంపుటకు ముందు రక్తదాహమున వాని వీపు కొఱికి నెత్తురు త్రావెనట. సిడులు ఆడుట ఈ వృత్తాంతమును స్మరణకు తెచ్చుటకే యని జానపదుల విశ్వాసము.

సిడి యెక్కువాఁడు అంతకు ముందు నలువదియొక్క రోజులనుండి భగవతిని ధ్యానించుచు, మాంస మద్య మానినీ విసర్జనము చేసినవాఁడై యుండవలయును

---

26. Thurstone- Ethonographic notes in South India.

సిడి యెక్కుటకు గూడ నంబిక యనుజ్ఞ అయిననే జరుగుపు. అమ్మవారి కుడి ప్రక్క బల్లి పలికినచో నదియామె అనుజ్ఞకు సూచనయని వారు భావింతురట[27]. సిడి యెక్కువాడు ప్రొద్దుట అభ్యంజన మాచరించి, తైల లిప్త సర్వాంగుఁడై యుండ వలయును. గాలము గ్రుచ్చుచోట వీపున నఱచేతితో దెబ్బగట్టిగా తగులు నట్లుగా కొట్టిన, ఆ భాగమున తిమ్మిరెక్కి కొక్కెములు దిగవైచునపుడు బాధ యుండదు. సిడియాడు వాని, తలకు పాగయు, మెడయందును చేతులకును పూవుల చండలు, నుండును. మొలకు లంగోటివలె వెనుకకు మడిచి కట్టిన వస్త్ర ముండును. కాలికి గజ్జెలు కట్టుకొనును. సిడివేసెడి విధమును గూర్చి 'సోనరెట్' అను యాత్రికుడు చక్కగా పరామర్శించెను. రెండు కొక్కెములు పెద్ద త్రాటి చివఱ కట్టఁబడినవి, సిడి యాడదలచిన వ్యక్తివీపునకు గ్రుచ్చఁబడును. ఈత్రాడు 28 అడుగుల పొడవుండి నిలువుగా పాతఁబడిన కర్ర చివఱి భాగమున సడ్డముగా నమర్చిన దూలము చివరకు కప్పీచేత చేర్చఁబడును. దానిని చేదుట చేత నేల మీద నున్న సిడియాడు వ్యక్తి క్రమముగా పైకి లేచును. అట్లు లేచిన వానిని సిడి మ్రానిపై నమర్చబడిన దూలము ఆధారముగా గిర్రుమని చుట్టును త్రిప్పుదురు. కొన్నిచోట్ల సిడియాడు వాని చేతి యందొక కత్తియు డాలును ఉండును. వాడా సిడిపై దిరుగుచు, యుద్ధము చేయు వీరుని వలె నంగ చాలనము కావించును. వాని ముఖమున బాధగాని, దుఃఖముగాని కాన్పింపరాదు. అట్లు కాన్పించినచో నా దేవత కాగ్రహము కలుగుటయు వానికి వ్రతభంగము కలుగుటయు సంభవించును. వాఁడట్లు తిరుగుచునే తనయొడి నుండి పూవులు తీసి క్రిందనున్న వారిపై చల్లుచుండును. క్రిందచేరిన ప్రజలు, ఒక్క పూవునైన దొరికించుకొనవలయునని దొమ్ములాడుదురు. అట్టి పూవులు శుభము నిచ్చి, యింటిని పాలపొంగువలె పొంగించునని జానపదుల నమ్మిక[28].

ఈ సిడులెత్తుట, మతమునకు సంబంధించిన పూజావిధులలో నొక భాగము కాక (Ritual) భక్తుడు దేవి యెదుట చెల్లించుకొనెడి మ్రొక్కులలో (Vows) నొకటియై భాసించినది. ఆపదలు కలిగినపుడు, కష్టములు వాటిల్లి

27. Phillips - Evolution of Hinduism.

28. Sonnerct - Voyage to the East Indies and China.

నపుడు ఈ సిడియాడుటను భక్తులు మ్రొక్కుకొందురు. ఒకరు మ్రొక్కుకొన్నచో వారికిబదులు, భక్తివలననో, ప్రేమచేతనో, మఱియొకరు సిడియెక్కి ఆ మ్రొక్కును చెల్లింపవచ్చును. కూతురు బదులు తల్లియు, భర్తకు బదులు భార్యయు, స్నేహితుని బదులు మఱియొకఁడు నిట్లు సిడియాడు నాచారము కలదు. ఒక్కొక్క గ్రామమున, నూరివారందఱును చందాలు వేసికొని, ఆ డబ్బిచ్చి, ఊరిమాలలను సిడి యాడించి మ్రొక్కులు తీర్చుకొనుటయు కలదు. మనుష్యులు దొరకనినాఁడు, గొఱెలను, మేకలను అవియు లేనినాడు గుమ్మడి కాయలను సిడి యెక్కించి మ్రొక్కు తీర్చుకొందురు. ఊరియందు గత్తర రేగినపుడు, గ్రామదేవతల జాతరలలో వివిధజంతువులను బలి యిచ్చుటతో పాటు బలియిచ్చిన జంతువుల తలలు గుట్టలుగా పడినచోటనే సిడి మ్రాను పాతి, పశువులను సిడి యాడించుట సర్వసాధారణముగా కాన్పించును. టావెర్నియర్ అను విదేశ యాత్రికుఁడు తన పరిశీలనమును బట్టి 17 వ శతాబ్దిలో, సిడి వ్రేలుటలో నొక వైవిధ్యమును జెప్పెను. భక్తులు, నగరమునకు బయటి ప్రదేశమున కేగి, చెట్ల కొమ్మలకు తగిలించిన ఇనుపకొక్కెములకు తమ వీపు చర్మములను తగుల్చుకొని, వారి బరువును భరించలేక చర్మము చీలి, వారు క్రింద పడు పర్యంతము అట్లే అంట వ్రేలి యుండెడివారట

మనుష్యులకు బదులుగా సిడి వీరన్న విగ్రహమును, సిడి మ్రానెక్కించి మ్రొక్కు తీర్చుకొనుటయు కలదు. ఈ సిడులలో గంపసిడి, గాలపుసిడి, పూస సిడి, తాళ్ళ సిడియను భేదములు కలవని థర్స్టన్ వివరించెను[29] కొచ్చిన్ రాష్ట్రమున నివి- 1. గారుడ తూక్కమ్ (Kite Swinging), 2. తోని తూక్కమ్ (Boat Swinging) అని రెండు విధములుగా నున్నదని వివరింపఁబడినవి.

గ్రామ దేవతలకు చెల్లించు మ్రొక్కులలో నొకటియై భాసించిన యీ 'వీరచర్య' రాను రాను, వీరశైవము ముదిరిన వెనుక, వీరశైవులచే గ్రహింపఁబడి, మిక్కిలి ప్రశస్తి వహించినది.

క్రీడాభిరామమున,

---

29 Thurston - Ethnographic notes in S India.

"గాలంపు కొంకి కంకాళ చర్మము గ్రుచ్చి
యుడు వీధి నుయ్యేల లూగు" మైలార
వీరభటులు ప్రశంసింపఁబడిరి.

"ఆత్మ హింసా" పద్ధతియందు, దేవి యెదుట, కరచరణములు ఖండించు కొనుట, నాలుక కోసికొనుట, చెవులలో శూలములు నాటుకొని గోరుగంట కన్నులు పీకుకొనుట, మిడిదల యిచ్చుట, మొదలగు వీరకార్యాచరణము కలదు. దీనికి తార్కాణములు తెలుగు సాహిత్యమునుండి యెన్నియేని యీ వచ్చును. ఆత్మ హననమున కుద్యోగించు భక్తుల వాడుకకై శ్రీశైలములోని వీరశిరో మంటపము నిర్మింపఁబడినది. భక్తులిచట భృగుపాత మొనర్చుచోటు కర్మహారీశ్వర మనఁబడెను ఇదియే కర్మారి, కనుమారి యను నామాంతరములు గలదయ్యెను. పండితారాధ్యచరిత్ర, బసవపురాణము, క్రీడాభిరామము, కళాపూర్ణోదయము, సింహాసన ద్వాత్రింశిక వంటి ప్రాచీన కావ్యములలో నీ యాత్మహనన ప్రసక్తి కలదు. సింహాసన ద్వాత్రింశిక యందలి చంపుడు గుడు లిట్టివే. కాని కథా గేయములలో వీని ప్రసక్తి యెక్కువగా కానరాకపోవుట యాశ్చర్య మూలకము. కాంభోజ రాజు కథయందు మాత్రమీ బాధా సహన రూపకమగు నొక యంశము కానవచ్చుచున్నది కాంభోజరాజు భార్య లేదుగురుసు సంతుకొఱకై రామలింగే శ్వరుని యాలయమున, సానపెట్టించిన కత్తులపై ప్రాణాచారము పడి సంతాన ఫలమునందిరి. మాత పురాణమునందును, ఈదెమ్మ కథ యందును సిడుల ప్రసక్తివచ్చినది, గాని వానివర్ణనగాని, అవి నిర్వహింపఁబడు విధానముగాని లేదు.

ఈ విధముగా ప్రాఙ్మత స్వరూపములలో నొకటిగా విజ్ఞులచే నెంచఁబడిన మాత్రారాధన (Mother Goddess worship), దాని కవసరమగు పూజాంగములతో జానపద కథాగేయముల యందు ప్రముఖస్థానము వహించి, యెన్నియో కథలకు మౌలికాంశముగా నేర్పడినట్లు, ఈ పరిశీలనము వలన స్థాపింపఁబడుచున్నది.

—: o :—

# వీరారాధనాంశములు

ఆదిమ మానవ సంఘమున తొలుదొల్తగా నూపిరి పోసికొన్న రసము వీరమనుటకు సందేహము లేదు. ప్రకృతి యొడిలో కన్ను తెఱచి, మృగదశ నుండి విడివడుచున్న మానవుఁడు, ఆహార సంపాదనమునకై వేటాడి, జంతువులను చంపుటలో బల ప్రదర్శనము చేయవలసి వచ్చెను. తనకు లొంగిన అమాయిక సాధు జంతువులను నిరాయాసముగ చంపినను, తన నెదిర్చి మీదికి దుముకు దుష్ట జంతు సంహననార్థమై, యాతఁడు బలమును, ఆవేశమును, చాతుర్యమును, చూపవలసిన వచ్చియుండును. అట్లు శరీర శ్రమకోర్చి, అపాయమును సైతము లక్ష్యము చేయక, దుష్టజంతువును సంహరింపఁగలిగిన ఆదిమ మానవుని విజయ సూచక సింహనాదము నందు, తొలుదొల్తగా వీర రసావిర్భావము జరిగి యుండును. అంతేకాక ప్రకృతి యందలి సహజశక్తుల ప్రకోపనము వలన గలిగిన గాలివాన, అతివృష్టి, జల ప్రళయముల వంటి యుపద్రవములను చూచిన ఆదిమ మానవ మస్తిష్కము, అట్టి సంఘటనలను తనకు శత్రువులుగా భావించినది. తన కుపకారకములును వెచ్చదనమును గలిగించునవియు నగు సూర్యకాంతిని, చంద్ర ప్రకాశమును, మిత్రములుగా భావించి, కొన్ని యెడల నట్టి కాంతి కవరోధన కారకములగు మేఘములను శత్రురూపమున నూహించుకొనెను. మరికొన్ని చోట్ల సస్యాధారములగు జలమును బంధించుటచేఁ గూడ నా మేఘములు వానికి శత్రువులే యయ్యెను. వేదములయం దింద్రుని వీరునిగ వర్ణించుటయు వృత్ర (మేఘము) ఘ్నుంతియై యాతఁడు చేసిన గో (కిరణ) విమోచనమును ప్రశంసించుటయు నీ యూహపై నాధారపడినదే. ఇట్టి ప్రాచీన పురాగాథ (Myths) లొక్క ఆర్యావర్తమునకే కాక, ప్రాచీన జాతులన్నింటికిని సంబంధించి యుద్భవిల్లినవి. ఉదాహరణకు బాబిలోనియాకు చెందిన జనన సంబంధియైన పురాగాథ (Origin Myths) లను పరిశీలించినచో నచటి 'మర్డుక్' అను వీరునకు 'తియామడ్', 'లబ్బ్బ'లను రాక్షసులతోనైన సంఘర్షణయు, నందలి వీరుఁడు విజయియై, యా రాక్షసులను చంపి భూమిపై ఆనందమును వెల్లి విరియించుటయు నను కథ ప్రముఖముగా కానవచ్చును. మఱియు నచట ప్రతి వత్సరమును

వర్షాధిక్యము వలన నుప్పొంగి తీరస్థ జనపదముల నూడ్చిపెట్టెడి యూ_ఫ్రెటీస్, టైగ్రిస్ నదుల యాగ్రహావేశమే పురాగాథలలో రాక్షస స్వరూపమై యొప్పారి నది. హిట్టైటుల పురాగాధలలో నాకాశ దేవత, చీకటికి మారురూపైన 'ఇలియాంకాస్' అను రాక్షసునితో పోరి ప్రపంచమునకు వెలుఁగు గొనివచ్చెను ఈజిప్ట్ దేశపు పురాగాథలలో సూర్యదేవత యగు 'రా', 'అపెపి' యను రాక్షసునితో పోరాడి విజయమును గాంచెను - గ్రీకు పురాగాథల యందలి, ప్రొసెర్పిన్ అపహరణ గాధ[1], హేమంత, వసంత ఋతు పరిభ్రమణ గాథయే. చీకటిని వెలుఁగు జయించుట, వానలు వెనుక పట్టుట, ప్రవాహోద్ధతి శాంతించుట, భూమిపై ఇగమంతరించి వసంతము విరియుట యను ప్రకృతి సహజములగు మార్పులే పురాగాధల యందు వీర గాథాంశములైనవి. అంతేకాక కొన్ని పండుగలకు సంబంధించిన మతపరమగు కర్మకాండను పరిశీలించినచో వర్షా హేమంత శిశిరములతో నవసిన ప్రకృతి వసంతాగమముచేఁ జిగిర్చి సింగారించుకొని నవ నవ లాడుట యను నంశమునే గాధా రూపమున స్పష్టము చేయుట కాననగును. హైందవులు అధికోత్సాహ సంరంభములతో జరిపెడి హోలి పండుగ వసంతోత్సవమే [2] దానికి సంబంధించిన గాధల యందును, హోలికా రాక్షసీ సంహారమున్నది ఈ విషయమును గూర్చి ముచ్చటించుచు, Prof. Jacobson. "ఇట్టి కర్మకాండలలో కాన్పించు నంశము, ఆదిమ మానవుఁడు జల ప్రళయాదుల పట్ల జరిగిన బృహద్యుద్ధమున నస్త వ్యస్త పరిస్థితిని జయించి ప్రపంచమును మామూలు స్థితికిఁ దెప్పుటయు. ప్రకృతి యొక్క పునరుజ్జీవనమును దర్శించుటయు, నను నదియే" యని నిర్ణయించెను.[3]

Lord Raglon - పురాగాథలలోని వీర లక్షణములను, చరిత్రకు సంబంధించిన వీరుని లక్షణములను చర్చించుచు పురాగాథలకును, కర్మకాండకును సంబంధించినంత వఱకు, వీర చరిత్రము నొక నిర్దిష్టమగు 'నమునా'లో నమర్చ

1. శ్రీ ఆదిరాజు వీరభద్రరావు - గ్రీకు పురాణగాథలు- పేజీలు 114-115
2. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి - హిందువుల పండుగలు- పేజీలు 184-201
3. T. Jacobson - Intellectual adventure of Ancient Man - P. 200.

వచ్చునని యభిప్రాయపడెను.[3a] 'ఆజయ్ లాహిరి' యను విమర్శకుఁడు, బాబిలోనియా, ఇండియా దేశముల పురాగాధల యందు నెలకొన్న రాక్షసహంతలగు వీరుల కధల 'నమూనా' లను పరిశీలించుచు, ఇట్టి కధల పుట్టుటకు కారణము చరిత్రకు సంబంధించిన యంశములు (Historical factors) కాక, ప్రకృతికి సంబంధించిన వనియు (Natural Elements), కొన్ని యెడల సమకాలిక జనుల యార్థిక స్థితికి సంబంధించిన వనియు నభిప్రాయపడెను.[4]

వేదముల యందు ఇంద్రుఁడు వీరుఁడు. వృత్రుఁడు ప్రతి నాయకుఁడైన రాక్షసుఁడు. వృత్రి హననము వలన నింద్రుఁడు పొందిన లాభములు, (1) కాంతిని పొందుట (Ref. R. V. 3.34.8, 8.15.5, 8.78.4, 10.43.4). (2) ఉషస్సును విముక్తి నందించుట (R. V. 2.12 7, 2 21 4, 3 31.15, 3 32 8, 3.39.4 వగైరా) (3) సూర్యుని విష్ణుపథమున ప్రతిష్ఠించుట (R. V. 1.7.3, 8 3.6, 8 12 30 వగైరా) (4) జలములను విమోచనము నందించుట (R. V. 1.57.6 1.61.10, 1.103.2, 2.11.2) మొదలగునవి. యాస్కుఁడును, సాయణుఁడును, ఇంద్రవృత్ర సంఘర్షణమును, ఇంద్ర పరాక్రమముచే మేఘముల యందు బంధింపఁబడిన జలధారలు వర్షరూపమున భూమికి దిగుటగా వివరించిరి. వ్యవసాయోపజీవులైన ప్రాచీన మానవులు వర్షముపై నాధారపడుటచే, నట్టి వర్షము తఱితో కురియకున్నచో, వారి మేధ రూపునందించుకొన్న కల్పనలే యానాఁటి పురాగాధలలో వీరరాక్షసయుద్ధములుగా చిత్రింపఁబడినవి.

అట్లే అస్తమయ సూర్యుని మందేహుల బారినుండి రక్షించుటకై బ్రాహ్మణులు మంత్రరూపమగు నస్త్రములతో ప్రతిఘటించుట, వంటి పురాగాథలు వీర

---

3.a. Lord Raglon — 'The Hero' - A study in tradi-tional Myth and Drama.

4. Ajoy Lahiri-A paper on the Origin of Demono-logy in Rigveda — Proceeding of the 26th Indian History Congress.

రసాత్మకములుగా జననమంది, నిర్ణీతమగు కర్మకాండతో (Ritual) గూడి, మతపరముగా శాశ్వతత్వము నందినవి విష్ణువు మధుకైటభులతో పోరి వానిని సంహరించుటయు, వారి మేదస్సునుండి జలోర్ధ్వభాగమున భూమి యేర్పడుటయు నను హైందవ పురాగాథ యంతరార్థము కూడ నిట్టిదే.[5] వివిధ జాతుల పురాగాథలను పరిశీలించినచో సృష్టిని గూర్చి, నక్షత్రములను గూర్చి, సూర్య చంద్రులను గూర్చి, జల ప్రళయములను గూర్చి, ఆదిమ మానవుడు తాను సత్యమని నమ్మెడి యంశమును ఒక పద్ధతికి లోబడి యొక రకపు మూసలో పోసినట్లుగా, నించుమించు పోలికలు కలిగిన గాథా కల్పనము చేసెనని తెల్లమగును. ఇట్టి గాథలలో సర్వసాధారణముగా వీరమునకే ప్రత్యేక స్థాన ముండుట మనము గమనింపదగిన యంశము. ప్రకృతియందు జరిగెడి, నిత్య సంఘర్షణ వలన కలగుండు పడిన మానవుడే తన యూహలలో నాయకుడు గతి తప్పిన పరిస్థితి నదుపులో పెట్టుటయు, వాంఛితార్థమును సాధించుటయు, నను నుద్దేశ్యములతోఁగూడిన యా నాయకుని ప్రతిఘటనయే, వాని వీరచర్య కాఁగా వాఁడు నిజముగా వీరుఁడగుచున్నాఁడు అదను దప్పిన పరిస్థితిని చక్కఁ జేయుటయే వాఁడు సాధించు విజయము ఈ విధముగా, ప్రకృతిలో వాటిల్లు నపభ్రంశములకు సంబంధించిన కల్పనా రూపమైన గాథలకు వీరము సరిపోయి నంత చక్కగా మరియే రసమును చాలదు. అందువలన పురాగాథా కల్పన జరిగిన యాదిమ కాలము నుండియే, జీవించు నిచ్ఛ కలిగిన మానవుని నిత్య సంఘర్షణను తెలియఁజేయు వీర రసావిర్భావము జరిగినదని చెప్పవచ్చును.

పురాగాథలయందలి వీరులకును, కొంతయైనను చరిత్ర ప్రాధాన్యము కలిగిన వీరులకును, భేదముకలదు పురాగాథలలోని వీరులు భూమిపై నివసించిన

---

5 ట్యుటోనిక్, జర్మన్, స్కాండనేవియన్ జాతుల కన్నిటికిని చెందిన యొక పురాగాథ విష్ణుకృత మధుకైటభ హననమును పోలియుండుట గమనింపఁదగినది. ఆదిదేవుఁడనదగిన 'Bori' మనుమఁడు 'Odin' అనువాఁడు 'Ymir' అను మంచురాక్షసుని జంపి, వాని కండలనుండి భూమిని, రక్తమునుండి సముద్రమును, ఎముకలనుండి కొండలను, వెంట్రుకలనుండి యరణ్యములను పుఱ్ఱెపై చిప్పవలన నాకాశమును సృజించెను.

పాత్రలుకారు. హిరణ్యాక్షుని నుండి భూమి నుద్ధరించిన విష్ణువు, కాళిందీ నదీ మార్గమును తన హలముచే నపకర్షణము చేసిన బలరాముఁడు, మధుకైటభులను చంపి భూమియొక్క ఆవిష్కారమునకు కారణమైన విష్ణువు, ఒక యింద్రుఁడు, ఒక మర్డుక్ (బాబిలోనియన్ వీరుఁడు) ఒక లింగాల్ (గోండుల వీరుఁడు) వీరందఱును ఎప్పుడేని జీవత్పాత్రలని చెప్పుటకు వీలు లేదు. వారిని గూర్చిన కథనము సత్యకథనము కాకపోయినను, అట్టి కథలను కల్పించుటలో నాదిమ మానవ మేధకు ఆధార ప్రాయమైన యంశములలో సత్యమున్నది. పురాగాధ లన్నియు నించుమించు ఇట్లేర్పడినవే. ఒక సత్య విషయమును, ఒక కల్పనచే రూపు కట్టించి (జలమధ్యమున భూమి యేర్పడినదనుట శాస్త్ర సత్యము. శ్రీ విష్ణువు మధుకైటభ సంహారము చేయుటచే వారి మేదస్సు వలన జలము నుండి భూమి యేర్పడినదనుట కల్పన) దానిని కథారూపమున వెలువరించినచో నదియే పురాగాథ యగును(Myth). ఇట్టికల్పన కాశ్రయ భూతముగా నాదిమ మానవ మేధ రసములన్నిటిలో వీరమునే అనుకూలమైనదిగా నెంచుకొన్నది. కాన నిట్టి వీరమునకు ఆలంబనులైన వీర, ప్రతివీరులు ఊహా కల్పిత జీవులును, ప్రకృతిలోని యనేకాంశములకు ప్రతినిధులును, అగుచున్నారు. చారిత్రక వీరులట్లు కాదు. అవ్యాహత గమనము కలిగిన యీ యనంత కాలములో నేనాడేని యట్టి వీరులు జీవించి, సాహసకార్యాచరణము చేసి, ప్రశస్తి వహించియుండ వచ్చును. ఒక కాటమరాజు, ఒక బాలచంద్రుఁడు, ఒక కుమార రాముఁడు మఱి యొక బంగారు తిమ్మరాజు, ఈ భూమిపై మనియుండఁగలుగుట కవకాశము లున్నవి. ఇట్టి వీరులకు సంబంధించిన కథనములలో నధిమానవాంశమునకు పురాగాథలయందువలె నెక్కువగా ప్రమేయము లేకపోవచ్చును. గాని అట్లని పూర్తిగా నట్టి యంశమునకు దూరముగా నవి మనియుండలేవు. రక్తమాంసము లతో నొకనాఁడు మనియుండి సాహస కార్యాచరణ దక్షుఁడే యైనను, అట్టి వానికి జానపద బుద్ధికి సహజమైన అధిమానవాంశ కల్పనము జతచేర్చఁబడక పోయినచో, నవి జానపదగాథా ముద్రను వహింపలేవు. కావుననే చరిత్ర ప్రాధా న్యము గలిగిన జానపద గాథలలోని చారిత్రకాంశమును, కల్పనల మధ్యనుండి విడదీసి యవగతము చేసికొనుట సులభ సాధ్యమగు విషయము కాదు.

ఆదిమ మానవుఁడు నాగరకత నేర్చి సంస్కృతి పథము వైపు పురోగ

మించుచున్న కొలఁది యాతఁడు నివసించు సంఘమున, దాని యాచారములయందు నియమములయందు నెన్నియో మార్పులు వచ్చినవి. ఎవనికి వాఁడుగా బ్రతుకు నాటవిక మానవుఁడు తన చుట్టును గుంపు నేర్పరచుకొని యా గుంపునకు తాను నాయకుఁడైనాఁడు. అట్టి నాయకత్వమును నిలుపుకొనుటకై వాఁడు, తన వంటి మరియొక గుంపు నాయకునితో స్పర్థవహించి, యుద్ధ సంరంభము చేయవలసి వచ్చెను. చిన్న చిన్న గుంపుల మధ్య, నాయకత్వమునకో, ఆహార సంపాదనకో, స్త్రీ విషయముగనో జరుగు నిట్టి కయ్యములు కూడ ఆదిమ మానవుని యందు వీర రసావిర్భావమునకు కారణభూతములైనవి. ఒక్కొక్క నాయకుఁడు తన నాయకత్వమునందు చూపిన సామర్థ్యము వలన లేదా, వ్యవసాయము, గృహ నిర్మాణము, పాత్రల వాడుక, నేత వంటి సంస్కృతీ వికాసమును సూచించు చర్యలవలన మత విషయకములగు క్రొత్తసిద్ధాంతములను స్థాపించి ప్రచారము నందించుటవలన, తన జనుల మధ్య తాను దైవసముఁడై వీర పూజల నందు కొనఁగలుగును. ఆటవిక జాతుల ఆదిమ గాథలలోని దేవతలు చాలమంది యిట్టి ప్రశస్తి వహించి మరణించిన వీరులైన నాయకులే. ఉదాహరణకు, ఈజిప్టునందు చనిపోయిన రాజులందరును దేవతలై పూజలనందుకొందురు జపాన్ దేశపు చక్రవర్తి మరణానంతర మాతనిని సూర్యదేవత (Sun Goddess) గా కొలుచు నాచారము కలదు. అట్లే యచట యుద్ధభూమి యందు మరణించిన వీరుని సర్వ లాంఛనములతో సమాధి చేసి, గుడికట్టి పూజించు నాచారము కలదు. ప్రాచీన గ్రీసు దేశమున వీరులకు సంబంధించిన పూజా విధానము (Hero Cult) చాల ప్రాముఖ్యమై యొప్పారినది. ఇచటి వీరులందరును దైవాంశము కలవారే; వారీ భూమిని వదలి వెడలిన వెనుక పూర్తిగా దైవ రూపము నందుదురు ఇట్లు వీరుల నారాధించుటవలన వారు మనుష్య జాతికి మార్గదర్శకులుగా, సంరక్షకులుగా, సంతాన ఫలప్రదాతలుగా, యుద్ధవిజయము నందించు సహాయకులుగా వెన్నుఁ గాగియుందురని యానాటి మనుష్యులు నమ్మెడి వారు. ఫోషియన్లలో (Phocians) వీరుల సమాధులయందు, తాము యుద్ధమున జయించి చెఱగొన్న బందీల రక్తమును చల్లి, వారిని పూజించు నాచారము కలదు.

హాటెన్ టాట్స్, వారి ముఖ్య దేవతయగు "సుఋ గోబ్" (TsuiGoab)

యొక్క వీరచర్యలను కథనము చేయుచు, వానిని వీరునిగనే పూజింతురు.

క్రేటనులు తమ దేవుడగు జీయస్ (Zeus) సమాధినొకదానిని చూపుచు, నాతని వీరచర్యల నగ్గడింతురు - ఈ యంశముల నితోధికముగా పరిశీలించియే Herbert Spencer పండితుడు, ఆదిమజాతుల యందు వీర కార్యాచరణ పరాయణుడైన మానవుడే భగవంతుడుగా నారాధింపబడెనని నిర్ణయించెను. వీరుల నిట్లు పూజించు నాచారము భారతదేశమందంతటను కలదు.

నాయకుని, సంఘర్షణ పటుత్వముపైగల భయ గౌరవములచే మొదలైన వీరపూజ రానురాను ఆ నాయకునినుండి వానికై ప్రాణములిచ్చెడి వీరభటుల యౌద్ధత్యమునకు సంక్రమించినది. కాలము గడిచినకొలది గుంపు నాయకుడు మకుటాధిపతియగు మహారాజయ్యెను. అట్టి రాజుతోపాటు రాజకీయ పరిజ్ఞానము, రాజ్య రక్షణలో నప్రమత్తత పెరిగెను. రాజ్యమును కాపాడుకొనుటకు యుద్ధమవసరమయ్యెను. చతురంగ బలములలో. బుద్ధిజీవులైన కాల్బంటుల వీర భటత్వము ప్రశంసా పాత్రమయ్యెను. రాజు సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడను నమ్మకము భారతదేశమందు నెలకొని యున్నట్లే ప్రపంచ పరివ్యాప్తముగ నన్ని ప్రాచీన జాతులయందును నెలకొని. వాని దైవాంశ నొక్కి వక్కాణింపబడినది. రోమనులలో తమ్ము పరిపాలించు రాజును భగవంతునికంటె నెక్కువగా చూచు నాచారముండెడిది. అట్లే ఈజిప్టు, బాబిలోనియా, పర్షియా దేశపు రాజులు దైవాంశకలిగినవారు. యూదులరాజు భగవంతునిచే నంగరాగ పరిలిప్త దేహుడై భువికి దిగివచ్చునని యా ప్రజలు నమ్మెడివారు. అందువలననే రాజు సహజ మరణము చెందరాదు. అతనికి సంబంధించిన యే చిన్న బాధయేని, ఆపద యేని భూమిని వణకించునని ప్రపంచ పరివ్యాప్తముగానున్న ఆదిమ జాతుల నమ్మకము. వారి యూహలయందు భూకంపములు కలుగుటకు ఇదియొక కారణము.[6] రాజు తన ప్రజల మేలుకొరకు రాజ్య భారము వహించుచున్నవాడు. దైవశక్తి సంపన్నుడైన యాతని నుండి యెట్టి స్వల్పాపరాధములు జరిగినను, ప్రకృతి ప్రకోపించును. ప్రజలకు నాశనము కలుగును. ఇట్టి

6. J. G. Frazer-The Golder Bough-Vol.1.

విపత్తునుండి తమ్ముతాము రక్షించుకొనుటకై తమ దృష్టిలో నేకైక వీర్యుడును దైవసమానుడును నైన తమ నాయకుని జీవితమును నియమ కఠినము కావించిరి. ఆహార విహారములయందు, ఆచార నియమములయందు నాయనకున్న నిర్బంధము లిన్నియు నన్నియు కావు. అడుగడుగున గండములతోఁ గూడిన వాని జీవితము కత్తివాదరపై నడక వంటిది. రాజ జీవితమున నిన్ని నియమములు విధింపఁబడియుండుట ప్రపంచమందంతట నున్నది ఇట్లు జనదృష్టియందు మహావీరులైన రాజులు, తాము యుద్ధము నందు పరాక్రమ స్ఫూర్తి నెఱపుచుండఁగా శత్రు హస్తగత ఖడ్గ ప్రహారములచే వీర మరణము కలుగనిచో, తమ వృద్ధాప్యమునందు బ్రాహ్మణ కల్పిత దర్భాస్తరణమున శయనించి, ఖడ్గ ప్రయోగమున తమ శరీరము నిచ్ఛాపూర్వకముగ చీల్పించుకొని, మరణించుట కిచ్ఛగించెడివారు.[7]

సాక్షాద్విష్ణుదేవుని యంశముగా నిర్ణయింపఁబడి వీర పూజనందుకొను మహారాజు కొలువున నున్న భృత్యులును, వీరులుగనే యారాధింపఁబడిరి. వీరు రాజు నెడల విశ్వాసపాత్రులై యాతఁడే తమ ప్రాణమని వ్యవహరించుచు, తమ ప్రాణార్పణమునకు సైతము వెనుదీయక ప్రవర్తించువారు. అన్నము పెట్టెడి రాజుపట్ల విశ్వాసము నెఱపవలయుననియు, యుద్ధమున శత్రు సంహారము చేయుట వలని స్వర్గప్రాప్తియు, రంభా సంభోగమును కలుగుననియు, వెన్ను చూపుటకంటె ప్రాణము పోగొట్టుకొనుట మానధనుఁడు చేయఁదగిన పనియనియు. మన సాహిత్యము నందలి వీరుల గాథలు తెలియజేయును. అట్టి వీరులను యుద్ధభూమికి పంపుటకై వీరపత్నులు వీర కుంకుమను తీర్చి దీవించి యుత్సహించువారు [8] వీరమాతలు తమ బిడ్డల వీరగాథలను వినియు. విజయ విహారముల నాలకించియు తమ గర్భము సఫలమయ్యెనని గర్వించెడివారు. యుద్ధ భూమినుండి వెన్నుచూపి తిరిగివచ్చిన భర్తకు మంచము చాటుజేసి నీరుత్రోవ పసుపు ముద్ద నుంచిన పత్నులును, విరిగిన పాలుపోసి యన్నము పెట్టి వెట

7. మణిమేఖలై XXIII-13-14-పురమ్-98

8. పల్నాటి యుద్ధము — పే. 419 - ఎ.డి. 1961

కారము చేసిన మాతలును[9] మనకు పరిచితులు. తన కొడుకు శరీరమందు వెన్నుపోటులున్నచో, నట్టి వ్యర్థునకు పాలిచ్చి పెంచిన తన చన్నులను తెగ కోసికొందునని వీరాలాపములాడి, సాయుధయై యుద్ధభూమికేగి, యచట శత్రు ఖడ్గముచే జర్జరీభూతశరీరుడై నేలను పడియున్న కొడుకును గాంచి, అతడుపుట్టిన ఘడియయందు పొందిన సంతోషముకంటె రెట్టింపు సంతోషమును పొందిన వృద్ధమాత కథనము మనకు క్రొత్తకాదు [10]

వీరులు యుద్ధభూమియందు రాజునకు సహాయకులై యుద్ధముచేయుచు మడియుటకంటె మఱియొక విచిత్రపద్ధతి ప్రాచీన కాలమున కాన్పించుచున్నది, రాజుక్షేమముకొఱకై వీరులైన రాజభృత్యులు అగ్నిప్రవేశము చేయుట, తలతెగ వైచుకొనుట వంటి యాత్మార్పణ పద్ధతి ప్రచారములో నుండెడిది.[11]

అట్లే రాజు చనిపోయినపుడు, అతని శరీరముతోపాటు ఖననము చేయc బడుట కిచ్చగించిన రాజభృత్యుల కథనములును గలవు. కన్నడ దేశమున నీతిమార్గుని కుమారుcడు రెండవ రాజమల్లుcడు (A. D. 907) చనిపోయి నపుడు కొందఱు వీరులు తామును అగ్నిప్రవేశము చేసిరి.[12]

అతి ప్రాచీనమైన తమిళ సాహిత్యము నందును, ఇట్టి ప్రసక్తి కలదు. కొందఱు వీరులు తమ్మేలెడి రాజు యొక్క క్షేమమునకై ఆత్మత్యాగము చేయుటకు మేము ముందనగా మేము ముందని పోటీ పడసాగిరి నల్లని కురులతో గూడిన తమ తలలను ఖండించుకొనుచు, రాజుయొక్క రాజ్యమును, చల్లగా చూడమని, భూతమును (నగరమును పరిరక్షించెడి యమానుష శక్తి) ప్రార్థించిరి.[13] ఈ విధముగా రాజాశ్రితులైన వ్యక్తులు, ఉత్సాహపూరిత చిత్తవృత్తి

---

9. కాటమ రాజు కథ - పే. 21. 53 - ఎ.డి. 1953
10. మణిమేఖలై -
11. Krishna Swamy Ayyangar - South Indian Inscriptions
12. Hayavadana Rao — Mysore Gazetteer.
13. శిలప్పదిగారము.

కలవారై, రాజుకొఱకై వీరమరణమును చెందుట యొక కాలమున దేశవ్యాప్తముగ కాన్పించుచు.

ఇట్టి వీరులకు యుద్ధ సమయములయందు ప్రేరణ కల్పించుటకును, ఉత్సాహమును కలిగించుటకును, జానపద కవులును, గాయకులును సిద్ధముగా నుండెడివారు. రాజు విజయయాత్ర కేగునపుడు చతురంగ బలమేకాక కవి గాయకులును వెంటనుండి వీరగీతములు పాడుచు వారికుద్రేకము కలిగించెడివారు, శాంతి సమయములందు వీరే రాజస్థానముల యందు నెలకొని రాజుయొక్క పూర్వికుల వీరచరిత్రమును, సాహసాచరణమును గానము చేయుచుండెడివారు. సంప్రదాయ సాహిత్యమున కానవచ్చు వందిమాగధ చారణులవలె 'పొరునారు' (Porunars) లను వారు, వీరగాయకులై రాజుల నంటిపెట్టుకొని యుండెడి వారు. వారు తమ వెంట నొక భేరీని విడువకుండ నుంచుకొని వీరుల సుద్బోధించుటకు గొంతు సారించి యా భేరీరావముచే దిక్కటాహముల నింపుచుండిరి. "నా భేరీ నినాదమును వినిన ప్రతిసమయమున నీ శత్రువులు కంపింతురని" కొవుర్ - కిలర్ అను వీరగాయకుడు చోళ రాజయిన నలంక్ - కిలిని ప్రబోధించెను.[14] ప్రాచీన కాలము నందలి వీర రసభరితములైన కథలన్నియు నిట్టి కవుల చేతనే కట్టబడి పాడబడుచుండెడివి.

జన జీవితము నందిట్లు ప్రాముఖ్యమును వహించిన వీరమునకు, పురా గాథల యందే కాక ప్రాచీన మానవుని మతము నందును సముచిత స్థానము లభించినది. వీర రసాధిష్ఠాత లనదగిన దైవములలో నతి ప్రాచీన కాలమున పూజలందుకొన్న దైవము దక్షిణ దేశమున 'మురుగన్' — ఈయన కురవల దైవము వేటయే ప్రధానవృత్తిగా కలిగిన కొండ జాతుల దేవుడు. ఆటవిక మనస్సు, తమ యొక్క మృగయా వ్యాపార లక్షణములను గుదిగూర్చి రూప కల్పనము చేసికొన్న దైవము. ఎత్తయిన కొండలపైననో, దట్టమగు నరణ్య మధ్యముననో నాలు మొగములును, పండ్రెండు చేతులును గలిగిన యీయన విగ్రహముండును. ఈయన యాయుధము బల్లెము, ఈ దైవమునకు ప్రీతి కరముగా మహిషాది జంతువులను బలి యిచ్చుట కలదు ఈయన చుట్టును అల్లబడిన కథలను, పరికింపగా, నేదేనొక రాజు, వీరవిక్రమ స్ఫూర్తి కలిగిన

14. Puram P. ౩82

వాఁడు, అనేక సాహసకార్యములను చేసి జనప్రశంస నందుకొన్నవాఁడు, మరణింపఁగా నిట్లు జనులు దైవభావనతో కొలుచు చుండిరనియును, పూర్తిగ నాటవిక మేధనుండి యుద్భవమై యనార్యాంశమైన, యీ దైవాంశమును, ఆర్యులు, తమ దేవతల వరుసలో కలుపుకొనిరి. ఈయనను షణ్ముఖుని జేసి, షాణ్మాతురుని జేసి పార్వతీ పరమేశ్వర పుత్రుని జేసి, దేవతలకు సేనాధిపతిత్వ గౌరవము నాపాదించి, కుమారస్వామినిగా మార్చిరి ఏమైనను వీర రసాధిష్ఠాతయైన యీ దైవము యుద్ధప్రియుఁడు. పరాక్రమ ప్రదర్శకుడు. ఆదిమ మానవుని యుద్ధకాంక్షకును, శత్రు విజిగీషకును చిహ్నమై నిలిచినవాఁడు

రాజుకడ భృతికి నిలిచి, తను ప్రాణమును సైతము పణముగా నొడ్డి, వీరాచారమున ప్రఖ్యాతిగాంచిన వీరభటుల వలెనేమతపరముగా వీరచర్యలు నడపు భటులును గలరు. మాతృదేవతారాధన (Mother Goddess worship) యందీ వీరచర్యలు కానవచ్చు విధము ముందు ప్రకరణమున పరామర్శింపఁబడినది. గ్రామదేవతలకు చెల్లించు మ్రొక్కులలో నొకటియై భాసించిన యీ వీర చర్య, రానురాను వీరశైవము ముదిరిన శతాబ్దులలో, వారిచే గ్రహింపఁబడి మిక్కలి వ్యాప్తిగాంచినది. శైవము, తాంత్రికత, ఉచ్ఛస్థితి నందిన యీ రోజుల లోనే భైరవము విశ్వతోముఖమై విరాజిల్లినది కాలాముఖ, కాపాలిక మతములే భైరవపూజకు ప్రాధాన్యము నిచ్చిన వనవచ్చును. వామాచార విధానము వలన, తాంత్రిక కల్పనము వలన, భైరవపూజ ఘోరమగు కర్మకాండతో గూడి భయదమును, రౌద్రస్ఫోరకమునై యొప్పారినది. జానపదుల దేవతలైన పోతు రాజు, వీరభద్రుడు, కాటేడు మొదలగువారికి సంబంధించిన రౌద్రసంబంధియగు నంశ యీ భైరవారాధన యందు స్ఫూర్తిగొన్నది. మనుష్యునియందు నిగూఢముగా నున్నట్లు నమ్మఁబడిన యధిమానుష శక్తులను రేపి, యనేక మంత్రముల బలమున, తదధిష్ఠాన దేవతలు తనకు లొంగునట్లు చేసి, యీ దేవతలే తనకు కైమోడ్పునట్లు చేసికొనవలె ననెడి యిచ్ఛ ప్రాచీన మానవునకుఁగలదు. అట్టి యిచ్ఛను సాధించి ఫలవంతము చేసెడి యనేక క్షుద్ర దేవతారాధనములలో ని శైరవారాధనము గూడ సుప్రతిష్ఠితమైనదని చెప్పవచ్చును. దీనికి తోడి జోడనఁదగినది తాంత్రిక మత విధానము (Tantricism) శైవ, సౌర, గాణపత్య.

స్కాంద, శాక్తములను బ్రాహ్మణమతమునందు విలీనము లొనర్చుటకు, స్మార్త పంచాయతనములు ఎట్లు కారకములైనవో, అదే విధముగా వివిధ ప్రదేశములకు (Regions) జాతులకు (Tribes) గ్రామములకు (Villages) చెందిన జానపద మత పూజా విధానముల కొక రూపము నిచ్చి వానిని వైదికమతమున విలీనమగునట్లొనర్చిన ప్రతిష్ఠ తాంత్రిక మతమునకు చెందినది. తాంత్రిక ముచ్ఛస్థితియందున్న 11-13 శతాబ్దుల మధ్య భాగమున వీరభద్రారాధనము ముమ్మరముగ నుండెడిది. శివమానసపుత్రుఁడైన యీ దేవుఁ డాయన కోపావిష్టుఁడైన యెడ జనించెను గాన, నట్టి కోప, భయ, రౌద్రావేశములకును, వీరమునకును నాయన యాశ్రయభూతుఁడయ్యెను. మహారాష్ట్ర మందలి మల్లారి మార్తాండుఁడు, ఆంధ్రదేశమందలి మైలారదేవుఁడును ఈ వీరభద్ర ప్రతిరూపములయ్యెను. బళ్ళారి జిల్లాయందలి "మైలారు"న నెలకొన్న వీరభద్రునికే యీ నామమును, నీయన పాదారాధకులకు మైలారు భటులను పేరును, సంక్రమించెను. వీరు వీరరస ప్రతీకలన నొప్పును.

మన సాహిత్యమునందు మైలారు భటులను తొలుత వర్ణించినవాఁడు క్రీడాభిరామకర్త[15]. స్కాందపురాణము నందు మైలారదేవుని మహాత్మ్యమును చెప్పుచు మైలార ఖండము కలదు. వీరత్వ ప్రతీకలైన మైలారదేవుని భటులు సాహసమూర్తిగొన్నవారు. ఈ సాహస కార్యాచరణము వీరశైవము వ్యాప్తి కాంచిన నాటనుండియే యాంధ్రమున మిక్కిలి ప్రచారములోనికి వచ్చినది. గండకత్తెరలకు తలలిచ్చువారు, చోద్యంపు గుండాల జొచ్చువారు, గనప పాతర్లలో నుట్టి చేరులు గోసి యుఱుకువారు, గాలంపు కొంకికి కంకాళ చర్మము గ్రుచ్చి యుడు వీధి నయ్యెల లూగువారు, కటికి హొన్నాళంబు గండకత్తెరపట్టి మిసిమి-తులుగాక మ్రింగువారు, కీళ్ళసందున నారసములు గూర్చియు, ఎడమ కుడి యఱచేతులలో హారతు లిచ్చియు, మైలారదేవుని యర్చించిన వీరభటులు వల్లభామాత్యుని దృష్టికి వచ్చిరి ఇట్టి ఆత్మహింసా (Self immolation) ప్రతిపాదక చర్యలు వీరశైవ మభివృద్ధి నందిన నాటినుండియు శిష్ట సాహిత్యమున కెక్కి, నాగరకుల దృష్టి నాకర్షించినను, ఇట్టివి జానపద ప్రీతికరములగు చర్యావిశేషములనియు,

---

15. వల్లభామాత్యుఁడు - క్రీడాభిరామము -

ఆనిమ మానవుని మస్తిష్కమునందు బీజరూపమున నుద్భవించి పెరిగి పెద్దవై వర్ధిల్లినదనియు, వెనుక ప్రకరణములలో చర్చింపఁబడినవి గ్రామదేవతల జాతరల యందు సిళ్ల వేలుట, నిప్పులు ద్రొక్కుట, ఒడలియందు గాయములు కలిగించుకొని రక్తమును కనులచూచుట, వంటి వీరచర్యల ప్రసక్తి యనేక జానపద గేయ గాథలందు గలదు. ఇట్టి సాహస కార్యాచరణమే, వారిచే నామోదింపఁబడి యాచరింపఁబడి, వీరారాధనకు, మరియొక కారణము కాగలిగినది సాహసోపేత కృత్యములను నిర్వహించి ప్రాణములను బలిపెట్టు, ధీరహృదయుల చర్యలపై గల మోజువలననే జానపదులు ఆయా చర్యలను కథారూపమున కైగట్టి, పాడుకొనుట కారంభించి యుండవచ్చును. సంవత్సరమునకో, రెండు మూడేండ్లకో, యొకపరి, కీర్తికాయులైన వీరులను పూజించు కార్యకలాపము, చనిపోయిన వారిని స్మృతికి దెచ్చుకొనుటకేకాక, బ్రతికి యున్నవారిలో నావేశోద్రేకములను ప్రోదిచేసి బ్రతికించుటకు కూడ నుద్దేశింపఁబడెను. ఆంధ్రదేశమున "వీరాచరణ" మనుపేర నీ వీరారాధనము 12, 13 శతాబ్దులలో ముమ్మరముగాఁ జరుగుచుండెడిది. శరీరములనర్పించిన భక్తుల స్మృతిచిహ్నములుగా వీరకల్లులు ఆంధ్ర మందంతటను వెలసినవి. 'కోట' పరిసర గ్రామమైన కొక్కుపాడు గ్రామదేవత యగు చాముండేశ్వరి కోవెల యెదుట వీరగల్లులు కలవు. కుడి చేతిలో తన తలను నరికి కొన్న ఛురికయు, ఎడమ చేతి యందు తచ్ఛిరమును, గ్రహించిన విగ్రహమిది. పైన నా వీరుఁడు లింగైక్యము చెందె ననుటకు గుర్తుగా, శైవ ప్రతీకము కలదు. మండపాల వీధిలో నొక వీరుఁడు తన తలను వెనుక నుండి నరికి కొనుచున్నట్లు చిత్రింపఁబడినది. మఱియొకటి ఎడమ చేతితో శపథము గ్రహించుచున్నట్లును, కుడి చేతనున్న ఖడ్గముతో కుడి రెట్టను కోసికొనుచున్నట్లును చిత్రింపఁబడినది. మూలపేట స్వర్ణాల చెఱువు కలుజునకు దక్షిణముగా నొక వీరశిల కలదు. అందొక వీరుఁడు బల్లెము కొనపై అఱచేతిని ఒత్తి ఆ ములుకును వంచివేయుచున్నట్లున్నది ఇట్టి వీరశిలలు మల్లామునందును, నెల్లూరునందును, విరివిగా కన్పట్టును. జిల్లా పరిషత్ పురావస్తుశాల యందు భద్రపఱుపబడిన వీరశిలలలో క్రీడాభిరామమున వర్ణింపబడిన కరవాడి యలుగుల గనప పాతర్లలో. "అను వర్ణనకు సరివచ్చు మైలార వీరభట శిలాప్రతిమ కలదు [16] అట్లే నల్గొండ జిల్లాలోని త్రిపురాంతకమున, వరంగల్లు కోను, పల్నాడు

---

16. Annent Nellore.

నందును, ఇట్టివి పెక్కు వీర శిల లుద్ధరింపఁబడినవి

వీరులై యారాధింపఁబడుటలో కేవలము నిజబాహుబల ప్రదర్శనము, యుద్ధ భూమియందు ప్రాణత్యాగము, మత పరముగా తన దేవుని యెదుట ప్రాణార్పణము చేయుట, వంటి యంశములే కాక మఱియొక విచిత్రాంశము కన్పించుచున్నది. కోపావేశమున, తమ ప్రతికక్షిపై పగతీర్చుకొన నెంచి ఎదుటి వాఁడు తమకంటె బలవంతుఁడగుటచేత స్వనిధనము కావించుకొని వీరులుగా వెలసి పూజలందుకొనుట గూడ జానపద కథలలో కాననగును. జనజీవితమున పాతుకొనిపోయి ప్రశంసింపఁ బడుచున్న యిట్టి గాథలను Whitehead, Elmore లు ఇరువురును లెక్కకు మిక్కుటముగా సేకరించిరి.[17]

1. ఒక రాజు చెఱువు త్రవ్వించి శ్రామికులకు బంగార మిచ్చెదనని చెప్పి వెండి యిచ్చెను. అందులకు వారలిగి రాజు నెదుట తమ గొంతులను కోసికొని వీరులై వెలసిరి.

2. ఒక రాజు సేనలోనున్న మాదిగలు యుద్ధమున నసామాన్య పరాక్రమ ప్రదర్శనము చేసి రాజునకు జయమును సంపాదించిపెట్టిరి. రాజు వారికి వీరుల కీయవలసిన గౌరవమర్యాదల నీయకపోవుట వలన కినిసి, రాజు నెదుటనే కంఠము లుత్తరించుకొని పడసి వీర శిలలైరి.

పురుషుల విషయమున నిట్టి చర్యలు జరిగినట్లు జానపద గేయ గాథల యందు తీర్చి దిద్దఁబడిన పొలకువలు కాన్పింపకపోయినను, స్త్రీ పరముగా నిట్టి సంఘటనలు జానపదామోదమును పడసినవి స్త్రీలు అన్యాయమునకు నత్యాచారమునకు బలియై ప్రాణత్యాగ మొనర్చిన పట్టున (వీర రాజమ్మ కథ) ఇతరులచేత చంపఁబడిన యప్పుడు, (లక్ష్మమ్మ కథ, పొదిలమ్మ కథ) తామై స్వయముగా సహగమనము చేసిన యప్పుడు, (కామమ్మ కథ), ఆ స్త్రీలు సతీ శిలలై వెలసి వీరులతో సమముగా పూజలందుట ఆ గేయగాథలయందు ప్రము

17. White Head. The Village Gods of South India–
Elmore. Dravidian Gods in Modern Hinduism–

ఖమై నెగడినది. యుద్ధభూమియందు శత్రుఖడ్గ ప్రహారముచే మృతినొందక పోయినను, పరిస్థితులను బట్టి ప్రాణములను తృణప్రాయములుగా నర్పించు నిష్టి చేష్ట యొక విధమగు వీరత్వ ప్రదర్శనమే యనుట సమంజసము.

వీరారాధనకు మరియొక కారణమును చెప్పుకొనవచ్చును. జానపదుని మనస్సులో నాత్మారాధన (Animism) దశ గడచి మనుష్యుని బోలిన దైవ రూపకల్పన యేర్పడిన వెనుక, నట్టి దైవము యొక్క నిర్దుష్ట రూపము కలవాఁడును వానివలె నభౌమమమైన శక్తి ప్రపత్తులు కలవాఁడును, లేదా అట్టి దైవముయొక్క సహాయ ప్రపత్తులు కలవాఁడును, అయిన ఆదర్శ మానవుని రూపకల్పన జరిగినది ఆ మానవుఁడు సకల సుగుణోపేతుఁడును, సాహసవంతుఁడును, వీరత్వమునకు ప్రతీకయునై, క్లిష్ట కార్యాచరణము నందును, తలపెట్టిన పనిని దిగ్విజయముగా కొనసాగించుటయందును విజయియై శోభించెను. ఈ వీరచర్యల ప్రాబల్యమును, ప్రాముఖ్యమును జానపద కథాంశమునందు పురాగాథల నుండి స్ఫూర్తి నందుకొన్నవే యయ్యును వీని విజృంభణము ఆత్మారాధన దశ గడచిన వెనుక జరిగియుండవచ్చును.

ఇట్టివన్నియు జానపద కథాంశములుగా నమరుటకు ప్రాతిపదికగా నిలుచునది మతము వీరశైవము విజృంభించిన తొలి రోజులలో తన్మత ప్రచారమునకై శివమహాత్మ్య ప్రతిపాదకములును, శివభక్త గాఢ మానస ప్రదర్శకములు నగు కథలెన్నియో జనించినవి. ఆనాటి పిచ్చుకుంట్లు, యాత్రా సందర్భమున నీ కథలను చెప్పుటకుఁదారమడుగు కొనెడివారు ఇందలి భక్తుల దయా, దాన ధర్మ వీరముల ప్రసక్తి చుట్టును నీ కథలల్లఁబడి, వారికి వీరశైవ గతమైన గాఢ నిష్ఠను తెలియఁజేయుటచే నీ జంగముల కథలన్నియు వీరగాథలే యనవొప్పును. బసవపురాణము నందు చెప్పబడిన శివ భక్తవరుల గాథలన్నియు నాంధ్రదేశపు నాలుగుమూలల యందును,బుఱ్ఱకథలుగనే కాక, కలుపు పాటలుగ కూడ పాడఁబడుచున్నవి [18]

---

18. కర్నూలుజిల్లా 'బోయిరేవుల' యందు భల్లాణరాజు కథ, సురాభాండేశ్వర కథ (సూర్యభాండప కథ), సిరియాల కథ, కలుపు పాటలుగాకూడ పాడఁగా నేను వ్రాసికొంటిని,

వీరగాథలలో నొక విశిష్ట స్థానమును పొంది, శ్రీనాథుని వంటి పండిత కవినిగూడ సమాకర్షింపగలిగిన పల్నాటి వీరచరిత్ర మీ గాథలలో నగ్రగామి కాఁదగినది. పల్నాటి వీరచరిత్రయు, కాటమరాజు కథయు జానపద గేయ గాథలయందు నెన్నఁదగినవి. ఇందలి కథాంశము, ఒక జాతియొక్క పురాగాథలలోని కథాంశమువలె పూర్తిగా, ఊహకును, కల్పనకును సంబంధించినది కాదు. ఇందు చారిత్రక సత్యమున్నదను విషయమున నెవ్వరికిని సందేహము రాదు. కాని యీ చరిత్రను ఇదమిత్థమని స్పష్టముగా నిర్ణయించుట యెట్లు ? 12వ శతాబ్ది యుత్తరభాగమున మత విషయక స్పర్ధలను మూల కారణముగా గొని పల్నాటి యుద్ధము జరిగినది. కాని ఈ మౌలిక కారణమున కప్రధానతయు అట్టి యుద్ధమున పాత్ర వహించిన వీరుల సాహస స్ఫురణకు ప్రధానతయు నిచ్చి జానపదుఁడీ గాథ నాదరించి దీనిపై మోజు పడినాఁడనుటలో విప్రతిపత్తి లేదు. జీవరక్ష తిమ్మన యనువాఁడు వీరస్మృతికై శీలమ బ్రహ్మనాయని కుంతము ఉఱికిచోట మేడ నిల్పి శాసనము చేయించెను.[19] శాసన ఫలకముపై కొందరు వీరుల విగ్రహములు చెక్కఁబడి క్రింద పేర్లు వ్రాయబడినవి. అవి పినమలిదేవరాజు, మలిదేవరాజు, సీలమ నాయుఁడు, పెద మలిదేవరాజు అనునవి. ఈతడిట్లు శాసనము వీరపరముగా వేసినాఁడనగా, నిది వారి వీరగుణ మగ్గింపఁబడుటకేగాని యానాటి చరిత్రాంశములను తడవుటకు గాదు. పల్నాటి యుద్ధమున నిరు కక్షల వారికిని జరిగిన యుద్ధమున నాయా వీరులు ప్రదర్శించిన పరాక్రమ వైభవమును, ఓడినవారు చిందించిన రక్త సింధూరముతో పాటు విజేతలయినవారు చాటిన అనన్య పౌరుష బలదర్పములును, జానపదుల మనస్సు నాకట్టుకొన్నవి. అందువలన జానపదులు వానిని కైగట్టి కాలికి గజ్జె కట్టుకొని, పలువురిముందు తమ హృదయగతావేశములను చాటుకొందురు. మనకీనాఁడు లభ్యమగుచున్న యే చారిత్రక గేయ గాథను చూచినను, అందున్న చరిత్ర సత్యముయొక్క స్వరూపమిదియని స్పష్టముగా నిరూపించుటకు వీలుకలుగుటలేదు. అందుకు కారణము అందు బీజప్రాయముగ నున్న వాస్తవ ఘటనతోపాటు, అతి విస్తరరూప రమణీయములైన యద్భుత కల్పనలును, అభూత విషయములును, చేరుచుండుట; అట్లు చేరుట, ఆదిమ

---

19. South Indian Inscriptions - Vol. 10 - P. 585.

మానవమేధా సంబంధియగు విషయము. ఒక సంప్రదాయము ననుసరించి, ఒక్కొక్క జాతియొక్క పురాగాధాకల్పన మెట్లుజరుగునో, అదే సంప్రదాయము ననుసరించి, యా జాతియొక్క ప్రాచీన దశకు చెందిన కల్పనా పటిమ అను స్యూతముగ నాజాతియొక్క జానపద వాఙ్మయమును భూషితముగ చేయుచునే యుండును కాలమెంత యతిక్రమించినను, సమకాలిక ప్రపంచము నాగరకత వైపున కెంత పురోగమించుచున్నను, ఆ కాలముగాని, నాగరకతగాని, తమ పూర్వులవలె యోచించుట కలవడిన జానపద మేధపై తమ ప్రభావమును చూపింపఁజాలవు. సమకాలిక సంఘటనలను కేవలము గేయగాధా వస్తువుగా స్వీకరించువరకే వాని యాప్తికాని, అట్టివి చరిత్రాంశములనియు, నట్టి చరిత్ర భావికాలమువారికి, భూతకాలములోనికి దారిచూపు సోపానశ్రేణి వంటిదనియు వానికి తెలియదు కావున నిట్టి గేయగాధల యందస్పష్టముగా నుండు చరిత్రాంశముల కొక నిశ్చితాకారము నిచ్చుటకు ప్రయత్నించుట ఫలితమంతగా లేని పని. కాని జానపద మేధను ప్రభావితము చేయుచున్న పురాగాధాంశములు (Mythical Aspects) ఇట్టి వీరగీతములందెట్లు పొదగఁబడి లభించునో గమనించుట కివి మిక్కిలి యుపయోగపడును.

వీర ప్రధాన కథాంశము కలిగిన జానపద గేయగాథలు తెలుఁగునందు కోకొల్లలుగా కలవు. ఏ భాషయందైనను ఇవి వివిధ రూపములలో నుండు యను లేదు. ఈ కథలను కట్టుటలో జానపదుని మనస్సు ఆలోచించిన తీరును బట్టి, యిట్టి కథల 'నమూనా' లను (Motifs) ఒక నిర్ణీత సంఖ్యకు కుదింప వచ్చును.

1. వాంఛిత కార్యసిద్ధికై కంకణము కట్టుకొని, యెన్ని యొడుదుడుకుల నేని సహించి నాయకుఁడు చివరకు విజయము నందుట

2. నాయకుడు, తానన్నమాట నిలుపుకొనుటకై పరీక్షలకు ఆగి, కష్టముల కోర్చి, చివఱకు బుధజన ప్రశంసా పాత్రుఁడగుట.

3. నాయికుడు ప్రతి నాయకునిపై స్పర్ధ వహించి, పగ తీర్చుకొనుటయే పరమ లక్ష్యముగా భావించి, పలు కష్టములకు లోనైనను చివరకు విజయము నందుట.

4. అవివాహితుడగు నాయకుఁడు, తాను ప్రేమించిన పడుచును పొందు టకై బహుశ్రమలకోర్చి, ప్రతిఘటిత శక్తులను లొంగదీసికొని, వాంఛిత ఫలమును పొందుట.

వీరరస ప్రధానములైన యే జానపద గాథలయందలి కథాకథన పద్ధతిని పరిశీలించినను పైన పేర్కొన్న నాలుగు విభాగములలో నేదే నొకదానికి చెందక తప్పదు.

ఇట్టి గాథలయందు, సమకాలిక సంఘస్వరూపము, మతనియతి, యచ టచట కన్పించినను. వానినిమించి జానపదుని యూహయొక్కపారమ్యము రూపు కట్టిన యభౌమాంశములతోఁగూడిన కథాకథన విధానమే ప్రముఖమై నెగడును. అట్టి కల్పనలకు ప్రాచీన మానవ మేధా పరిణామ క్రమమే ముఖ్య కారణము. అట్టి కల్పిత వీరగాథలలో నభౌమ గుణ సంకలితములైన జానపద గేయగాథ లను మొదట విచారింతము ఈ కోవ క్రిందికి వచ్చు గాథలలో మొదట నెన్న దగినది కాంభోజరాజుకథ. దీనినే శరాబందిరాజు కథ యని పిలుచుటయు కలదు. జానపదగాథ యిట్లుండి తీరవలయునను ప్రత్యేక నియమమును, రూప నిర్ణ యమును లేకపోయినను, అనేకానేక గాథలను పరిశీలించుట వలన నీ గాథల నిర్మాణవైఖరినే కొన్ని 'మూసల'లో నమర్చుటకు వీలున్నది. అట్లు నమూనాలు (Motifs) గా నిమిడిపోవు కథలు నిస్సందేహముగా, ప్రాచీనమగు పుట్టుకను కలిగినవనియు, సరిక్రొత్త కథాంశము కలిగినవి, ఆధునికములని నిర్ణయింప వచ్చును ఆ దృష్టితో చూచినచో నీ కాంభోజరాజు కథ మిక్కిలి ప్రాచీన మనియే చెప్పవచ్చును.

1. వాంఛిత కార్యసిద్ధికై కంకణము గట్టుకొని యెన్ని యొడుదుడుకుల నేని సహించి నాయకుఁడు చివరికి విజయము నందుట యను విషయమే కాంభోజ రాజుకథ యందు ప్రధానముగా మలచఁబడినది. ఇందు, కథానాయకత్వము వహించినవాఁడు, కాంభోజరాజు కొడుకు శరాబందిరాజు. ఈతఁడు పరమేశ్వర ప్రసాదము వలన, భర్తచే నరణ్యములయందు నిష్కాసితయైన మాణిక్యాల దేవికి, జనించెను. పెరిగిపెద్దవాఁడై, తండ్రి వీపున రాచరణము లేచి బాధపడు చున్నాఁడని విని, మందుల వాని వేషమున రాచనగరికేగెను. తండ్రి వ్రణము

సగము మాన్పి, మందు తన కడలేక పోఁగా, దానిని సాధించుటకై పోవును, దారిలో రాక్షసులు పెంచిన కన్యను రత్నాల గంధిని పెండ్లాడి, యామె యిచ్చిన కీలుగుఱ్ఱము నెక్కి సముద్రాల యొడ్డునకు పోయెను. అచట కొలువై యున్న వీరభద్రుని ప్రసాదము వలన యోజన గంధిని వివాహమాడి యామె కడ నున్న 'నిర్మలమ'ను మందును సాధించెను. దారిలో, అ మందును సాధించుటకై బయలు దేరి బోగము రంగసానికడ బందీలై పోయిన యార్గురు సవతి యన్నలను విడి పించుకొని, వారిచే మోసమున చంపఁబడెను కాని తిరిగి యోజగంధి యౌషధ విజ్ఞానమువలన బ్రదికి తండ్రి కడకు చేరి వానిని నిరోగుని జేసి తల్లిని తండ్రిని కలుపఁగలిగెను. ఇచట 'శరాబంది' యొక్క నాయక లక్షణమును, వీరత్వ స్ఫూర్తిని, ప్రతిష్ఠాపించుటకై యాతని తలిదండ్రుల దీనదశ కారణముగా గ్రహింపఁబడినది. అతఁడెదుర్కొనిన యాపదలు పడిన బన్నములు నన్నియు వీరము నుద్దీపింపఁజేసినవి- ఈ కథతోపాటు పై విభాగములో చేర్చఁదగిన కథలు బాలనాగమ్మ కథ, శివకుమారుని కథ. బాలవర్ధిరాజును, శివకుమారుఁడను పోలికలు కలిగిన వీరులు. బాలవర్ధిరాజు తల్లిని చెఱనుండి విముక్తురాలిని చేయుటకై తన పరాక్రమమును, అకుంఠితమగు కార్యదీక్షను వెలువరింపఁగా శివ కుమారుఁడు తల్లి కోరిన వస్తువులు తెచ్చి యామె కిచ్చుటకై విడఁబించెను.

2. రెండవ రకము, నాయకుఁడు తానన్నమాట నిలుపుకొనుటకై పరీక్షల కాగి కష్టముల కోర్చి చివఱకు బుధజన ప్రశంసా పాత్రుడగుట. ఎన్నియాపదల కైన నోర్చి, చివజి వఱకును పట్టిన పట్టు విడువక, అభిహిత కార్యాచరణము నందు వీర వైఖరిని దాల్చుటయును నదియు నొక విధమగు వీరమే. దీనికి సంప్రదాయ సహిత సాహిత్యమునుండి చక్కని యుదాహరణము నీయవలయు ననినచో, హరిశ్చంద్రోదంతమును పేర్కొనవలయును. ఇచట హరిశ్చంద్రుడును విశ్వామిత్రుడును, నాయక ప్రతినాయకులు. వీరిరువురికిని మధ్య యుద్ధ పరికరములతో ప్రత్యక్ష యుద్ధము జరుగకపోయినను, అభిప్రాయగతమగు స్పర్ధవలన ప్రచ్ఛన్న యుద్ధమారంభమైనది. నాయక హృదయగతమగు ధర్మ నివిష్టమగు నుత్సాహమే యిచటి వీరమునకు స్థాయి. ఈ కథతో, పోలికలు గలిగిన జానపదగేయ గాథలను గలవు. అందు తొలుదొల్త పేర్కొనఁదగినది "ఘూదెమ్మ కథ." ఈ కథ ప్రసంగవశమున "మాతారాధన" యందు

పేరొ్కనఁబడినది. ఇందలి నాయకుఁడు స్త్రీ గర్భమునందు బుట్టని మాంధాత. యువనాశ్వుని పుత్రుఁడు. మాంధాత జనన గాథ పురాణముల యందును ప్రసిద్ధమే[20]. స్త్రీ గర్భమునుండికాక, అయోనిజులై మానవులు జనించుటయను నంశముయొక్క కల్పన మిక్కిలి ప్రాచీనమైనదిగను, ప్రాఙ్మానవ మస్తిష్క జనితమైనదిగను నెంచవచ్చును. అట్టి గాథలు జానపదములలో నెన్నియేని ప్రచారమందు కలవు[21]. ముఖ్యముగా కొన్ని కులములు, తెగలు, వారి వంశమునకు జెందిన మూల పురుషుని యుత్పత్తిని గూర్చి చెప్పునపు డిట్లే వానిని అయోనిజునిగ వర్ణింతురు. అనగా నీ యంశము నిశ్చయముగా పురాగాథాంశము. ఇట్టి యంశమును పురాణములును బహుముఖములుగా స్వీకరించినవి. ద్రౌపది యగ్నికుండమున బుట్టినది సీత నాగేటి చాలునందు దొరికినది. వాల్మీకి పుట్టయందుఁ బుట్టెను. వశిష్ఠుఁడు కుంభజుఁడు అగస్త్యుఁడు నట్లే. సకల సృష్టికిని కర్త యైన కమలాసనుఁడు విష్ణునాభి యందు జనించెను ఒక్కొక్క జాతి యొక్క సంప్రదాయ సాహిత్యము, అది నేర్చిన బుద్ధి కౌశలము వలన, దానికి గల నాగరకత యొక్క విజ్ఞానము వలన నెన్ని నాజూకు తనములును, ఎంత పరిణతోహలను చూపినను, ఆ జాతుల యొక్క అనాగరక వాఙ్మయమునందలి కథాంశము మాత్ర మొకే విధముగ నుండును. దీనిని బట్టి ప్రాఙ్మానవుని బుద్ధి సాధించిన పద్ధతి యించుమించన్ని దేశముల కొకటే యని సోదాహరణముగ నిరూపించుటకు వీలగును ఇంతకును మాంధాత అయోనిజత్వము పురాణములందు కాన్పించినను, అది జానపద కథాంశము గూడఁ గావున యట్టి యంశము చుట్టును కథలల్లుటలో జానపద కవికి, "ఎఱువు తన మంట గట్టుట" కావ్కారము లేదు.

మాంధాత గొప్ప వీరుఁడు. దేవతలతో తన పరాక్రమమును తైపారు వేసికొన జూచిన సాహసి ఈశ్వరుఁడు వచ్చి సంధి ప్రయత్నములు చేసినగాని తన విక్రమ సంరంభమును మాననంతటి తీవ్ర ప్రకృతి కలవాఁడు. అట్టి రాజు దిగ్విజయముచేసి భూనభోంతరములయందు తన కెదురు లేదనిపించుకొని కొలువు తీరి యున్నపుడు, ప్రధానులు రాజును సంబోధించి.

---

20. విష్ణు పురాణము-ఉత్తర రామాయణము

21. ఎల్లమ్మ కథ, కమ్మవారి పుట్టుక కథ, మాహురమ్మ కథ మొ,

"ఇటు విను మాంధాత జనపాల తిలక
కడలేని విధి కడు ఘన మందురయ్యా
ఉత్తర కాంభోజి ఉజిడి వీర మహంకాళి
శివాదేవి శామంతి కుందనపు శిత్తాల పట్నాన ఉన్నాది
అనంత కాలాలచాటి ఆకాల విధి యనె శక్తి
ఉసికెతత్వము ఆవల ఉమ్మతత్వము
ఉమ్మ తత్వం ఆవలకొత్తం
నిప్పుల సముద్రము-నీళ్ల సముద్రమును
పాల సముద్ర మని యేటి భగీరథియు
కచ్చకోరెంద అల్లు దామర
కలమెలగి యున్నాది కానరాకుండ-మనసుగిరి
కొండలు మహామ్మేరువులు దాటి-హేమగిరి
దీపెంతాల జీవి గడ్డన-ఏడాకులు మర్రికింద
యేడాకుల దోత్తానం బరుసుకోని-కొందటి
రాజుల శిరస్సులు దెగబార నరికినాది
కాదన్న రాజులబట్టి కంచాన మంచాన ఎడ
బాపినది. లేదన్న రాజుల లేమిడి జేస్తున్నాది
తూర్పున సుల్తాండ్లు, పడమట భల్లాండ్లు
ఆ భీర్లు గాంభీర్లు-ముఖా
మూడు కండెల రాజుల-కంటిలో పుట్టే
నెరుసు నన్నాది. ఎన్నున ఉండే గాలాన్న
న్నాది-పక్కన ఉండే రణాసురియ నన్నా
ది-అటువంటి ఘనశక్తి వత్తి లేక
తైలం లేక-అఖండ వీర జనదాత్రై
ఏనూరు కోట్ల భూమండలంబుఎలుగు తు
న్నాది కొలిచిన రాజుల కొంగున బంగా

రమిస్తూ ఉన్నాది. కొలపని రాజుల బట్టి
కోర్లికు దార్పన జేస్తూ ఉన్నాది."—

అని చెప్పెను. మాంధాత కోపించి,

"రే మంత్రి శేఖరా-రాజ ప్రధాని
సభలోన ఆడదాన్ని సాటి దెచ్చితివి
సబుకుల వేయింతు సైసుమనెదాన్ని
అడుప వాని కాల దాన్ని గట్టించి
వీధిలో వేగింతు ఇల కంపటిల్ల"
అని, "ఆడు దైవము, తొత్తు
అది యనగ నెంత'' యని
శక్తి బొమ్మను చేయించి

''యేనుగ కాల గట్టించి, కొట్టింపగా, అమ్మవారికి ''యారగొలంత''
దెబ్బ యీపున దేలె''—అప్పుడు శక్తి రాజుపై కత్తి గట్టి,

''ఎంట బడి రాజ్యంబు ఏక తొలగింతు
పంట విషములు బట్టి పద్మాక్షి విధియు
మన్నీల నురుమాడిన మాంధాత నిపుడు
పనిబకి మాంసంబు పట్టి తరిగింతు
బద్రేశి ఆయుధాలు పట్టిన చేతుల్ల
కొడువలి బట్టించి కూలి చేయింతు
చెట్టికి సతినిచ్చి చెడి యటుబోగ
పట్టి ఉసికా రోన మట్టుదు వీన్ని
అయోధ్య ఒక తెరువు ఆలి ఒక తెరువు
తనయులు ఒక తెరువు తాను ఒక తెరువు
ఇద్దరి కొమాండ్ల నిటుసటు జేసి
మద్ది చెట్ల కింద మట్టుమ వీన్ని''

యని పంతము పట్టినది. రాజు మాఱువేషమున వచ్చి, జూదమాడి, యాతఁడు తన సర్వస్వమును గోల్పోయి యాలు బిడ్డలతో నడవి కేగునట్లు చేసినది. అడవిలో సెట్టి నొకని కల్పించి, వాని యాదరమున సకల పదార్థములు వానికడ నుండి రాజు గ్రహించి, యనుభవించునట్లు చేసినది చివరకు సెట్టి యా పదార్థముల కొఱకై రాజును నిలువరింపఁగా, రాజు కొడవలి చేబూని కూలి చేయవలసి వచ్చెను. కూలి తెచ్చుకొనుటకై రాజు భార్య విమలాంగి సెట్టి కడకు పోగా నాతఁ డామెను బలాత్కరింపబోయెను. ఆమె పతివ్రత యగుటచే చేరువనున్న బోషాణపు పెట్టెలో చేరి తలుపు వైచుకొని భర్తృహస్త స్పర్శవలనగాని యా మూత విడకుండునట్లుగను అది నిప్పున కాలకుండ నీట మునుగకుండ నుండునట్లును కట్టడి చేసెను. భార్య జాడ తెలియని రాజు చింతాక్రాంతుఁడై తన యిరువురు కొడుకులను దీసికొని పోవుచు మధ్యనొక యేరడ్డము రాఁగా దానిని ఒక్కపరి బిడ్డలతో దాటుట కష్టమని గ్రహించెను. అంత ఒకనిని ఈవలివైపున చెట్టునకు గట్టి, ఒకనిని గొనిపోయి యావలి వైపు చెట్టునకు గట్టి మఱల రెండవ వానితో నేరు దాటవచ్చుననుకొని యేటిమధ్యమునకు వచ్చిన రాజును ఇసుకదుమారముకల్పించి శక్తి అందు పూడ్చివైచెను. రాజు పురాణముల యందలి నలమహారాజువలెను హరిశ్చంద్రుని వలెను నరణ్యముల యందష్టకష్టములు పడుచున్నను, శక్తియొక్క పరమోత్కృష్టతను అంగీకరింపలేదు. అడుగడుగునకును 'ఈదెమ్మ' నా పారమ్యము నంగీకరించినచో నిన్ను సుఖపెట్టెదనని యాశ చూపించుచున్నను రాజందులకు లొంగలేదు. చివరకు రాజు పరమేశ్వరుని ప్రార్థించుటయు, నా స్వామి వెనుక తాను మాంధాత కిచ్చిన మాటను పురస్కరించుకొని, యాతనిని సైకత సమాధినుండి యుద్ధరించి కరుణించుటయు జరిగెను. అంత విధియు చేయునది లేక రాజుతో రాజీపడి, యాతనిని భార్యాపుత్ర సమేతునిగా, నాతని రాజ్యమునందు ప్రతిష్ఠితునిజేసి శుభము లిచ్చి యాదరించును. ఆ విధముగా మాంధాత, శక్తిపై విజయమును చాటి నాయకుఁడై వీరరసమున కాలంబనప్రాయుఁడయ్యెను. ఇందు సంప్రదాయ సాహిత్యమునందలి జయప్రదాపురూరవుల గాథయొక్క ఛాయలు కాన్పించుచున్నవి. రాజు జూదములో నోడుట, అరణ్యమున నష్టకష్టములను పడుట, పరీక్షల కాగి చివరకు విజయము కాంచుటయను కథనపద్ధతి జానపద బుద్ధి జన్యమగు కల్పనాసరణి యగుటలో నాశ్చర్యములేదు. నలకథ, హరిశ్చంద్రగాథయు, అంబరీషుని కథయు, రుక్మాంగద కథయు కొంత

వరకు సిరియాళ కథయు నిట్టివే. ఆ విధముగా నాలోచించినచో భారతము నం దుపాఖ్యాన రూపమున వెలసిన నలకథ, హరిశ్చంద్ర గాథలకు మూలము జానపద బుద్ధియే యనవలయునని మనసు కలుగుచున్నది.

3. ఈ వీరగాథా నిర్మాణమునందలి మూడవ పద్ధతి, నాయకుఁడు తన శత్రువుపై పగ తీర్చుకొన నిశ్చయించి తన్నిశ్చయ సాధనకై విడువని పట్టుదలతో శ్రమించి సాధించుట - ఈ విభాగము క్రింది కించుమించు చారిత్రక గాథ లన్నియు వచ్చిచేరును. తమ కన్నుల యెదుట జరిగిన చరిత్రాంశమును కైగట్టి పాటలు పాడుట జానపదకవికి సహజమేయైనను, అట్టి చరిత్రాంశముయొక్క నిజ స్వరూపము స్వల్పమును, దాని చుట్టును అల్లఁబడిన కల్పితాంశముయొక్క పరిమాణము అధికమును నై యుండుట, ఏ చారిత్రిక గేయగాథ యందైనను మనము గమనింపవచ్చును. చారిత్రక వ్యక్తులు నిజజీవితమున సామాన్య మానుష గుణములు గలవారే యైనను, జానపదుని కల్పనయందు వారికి అతి మానుష శక్తులాపాదింపఁబడుట కాన్పించుచున్నది. సత్యాంశమును ఉన్నది యున్నట్లుగా కథనముచేయుట యందాస్థ చూపని జానపదకవి, దానికి చిలువలును పలువలును గూర్చి అద్భుతావహమగు నంశముగా మలచి జనరంజకమగునట్లుగా దానిని తీర్చి దిద్దుటయందు శ్రద్ధచూపును. అందువలన నీ గాథలు కేవల వీరగాథలు మాత్రమే కాక, జనమానసముల నద్భుత రసమగ్నములుగను చేయుచున్నవి. కావుననే కొందఱిట్టిగాథలనుఅద్భుతరసప్రధాన గాథలని యు పేర్కొనిరి.[22] కాటమరాజుకథ పల్నాటి వీరులకథ, బొబ్బిలి యుద్ధము, పెద్దాపురపు కోడిపందెములు, సారగమ్మ కథ, నల్లసోమనాద్రికథ, రాజారామేశ్వర రావుకథ, సదాశివరెడ్డి కథ, దేసింగు రాజు కథ - మొదలగునవన్నియు నీ విభాగములోనివిగా స్వీకరింపవచ్చును. వీరరసమున కాలంకారికులిచ్చిన వివరణమునకు సరియైన లక్షణములనఁగు పాత్రలచే రాణించుకథలివి ఇందు నాయక ప్రతినాయక గతమగు పరస్పర మాత్సర్యము ద్వేషము, స్పర్థ ఒకరినొకరు నాశముచేసికొనవలయుననెడి యుత్సాహము, మొదలగునవన్నియు స్పష్టముగా చిత్రింపఁబడి, తత్పర్యవసానముగ పరస్పరాయుధ సంఘర్షణమున రూపుకట్టిన సంకుల సమరము ఒనగూడుట జరుగుచున్నది.

---

22 డా. బి. రామరాజు - తెలుఁగు జానపద గేయ సాహిత్యము

ఈ కథయందు నెలకొన్న చారిత్రకాంశములకంటె వీరారాధనాంశము వల ననే యీ కథాగేయము ప్రశస్తి పొంది జనజీవితమున పాదుకొన్నదనుటలో విప్రతి పత్తిలేదు. తాను వసించుగడ్డపై జనజీవితమున సంచలనము కలిగించునంతటి పటిష్ఠమగు సంఘటన యేదేని జరిగినచో, నట్టిది సర్వథా జానపదుని హృదయ మున సంచలనము కలిగించుటయు, నది పదరూపమున నావిర్భవించుటయు జరుగును. అట్లావిష్కరించు కవి హృదయమునకా సంఘటనయొక్క బలము గ్రహింపునకు వచ్చినంతగా దానికి సంబంధించిన చారిత్రక విషయములను, సాంఘిక, మత, రాజకీయాదులగు వివిధాంశములును గణనకురావు. ఏది జాన పదుని హృదయాకర్షకమో అట్టి యంశమీ గాథలయందు వీరారాధనాంశమే. ఆ కవి, యే పక్షమును గైకొనక, బ్రహ్మనాయు నెంత యభిమానించునో నాగమ్మను నంతయే ప్రశంసించుచు కథ నడిపింపగలుగు నుత్సాహ పౌష్కల్యము కలిగియుండును. ఈ వీరగాథయందు, కథకుని యాప్తి ననుసరించి పాత్రలు భౌమపాత్రలైనను, కథచరిత్రాంశము కలిగినదైనను, తాను కల్పించిన, తనకు తనజాతియొక్క పురాగాథా (Mythical) పరిచయముచే నచ్చిన, యభౌమాంశ ములను చొన్పుట జరుగుచున్నది అట్టి యంశముల చేరికవలననే సామాన్య వీరుని వీరత్వము శతధా గుణీకృతమగును. వాఁడు పూజార్హుఁడుగను, సామాన్య జన మానస సమ్మోహన కారుఁడుగను భూరి జానపద హృదయములయందు చిరప్రతిష్ఠితుఁడగుచున్నాఁడు పల్నాటి కథయందును నట్టి యంశములు కొల్లలు. ముఖ్యముగా పురాగాథలను (Myths) బోలిన యంశము లెన్నియేని యిట్టి చారిత్రక వీరగాథలయందు ప్రవేశ పెట్టబడినవి.

1. పల్నాటి యుద్ధమునందు, పాల మాచాపురి యందుండెడి యనుగు రాజు, తాత ముత్తాతలు చేసిన పాపములఁబాపుకొనుటకై జీడి వస్త్రములు ధరించి యాంధ్రదేశమందలి మోటుపల్లెకడ సాగరస్నానము చేయగా నచట జీడి గుడ్డలు తెల్లనై పాపవిమోచనమయ్యెను.

2. అర్వెల్లినాగుతో పందెమాడుటకై బ్రహ్మన్న ప్రత్యేకముగా పానుగల్లున శన్నెశ్వరుఁడను నొక చట్టుక్రిందనున్న చిట్టిమల్లుఁడను కోడిపుంజును

దెప్పించెను ఆ పుంజు విచిత్రమైనదియని పల్నాటికథ చెప్పను.[23] ఆ వైచిత్ర్యమేమనగా, గౌతముని భార్య అహల్యను చెఱచుటకై యింద్రుఁడు సూర్యుడు, శుక్రుడు, కుక్కుటా సూర్యుడు (?) నలువురును బయలు దేరిరి. ఈ కుక్కుటా సూర్యుని కూతవినియే అపరాత్రివేళ గౌతముఁడు అహల్యను విడిచి స్నానార్థమై యేగెను ఇంద్రబీజమువలన వాలియు. సూర్య బీజమువలన సుగ్రీవుఁడును అహల్య సంతానమై వెలసిరి. ఇంతలో మోసమెఱిగి తిరిగివచ్చిన గౌతముఁడు, నలుగురికిని శాపములిచ్చెను, ఆ శాపములిట్టివి. ఇంద్రుఁడు ఒళ్లెల్ల కళ్ళుగల నెమలియై జనించును, శుక్రుడు తూర్పున చుక్కయై పుట్టి యెదురు వచ్చిన వారిని ఆహారముగా (చుక్కెదురు) గొనును. సూర్యుని మొగమున జనులు ప్రాచి కసవూడ్చి పారజల్లుదురు. అంతే కాక అతఁడు కలియుగమునందు మానభంగముల కన్నుల జూచును ఇఁక కుక్కుటా సూర్యుని, గౌతముఁడు

"చేరి తన పూజ చెరిచినందులకు
రెక్కలు రెపరెప అదిర్చి నడిజాములెల్ల

కొక్కరో యని కోడికూతలు కూయుమని పలికె- "సనేశ్వరు సట్టుకింద అర్ధనాల చిటిమల్లువై" పుట్టుమనెను

కలయ కారెంపూడిలోననె తాకార్యము గలదు
కత్తి గట్టినప్పుడె నీకు మరణమున్నాది" యని శపించెను
"ఆ శాపము బొంది కుక్కుటా సూర్య
డంతట దొలగె"[24]

ఈ 'శిటుమల్లు' కల్పన యంతయు ప్రస్తుత కథయందేగాక, కథాంతరమునఁగూడ చోటు చేసికొని యున్నదనుట వలన, వీరగాథకు మూలమైన యా కోడిపుంజునకు జానపమని యాలోచనా వీథియందున్న మమకార మెట్టిదో గ్రహింపవచ్చును.

23. పల్నాటి వీరచరిత్ర- పే. 75 - ఎడి. 1961
24. గౌత పురాణము- నాచే సేకరింపఁబడినది.

3. బ్రహ్మన కృష్ణను దాటుచుండగా నొక మొసలి యాతనిని మ్రింగ బోయెను. మొసలితో నిటియందు మునిగిన బ్రహ్మన్న యస్తమించెనని నాయకులు దుఃఖితాత్ములైరి.

కాని,

''అంత శీలము బ్రహ్మ నాకాలు మొసలి
వింతగా నెత్తుకి వేగంబె పోయి
మునుకొని నది గుండముల త్రిప్ప త్రిప్ప,
కని బ్రహ్మనాయండు గ్రక్కున కినిసి
ఘనమైన మకరిని ఖండింపగాను-''

అది అంతరిక్షమున ముదితయై నిలచి, తనకు శాపము వాటిల్లిన చంద మును, తాను గంధర్వకాంత యగుటయు, ఆదివిష్ణువు బ్రహ్మ యవతార మెత్తి శాపవిమోచనము ప్రసాదించిన తెఱంగును చెప్పెను.

అట్లే ఆవులమందలోఁ జొరఁబడి యుపద్రవము కలిగించుచున్న పెద్ద పులిని జంపగా నదియు నంతరిక్షమున కెగసి గంధర్వుఁడై, శాప విమో చన కారకుఁడగు బ్రహ్మన్న నగ్గించెను.

4. పెను కంచిలో పుట్టిన దొంగయొకఁడు, గుండము గోకర్ణుఁడను రాజును దోచెను. రాజు బంధింపఁబోగా, వాని బలముల నణచి గురజాలకు పారిపోయి వచ్చెను. నలగాముఁడు గోకర్ణుని మాటపై దొంగను బంధించి చంపఁబోఁగా నన్ను జంపుట న్యాయమా యని ప్రశ్నించెను. అంత నాగమ్మ, నాయుఁడు వచ్చినపుడు వానిపైకి సెలవిచ్చి విడుతుము. బ్రహ్మన్నను బట్టినచో నొకపల్లె నిత్తుమనెను. అందులకువాఁడు దురుసుగా మాట్లాడగా రాజు వానిని కొఱత వెసెను. అట్లు కొఱత వేయుట వలన మరణించి, వాఁడా పురికి వీరుఁడయ్యెను. ఇట్లు భూతాకృతినున్న వీరునకు బ్రహ్మన్న చెవియందు మంత్రము గఱపి, యాచారవంతునిజేసి, యింద్రలోకమిచ్చి రక్షించెను.

6. కదనమునకు ముందు, బ్రహ్మన కారెంపూడిని వీర తిరుపతిగా చేయ నెంచెను. అచటి రుద్రభూమినే జరుగబోవు యుద్ధమునకు పొలి కలనుగా నిశ్చయించి దానిని శుద్ధిజేయ నెంచెను.

"ప్రమథావతారులు బలు వీరవరులు
ప్రథన మేదిని యందు ప్రాభవమొప్ప,
ఇత్తుము ప్రాణము లీ యవని నంచు
వచ్చియున్నారదె వైభవం బలర
వీరసింహంబులు వీర నాట్యంబు
సేయుదు రిప్పుడు స్థిరబుద్ధితోడ"

నని, యుద్ధభూమిని పావనము చేయనెంచి వర్షము కురిపింపుమని విష్ణువును ప్రార్థించెను. అప్పుడు లోకమంతయు నేకార్ణవ మగునట్లుగా హెచ్చి వర్షించెను జలమధ్యమునుండి యొక్క పునుక జలముపైన పొర్లాడు కొనుచు వచ్చి బ్రహ్మన్న వద్ద నిలిచి పకపక నవ్వెను. అది బ్రహ్మన్నను వేదమయాత్మునిగను, తార్క్ష్యవాహనునిగను, జలజ సంభవ జనకునిగను స్తుతించి, తాను ద్వాపరము నాటి యుద్ధమున ధూర్జటి నెదిర్చి సమసిన సోముడను రాజుననియు,

"ఇటువంటి కలనిలో నేపున మీరు
కదననాట్యము సల్ప కడు సంతసించి
శంకరుం డింద్రుడు సకల దేవతలు
ఎదురుగా చనుదెంచి యిత్తు రిష్టములు
ఘన పవిత్రులుగా కలియుగమందు
వీర పుంగవులంచు వెలయంగ గలరు''

అని చెప్పెను. ఇంతలో కలనికి కర్త్రియైన శక్తి బ్రహ్మన్నయెదుటనిలచుటయు, నతడామె నగ్గించి, 'సమరంబునకు సాక్షి శక్తివీవ' యనుచు చెప్పి పంపుటయు జరిగెను.

ఇట్లే పల్నాటి వీర చరిత్ర తరువాత నంత ప్రశస్తి వహించి జన జీవితమున పాదుకొనిపోయిన కాటమరాజు కథ యందును నిట్టి యంశములు కొల్లలు.

1. సిద్ధిరాజు సైన్యమును కసిమసంగుటకై ఆది విష్ణువుయొక్క అవతారముగా స్తుతింపఁబడిన, బొల్లావు పూనుకొనును.

2. సృష్టికి మొదట పుట్టిన తాతా జాంబవంతుఁడే[25] జన్మ లెన్నో గడచి వీరభద్రుని వరమున బీరన్నయై పుట్టి, కాటమరాజునకు బాసటగా నిలచెను.[26]

3. కాటమరాజు శ్రీకృష్ణుని యవతారము. గోవర్ధనగిరిని కృష్ణుఁడెత్తి నపుడు దేవేంద్రుఁడు వజ్రాయుధమును విసరెను. కృష్ణమూర్తి యా పిడుగును డాచేతఁబట్టి, విశ్వకర్మను పిలిచి, దీనిచే నొక మంచి ఘంటయు, కొంగ వాల్ కత్తియు జేయుమనెను. ఘంటను పాతాళగణపతి కిచ్చెను. అతఁడా ఘంటను ఆడించుచు, శివపూజ చేయఁగా, తన పూజ చేయక శివపూజ చేసెనన్న కినుకతో, కృష్ణుడు తానే కాటమరాజై పుట్టి. గణపతితో పగడసాల పందెమాడి, తానిచ్చిన ఘంటనే ద్యూత పణముగా తిరిగి గెల్చుకొనెను. ఆ ఘంట బొల్లావు కంఠమును, కత్తి బీరన్న హస్తమును అలంకరించినవి.

కుమారరాముని కథయందు –

1. కంపిలి నాయని భార్య హరియాలదేవి, జటంగి రామయ్య వరమున నొక పండు దెచ్చుకొని భుజించి కుమారరాముని గనెను. దాది సంగ, ఆ పండు యొక్క తొక్కను, గింజను, దిని పోలిక రాముని గనెను.

2. కుమార రాముఁడు ఓరుగంటిపై కెత్తి వెడలినపుడు, కోట వాకిట కాపున్న ఆదిశక్తియు, భేతాళుఁడును, వాని ధాటి కాగలేక పారిపోయిరి.

3. కుమార రామునకు చెండాటలాడ బుద్ధి బుట్టెను. తన జేజినాయన యాడిన చెండును అయిదుగురు జెట్టీలేకాక, కట్టమీది ఆదిశక్తి, కట్టక్రింది గోవింద రాజులు, అంకాళ దేవత కాపుకాయుచుండిరి. ఆ చెండును దెచ్చుటకై జటంగిముని వరబలము పొంది కుమార రాముఁడు బయలు వెడలి, వారిని జయించెను.

---

25. జాంబపురాణ మీతని పేర జనించినది.

26. కాటమరాజు కథ–పే. 82–ఎడి. 1953

4. సుగ్నపువాళ్ళ పాతరలో (కాపుపాతర) విరబోయి పడబడిన కుమార రాముని సవతి తల్లి రత్నాక్షి, తాను చావబోవుచు, 'ఢిల్లీలో గుర్రపు చెవియందు మతంగి బూబునై పుట్టి, మగరూపునెత్తి, దండు దెచ్చి, నీ పట్నమును కొల్లగొట్టించి, నిన్ను (కుమార రాముని) జంపి పగ దీర్చు కొందునని' శపథమాడెను.

5 మతంగి బూబు దెబ్బకు, మొండెమునుండి వేరయిన కుమార రాముని తల ఢిల్లీ డేరీ (బురుజు) మీద వ్రాలి కేరున కేక వేసెను. ఆ కేక విని ఢిల్లీ పాదుషా సైన్యమంతయు క్రిందపడి ప్రాణములు విడిచెను. ఆ తల యటనుండి జటంగి రామయ్య దేవళము కడ కెగిరి, వ్రాలి, యావులించి, ప్రాణములు విడిచెను.

సర్వాయి పాపని కథ యందు

1. ఆవులం గాయుచు సర్వాయి పాపఁడు, చెట్టు నీడన నిద్ర బోవుచుండఁగా పండ్రెండుశిరసుల నాగుబాము పడగ నీడ బట్టెను.

2. సర్దారి పాపఁడు 'నాగసర్పం వంటి' తాటి మానును జూచి తన పేరు చెప్పి, 'లొట్టి పెట్టఁగా, చెట్టు వంగి, కల్లు పొంగి, లొట్టి నిండెను.

3. పాపని దౌర్జన్యమునకు భయపడి, దేవళము విడిచి పోవుచున్న యెల్లమ్మ దేవతను, పాపఁడు జడపట్టుకొని యీడ్చుక వచ్చెను.

బల్లూరి కొండయ్య కథ యందు కొండయ్యకు,

1. వీపున వీరహనుమంతుఁడును, కుడి భుజమున, వీనిని పెంచుకున్నుండి యెత్తి చాదిన, బంగరు మైసమ్మయు కలరు.

2. వీని ఆకార సౌష్ఠవమునకు మోజుపడి, ఆరవెల్లి గట్టుపైనున్న శక్తి పన్నెండేండ్ల 'బాలా కుమారిగా' వేషము కట్టి, తన్ను పెండ్లియాడుమని వానిని నిర్బంధించెను.

3. గొల్లకొండను గొట్టిన వెనుక తాను వచ్చిన పనియైనదని భావించి, తన బల్లెమును నాటి, బల్లెముపై బోర్లపడి, కొండయ్య యవతారమును చాలించి వీరహనుమంతునిలో కలసిపోయెను.

ఈ విధముగా, స్పష్టా స్పష్ట చరిత్రాంశములు కలిగిన, బంగారు తిమ్మ రాజు, దేశింగురాజు, సదాశివరెడ్డి, సోమేశ్వరరావు, నల్ల సోమనాద్రి కథలవంటి యనేక వీరగాథలలో నీ యంశములున్నవి. ఇట్టి యద్భుతావహాంశముల సహాయముననే, సామాన్య వీరుడతిలోక వీరుడై జానపద హృదయ సమాకర్షణము చేయగలుగుచున్నాడు.

చారిత్రక వీరులకే యిట్టి కల్పనలు కట్టి పెట్టబడగా నిక కల్పిత వీరుల విషయమున నెక్కించప నక్కరలేదు.

1 ఈ కథలయందు కథానాయకుడైన వీరుని జననము సామాన్యముగా చెప్పబడదు, తల్లి దండ్రులు 'సంతు' లేనివారై యుండి, సాధారణముగా తల్లి, సంతు కొఱకై యరణ్యములలో తపస్సు పట్టబోవును. ఆ తపస్సు ఫలముగా నాయకుడుద్భవించును చాలకథలయందు, పరమేశ్వరదత్తమో మహా పురుష దత్తమో యగు ఫలమో, పూవో, యనభవించుట వలన స్త్రీకి కథా నాయకుడు కాగల సంతానముత్పన్నించును. సంతానోత్పత్తికి స్త్రీ పురుష సంయోగము అవసరమనెడి జ్ఞానము లేని ఆదిమదశ యందేర్పడిన,యభిప్రాయ మీనాటికిని జానపద గాథలయందుపరంపరగా కన్పించుచునే యున్నదనుట కిట్టి కథ లాధారములు.

2 కథానాయకుడు తన వీరత్వమును నిరూపించుకొనుటకై, యభిహిత కార్యాచరణము నందనేకములగు నడ్డంకులకు లోనుకావలసి వచ్చును. అట్టి పట్టుల, రాక్షసులు, జంతువులు, ప్రతిపక్షపు వ్యక్తులు, కొన్ని యెడల సన్నివేశములును, నీ యడ్డంకులను కల్పించి వీరునియొక్క పట్టుదలను, బాహుబలమును, చాతుర్యమును వెల్లడి చేయుట కనువగు పరిస్థితులకు కారకులగుట సంభవించును.

3. వీరుడు సాధింప బూనుకొన్న యొక వస్తువో, సుందరియో సామాన్య శ్రమచే లభ్యమగు నట్టిదికాక, అతి మానవమగు శక్తివలన మాత్రమే సాధింపదగు నట్టిదియు, నా శక్తి వాని కనుగుణముగా నుండునట్టిదియు నగును.

4. వీరునకు ప్రతికక్షుల వలన ప్రాణాంతకమగు నాపద, మరణము, వంటివి కలుగునట్టి పట్టున దైవముయొక్క కరుణచే వాఁడాపదల నుత్తరించుట, తిరిగి బ్రతుకుట వంటి యద్భుత కార్యసంధానము కాన్పించును.

5. వీరునకు తోడ్పాటుగా నుండుటకై దైవదత్తములో, మహాపురుష దత్తములోయగు నద్భుతశక్తి మంతములగు వస్తువులకల్పనము కాన్పించును.

6. వీరుఁడు తన పరాక్రమ స్ఫూర్తిచే బాధితునకు న్యాయము కలుగఁజేసి, సవాలుగా నిలచిన వెనుక, బాధితుని యొక్క స్వపక్షము వారిచే కొన్ని పరీక్షలు జరుపబడుటయు, నందు నెగ్గి యావ్యక్తి తన పావిత్ర్యమునో, నిర్దోషితనమునో తెలుపుకొనవలసి వచ్చుటయు కాన్పించును.

ఇట్టి కల్పిత వీరగాథలన్నియు వీరుఁడైన పురుషుని చుట్టును నల్లఁబడినవే. స్త్రీయందు వీరమున కాలంబనము కాగల లక్షణములు మిక్కిలి యరుదైనను, కొన్నియెడల స్త్రీ గతమగు వీరము నాధారముగా నిర్మించిన గాథలును కలవు. కాని యీ రెంటికిని ప్రధానభేద మొకటి కాన్పించుచున్నది. పురుషనిష్ఠమగు వీరనము కద్భుత మంగముకాగా, స్త్రీనిష్ఠమగు దాని కంగము కరుణముగా కాన్పించుచున్నది. ఈ రకపు కథలలో మొదట చెప్పఁదగినది చిన్నమ్మ కథ సర్వసాధారణముగా జానపద గేయగాథలలో దైవపరమగు గాథలన్నియు శివ పారమ్యమును చెప్పు గాథలుగా కాన్పించుచున్నవి. రామాయణ, భారత, భాగవత గాథల ననుకరించిన పట్టులఁదప్ప, నితరములు కల్పనాగాథలు, విష్ణు పారమ్యమును చెప్పునవి, మిక్కిలి యరుదుగా నిచట కాన్పించును అట్టి యరుదైన వైష్ణవ గాథలలో నొకటి చిన్నమ్మ కథ ఇందలి కథలో ప్రధానాంశము మత వ్యత్యాసము. చిన్నమ్మ విష్ణుభక్తురాలు కాఁగా, అత్తగారి యింటి దేవుఁడు శివుఁడు. విష్ణుభక్తి మానుమని యత్తమామలు చిన్నమ్మను రాచి అంపమున పెట్టఁజొచ్చిరి. అందులకే మాత్రమును జంకని చిన్నమ్మ స్వమతాభి నివేశమును మానదు. స్వధర్మ నిష్ఠమగు నామె యుత్సాహ మిచట స్థాయికాగా నిది ధర్మ వీరముగా పరిగణించుటకు వీలున్నది ఇచటను నద్భుత రసస్పర్శలేక పోలేదు. అన్నిబాధలు పెట్టుచున్నను పల్లెత్తి మాటాడని చిన్నమ్మ కన్ని విధముల మద్దు

లేటయ్య యండదండ యై నిలచెను. చిన్నమ్మను మామ కొట్టబోగా, మద్దులేటయ్య వాని చేతియందలి 'వడిసాల కోల' తెగి నేలబడునట్లు చేసెను. తన్నిన కాళ్లు నొప్పులబడునట్లు చేసెను. ఏనుగంత కడవను ఇరువది యిరువురు మనుష్యు లెత్తలేక యెత్తి చిన్నమ్మ నెత్తినబెట్టగా నలివేలు మంగమ్మ దాని బరువు చిన్నమ్మకు తగులకుండ తన యరచేతియందు నిలిపెను. అట్లే పశువుల కాపరులైన పిల్లలు చిన్నమ్మను బాధించి కడుపు నొప్పిచే బాధపడిరి. చిన్నమ్మను గట్టున గూర్చుండబెట్టి 'యేడుగురు దైవాలు' గడ్డిని కోసిపెట్టిరి. చివరకు మద్దులేటయ్య తమ్మి పెట్టిన పాట్లవలన అత్తమామలును, భర్తయు చిన్నమ్మ గొప్పతనమును గుర్తించి తాముసు వైకుంఠప్రాప్తి నందగలిగిరి. ఈ విధమగు నద్భుత కృత్యములతోపాటు వారు చిన్నమ్మను పెట్టిన హింసల వలన కరుణమును సృజింపబడినది

వీరులు కదన రంగముననో లేక దేవతకు మ్రొక్కుబడిగా కరచరణాద్యవయవములను, శిరమును నివేదించియో, ప్రాణత్యాగము, చేసి వీర శిలలై పూజలందుచున్నట్లే భర్త చనిపోయినపుడు సహగమనము చేసిన పుణ్యస్త్రీలు పేరంటాండ్రై సతీశిలా రూపమున పూజలందు చుందురు. స్వప్రాణ త్యాగమునందు వీరుడనుభవించు తీవ్రత యెట్టిదో సతి యనుభవించు తీవ్రతయు నట్టిదే యనుటలో నసామంజస్యములేదు కావున పేరంటాండ్ర కథలన్నిటిని వీర గాథలుగనే స్వీకరించుట యొప్పును. ఇవి ధర్మవీరమునకు నుదాహరణములై యొప్పారును

ఇట్టి పేరంటాండ్ర గాథలు జానపదులలో బహుళప్రచారము నందున్నవి. ఇందు తలమానికముగా నెన్నదగినది కామమ్మ కథ ఇది తూర్పుగోదావరి జిల్లాకుచెందిన గాథ. భర్త మారెయ్య మరణించుటచే కామమ్మ సాగు మానము చేయనెంచెను. కాని సహగమన నిషేధమున్న యారోజులలో నా పని సులభము కాదు. ఆనాటి యడ్డంకులను, కొన్నిటిని తన కార్య చాతుర్యము చేతను, కొన్నిటిని తన యతిమానుషశక్తి చేతను గడపి, కామమ్మ తన వాంఛితమును నెరవేర్చుకొనుటలో చూపిన యుత్సాహమే యిచట స్థాయి. అదియే యీ కథకెల్లను నాయువుపట్టు వంటిది. అట్టి యుత్సాహ ప్రదర్శన మీ కథయందు చక్కగా ఛేయబడినది, కామమ్మ

"నాకు భూమిలో పీసంబు జాగ యిప్పించూ రెడ్డన్న
గోరెడగ్ని హోత్రంబు దయసేయవయ్యా ఓ మఱది"

యని మఱదికి తన మనసు తెలియజెప్పెను 'కుంఫిణీ కాయిదా' చెల్లుచున్న దనియు, జాతి వారి 'హక్కులు' చాల చెడ్డదనియు, కాకినాడలోని కలెక్టరు దొర చాల చెడ్డవాడుగాన గుండమునకు సెలవీయడనియు, పైగా చెన్నపట్టణపుదొరల యనుమతి గావలయు ననియు రెడ్డన్న వదినకుఁజెప్పెను. చచ్చువారితోనందఱును చావరు. మాయన్న యిచ్చిన యన్నవస్త్రములు నీవేమి యనుభవించితివి, ఈ వెఱ్ఱి బుద్ధులు నీకేల యని మెల్లగా మంచలింపఁబోయెను. అందుకు కామమ్మ.

"అయ్యో విధవ కోటరికము నే జేయలేను ఓ మరిది
నేను పసుపు కుంకుమ లేక గడియేగలేనూ"
పడిపోయిన కుంకుమ పసుపు వస్తుందా ఓ మరిది
పదియేండ్లు బతికినా పడక మానేనా గుండాన'.

యని, తన నిశ్చితాభిప్రాయమును తెలియఁజేసినది.

ముందు తమ యూరిలోని (సామర్లకోట) కప్తాను సెలవు నొందుటకై కామమ్మ కోటలోనికి విడిబడెను. కప్తాను భార్యతో,

"భూమిలో పెనిమిటి చనిపోయినాఁడు దొరసాని
ఇంక మీఁద గుండాలు త్రవ్వించవమ్మా"

అని వేడుకొనఁగా, నా దొరసాని యందుకు కామమ్మను సహగమన ప్రయత్నము మానుమనెను. పసుపు కుంకుమల మీదనే యంత మనస్సున్నచో, మఱది రెడ్డన్నను పెండ్లాడుమనెను. అందుకు కామమ్మ 'నారాయణా' యని చెవులు మూసుకొని,

"నీతి కారణమా జాతి కారణమా దొరసాని
కులము కారణమా గుణము కారణమా దొరసాని
మారుమనువు పెండ్లి మా యింటలేదు దొరసాని"

అని కట కట పడి, క్రుద్ధయై,

"పని ఉండే సత్యాలు చూపుతున్నాను దొరసాని
ఇలమీద నా సత్యమిక జూడవమ్మా దొరసాని
అంతలో మాయ కడుపునొప్పి కలిపించినాది కామమ్మ"

ఆ నొప్పితో దొరసాని 'గిజగిజా యొకజాము కష్టపడి, కన్నులు తేలవేసెను. దొరగా రేగుదెంచి,

"చెల్లు చెల్లు నే కావమ్మ నీకు చెల్లు కావమ్మ
పోయిన ప్రాణాలు బొంది కొస్తేను కావమ్మ
మా తోటతో నున్నావి చాపరాళ్ళమ్మా కావమ్మ
చాపరాళ్ళు గొట్టి గుళ్ళు గట్టింతూ కావమ్మ
ఒక యేడు తిరణాల నీకు చేయింతూ కావమ్మ

అని ప్రార్థించి, గుండమునకు చెన్నపట్టణపు దొరల సెలవు తెమ్మకొమ్మనెను.

అందుచే ముందుగా, కాకినాడ యందలి కలెక్టరు దొరగారి యనుజ్ఞ కావలసివచ్చెను. అతఁడు సుముఖుడు కాడు. అంతకు ముందు చిన్నమ్మ యను మాలపడుచు తన భర్త చనిపోఁగా గుండమున బడుటకై యనుజ్ఞ వేడెను. దొర యామెను పరీక్షలడిగెను. అంత చిన్నమ్మ, ఎఱ్ఱగా కాల్చిన జోడు ఫిరంగి గుండ్లను చేతఁబట్టి బంతులాడినది. ఆ గుండ్లను నలిపి పసుపు చేసినది. అట్లు చేసిననే గాని వాని మనస్సు కరుగలేదు. ఈ వృత్తాంతము వినియు కామమ్మ జంకలేదు. కలెక్టరు దొర, కామమ్మను పండ్రెండు పారాలలో నుంచి పైన "బెత్త మాడించె"ను. ఏడు రోజులు అన్నము నీళ్ళను లేకుండఁ జేసెను. ఏటి యిసుకలో నెట్టని యెండలో నిలవేయుంచెను. అయినను,

"నిమ్మపండ్ల ఛాయ వస్తువున్నాది కావమ్మ
తొడిగిన రవికలు పిగిలి పోతుండే కామమ్మకు"

కలెక్టరు, సామర్లకోట యందు మారయ్య శవమట్లే యున్నదని యెఱిఁగి దానిని దహనము చేయించుమని కొత్వాలునకు ఉత్తరము వ్రాసెను.

అక్కడ బలవంతముగా మారయ్య శవమును "దాది నిమ్మలో పండ బెట్టి" దహనము చేసిరి. శవదహనము జరుగగనే, యిచట పారాయందున్న కామమ్మ ప్రాణములు పోయెను. ప్రాణములు పోయినవి గదాయని యామెను పారానుండి యీవలికి తెచ్చి మఱదియు పినతండ్రియు గృహాభిముఖులు కాగా, కొంత దూరము రాగానే కామమ్మ తెప్పున కేకవేసి కూర్చుండెను. 'బ్రహ్మ పట్నందాకా నే జూడబోతిని. బ్రహ్మదేవుడే నాకు సెలవిచ్చెను. చెన్నపట్నము నేనే బోయి దొరలవద్ద సెలవు దెచ్చుకొందు" నని కామమ్మ చెప్పెను. ఆ యూరి కధికారి యగు పాపయ్య కుంటివాఁడు. నేను చెన్నపట్టణమునుండి దొర సెలవు తెచ్చిన వెనుక సాపుర్లకోటనుండి నీకు కబురు పంపెదను కాళ్ళులేని నీవు నడిచి వత్తువు. వచ్చి గుండములు త్రవ్వించి నా సాగుమానమున కన్ని యేర్పాటులును చేయుమని వానికి కామమ్మ చెప్పెను ఆటనుండి యింటికేగి, వెలుగుచున్న మారయ్య కాష్ఠమునుండి "మూడు దోసిళ్లగ్గి" వడి గట్టెను. క్రొత్త పిడత నొకటి తెప్పించి, రాగికొమ్మ తెప్పించి, ఆ కొమ్మ నా నిప్పులో పూడ్చి పెట్టెను, మారయ యస్థులేరి క్రొత్త పిడతలో నుంచి యా రాగికొమ్మకు వ్రేలాడదీసెను. ఆ కొమ్మ చిగురువేయుచు రోజుకు బారెడు సాగుచు కామమ్మ సత్యము వలన వృక్షము కాసాగెను. ఆ చెట్టుకు అరుగుచేసి, దానిని కాపాడుమని పినతండ్రితో జెప్పి, నట్టింట "దర్భగడ్డి" చాప పఱచుకొని, యింటికి తాళములు వేసికొని. నేను తీయుమన్నప్పుడు తలుపు దీయుమని మఱదితోఁజెప్పి, చాపపై పండుకొని "హరినారాయణా" యనుచు జీవము వదిలెను. జీవము వదిలి పసిడి బొమ్మయై చెన్నపట్టణములోని. 'వాలీసు మేలీసు లూకాసు లోకాసు, దొరల కలలలోనికి వెళ్ళి, వారికి తన సత్యము చూపించి, దారి తప్పిపోయిన వారితమ్ముని తిరిగి రప్పించి, యెట్టకేలకు గుండమున కనుజ్ఞలు తెచ్చుకొనెను. అభిలషిత కార్యసిద్ధికై యిన్ని పాట్లుబడి చితియందు దూకిన కామమ్మను వీరవనితయే యనఁజెల్లును.

ఈ కథ ననుసరించి సాగిన కథలు మరికొన్ని గలవు. విశాఖ మండల మున సన్యాసమ్మ కథ, కృష్ణామండలమున పాపమ్మ పేరంటాలు కథయు నిట్టివే, "సహగమన నిషేధము" న్యాయమైన కాలమున, జానపదులలో కలిగిన కలవర మునకును, వారి యూహలయందు దానిపై నేర్పడిన ప్రతిఘటనకును ఇట్టి కథలు సూచకములని చెప్పవచ్చును- తూర్పుగోదావరీ ప్రాంతపు కామమ్మయు, విశాఖ

ప్రాంతపు బాలసన్యాసమ్మయు, కృష్ణాజిల్లాకుఁ జెందిన పాపమ్మయు నొక్క రకపు పాత్రలే. వీరు సహగమన నిషేధకాలములో 'సాగుమానము' చేసిన యుదంతము నిజమగునో కాదో గాని, జానపదుని యూహల యందలి ప్రతి ఘటనకు రూపము నేర్పఱచిన ముఖ్య పాత్రలివి. సాధారణముగా జానపద గాథలయందు ఒకే కథాంశము వేఱు వేఱు ప్రాంతములలో నామభేదములతోఁ గాన్పించినచో, నా కథ యెచటనో యొకచోట పుట్టి మిగిలిన ప్రాంతములకు పయనించినదని యూహించు పద్ధతి యొకటి గలదు. ఈ మూఁడు కథలలో నేది దేనికి మాతృకయో చెప్పుటకు వీలులేదు. కాఁగా, మూఁడును, సమకాలిక సంఘటన వలన ప్రధావితములై దేని కవిగా జనించినవని చెప్పుకొన్నను, అందసామంజస్య ముండఁబోదు.

కామమ్మ కథ వలెనే తీవ్ర ప్రకృతి కలిగిన మరియొక గాథ గాంధారి కథ ఇందలి కథాంశము వేఱైనను నిదియు స్త్రీ నాయకమైన వీరగాథయే యనఁ జెల్లును.

కథానాయిక యగు గాంధారి బహుముఖములుగా వాటిల్లెడి యడ్డంకులను తన వాకచక్యముచేతను, బుద్ధి కౌశలము చేతను దాటి, తన మేనత్త కొమరుని, వివాహమాడుట యిందలి కథాంశము. పురుషుడు తాను కోరిన పడుచును పెండ్లి యాడుటకై ప్రతి నాయకుని జయించుట, అవరోధములను అధిగమించుట, యను నంశములతోఁ గూడిన కథ సర్వ సాధారణముగా వీరగాథలయందు కన్పించును. ఇచట స్త్రీయే తద్వ్యతిరేకముగ, తాను కోరిన పురుషుని వైముఖ్యమును గూడ నధిగమించి వానిని తన యెడల సుముఖుని జేసికొని, వాంఛితార్థమును బొందుట చిత్రింపఁబడినది. ఈ గాథను గూర్చి శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారొక యభిప్రాయమును వెలిబుచ్చిరి. కాకతీయ సామ్రాజ్యమును పాలించిన రుద్రమదేవి వివాహగాథయే యిది యని వారి యుద్దేశ్యము. ప్రజలు రుద్రమను మహా మాంత్రికురాలనుకొని యుండుట చేతను, గాంధారి కథయందు మాంత్రిక చర్య లుండుట వలనను, వారామెయే యీమెయని నిర్ణయించినట్లుగా తెలియవచ్చు చున్నది.[27] ఇట్టి నిర్ణయము లవిచార మూలకములు. దీనిని సమర్థించుటకు గాని,

---

27. శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు- బాల-ఆగస్టు 1953

కనీసము, దీని కాలమును నిర్ణయించుటకు గాని తగిన యాధారము లీ గ్రంథ మున లేవు.

ఇందలి తాంత్రిక వ్యవహారములను పరికించి, శ్రీహరి ఆదిశేషువుగారు "ఈ కథారచన పరిశీలించగా మల్లమ్మ భక్తులు తాంత్రిక విధానాలలో నిమగ్నులైన 11-12 శతాబ్దాలలో జరిగినదేమోనని ఊహించవలసి వస్తోంది." అని దీని కాల నిర్ణయము కొంత విశదముగా చేసిరి.[28] ఈ నిర్ణయము నందలి సామంజస్యమును పరిశీలించుటకు కుండిచట స్పష్టము చేయబడిన తాంత్రిక చర్య లెట్టివో పరిశీంచుట ముఖ్యము.

1 గాంధారి వడ్లవులబడిలో బ్రాహ్మణ అయ్యవారి చాపక్రింద నున్న 'మంత్రాల పుస్తకము' సంగ్రహించెను.

"ఆ పుస్తకంలో ఏమేమి యున్నవి. శక్తి పంపు, శాంభవి పంపు, హనుమంతు పంపు వీరభద్రపంపు, భేతాళ పంపు. భైరవి పంపు, శక్తి ముగ్గు, శాంభవి ముగ్గు. హనుమంతు ముగ్గు, భేతాళ ముగ్గు, భైరవి ముగ్గు" ఇవి యన్నియు గలవు.

2. గాంధారి శక్తిని లేపవలయునని యొకచో గోమయముతో నలికి, హోమ గుండ మేర్పరించి, మంత్రాక్షతలను పిడిగట్టుకుని, మానెడు నలుపు, మానెడు ఎరుపు, మానెడు తెలుపు, మానెడు పసుపు, రంగవల్లి (ముగ్గు వేసి, హోమమును పేల్చెను అంత మందికిని "ఒక్క సమముగ" శక్తి పుట్టెను. ఆహారము కావలయునని యడిగెను.

3. అట్లే కాలభైరవుని, భేతాళుని లేపెను.

గాంధారి మంత్రాలను వల్లించి తాంత్రిక విద్య నేర్చుట వలన కథాగమనమున కలిగిన మేలెట్టిది ?

1. ఒకసారి పదమూర్గురు 'ఝుట్టీలు' బాలరాజును కట్టి గాంధారిని పల్లకిలో వైచి తీసుకొని పోవుచుండగా, గాంధారి 'గోరెడక్షింతలు' చేతఁబట్టి,

28. శ్రీహరి ఆదిశేషువు-జానపద గేయ వాఙ్మయ పరిచయము-

వీరభద్ర కవచము పఠించెను విభూతి అక్షింతలు అభిమంత్రించి వేయగా పదముగ్గురు 'ఋష్టులు' లేచి కలుసుకొనిరి

2. గాంధారిని పెండ్లాడవలయునని సోమకరాజు తాండిలపట్నము (గాంధారి పుట్టిల్లు) నకు రాఁగా, గాంధారి తెలిపిన భేతాళుఁడు సోమకుని పురమగు వాలుగొండ లోని జనుల నందఱిని మ్రింగి యూరు పాడు బెట్టెను

3. బాలరాజు తన భూమికిఁబోవలయు ననఁగా గాంధారి కాలభైరవుని లేపి తన తండ్రి యగు దేవేంద్రుని వద్దకి రెండు ఱెక్కల గుఱ్ఱమును దెమ్మనెను. వాఁడా పని సాధించి పెట్టెను. శక్తిని లేపఁగా, నడియడవి యందు పట్టెమంచము దెచ్చి యుంచెను.

4. వీరభద్రుఁడు, కాలభైరవుడు, ఆదిశక్తి, వీరహనుమంతుఁడు భేతాళుఁడు ఈ ఐదుగురును తాండిల పట్టణమును ముత్తలు నాలుగు వైపుల నెత్తి మోసుకొని వచ్చి యడవిలో నిలిపిరి.

5. గాంధారి కడకు, ఆమె తల్లిని పద్మగంధిని భేతాళుఁడు కొని వచ్చెను.

ఇట్టి కథాక్రమమును బట్టి చూడగా ననేకాద్భుత చర్యల తావాలమైన కల్పిత వీరగాథ లెన్నియో యుండవో, యిట్టి చర్యలను, ఇటువంటివే భేతాళుడు, శక్తి మొదలగువారి విజృంభణమును కన్పడుచునే యున్నవి. ఆ చర్యలకంటె గాంధారి కథ యందలి యీ యద్భుత చర్యలే అధికముగను విశిష్టముగను, తాంత్రిక రహస్యములను ప్రత్యేకముగా, అందును పర్వతాల మల్లయ్య భక్తులు మాత్రమే యవలంబించు విశిష్ట పద్ధతి తోడను రూపొంది యుండలేదు. ఈ విషయమును అవగతము చేసికొనుటకు కొన్ని వీరగాథలలోని యద్భుత చర్యలను పరికించుట యుక్తము.

1. గాంధారి కథకు తోడి జోడనఁదగిన 'కమ్మవారి పణతి బాలరాజు కథ' లో, బాలరాజు కోరినట్లుగా పణతి ఒడిలో నేడు చెంబుల నీరు మూటఁగట్టి తెచ్చెను. అందుకు బాలరాజు,

"ఓ బావా,

కట్టుబోతుల విద్య నేర్చినావు మాయకారుల విద్య నేర్చినావు
ఎల్లమారమ్మ పదవులు నేర్చినావు మంత్రాలు తంత్రాలు నీవు నేర్చినావు

తోడు బోతుల విద్య నేర్చినావు దుష్టమార్గుల వరుస నిలిచినావు"
అని నిరసించెను.

ఇట్టి తాంత్రిక విద్యలు నేర్చిన పణతియు మఱియొక రుద్రమదేవి కావలసి వచ్చును. కాఁగా ఈ విద్యలన్నియు పర్వతాల మల్లయ్య భక్తులు మాత్రమే ప్రచారములోనికిఁ దెచ్చిరనుట కాధారమేమియు నెచటను కాన్పింపదు-

2. పెండ్లి వలదని పణతిని వదలివైచి బాలరాజెటకేని పోఁగా, పణతి భేతాళుని దలచుకొనెను భేతాళుఁడు పోవువానిని పెద్దపులియై యడ్డగించి, వానిని తిరిగి పణతి కడకు తెచ్చి విడిచెను.

ఇట్లు భేతాళుఁడామె వశమగుటకు కారణము, మాఱు వేషమున నారదుఁడు వచ్చి తన్మంత్రము నుపదేశించుట

3. కామమ్మ కథయందు, గుండఋున దూకమన్న కామమ్మ ప్రతిభతగ్గించుకై "మాదిగ యొకఁడు", పంచవన్నె ముగ్గులు నట్టింటవేసి, పసుపుకుంకుమ యందు ఎల్లమారెమ్మను పంపు చేసెను.

4. పల్నాటి వీర చరిత్రయందు

నాగమ్మ గురజాలలో నున్న కట్టుబోతునెల్ల రప్పించి, "మము వలసిన వారు మది నరలేక

మంత్ర తంత్రాదుల మాయల నేడు
నెరితత్త్వముం జూపి నెగడగ వలయు"

ననఁగా,

వారు

వాకట్టు మరకట్టు వణకెడు కట్టు
పొట్ట పొంగెడు కట్టు పొంగుల కట్టు

కూతపెట్టెడు కట్టు కోపించుకట్టు
ఎండిపోయెడు కట్టు ఎగరెడు కట్టు
వీధి జారెడు కట్టు బెగడెడు కట్టు
కాళ్లను చేతులు కదలని కట్టు
ఎక్కసక్కియకట్టు నేడ్చెడు కట్టు
కుంది కందెడు కట్టు గుడికొనుకట్టు
ఓకిలింతల తోడ నొరలెడు కట్టు
ప్రాణంబు పోయెడి బలుపైన కట్టు
కట్టనేర్తుము మేము కలగ ప్రాణములు
పెద్ద కొండలనైన ప్రేల కట్టుదుము
పారెడి యేటైన పారకయుండ
మంత్రింపగల మమ్మ మనభూమి నెరుగ
మునుకొని మేము సముద్రంబునైన
నింకింప జాలుదు మి మంత్ర మహిమ
జీవంబుగల వాని చెప్పంగ నేల
ఏము కల్గంగ నీకేల బొమ్మ" నిరి–

5. కాంభోజరాజు కథయందు, శరాబందని పట్టవచ్చు యోజన గంధిని జూచి, వానిని తన వెనుకకు లాగుకొని వీరభద్రుడు, మంటికి నేలకు నెగబెరిగి, గదలు చక్రములు, గండ్రగొడ్డళ్లు, శూలములు, విండ్లు, కోలలు, రాళ్ళ వడిసెలలు మొదలగు 'ముప్పై రెండాయుధములు' తీసికొని యోజనగంధి కడ్డమయ్యెను. ఇరువురికిని రాజీ కుదిర్చి వారి వివాహము తానే చేసెను.

6. మొదిమెకోట నాగిరెడ్డి కథయందు, పగవారు పంపిన'బొండిలోడు'తన చేతి క్రింది పదముగ్గురు బోయీలతో కలసివచ్చి, గుఱ్ఱముపై బోవుచున్న నాగి రెడ్డిని నిలవైచెను. వాని తలపై నిమ్మపండు కోసి పిండి "హాం కట్టు" గట్టెను. "నజరు బందనం" జేసెను. "వాకు బందనం" జేసెను. 'ఉసిక' మంతరించి చల్లెను. అంత నాగిరెడ్డి కదలడు, మెదలడు.

7. కుమార రాముని కథయందు పోలిక రాముడు, కిట్టుగట్టి కాపలి వారిసంపజిని మూర్ఛలో మునుగునట్లు జేసి, తాను తన తండ్రి శయనించిన మంచపు రత్నాల కోళ్ళను దొంగిలించి తెచ్చెను.

8. సదాశివరెడ్డి కథయందు ప్రతికక్షి 'సిద్ధి నాడు''మహాకిట్టుబోతు' ''పిడికెడంత మన్ను పట్టి నాడు పటపటమని మంతరించినాడు. రెడ్డిపైన జల్లినాడు. రెడ్డి రాయై పోయినాడు. ఎక్కిన గుఱ్ఱము రాయైనది." అంత దీనికి ప్రతి చేయనెంచి రెడ్డి పాలిత జనములోని ఎఱ్ఱగొల్ల యొకడు, ఐదు నిమ్మ కాయలు మంతరించి, ఒకటి కోసి రెడ్డిమీద వేయగా నాతడెప్పటివలె నయ్యెను. మిగిలినవి సిద్ధివానిమీద వేయగా, "వాడు కట్టేసిన గొఱ్ఱె చందమయ్యెను. కదలను మెదలను వానికి వశము కాలేదు.

ఇట్లుదాహరించుచు పోయిన గ్రంథ విస్తరమగును. దీనినిబట్టి తెలియు చున్నదేమనగా, మంత్ర చర్యవలన నతి మానుషశక్తులను వశము చేసికొని, తన్మూలమున, మనుష్యులకు మేలు కీళ్లు కలిగించుట యనునది, ప్రాచీన మానవుని యాలోచనా విధానమున పరంపరగా పెరుగుచున్న యూహయే. అట్టి యూహలతో నాదినుండియు జానపద మేధ పరిప్లావితమై యుండును. కావున తానల్లెడి వీరగాథలయందు వీరుడైన మానవుడు కేవలము తనవంటి వారిపై విజయము సాధించుటయే కాక తన్ను మించిన శక్తులను కరగతము చేసికొని విజృంభించుటయను నంశముండితీరక మానదు. ఆ యంశమున్ననే గాని, జానపద వీరుని చిత్రణ పరిపూర్ణమైనట్లుగా, కథకునికి తృప్తి కలుగదు. కావున నిట్టి చిత్రణలు చేయుటకు, ఏ పర్వతాల మల్లయ్య భక్తుకో తాంత్రిక చర్యలను వ్యాపింపజేసినగాని, సాధ్యము కాదనుట యుక్తిసహము కాదు నిజమునకు పర్వతాల మల్లయ్య భక్తులైనను, తాంత్రికతకు లోబడిరనగా, నా తాంత్రికత ఎక్కడిది ? వారు కల్పించినదా ? మనుష్యులను మంత్ర తంత్రములచేత వశము గావించుకొనెడి క్రియా కలాపము ప్రాచీన కాలము నుండియు నన్ని యాదిమ జాతులయందును నున్నట్లు నృశాస్త్రవేత్తలు గమనించిరి.[29] తాంత్రికత యందలి

29. Herbert Spencer - Principles of Sociology, J. G. Frazer - Golden Bough Vol. 1 ; Campbell Thomson-Semetic Magic, Its Origin & Development.

షట్కర్మ విధానమున నంగములైన, మంత్ర ప్రయోగము మూలికాధారణ, వశీకరణము వంటి ప్రక్రియలు ఆదిమ మానవ జాతుల మతవిధానమునందు విడువక కాన్పించునట్టివే. శత్రువుయొక్క బొమ్మను సూదులతో గ్రుచ్చియు, దాని అంగ విచ్ఛేదము చేసియు నిజవ్యక్తిని బాధించుట, స్త్రీలను వశీకరించుకొనుట అద్భుతచర్యలను చేయుట, యీ తాంత్రికతయందలి ముఖ్యాంశములు. ఇట్టి తాంత్రికాచారములు ప్రాక్ చారిత్రక యుగమునకు, జెందిన వనియు వానికి సంబంధించిన యంశముల యునికి వైదిక సాహిత్యమున గాన్పించుచున్నదనియు విజ్ఞులు నిర్ణయించిరి.[30] కాన దేశమందనాది నుండియు నల్లుకొనిపోయిన యిట్టి తాంత్రిక చర్యను, మల్లయ్య భక్తులెట్లు గైకొనిరో, జానపద కవులును నట్లే గైకొనవచ్చును. అందువలన కేవలము తాంత్రిక చర్య ఆధారముగా గాంధారి కథయొక్క కాలమును నిర్ణయింప వీలులేదు.

గాంధారి కథకును కమ్మవారి పణతి కథకును దగ్గఱి పోలికలు కలవు. పణతియు నొక వెలమ బాలుని వలచి యాతనిని వివాహమాడవలయునని వెంటఁ దగులును. బాలుఁ డెన్ని పరీక్షలు పెట్టినను నామె నెగ్గి యొకపరి యగ్ని యందు దూకి, యింద్రలోకమున తన తండ్రిని దేవేంద్రను చూచివచ్చును. చిట్ట చివఱకు బాలరాజు ప్రేమ బడసి యాతని వివాహమాడుటలో కృతకృత్యురా లగును.

చారిత్రకాంశములతో గూడి, వీరుఁడు, ప్రతివీరునితో పోరి, సంఘమునో, దేశమునో రక్షించుటకు నడుము కట్టిన కథలవలెనే. స్త్రీనాయకములగు గాథలును గలవు. మహారాష్ట్రమున ఝాన్సీలక్ష్మి జిజియాబాయిలపై ననేకములుగా వెలసిన 'పొవాడె' (స్తుతిగీతము) లిట్టి తెగకు చెందినవియే. తెలుఁగున సారగమ్మ కథ యట్టిదే.

---

30. Chintaharan Chakravarti - The Tantras - Studies on their religion and Literature - Vide Chapter on Antiquity of Tantricism—Pp.10-14.

ఇది ఆదిలాబాదులో ప్రచారములో నున్న కథ. సారగమ్మ (సరియగు రూపము సాగరమ్మ కానోపు) కర్ణాటక దేశములో పుట్టినది. మలకాఫూర్ (మాలిక్‌కాఫూర్) తురకవాని 'యములు' లో తురక దండు దేశమును త్రొక్కి దలించి పైచినది దోపిడి, జన హింస, మానభంగముల వంటి వెన్నియేని నిష్కారణముగ దేశమును పల్లకాడుగా మార్పఁజొచ్చినది అట్టి సమయమున, చుట్టు నున్న గ్రామ స్త్రీలకు శిక్షణ యిచ్చి మహమ్మదీయుల దుండగములు నరికట్టుటకు ప్రయత్నము చేసిన నాయకురాలు సారగమ్మ. వీరి యాయుధము లలో ముఖ్యములైనవి యొడిసెలయు గుప్పెడు కారమును. బూడిదలో కారము కలిపి, శత్రువు చేరవచ్చి దౌష్ట్యము నెఱుప నున్నపుడు, వాని కన్నులలో జల్లి తప్పించుకొనుట సులువగు నుపాయము. చెన్నూరు, మెట్టపల్లి, సిరిపూరులం దెక్కువగా దసిలిపట్టు లభించును. ఈ పట్టు కాయలకు కన్నములు పొడిచి, ఒడిసెలలయందు రాళ్లకు బదులుగా నుపయోగించి శత్రువులను దెబ్బలతో ముంచెత్తుట యీమె స్త్రీ జనమునకు నేర్పెను. బల్గూరి కొండయ్య కథలో కనిపించు, పోలాస, బెల్యాలలు, రెండును సారగమ్మ పరాక్రమమున కునికి పట్లయినవి. 'తోపు గోలాలు' నుపయోగించుట యీ పదమునందు కానవచ్చు చున్నది. సారగమ్మ నాగపురం వద్దనున్న 'ఖలేజ్‌పూర్'లో మహమ్మదీయులచే గాయపడినదట. కాని వారికి ప్రాణముతో చిక్కుట కిష్టము లేక దూసిన బాకుపై నొరిగి వీర మరణము చెందినది ఆమె యనుయాయు లాశవమును శత్రువులకు చిక్కనీయక సమాధి కావించిరి. ప్రతి ఫాల్గుణ పూర్ణిమకును నీమె సమాధి చుట్టును జనులు చేరి యుత్సవములు జరుపుదురు. ఈమె ప్రతాప చర్యలను పదప్రవర్తకులేకాక కలువుతీయు సమయముల యందు పనివాండ్రును పాడుచుందురు.

"ఊరూరిలో ఉడుకుతనం పుట్టించావమ్మా
మమ్మ కాపాడవమ్మా సారగమ్మా
తెలియని వేసాలు వేసి
మము తెర్లుజేసి మోసగించిరి ఓయమ్మా
మము కాపాడినావె సారగమ్మా"–

ఈ విధముగా నా పాటలు సాగును.

కేవలమీ సారగమ్మ కథవలె వీర రస ప్రధానమైనది కాకపోయినను, కరుణతోఁ గూడిన వీరముతో భాసించిన మఱియొక చక్కని కథ వీరరాజమ్మ కథ ఇచట వీరరాజమ్మయు, సారగమ్మ వలెనే వీరము నెఱపిన నారి కాని సారగమ్మ, అవసరమును బట్టి తనలోని స్త్రీత్వమును వెనుకకు నెట్టి శత్రు సంహనన దీక్షా పరురాలై భాసించినది వీరరాజమ్మ కేవలము సంసారస్త్రీ తన్ను రాచి రంపమున బెట్టు అత్తగారి నెదుర్కొను సాహసమైన మాపలేని తెలుఁగుటిల్లాలు. అత్తచే మెడబట్టి గెంటఁబడి, బిడ్డతో దారితప్పి దొంగలపాలిన పడినది. అదనుతప్పి తన మానమునకే భంగము వాటిల్లనుండఁగా, నామెలో చుఱుకుదనము ప్రవేశించెను కన్నకొడుకు తన కన్నుల యెదుటనే కండతుండెములు కాఁగా నామెలో కఱుకుఁదనము ప్రవేశించెను దారినఁ బోవువారి యాదృచ్ఛిక సహాయము వలన, కత్తి చేఁబూని, శిశుహంతకులైన దొంగలను కసిమసంగి యా యావేశములోననే ప్రాణము విడిచినది. అట్టి క్లిష్ట పరిస్థితులు కిమ్ముకొని రానిచో వీరరాజమ్మ వీరనారిగా పరిణమించెడిది గాదు. తలుపులువైచి పిల్లిని గొట్టినను, అది పులియగునన్న విధమున పరిస్థితులు అమాయకపు టిల్లాలిని వీర నారీమణిగాఁ దీర్చి దిద్దిన వైనమీ కథయందు రమణీయముగాఁ జెప్పఁబడినది

ఈ రకపు వీరవనితలలో సారగమ్మ వలె నగ్రగణ్యగా నెన్నఁదగిన కాకతి రుద్రమ్మను గూర్చి, జానపద గాథా కథనము నాకు లభింపలేదు. రాజ్య చక్రమును సమర్థముగాఁ ద్రిప్పఁగలిగి, చరిత్ర కెక్కి రాణించిన యీమె జానపద హృదయముల నెందుకు మెప్పింపలేదో తెలియదు. ఆమె రాజ్యతంత్రజ్ఞత, రాజకీయపు టెత్తుగడలు పామరజనావగాహములు కాని విషయములై, యామె సామాన్యుని యెఱుక కందని యెత్తులలోనే యుండి యుండవచ్చును. లేదా, తెలంగాణపు మారుమూలల నామె వీరచర్యలు జానపదగాయకుల వాగ్ద్వార వినిర్గతములై యింకను వినువారల గుండెలలో వీరమును పరవళ్లఁ ద్రొక్కించు చున్నవేమో తెలియదు-అట్టి గాథలేవైన నున్నచో నవి పరిశోధకులు వెదుకఁ దగ్గవి.

స్త్రీ పరమగు గాథలలో వనితానిష్ఠమగు వీరమును ధర్మవీరముగ (కామమ్మ కథ, సన్యాసమ్మ కథ మొదలగునవి) నెట్లు గ్రహించితిమో, అట్లే వీర భేదములుగ నీ జానపద గేయగాథలయందు, భక్తి వీరమును, దాన వీరమును గూడ గుర్తింప వచ్చును.

జన జీవితమున నొక్కొక్క ప్రముఖ సంఘటన జాతినంతటిని ఉద్ఘాత లూగించును. జానపద మానసములు కూడ నందులకు పులకించి, వారి గళముల నుండి యుత్సాహ పూర్ణములగు క్రొంగొత్తగాథ లుద్భవించును. బసవేశ్వరుని వీరశైవ మతాభినివేశము, వీరమాహేశ్వరులగు జంగముల, కథలకు రూపు దిద్ది తెలుఁగు జాతి యందలి జానపద జన జీవితమును, వారి సాహిత్యమును అలంక రించినది. 12,13 శతాబ్దులలో వీరశైవ భక్తవరుల గాథలు, శైవ యాత్రాస్థల ముల యందు ప్రతి ధ్వనించుచుండెడివి. 'సిరిగిరి'కి నడిచెడి పరుసలో కలసి జానపద గాయక జాతియగు పిచ్చుగుంట్లు, శివభక్తవరుల గాథలను చెప్పుచు బిచ్చమెత్తుకొనెడివారు.[31] వారు వర్ణించిరని సోమన చెప్పిన గాథలలో ముఖ్యము లైనవి, అరియమరాజు, ఏణాధినాథుడు సవరద నాచయ్య, కరయూరి చోడఁడు, సిద్ధరామయ్య, పిరిసిద్ధ రామయ్య, సిరియాలుఁడు మొదలగు వీరభక్తుల గాథలు కలవు-ఈగాథలనుపరికించి చూచినచో నిందలి భక్తినివీరభక్తిగా వర్ణించవచ్చును. ఆలంకారిక పరిజ్ఞానము ప్రకారము, భక్తి రసమగునా కాదా, భక్తియే రసస్థాన మును పొందనిచో దానితో వీరమును జతచేయుట యెట్లు, అను వాదవివాదముల కిచట తావులేదు. ఒక ఆదర్శమును మనము నందుంచుకొని తన్నిష్ఠమగు ప్రత్యగ్ర బుద్ధితో, తత్సాధన కవసరమగు నుత్సాహ ప్రపూర్ణ చిత్తముతో, దానిని సాధించు వానిని ఎట్టి పట్టులనైనను వీరునిగనే వర్ణింపవచ్చును. ఇచటి వీరశైవ భక్తవరుల చిత్తములు జంగమ లింగా యత్తులు గురులింగ జంగ మార్చనయే వారి ధ్యేయము. తద్గతమగు నుత్సాహముచే వారి యెడందల యందు ధన ప్రాణమానముల కాసించని తెంపఱితనము నిండియుండును కావున వారిది వీరభక్తి.

ఇందలి యరియమరాజు, రుద్రాన్యశబ్దము పలికెనని యాచకుఁడైన యొక బ్రాహ్మణుని, తన చేతి యందలి చట్టువముతో జంపి, 'అట్లేల చేసితి'వని రాజ ప్రశ్నించఁగా "చంపిన విధము, చంపంగఁదగు తప్పు శంభుండ యెఱుఁగుఁగాన, చంపఁగ కర్తదేవుఁడ కాక కావఁజంపఁగమీరు గర్తలె"యనిరాజును ధిక్కరించెను. "భవి కీటకములతోడ శివభక్తిపరుని సరిచేసిన" రాజు రాజ్యమున నుండ నొల్లనని శివుఁడు "తనకు పక్షంబుఁదెరువఁగా లింగ గర్భమున జొచ్చి కైవల్యము నందెను.

31. పాల్కురికి సోమన-పండితారాధ్య చరిత్ర-పేజీలు 344-347

సవరద నాచయ్య, తన భార్యకు కవల పిల్లలుదయించు చుండఁగా తన కడ నొక్క లింగమే యుండుటచే, ముందు వచ్చిన పిల్లవానిని లింగధారినిజేసి, రెండవ వాఁడట్లు పుట్టిన వెంటనే లింగధారి కానందున, నా బాలుని మొగము జూడ నొల్లక వానిని బారవేయించెను.

ఏణాధి నాధుఁడు, తన యెదుట నిలచి పోరాడుచున్న దళవాయి భూతి రుద్రాక్షధారి యగుట జూచి కరవాలు పాఱవైచి వానికి మ్రొక్కెను.

ఇట్టి కథల నన్నిటిని పరికించి చూచినచో, నీ భక్తులవలంబించిన భక్తి యందు వీరతాస్ఫూర్తియున్నట్లు గ్రహింపవచ్చును. ఇచ్చటి ప్రతికథ యందును నాయకునకుఁ మత నివిష్ఠమగు నుత్సాహమే స్థాయియై యొప్పారుచున్నది. జాతి మత, కుల వైషమ్యములతో నిండి నిర్వీర్యమైన సంఘమును వీరశైవము, భక్తిపాశబద్ధము జేసి వీర్యవంతముగా నొనర్చినది 32 ఆనాటి వీరశైవులు 'లింగపసాయిత' శస్త్రములనుబూని శివద్రోహులను జైనులను జంపుట ఘోర కార్యమేయైనను, తన్మూలమున నాటి మానవ హృదయాంతర్గతమగు వీరతా స్ఫూర్తి వెల్లడియగు నవకాశము లభించినది వీరశైవ భక్తులు శివునికంటె శివభక్తులను మిన్నగాఁజూచిరి. శివప్రీత్యర్థమై తమ బంధువులను, భార్యలను, బిడ్డలను చివఱకు తమ్మును ఆర్పించుకొనుటకు వెనుదీయరైరి. తమ భక్త్యావేశమున వీరు కన్నులు పీకుకొనుట, నాలుకలు పెఱుకుకొనుట, తలలు తఱుగు కొనుట వంటి యాత్మ హింసాపద్ధతి నవలంబించెడివారు. దీపమునకు చమురు లేనిచో జుట్టు ముట్టించుకొని జీవద్దీపములై వెలుఁగువారును, గుగ్గిలము లేనిచో దేహములను కాల్చుకొని యా పొగతో ధూపములు వేయువారును ఆ కాలమునఁ గలరు. బసవని కాలమున కల్యాణ కటకమున నిట్టి వీరభక్తి ననుసరించు నారాధకులు లక్షల కొలఁది యుండెడివారు.32 సోమన కాలమున శ్రీ శైలము

---

32. శ్రీ చిలుకూరి నారాయణరావు - ఉపోద్ఘాతము. పండితారాధ్య చరిత్ర 1939.

32. డా॥ చిలుకూరి నారాయణరావు-పే. 330 ఉపోద్ఘాతము పండితారాధ్య చరిత్ర ఎడి. 1939.

లోని వీరమండపమిట్టి యాత్మ హనన చర్యలను ప్రకటించు స్థానముగా నుండెడివి. ఇట్లు వీరత్వస్ఫూర్తి కలిగి, ప్రాజ్ఞానవ మేధా సంబంధియగు నాత్మ హనన చర్యకు మిక్కిలి ప్రాచుర్యమును గొని వచ్చిన వీరభటులు వీరే.

వీరతా ప్రతీకలైన యిట్టి శివభక్తుల గాథలు జానపద మనస్సమాకర్షణ చేయుటలో వింతలేదు. నాకు దొరికిన గేయగాథలలో నిట్టివి రెండు గలవు రెండును కర్నూలు ప్రాంతమునకుఁజెందినవే. అందు మొదటిది సిరియాలుని కథ, రెండవది 'సూర్యభాండవ' కథ - రెండు కథలును సాహిత్యకులకు పరిచితములయినవే.

సిరియాలుని కథయందు మిక్కిలి యావేశముతోడను, నుద్రేకము తోడను చెప్పబడిన భాగము, చిఱుతొండడును సంగవ్వయు గలిసి సిరియాలుని చంపి శివయోగి కారగింపుపెట్టిన భాగము.

సురాభాండేశ్వర కథనమే జానపదునినోట 'సూర్యభాండవకథ'యైనది. ఈ కథకు పెక్కుచోట్ల పెక్కురీతులుగా ప్రచారమున్నట్లు తెలియుచున్నది. చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలో 'కలకడ' యను గ్రామమున లింగ రూపియై వెలసిన దేవుఁడు సురాభాండేశ్వరుఁడు. ఒక రాజు కూతురు, సత్యవతి యను నామె భగవద్విలాసముచే నవివాహితగనే గర్భమును ధరించెను. కూతు సుశీలమును నిరూపించుటకై తండ్రియొక కల్లు కడవ నామె తలపై క్రూరాశీ విషమును చుట్టకుదురుగా జేసి యుంచి కల్లు తొణకకుండ, పాము కఱువకుండ నేడు పొలిమేరలు దాటవలయునని కట్టడి చేసెను. ఆమె యా కట్టడిని గడచి నేఁటి కలకడ యున్నచోట కల్లుకడవను దించి, నదీ రూపమున ప్రవహించెను. కల్లు కడవను దించిన చోటు కలకడ యైనదనియు, నామెను కాపాడుమన్న శివుఁడే యట సురాభాండేశ్వర రూపమున భక్తశరణ్యుఁడయ్యె ననియు స్థానికముగ కథలు చెప్పుదురు.[33]

---

౩౩. శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి - పరిచయము - సురాభాండేశ్వరము (రచన - శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి)

నాకు దొరికిన కథయందీ యంశము లేదు. ఒక గౌండ్ల వనిత ఈదులలో (ఈతతోపు) నున్న భర్త కంబలి ద్రావించి తిరిగి పోవుచుండఁగా బ్రాహ్మణుఁడొకఁడామె యందమును జూచి వర్ణించుచు వెంటఁదగిలి యింటికి వచ్చెను. ఆమె పొందు గోరెను. గౌండ్లవాఁడు ఇంటికి వచ్చు నలికిడి విని బ్రాహ్మణుఁడు భయమంది, తన్ను దాచిపెట్టుమనగా నామె పొంగి నురుగులు వారుచున్న కల్లు కుండను జూపెను. భర్తరాఁగా శివబ్రాహ్మణుని తృప్తిపఱచి కల్లుకుండలలో దాచితినని భార్య చెప్పెను. అతఁడు మూతతీసి అందు ఊపిరందక చనిపోయియున్న భసిత రుద్రాక్షధారియైన శివబ్రాహ్మణునిజూచి యపరాధము జరిగినదని శిరఃఖండనము చేసికొనఁబోయెను. అంత నా శవము మాయమై యచట శివుఁడు సాక్షాత్కరించి, యా దంపతులకు కైవల్యమిచ్చెను. కల్లుకుండ యందు సాక్షాత్కరించిన శివుఁడే సురాభాండేశ్వరుఁడయ్యెను. ఈ గాథలయందలి వీరత్వము యొక్క స్వరూపమిది.

ధర్మమును, భక్తిని, ప్రగాఢమగు వీరతావైభవముతో భూషితము చేసినట్లే, దానగుణమును గూడ శోభింపఁజేసిన దానవీరుల కథలును గలవు. అందు నాకు లభించిన వానిలో తలమానిక మనఁదగినది "బుడ్డా వెంగళ్రెడ్డి" కథ.

ఈయన జన్మస్థానము కోయిలకుంట్ల తాలుకాలోని ఉయ్యాలవాడ. తండ్రి నల్లపురెడ్డి. తల్లి వేంకటమ్మ ఈయనకు ముగ్గురు భార్యలు. ఈయన డెబ్బది సంవత్సరములు జీవించి 1900 సం డిసెంబరు 31 న పరమపదించెను. పూవు పుట్టఁగనే పరిమళించునని యీయన యందలి దానగుణము చిన్ననాఁడు బడి చదువుల యప్పుడే వికసించెను. పెద్దవాఁడై తన యింటి యందు నిత్య సంతర్పణ యేర్పాటు చేయుటయేగాక బీదలకు ఉపనయనములు, వివాహములు చేయించెడి వాఁడు. ఆయన ఇంట, ప్రొద్దుటిపూట నిత్యము నూరిలోని పాడిలేని బీదలకు మజ్జిగ పంచు నలవాటుండెడిది. ఎప్పుడును వచ్చు నొక బీదరాలా వేళ నాలస్యముగ వచ్చుటచే మజ్జిగ మిగిలిపోయెను. ఆమె యూరక తిరిగి పోవు చుండఁగా రెడ్డి చూచి, నీవు వేళకు రాలేదు ఉత్త చేతులతో నీవు తిరిగి పోవుట మాకు క్షేమముగాదని యింటికెదనే పాడి చేసకొమ్మని యొక 'మలి చూలి పడ్డ'ను తోలిపెట్టెను.

అట్లే మఱియొక రోజు ఒక బిచ్చగత్తె బయటినుండి "యమ్మా నీ చెమ టకు మాసిన పాతకోక పారవేయుమని యడుగుచుండెను. ఆయన భార్యలలో నొకామె కోపము దెచ్చుకొని "పాతదేమి కర్మ, నీ కొఱకు క్రొత్తది నేయించి దండెము మీద వేసితినని విసుగుకొనెను. అది విన్న రెడ్డి చర చరలోని కేగి యామె కట్టి దండెముపై వేసిన "పుట్టినింటి క్రొత్త చీర" నొకదానిని జూచి దాని నా బిచ్చగత్తెకిచ్చి పంపిచ్చెనట.

అన్నిటి కంటెను మిన్నయైనది, యీయన 1886 క్షయ నామ సంవత్సర మున దేశమునల్లకల్లోలము చేసి వైచిన "డొక్కల కఱువు" నందు, సర్వ శక్తులు వినియోగించి పాటుపడి యన్నార్తులకు కల్పవృక్షమై యాదుకొన్న, దాన చర్య. అనాఁడు దేశమున చెలరేగినది వీరక్షామము కడుపు నిండ నన్నము తిన్నవాఁడగుపడినచో వాని డొక్క చీల్చి యా యన్నమున కాశపడు దుర్దశ యానాఁడు ప్రాప్తించుటచే దానికా పేరు వచ్చినదట. 1835 క్రోధినామ వత్సరమున నొక మాదిరి పంటలు పడెను 'క్షయ' యందు చినుకు లేదు. దైవ మాతృకములైన కర్నూలు జిల్లాలోని ప్రత్తి కొండ, డోన్ తాలూకాలు, బళ్లారి జిల్లాలోని కొన్ని ప్రాంతములు, ఎత్తి వచ్చి కుటుంబములు కుటుంబములే పశువులతోపాటు రెడ్డిగారి ప్రతిష్ఠ విని యుయ్యాల వాడ, జేరుకొన్నవి. అప్పుడు పూటకు ఎనిమిది వందల మంది దనుక నాయన యింట నెంగిలి పడుచుండిరి. తాత ముత్తాతలు చేర్చిన లక్షల ద్రవ్యమును, పుట్ల కొలది ధాన్యమును, ఆ సమయమున హరించుకొని పోయినవి. అయినను రెడ్డి జంకక బీదలను వెంటనిడుకొని చుట్టుపట్ల గ్రామములలోని మోతుబరుల చెంత ధనమును ధాన్యమును దండి, యన్న దాన కార్యక్రమమును కొనసాగించుచుండెనట. రెడ్డి వచ్చుచున్నాఁడన గనె పాతరల పెరికించియైనఁగొని పోవుచన్న జంకుతో లుబ్ధా గ్రేసరులు సైతము వానితో సహకరించెడివారు.

ఇట్లు వెంగళరెడ్డి యొక సంవత్సరము పాటు క్షుధాపీడితుల వెన్ను కాగియుండెను. 'అన్నార్తుల కండదండయై నిలచెను. అందులకై వేనవేలు ఋణములు దెచ్చెను. ధాన్యమును 'పెచ్చుల'కు దెచ్చెను. పత్రములు లేవు. సాక్షులు లేవు. ఈ కఱువునందు వలస వచ్చి తన యింట తల దాచుకొన్న

జనుల పుగుడు పుణ్యములను, రోగుల పథ్యపానములను, అన్నియు సక్రమముగా జరిపించెను.

1887 ప్రభవ నామ సంవత్సరమున తొలకరించి, ఆశ్వయుజమున దేశ వ్యాప్తముగా తఱితో వర్షము కురిసెను. అప్పుడెక్కడి వారక్కడకు పయనమగు చుండఁగా రెడ్డి వారికి విత్తనపు గింజలు గూడ కట్టి యిచ్చి పంపెను. ఆయన పోషణలో కఱవు దినములు వెళ్లమార్చుకొన్న కృతజ్ఞులైన ప్రజలు తరువాత తమకు గల్గిన సంతానమునకు వెంగళయ్య, వెంగళమ్మ యను పేర్లు బెట్టుకొనిరట.

కఱవు కాలమున నాంగ్ల ప్రభుత్వము వారు కఱవు పనుల నేర్పరచి బీదలకు జీవనాధారమును, గల్పింపఁజూచిరి. కాని రెడ్డి యసహాయ శూరుఁడై నిర్వహించిన యీ మహత్తర దాన చర్యను మెచ్చుకొనకుండ నుండ లేకపోయిరి. విక్టోరియా మహారాణి పట్టాభిషేక సందర్భమున, ఢిల్లీలో దర్బారు జరిగినపుడు రెడ్డి యచటి కాహ్వానింపఁబడి 14 తులముల స్వర్ణపతకమును గౌరవ లాంఛన ముగా పొందెను. దానియందలి వక్కాణ మిట్లున్నది.

Presented<br>
to<br>
Budda Vengala Reddi<br>
As a token of the High appreciation of<br>
Her Majesty's Government<br>
of his<br>
Munificient Liberality<br>
to his destitute country men in the<br>
famine of<br>
1886

ఇప్పటికిని ఆ పతకము రెడ్డిగారి కుటుంబీకుల చెంత నున్నది[34]. వారే

---

34. నాకు రెడ్డిగారి జీవిత వివరములను, పతకము నందలి వక్కాణను, తెలియఁజేసిన వారు నంద్యాల వాస్తవ్యులగు, శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

ప్రతి వత్సరము ఉగాదికి ఆయన సమాధి చెంత గొప్పయుత్సవమును జరిపింతురు. అప్పుడది యొక యాత్రాస్థలమై యంటిక దేశము నాలుగు మూలల నుండి, జనులు స్నానముచేసి తడి గుడ్డలతో 'కాయ కర్పూరము' లను గొనివచ్చి రెడ్డి యెడల తమకుఁగల కృతజ్ఞతను తెలుపుకొందురు. పదప్రవర్తకులు, ఆయన చేసిన దానకృత్యములను కై గట్టి, తీరు తీరుల పాడుట యీనాఁటికిని అచట కాన్పించును. అట్టి గేయగాథల కెల్ల మకుటము వంటి రెండు చరణములను, ఈ నాఁటికిని కర్నూలు ప్రాంతమున నే బిచ్చగాని నోటినుండి యేని వినవచ్చును. ఆ చరణము లివి.

"ఉత్తరాదినా ఉయ్యాల వాడలో
ఉన్నది ధర్మము చూడ రయా
నేటికి బుడ్డా వెంగళరెడ్డి
ధర్మ ప్రభువని కానరయా—"

కలియుగ మహాదాత యినెడి సార్థక బిరుదము నందిన దానవీరుఁడు బుడ్డా వెంగళరెడ్డి—

ఈ మహాదాతకు సంబంధించిన పదములు చెదురు మదురుగా నాకు కొన్ని కర్నూలునందు బిచ్చగాండ్రవలన లభించినవి. గాని వాని పూర్తి స్వరూపమును సేకరించుటకు వీలు కాలేదు. ఒక మహోపకారమగు సంఘటనవలన నొకవ్యక్తి దాతృత్వము శతధా ప్రకాశించిన తీరు ఈ గేయగాథయందు నెలకొనియున్నది. కాలము గడచిన కొలఁది విస్మృతి పథమున జారిపోవు ప్రమాదమున్న యిట్టి పదములను భద్రపఱచుట యవశ్య కర్తవ్యము. గ్రామ సంఘము లీ పనిని సునాయాసముగ నిర్వహింప వచ్చును.

ఈ కోవకు చెందినదే మఱియొక గాథ నల్లసోమనాద్రి కథయందు అంతర్భాగముగా నున్న సోమనాద్రి తండ్రి తిమ్మారెడ్డి కథ.

కల్వకుర్తి జిల్లాకు చెందిన రంగంపేటలో పాకనాటి కాపుకొడుకు తిమ్మారెడ్డి. ఆయన భార్య కేశమ్మ కాపురముండిరి. ఆ యూరికి వారు మోతుబరులు. ఈ కేశమ్మ "సదాశివనం పేట" నేలు సదాశివరెడ్డి తోఁబుట్టువు - వెంగళరెడ్డి

కథ యందలి డొక్కల కఱువు కాలమే యిచటి కాలమును; (1886) రంగం పేట చుట్టుపట్లనున్న బీదసాదలందరును కఱువుధాటి కాఁగలేక వలసపోవుచుండిరి. అంత తిమ్మారెడ్డి

''భామా ఓ భామా కేసమ్మ దొరసాని
ప్రజల దుఃఖమూ మనము జూడలేమే భామా
ద్రవ్యముంటే నేమి ధనముంటే నేమి
ధనము ఊరిక ఉంటే ఎవ్వరడిగేరూ
ప్రజల కిచ్చీ వాండ్లను సాకుదామూ
కీర్తన్న ఉఁటుంది, అపాకీర్తన్న ఉంటుంది"

అని భార్యను సంప్రదించి తన కున్నదంతయు ప్రజలకు పంచిపెట్టి వారి యాకలి దీర్చుటకు ప్రయత్నము చేసెను. ధనము, ధాన్యము, ఎడ్లు, నగలు అన్నియు నైపోయినవిగాని కఱువు 'తెల్లారఁబోదు'
అప్పుడు,

"చూచె తిమ్మారెడ్డీ, కాదు, బంగరు కడ్డీ
కల్పవృక్షము రెడ్డీ కామధేనవ రెడ్డీ
భూదేవతా రెడ్డీ పటపట పండ్లు గొరికె
కరువమ్మ కడుపుగాల, నన్ను ఓడిస్తుందా
నా మందిని జంపుతుందా దీని తమాష జూచేనూ"

అని భార్య మెడనున్న 'స్థాళి' (తాళి) గ్రహించి దాని నమ్మి యా ధనమును క్షుధార్తులకు వెచ్చించెను. ఈ తిమ్మారెడ్డి కొడుకే తరువాత 'గద్దగూడెము పల్లె' కడ, గడికట్టి దానికి గద్వాల యను నామముంచిన నల్లసోమనాద్రి. ఈ విధముగా దాతృత్వమునందు సైతము వీరతాస్ఫూర్తి నెఱపిన, దాన వీరుల గాథలచేఁగూడ జానపదుల వీరారాధనా తత్పరత శోభించినది.

రాజకీయ కారణముల వలన ప్రతికక్షుల నెదిర్చి సాహసకార్యాచరణ మొనర్చి ప్రాణములను సైతమొడ్డి యమరులైన వీరుల గాథ లనేకములు జానపద

మానసముల నలరించి గేయగాథలుగా నెగడినవి. ఇట్టి గాథలను పేర్కొన నెంచినచో పెద్ద పట్టిక రూపొందును. ప్రసంగాంతరమున నీ ప్రకరణమునందే స్పృశించఁబడిన పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ, కుమారరాముని కథ బల్గూరి కొండయ్య కథ, సర్వాయి పాపని కథ మొదలగునవి, అన్నియు నీ పట్టిక క్రింద చేర్పఁబడ వలసినవియే-

వీనియందలి కథాంశములోని వీరతా స్ఫూర్తియు, జానపద మానసమిట్టి వీరులపై పెంచుకొన్న యాకర్షణము వెనుక పేజీలలో వివరింపఁబడినది. కథాంశమున కంటె వీనియందు స్పష్టముగనో యస్పష్టముగనో నెలకొనియున్న చరిత్రాంశము ఒప్పరికింపరానిది - ఈ చారిత్రిక వీరగాథలనన్నిటిని కొన్ని విభాగముల క్రిందికిఁదెచ్చుటకు వీలున్నది.

1. కొన్ని ప్రాంతములకు జెందిన రాజ్యపాలకులగు రాజులచుట్టును అల్లబడిన కథలు.

   పల్నాటి వీరుల కథ - కాటమరాజు కథ యిట్టివి ఇందొకటి పల్నాటి సీమకు చెందినది కాఁగా మఱియొకటి నెల్లూరు సీమకు చెందినది. విదేశీయుల యునికి తెలియని కాలమునకు జెంది, మకుటాభిషిక్తులైన రాజులకు సంబంధించిన గాథలివి. - లభించెడి జానపద చారిత్రక గాథలలో ప్రాచీన తమములైన గాథ లివియే.

2. విదేశీయుల ప్రాబల్యము హెచ్చిన వెనుక, సంస్థానాధీశులై ప్రభుత్వము నెఱపిన చిన్నచిన్న ప్రభువులకు సంబంధించిన గాథలు. బొబ్బిలి, పెద్దాపురము, పెనగొండ, వనపర్తి, గద్వాల, సదాశివనంపేట, వంటి సంస్థానముల చరిత్రను దిక్ప్రదర్శకముగా చూపుగాథలే, బొబ్బిలియుద్ధము, పెద్దాపురపు కోడి పందెములు, బంగారు తిమ్మరాజు, రామేశ్వరరావు కథ సోమనాద్రి కథ, సదాశివరెడ్డి కథలు -

3. పరప్రభుత్వము సాగుచుండగా, నందువలనన సంతృప్తిజనించి, ప్రతిఘటనముసాగించి, 'పితూరి'లు లేపిన వీరవరుల గాథలు - చిన్నపరెడ్డి కథ, గుజ్జాల గోపిరెడ్డి కథ,బల్గూరి కొండయ్యకథ,అల్లూరి సీతరామరాజు

కథ వంటి వీ కోవకు చెందిన గాథలు. వీనివలన గూడ సమకాలిక ప్రభుత్వ స్థితి గ్రహించుటకు వీలగును.

4. కథాగత వ్యక్తులును, కథజరిగిన స్థలమును, తెలుఁగు దేశమునకు చెందిన వైనను, ఇచటికి ప్రాకివచ్చి, యితర రాష్ట్రములకు జెందిన, చారిత్రక గాథలు, కంపిలి నేలిన కుమారరాముని కథయు చెంజీ దుర్గమునేలిన దేశింగు రాజు కథయు, మరాఠా దేశమునకు చెందిన కరిణేకల్లు వీరుల (ఆరెమరాఠీల కథ) కథయు నీ విభాగమునకుఁజెందినవి

వీని యందలి చారిత్ర కాంశములను గూర్చి క్షుణ్ణముగా, పలువురు పరిశోధనా పరమేష్ఠి కల్పులు, పరిశీలించి తమ యమూల్యాభిప్రాయములను వెలువరించి యున్నారు. డాక్టరు రామరాజుగారి తెలుఁగుజానపద గేయసాహిత్యమునందు చారిత్రక గేయములను శీర్షికలో, నాయన ఇతరుల యభిప్రాయములను సమీకరించుటయేకాక, వీనియందలి చరిత్రను గూర్చి, తమ నిర్ణయమును గూడ తెలియఁజేసియున్నారు. మరల చరిత్రాంశములను దడవుటవలన చర్వితచర్వణ మగునన్న భీతితో నేను వానిని స్పృశించుట లేదు.

కథాకథనమునకు సంబంధించినంత మట్టుకు వీరరసస్ఫోరక మగు నంశము యొక్క పరిణామము జానపదగేయగాథలయందు మనోహరమును, సహృదయ హృదయరంజకమునై యొప్పారుచున్నవి.



# రాజకీయ సాంఘికాంశములు

జానపదగేయ గాథలయందు. కథావశమున నమరి, మనకు లభించెడి రాజకీయ సాంఘిక సమాచారము స్వల్పమేయైనను, అది జానపద నాగరక, జీవన విధానముల మధ్యగల విభిన్నతలను దెలియఁజేయుఁగల సమర్థత కలదిగా కాన్పించును. అట్లని జానపద జీవన విధానము నాగరక మానవునకు పూర్తిగా తెలియదనిగాని, మిక్కిలి క్రొత్తయైనదనిగాని చెప్పుట నా యభిమతము కాదు. ప్రతి వ్యక్తియు తాను నివసించు నాగరక సంఘము యొక్క ప్రాబల్యము వలన లోకమునకు తాను మిక్కిలి నాగరకముగా కాన్పించుటకే యిచ్చగించుచుండును. కాని తన యంతరాంతరమునందు, తాను జన్మనందిన కులమత సంఘములకు సంబంధించిన ప్రాక్తనాచారములను అభిమానించుచు వానితో తన్నభేదముగా చెప్పుకొనుటకే కుతూహలపడుచుండును. కావుననే తన వంశమునందు పరంపరగా నవలంబింపఁబడు నాచారములును, విధులును, ఆంక్షలును, ఎంత మూఢములును అర్థరహితములు నని సమకాలిక ప్రపంచము హేళన చేయుచున్నను, వానిని విడిచి పెట్టుటకు వాని మనస్సంగీకరింపదు. అట్టివానిని బాహాటముగా తనకు చెందిన వానినిగా చాటుకొను నిబ్బరము నాగరకునకు లేకపోయినను, జానపదునకుండును. కావననే వాని సాహిత్యము నందీ సాంఘిక స్థితిగతులు ప్రత్యక్షముగను ప్రస్ఫుటములుగను కాన్పించుట కవకాశమున్నది. ఇట్టి సాంఘికాచారముల వెనుక పురాతనత్వ మివతాళించుచుండును,

జానపద వాఙ్మయమున ప్రతిబింబించెడి ప్రభుత్వము ఈనాఁటి ప్రభుత్వమునకు ప్రతీకకాదు. ఒకనాఁటి రాచరికము, మండలాధిపత్యము, పొరుగురాజులతోడి సంబంధ బాంధవ్యములు, ప్రజలకును ప్రభుత్వమునకును మధ్యగల సంబంధము, పన్నులు, పగలు, యుద్ధములు, వంటి విశేషము లిచటఁ గాన్పించును. వ్యూహరచన, సైనిక బలముల యేర్పాటు, కోటలను వశము చేసికొనుట, రక్షించుట, వంటి విషయములన్నియు గత కాలమునకుఁ జెందినవగుటచే, నాగరక పాఠకునకు, లేదా శ్రోతకు అవి యాసక్తి దాయకము లగుచున్నవి.

పల్నాటిగాథయందు వర్ణితమైన రాజకీయ పరిస్థితులను, ఆచారములను అరయుటయొప్పు ఇచట వర్ణితమైన యుద్ధము విభిన్న రాజ్యముల మధ్య జరిగినది కాదు కేవలము దాయభాగ నిర్ణయమునకై మహాభారత మున కురుపాండవులు పోరినట్లే యిచటను అన్నదమ్ములు కలహించిరి. కాని పదు నొకండు పండ్రెండు శతాబ్దుల మధ్యకాలము ఆంధ్రదేశచరిత్రలో రాజకీయ ముగా చెడ్డకాలము.[1] ఒక మహాసామ్రాజ్యము దుర్బలము కాఁగా మఱియొక మహాసామ్రాజ్యము వేరుదన్ని పటిష్టమగుటకు మునుదేర్పడిన అవ్యవస్థతోఁ గూడిన సంక్షుభిత కాలము. ఆ కాలమున నాంధ్రదేశము వెలనాడు, పల్నాడు, కమ్మనాడు, పాకనాడు, పొత్తపినాడు, మొదలగు చిన్న చిన్న భాగములుగా శతధా విభక్తమై యుండెను. ఒక మండలాధిపతికిని మఱియొకనికిని మధ్య సామరస్య మరుదుగా నుండెడిది.దానికితోడు వేంగీ దేశాధిపత్యమునకై నిరంతరము కలహించు పశ్చిమ చాళుక్య రాజన్యులవలన నాదేశపు ఏలికలకు శాంతి లేకుండెను. ఇట్లు పెద్ద పెద్ద యుద్ధములును, చిన్న కలహములును దేశమును నిత్య రణరంగముగా చేయుచుండెడివి. ఆ సమయమున దాయభాగ నిర్ణయము నకై యేర్పడి కుటుంబ కలహముగా పరిణమించినది పల్నాటియుద్ధము. అయినను ఈ యుద్ధమున సామంతత్వము వలననో, స్నేహ బంధుత్వములను పురస్కరించుకొనియో, కలచురి రాజులు, వెలనాటి దుర్జయులు, కోటరాజులు, హోయసల భల్లాణులు, గుడిమెట్ట చాగిరాజు, కాకతీయులు మొదలగు సమకాలిక మండలాధిపతులు ఇరుపక్షముల ముందును నర్దుకొని యుద్ధమునఁ బాల్గొనిరి.

హైహయులు పశ్చిమ చాళుక్యుల సామంతులు. మైలమాదేవిని నలగామ రాజున కిచ్చి వివాహము చేయుటవలన, వీరికిని వెలనాటి చోళులకును బంధుత్వ మేర్పడుటయే గాక, పలనాటిసీమ అరణముగా వచ్చినది. అట్లే మలిదేవునకు బిజ్జలదేవి నిచ్చి వివాహము కావించుటవలన, వీరికి కల్యాణ రాజులతో బాంధవ్య మేర్పడినది. పల్నాటి యుద్ధమున నీ సంబంధముచేత వెలనాటి చోడులు నలగామ రాజునకును, కల్యాణరాజులు మలిదేవరాజునకును తోడ్పడిరి. ఇంతేకాక, నలగాము నకు. మొదటి కాకతి ప్రతాపరుద్రుఁడు, ధరణికోట భీమదేవుఁడు, కోటకేతన్నలు

1. శ్రీ పింగళి లక్ష్మీకాంతము - పీఠిక. పలనాటి వీర చరిత్ర

తోడ్పడిరి. వీరు చారిత్రక పురుషులు. వీరందరి కాలములను పల్నాటియుద్ధము జరిగిన 1181-82 సం. తో సమన్వయింపఁబడుచున్నవి.

అప్పటి యుద్ధము వలన ప్రజలకేమి కష్టములు వాటిల్లెనో, యెట్టి క్షోభ కలిగెనో యీనాఁడు సుస్పష్టముగా మనకు తెలియరాకపోవచ్చును. కాని యా నాఁటి యుద్ధసంరంభము, రాజకీయపు యెత్తులు, రాజజీవన విధానము, మొదలగు విషయములను ద్విక్ప్రదర్శకముగా నైన నీ గాథ యెత్తి చూపుట మన యదృష్టము.

రాజు యుద్ధభూమి కేగుటకు ముందు, తొడిగి, పూసి కట్టి, వివిధాలంకార ములచే భాసించుచు వాకిట నిలుచుండును. అప్పుడు సకల బలంబులును చను దెంచి యాయుధపాణులై యంజలి పట్టి దూరముగా నిలుచుందురు. అంత నాయన యధిరోహించు నేనుఁగు సకలాలంకార సుందరముగ, మంద గంభీరముగ రాజు కడకుఁగొని రాఁబడును. మావంతుఁడు లొలుత దానిచే ప్రణామము చేయించిఁ కూర్చుండఁబెట్టఁగా పరిచారులు పుత్తడి నిచ్చెనను పొందికగా వేయుదురు. సేవకు, లిచ్చు కైదండతో నాయన కరీంద్రారోహణము చేయును. ఒక సేవకుఁడు వెనుకఁ గూర్చుండి తాంబూల మిచ్చుచు చామరగ్రాహి యగును అంత నా దంతావళము లేవఁగా హేమదండముతో నొప్పు మౌక్తిక ఛత్రములు మనుజేశు నెదుట పరి చారకులు పట్టుదురు. 'ధ్వజములు, గొడుగులును, ప్రాంగణమున శోభించు చుండును. అయిదు విధములగు వాద్యములు ఘోషించుచుండఁగా సామంత ధరణీశ వితతి తమ దళములతో ముందు నడచుచు పరిక్రమించును. ఆపైన దండును, కైజీతగాండ్రును, మిత్రులు, బంధుజనము నడుతురు రాజు బయల్వెడలుచుండఁగా నాతని వెనుక రాజున కాప్తులును, సేనాధిపతులును బయలుదేరుదురు. వేత్ర హస్తుల సందడి యెల్లెడల మిక్కుటముగా నుండును. అట్టి రాజుల పౌరుష కథనము చేయుచు భట్టులు వెంట నడుతురు. రాజు యుద్ధమున వీరమరణము చెందినను, వాని కీర్తి దశదిశల విస్తరించుటకై భట్టు బ్రదికి యుండవలయును. భట్టు రాజుల కీర్తి గానము చేయుటయే కాక, అంతకన్న బాధ్యతలతో గూడిన రాయబార కృత్యమును నిర్వహించుటకు రాజులచే ప్రేషితుఁడు. రాయబారియై వచ్చిన భట్టు తమ రాజు మాటగా నెన్ని కాఱు లఱచినను, అవతలి పక్షపు రాజు

వానికి హాని చేయరాదనుట రాజకీయమగు న్యాయము. పైపెచ్చు కట్టుపుట్టములు, కట్నమిచ్చి గౌరవించి పంపవలయును.

యుద్ధమునకుఁ దరలు రాజులతోపాటు భట్టులేకాక, వీరగానము చేయు గాయకులును, కవులును, మానసము నుల్లాసభరితము చేయుటకు వేశ్యాజనము యుద్ధరంగమునకు పయనము కట్టుచుండిరి. రాజులు తమ పయనమునకు ముందు, రాజధానియందు సమర్థులగు వారిపండి, రాజ్యమును, ప్రజను, కాపాడునట్లు కట్టడిచేయుట యవసరము. మలిదేవాదులు కారెమపూడి యుద్ధరంగమునకుఁ గదలుటకు ముందు, ఇంటివద్ద కొమ్మరాజు నుంచిరి. బాలచంద్రుఁడా బాధ్యతను అనపోతున కప్పఁజెప్పెను. కాటమరాజు కథయందు ఐతమరాజు, ఆ బాధ్యత తన చెల్లెలగు అగుమంచి కప్పఁజెప్పెను. మఱియు నూరిలోని మోతుబరులను బిలిపించి దొనకొండలోని ధనధాన్యములను, కుటుంబములను, గృహములను హెచ్చరికతో కాచుచుండుడని యొప్పగించెను దినవార్తలు కలనినుండి రాజధానికి నడుచునట్లును, పావురాలు జాబులు నడపునట్లుగను కట్టడి చేసెను. కాపులు, కరణములు, పద్మనాయకులు, మస్నీలు వేయికన్నులతో రాజధానిని కనిపెట్టి యుండవలయునని హెచ్చరించెను.

యుద్ధమున సైనిక బలము తక్కువైనచో 'దినభత్యము'నకై రాజులు వ్యావసాయికులను, పల్లకీలు మోయు బోయీలను, కట్టెలమ్ము వారిని, వివిధ వృత్తులలోనున్న వారిని సేనయందుఁ జేర్చుకొనుట గలదు. వీరినే కూటువమూక యందురు. యుద్ధ భూమికేగు వీరులలో నగ్రగణ్యులకు మోకాలి పట్టము గట్టి సేనానాయకత్వమును రాజులే స్వయముగా నప్పగింతురు. వీరులు యుద్ధమునకుఁ బోవుటకు ముందు తమ యాయుధముల కుపహారమిచ్చుట గలదు. బ్రహ్మనాయడు పోకంత సాదమును, కొంత నీటిని, చేర్చి కుంతమునకుఁ గట్టెను. శరణాగత రక్షణము వీరుల కుండవలసిన గుణము. యుద్ధభూమి యందైనను, వారు, తడబాటుచే దాగువారిని, చెట్టు లెక్కువారిని, చేతులెత్తి శరణనెడివారిని, చంపరాదు. అట్లే కట్టె మోపుల వారిని, కలగూర వారిని, పశువుల కాపరులను, బలుసు కూరాకు దిని యడవులలో దిరుగు వారిని, మగువల గోష్ఠిలో మగ్నులైన వారిని, గుడులయందుఁజేరిన వారిని చంపరాదు.

కోటపోడుప వలసివచ్చినచో, గోవుల పాలు పితుకువేళ, బ్రాహ్మణులు జపమునకు మఱలు వేళ, జనులు పనులు చాలించి, బత్తెముగొని యింటికిఁజేరు వేళ, పరిహరించి పోడుప వలయును.

వీరులు తాము చేయఁబూనిన పూన్కిని విడువరాదు. కావుననే యల్లు మల్లు నాయకురాలిపై నెత్తిన కత్తిని, వ్రేటు విఫలము కారాదని చెంతనున్న యుక్కు స్తంభముపై వేసి దానిని రెండు తునియలు జేసి యొఱలో నుంచెను.

ఎవరైనను యుద్ధమున వెన్నిచ్చి పాఱుట మిక్కిలి యవమానకరమగు విషయము. బ్రాహ్మణుఁడైనను ఆ విషయమున సడలింపులేదు. అందుకు ఖడ్గ తిక్కన వృత్తాంతము తార్కాణము (కాటమరాజు కథ. పే. 20)కాని యుద్ధము నందు బ్రాహ్మణుని బ్రాహ్మణయోధుడే యెదుర్కొనవలయును. ఖడ్గతిక్కనను శివబ్రాహ్మణుఁడగు శివదేవయ్య యెదుర్కొనెను. యుద్ధమందైనను బ్రాహ్మణుని చంపుటవలన బ్రహ్మహత్యాదోషము వాటిల్లునని వీరులు జంకెడివారు అందువలననే బాలచంద్రుఁడు అనపోతును యుద్ధమునకు రాకుండ నిషేధించెను కాటమ రాజు కథయందు, ఖడ్గతిక్కన యుద్ధరంగమునకు రాఁగా

"బుద్ధి చాలని యట్టి భూసురోత్తముఁడు
యుద్ధంబు సేయ నుద్యోగించినాఁడు
సర్వథా బ్రాహ్మఁడు చావకపోఁడు
బ్రహ్మహత్య మనకు బాపుకోరాదు."

అని వీరులు సంశయించిరి.

ఇట్టి వీరులు యుద్ధమున కేగుటకు ముందు రాజుచే వీర తాంబూలము గొని యుత్సాహభరితులై యుప్పొంగుట కలదు వారి వాహనముల యలంకారములు, వారు కైచేసికొన్న తీరుతెన్నులు, వారు ధరించిన వివిధాయుధములు, జానపదులచే మిక్కిలి యాప్తితోడ వర్ణింపఁబడినవి.

ఇట్లు వీరుల సహాయమున రాజులు యుద్ధమునందు విజయము నంది పర బిరుల నుండి రాజ్యములు గొనుటయు, లేదా, వారిని సామంతులను జేసికొని కప్పములు గొనుటయు జరుగును. ఊరకోట కడ జొన్న కంకుల విషయమై చిఱు

కలహము చెలరేగి దాని కేలికయగు పేరమ రాజుతో నముగు రాజునకు యుద్ధము సంభవించెను. ఆ యుద్ధమున పేరమరాజు మరణింపఁగా, నముగు రాజు,

"పుడమి నముఁగు రాజె పురుషుఁడనఁ జెల్లు
అవని పాలసులెల్ల నతివలె చూడ"

యని శాసనము చెక్కించెను ఈ వార్త విని చందవోలు నేలు పృథివీశ్వరుఁడు కయ్యమునకు కాలుద్వ్వఁగా, నముగు రాజు వానిని యుద్ధమం దోడించెను. ఇరు పుర మధ్యమున సమాధాన సూచకముగా, చందవోలు రాజు తన కూతును మైలమాదేవిని ఆముఁగు రాజున కిచ్చి వివాహము చేయుటమే గాక పల్నాటి సీమ నరణముగా నిచ్చెను ఇట్లు సంధి సంప్రదింపులు జరుపుకొను పద్ధతియే గాక తాము జయించిన ప్రతికక్షి బొమ్మను లోహపతకములలో జెక్కించి వానిని తమ యడప వాని కాలికో, ఏనుఁగు, గుఱ్ఱము మొదలగు తామెక్కు వాహనముల కాళ్లకో గట్టి యవమానించు ప్రక్రియను రాజు లవలంబించుట గలదు. తమ విజయమును సూచించు జయ స్తంభముల నాటు నాచారమే కాక, పగవాని జయము లను చాటు ధ్వజ స్తంభములను, వాని ఖడ్గములను, ఎత్తుకొని వచ్చు పద్ధతియు గలదు. బ్రహ్మనాయడు శివనండ్ల కోటను పొడివి, యటనున్న 'భూతరాట్కాంబ' మను విజయ స్తంభమును గొనివచ్చెను. అదియే తదుపరి కారెమపూడి యందు జరిగిన కలనిలో ధ్వజ స్తంభముగా నాటఁబడినది.

ఇట్లు పరాక్రమోపేతులైన రాజులు సుభిక్షమైన తమ దేశమున పండిన పంటలో పండ్రెండు పాళ్ళు కాపుల కుంచి, తాము నాలుగు పాళ్లు మాత్రమే గైకొందురు. పన్ను వసూలు చేయువాఁడు సుంకరి ఈతనినే పన్నుపడాయిఁ డనియు వ్యవహరింతురు. నేరము చేసిన వ్యక్తికి ప్రభుత్వము దండుగవిధించును. రాజ్యమునందు నిర్ధనులైన తక్కువ కులముల వారికి వెట్టిచాకిరి చేయుపద్ధతి యుండెడిది.

రాజసేవకులలో పలు తెగలు గలవు. ప్రధాని, దండనాయకుఁడు, కోశాధిపతి వంటి ప్రధానాధికారులేగాక, కోలకాండ్రు, వేగరులు, 'తురుతువార్త' లందించువారు, దినచరులు, కాలరులు, విచ్చు కత్తుల వారు, వీరనాయకులు నుందురు. వీరు కాక భట్టులు, వందులు, వేశ్యాజనము, కవివరులు, గాయకులు, భరత పండితులు మొదలగువారు ప్రభు మానసోల్లాసమునకై కొలువునందురు.

చతురంగబలములలో కాల్బలమునకును, ముందు వరుసలోఁ దీరు నెలగోలు దళము నకును, జానపద మానసమున గౌరవము హెచ్చు

రాజులు వసూలు చేయు పన్నులలో 'పుల్లరి', కాటమ రాజు కథ యందు కథాగమన ప్రాముఖ్యమును పొందిన యంశము. ఈ పుల్లరి విషయమునందే, కాటమ రాజునకును నల్లసిద్ధికిని కలహము వాటిల్లెను నెల్లూరికి పడమటి సీమలో దర్శి, కనిగిరి, ప్రాంతములు, కాటమ రాజు ప్రభుత వ్యాపించిన ప్రాంతములు. వారికి పశుధనము మిక్కిలిగా కలదు వారున్న ఆ ప్రాంత మున క్షామము సంభవించి, గడ్డి దొరుకక, వారు పశు బలమును సుభిక్ష ప్రాంత ములకుఁ దరలింపవలసి వచ్చెను. లంకమల, నల్లమల, పాలకొండ మొదలగు గ్రాస సమృద్ధి గల సీమలను హెచ్చు కొన్న నెల్లూరి సీమ వారి నాకట్టెను. అందు వలన కాటమరాజు, నెల్లూరి నేలు చుండిన నల్లసిద్ధితో నొక యొప్పందము చేసి కొనెను. అచట పుట్టిన తమ మందలోని కోడె దూడల నన్నింటిని, సిద్ధిరాజునకు పుల్లరి క్రింద నిచ్చుటకై కాటమ రాజంగీకరించెను. ప్రభుత్వముల మధ్య నిట్టి యొప్పందములు చిత్ర విచిత్రములైనవి, జరుగుచుండును. కాని కొన్ని కారణములచే కాటమరాజా నియమము నుల్లఘింపఁగా నా రెండు పక్షములకును మధ్య పోరు జరిగెను. ఈ విధముగా కాటమరాజు యుద్ధమున 'పుల్లరి' మిక్కిలి ప్రాము ఖ్యమును వహించుచున్నది. పల్నాటి యుద్ధమున నీ విధముగా ప్రాముఖ్యము వహించిన యంశము కోడి పోరు. భారతమున ద్యూతమునకున్న ప్రాధాన్యమే యిచట నీ కుక్కుట కలహము నకుఁగలదు. ఇందోడుట వలననే, మలిదేవాదులు రాజ్యములు విడిచి వలస పోవుటయు, చివరకు వారికిని, నలగామునకును, పోరు జరుగుటయు సంభవించినది. బొబ్బిలి కథయందును, పెద్దాపురపు కోడి పందె ముల కథ యందున, ఈ కోళ్ల పోరు రాజకీయములగు కలహములకు కారణ మగుట కన్పించును.

రాచఱికము సాగిన నాఁటి పరిస్థితుల నీ విధముగా పల్నాటి వీర చరిత్రయు, కాటమరాజు కథయు తెలియఁజేయుచున్నవి. నల్ల సోమనాద్రి కథలో ఊరి పెత్తన దారుఁడైన 'రెడ్డి' యొక్క అధికార ప్రదర్శనము కలదు. కామమ్మ కథయందు, సహగమనము చేయ నిచ్చగించిన కామమ్మకు కుంపిణీ ప్రభుత్వము పెట్టిన యాజ్ఞలును, చేసిన కట్టడులును వర్ణింపఁబడినవి. బొబ్బిలి కథ యందు

'ఫరాసు బూచి' యొక్క వర్ణన కొంత గలదు. ఇంతకు మించి యీ గేయగాథల యందు రాచఱికపు టుదంతములు మిక్కిలిగా వివరింపఁబడలేదు.

ఇఁక జానపదుఁడు వివరించిన సంఘమును, దానికి సంబంధించిన యాచారములును గమనించుట శ్లాఘాకరము లైనవి.

వైవాహికాచారములు .- సర్వసాధారణముగా వధువు పదునాలు వర్షములు దాటనిదై యుండవలయును. పెండ్లి కూతురు తండ్రి తన బిడ్డ నిచ్చుచోట పంటలు హెచ్చైనచోటుగను, సిరి సంపదలు గల చోటుగను విచారించి సంబంధము నిశ్చయించును. రాజుల యింటి వివాహములలో నొక్కొకచో పెండ్లి కొడుకు కన్య యింటికి వచ్చుటకు బదులుగా, తన ఖడ్గమును పంపుట కలదు. ఆ కత్తికి వరునకు మారుగా 'బాసికము' గట్టి తలఁబ్రాలు పోసి వివాహ కార్యము నడుపుదురు. పెండ్లి కూతు మెడలో ముదసలి ముత్తైదువ పెండ్లికొడుకునకు మారుగా సూత్ర ధారణము చేయును 'ధర్మాంగదపాము పాట' వదమునందీ యాచారము, కథాగమనమున, ప్రాముఖ్యము వహించుచున్నది ద్రావిడ దేశమున కొన్ని కొన్ని వర్ణములలో నిట్టి యాచారము వాడుకలో నున్నట్లు నృశాస్త్రజ్ఞులు వివరించిరి. మైసూరు చాకలి కులమున నిట్టి యాచారము కలదు. ఆడుపిల్లలు రజస్వలలు కాకముందే వివాహము చేయవలయునను పట్టింపు గల రోజులలో పిల్లను కత్తికో, చెట్టునకో తొలుత వివాహము చేసెడివారట ఆ పైన నిజమగు వివాహమెంత యీడు వచ్చిన వెనుక చేసినను పట్టింపు లేదు [2]

మధుర యందలి తెలుఁగు వ్యావసాయిక జాతి, యచట 'తొట్టియవల'ని పిలువఁబడుదురు. వీరిలో తమ యింటి పెండ్లికొడుకు తమకన్న తక్కువ సాంఘిక ప్రతిపత్తి (Social status) కలిగిన యాడు పిల్లను వివాహమాడవలసి వచ్చినచో, పెండ్లి కొడుకును పిల్ల యింటికి వివాహార్థమై పంపుటకు బదులగా వాని కటారిని పంపు నాచారమున్నది. దాని సమక్షమున పిల్ల మెడలో ముత్తైదువ తాళి కట్టును [3] రాజులలోను (క్షత్రియ కులము) వెలమల యందును

---

2 Mysore cenus report. 1901.

3. E. Thurston - Ethnographic notes in south India,

నిట్టి యాచారము కన్పించు చుండును.[4] ఇట్లు కత్తి, చెట్టు మొదలగు నిర్జీవ వస్తువులకు వరునియొక్క ప్రాతినిధ్యము నాపాదించి, పెండ్లిచేయు నాచారము సంఘములోని పురాతనాచారముగా తెల్లమగుచున్నది. అదియే జానపద గాధలలో చోటు చేసికొన్నది ఈ యాచారమునకు సంబంధించిన విచిత్రమగు నభియోగ మొకటి మదరాసు న్యాయశాలలో విచారింపఁబడినది. ఒక జమీందారునకు కత్తికి భావికము గట్టి పెండ్లి నడుపఁబడుటచే, పాణిగ్రహణము, సప్తపదీత్యాదులు జరుగలేదుగాన, నా సంబంధమునకు గలిగిన సంతానమున కౌరసత్వము లేదనియు, వారికి ఆస్తిహక్కులు లేవనియు నొక విచిత్రారోపణపై నభియోగము నడచెను. కాని వారి జాతి యందది వైవాహికాచారము గాన నా వివాహము సరియైనదే యని తీర్పు చెప్పఁబడినది[5]

వైవాహికాచారములలో 'నోలిమాడల' నియమ మొకటి గమనింపఁదగినది. ఈ నాఁడు సంఘమున కన్పించు వరకట్నమున కది వ్యత్యయమగు నేర్పాటు. పిల్లను గ్రహించు చున్నందుకు పిల్లవాఁడు పిల్ల తలిదండ్రులకు నిర్ణయింపఁబడిన సుంకము నీయవలయును. ఈ సుంకమే ఓలి. వరుని పక్షమునుండి పెండ్లి కూతురు తండ్రి యోలిని గ్రహించె ననఁగా నా పెండ్లి నిశ్చయమైనట్లుగా నిర్ణయింపఁబడును. నేఁడు వివాహమునకు ముందు, 'ప్రధానము' 'నిశ్చితార్థము', అని జరుగు తంతులో పిల్లకు వరుని వైపువారు గొనివచ్చుచీరలు, నగలు, మొదలగు కానుకలలో ప్రాచీనాచారమగు 'ఓలి యిచ్చుట' యొక్క స్వరూపమున్నదని యూహింపవచ్చును. ఇట్టి ఓలిని జానపద గాథలు మిక్కిలి శ్రద్ధతో వర్ణించినవి.

పల్నాటి వీర చరిత్ర యందు బొంగరములాడఁగోరిన బాలచంద్రుఁడు తల్లి యైతమ్మ కడ కేతెంచి బొంగరములు చేయించి యిమ్మనును. ఆమె యేదో విధముగా మేల్తరము కాని బొంగరములతో నాతనిని సంతృప్తి పఱుచుటకు యత్నించెను. అప్పుడు బాలుఁడు తల్లిని ఆమెయొక్క లౌభ్యమును విడుమని చెప్పుచు తల్లియొక్క యుదారతను వివరించెను. ఐతమ్మ తన తమ్మునితో వియ్యమందఁగోరఁగా నాతఁడు "మన కులంబున నోలి మాడలు గలవు తగిన

4. H.G. Pendergart-Indian. Antiquiry 1891
5. Madras Law Reports - Vol, XVII, 1894

ధనం బీక"- పిల్ల నీయననెను. అంత నైతమ్మ మూర్చించి యెదురోటుల దాక ముట్టడి వేసెను. తమ్ముఁడు మాత్ర మింత యైన బెసఁగక

''అక్కవైనను నేమి యలిగిన నేమి
అడిగిన ధనమీయ కతివనే నీయ
బ్రహ్మ వచ్చినఁగాని భయపడఁబోను
నిశ్చయం. బీమాట నెలతరో"

యని తెగ వేసి చెప్పెను.

అంత నైతమ్మ చేయునది లేక యోడి మాడలిచ్చుట కంగీకరించి యూరి గిలను బంపి యొప్పైన ధనము దెప్పించి రాశిగాఁబోసి తమ్ముని కొలుచుకొమ్మని చెప్పెను అతఁడు మెట్టు కట్టించి, ధనమును ధాన్యమువలె తూర్పార బట్టించి, చింది పోయినవన్నియు పొల్లని రోసి, హెచ్చుకొలతగల తూముచే హెచ్చుగా గొలిచి, చివఱకు 'కళ్ళమడు'గును,, తాలని యావలకుఁద్రోసిన ధనమును, గూడ కాంక్షతో మూటలు కట్టించి యోలిమాడలుగా గ్రహించి తరలెను. "బాలగౌరమ్మ వివాహ" కథ యందును, నీ యోలిమాడల ప్రసక్తి వచ్చినది. పరశురాముని మేనయత్త తరిదేవి తన కొడుకులలో నొకనికి పరశురాముని చెలియలును, రేణుక పుత్రికయునగు బాలగౌరిని వివాహము చేసికొన నిశ్చయించెను. సూటిగ నడిగినచో రాజస ముట్టిపడెడి పరశురాముఁడును, వాని యన్న జంపలేశ్వరుఁడును పత నిత్తురో లేదో యని, తరిదేవి గొల్లచేడియ వేషమున వారి యూరి యందు చల్ల లమ్ముటకై వచ్చెను. పురవీధుల యందు ముత్యములకును రత్నములకును చల్ల నమ్ముచుండఁగా జంపలయ్య తన సముఖమున కామెను రప్పించెను. మేనత్తను గుర్తుపట్టలేక, పై యూరినుండి యిట చల్లలమ్ముచున్నందుకు సుంకము చెల్లింప వలయునని గద్దించెను. తరిదేవి యందులకు నిరాకరింపఁగా దాని బదులు 'చల్లమార్పు' మనెను. ఆమె చల్ల కొలుచుచు, ఒకటి, రెండు, మూడు అని గాని, 'ఏకం, దశం' అని గాని లెక్కింపక 'ఓలి ఓలి' యని లెక్కింపసాగెను. అది యేమని జంపయ్య యడుగఁగా నామె తన కాంధ్ర సంస్కృతముల యర్థము తెలియదనెను, ఆ మీద మిక్కిలి ధైర్యముతో

"ఒక శేరు నీ చెల్లెలు ఓలి మాడలకుఁ జెల్లు
రెండవ శేరు నీ చెల్లెలు కల్యాణమునకుఁజెల్లు
మూఁడవ శేరు నీ చెల్లెలు ప్రధానమునకుఁజెల్లు
నాల్గవ శేరు నీ చెల్లెలు వస్త్రాభరణ భూషణములకుఁజెల్లు''

అని కొలిచెను. అట్లు తరిదేవి తానమ్మ చల్లను, తానివ్వఁబోవు "ఓలిమాడల"తో సరివిలువ కలదానినిగా సూచించి, పెండ్లి ప్రస్తావనను గూడఁదెచ్చి చాతుర్యము వెలయించినది.

వధువునకు తండ్రి వివాహ సమయమున వస్త్రాభరణాదుల నిచ్చుటయే కాక, పసుపు కుంకుమల క్రింద భూమినిచ్చుటయు కలదు. చందవోలు పృథ్వీశ్వరుఁడు కూతురు మైలమాదేవికి పల్నాటి సీమను పసుపున కిచ్చెను.

కూతు నత్తవారింటికిఁబంపునపుడు పుట్టింటివారు తీరు తీరుల సారెలను పంపుట గలదు అత్తవారింటిలో కూతురు కొంతకాలము వఱకును నెట్టి కొఱతయు లేకుండ సంసారము నడపుటకై యీ సారె వస్తువులు దీర్చుట జరుగును వధువునకుఁ గావలసిన చీరెలు సొమ్ములు, మాత్రమేగాక ఆమెకు వలసిన పసుపు, కుంకుమ, సున్నిబిండి, గిన్నెలు, దొన్నెలు, గొడ్లు గోదలు, చివఱకు చేటలు చీపుళ్లు మొదలగు నిత్యావసర వస్తువుల నన్నింటిని ఆ సారెలో చేర్చుట గలదు.

కామమ్మ కథయందు కామమ్మ భర్త మారెయ్య జబ్బున పడెనని, పుట్టినింటనున్న వదినను గొనిపోవుటకై మఱఁది రెడ్డన్న వచ్చెను. కామమ్మ పెదతండ్రి బిడ్డ నత్తవారింటికి తొలిసారిగాఁ బంపవలసి వచ్చి, చేత కాసులేక యేమి చేయుదునా యని చింతింపసాగెను. అది గ్రహించి కామమ్మ,

"వరుస బంప నీకు ఏమి లేకుంటె బాబయ్య
పసుపు కుంకుమ యిచ్చి పంపరాద నన్ను బాబయ్య
ఎన్నఁడైన నిన్ను అడిగి ఉంటినా బాబయ్య

అని ఖండితముగాఁబలికెను,

అంత పెదతండ్రి రామయ్య "లోకనిందలు నేను పడలేను. నూఱు అప్పులు చేసి తీర్చినవారు రాజ్యమున లేరా'' యని షావుకారింటికి పరుగున వెళ్ళి యేఁబది వరాలప్పుఁజేసెను. భీమవరము సంతకు వెళ్ళి కోటబొమ్మంచు అవికె, చీరె కొనెను. నిమ్మపండ్ల చాయ బరిణె కొనెను. ఐదు మణుగుల పసుపు, రెండు మణుగుల కుంకుమ కొనెను. తొమ్మిదివందల కొబ్బరికాయలు, అయిదు వందల అమృత పాణీలు మూఁడు వందల చక్రకేళీలు కొనెను. ముప్పదినాలుగు నారచీరలు కామమ్మకు కొనెను. గంధపు చెక్కలు, దువ్వెనలు, కొప్పుసవరములు కంచము చెంబు కొనెను. ముత్యాల నత్తు, బన్నసరము పాపటబొట్టు కొనెను. వీని నన్నింటిని గూర్చి పదునాఱు సారె కావళ్లను బయలు దేరఁదీసెను.

నల్ల తంగాళ్ కథయందు ఆమె యన్న నల్ల తంబి అత్తవారింటికి పోవుచున్న చెల్లెలికి పంపిన సారె మిక్కిలి ఘనమైనది దీనిని శ్రీ (స్త్రీ) ధనమని జానపదుఁడు పేర్కొనెను. ఏటి గట్టున నిండిన బఱ్ఱెగొడ్డులు, అడవియందు నిండిన ఆకు మేక, పల్లముల నిండిన పాడిపశువులు, మెట్టభూములు, పల్లపు భూములు, పైరు పంటలు- ఇవన్నియు నల్లతంగాళ్ స్త్రీధనముగాఁ బొందెను. దీనికి తోడు 'వరుస'ల (సారె) రూపమున. చేపట్టి పాలు పితుకుటకు బంగారు ఆసపీట. ఆఱులక్షల దాసీ జనము, చేవరోకళ్లు, చేటలు, గంపలు అన్నియును ఆమె పొందెను.

సన్యాసమ్మ కథయందు ఆమె యన్న రామన్న నూఱువేల వరహాలు చేతఁబట్టి నూఱుబండ్లు తన యింటివియు, కూలికి తోలిన బండ్లు నూఱును, వెంట నిడుకొని 'పార్వతీపట్నము' సంతకు వెడలెను. సంతలో ముత్యాల బిందెలు కంచు కంచములు, వెండి, బంగారు చెంబులు, గిన్నెలు, ఏడు బండ్ల కొండచీపుళ్లు ఆఱు బండ్ల గీటుకంచములు, అయిదు బండ్ల యింటిచీపుళ్లు, నాల్గు బండ్లకు పేడనెత్తు తట్టలు, కత్తులు, గొడ్డళ్లు, తిరుగళ్లు, రోకళ్లు, ఆఱుబండ్ల పసుపు, ఏడు బండ్ల సీకాయ, అఖశాలు, నాలుగు బండ్ల కుంకుమ బరిణెలు, ఏడుబండ్ల పెసలు, రెండు బండ్ల నోముదారాలు నూఱు గరిసెలు, సన్నబియ్యము. ఏఁబది గరిసెల ముతకబియ్యము, తొమ్మిదిబండ్ల కందిపప్పు, తొమ్మిది బండ్ల సారపప్పు, ఏడు నూలుచీరెలు, ఏడేసి పసుపు, నలుపు, తెలుపు, చీరెలును ఏడు వారాలకు నేడు తొడుగుల నగలను, నింపి తెచ్చెను. అంతేకాక వెండి, బంగారము వెండినాణె

ములు, 'మోరికాసు'లు, పన్నెండు జతల ఆవులు, పోతులు, గాడిదెలు, పన్నెండు మంది నౌకర్లు మొదలగు బలగము నంతయు నామె పరము చేసెను. ఇంకను చెల్లెలికి పసుపుకుంకుమ క్రింద నాయులు కరణాలతో పెద్ద రచ్చసభ తీర్చి వారి సమక్షమున నిరువది నాలుగు మోకాసు గ్రామములు వ్రాసియిచ్చెను. ఆమె తెచ్చిన సారె అత్తయింట పదునాలుగు కొటార్లో వేయఁగా నింకను మిగిలి పోయెను. మిగిలిన సారెను సన్యాసమ్మ మూఁడు దినము లూరంతయు పంచెను. సారెలో పసుపు, కుంకుమ, సున్నిబిండి, పండ్లు, భక్ష్యములు, అవికెల గుడ్డలు మొదలగునవన్నియు నత్తవారి యూర పంచు నాచారము కలదు.

ఇఁక వివాహ సమయమున జరుపు నాచారములు చిత్ర విచిత్రములుగా నుండును. వధువు వైపువారు పెండ్లి ప్రయత్నముల కన్నింటికిని నాందిగా నాకాశమంత పందిరియు, భూదేవియంత అరుగును వేయుదురు. పందిళ్లు, రకరక ముగా నుండవచ్చును. పగడాల పందిళ్లు, ఆరటి మ్రాను పందిళ్లు, ముత్యాల పందిళ్లు, పచ్చాకు పందిళ్లు, ఇట్టిదేని యొక పందిరి లేనిదే 'పెండ్లి కళ' రాదు. నల్ల తంగాళ్ కథయందు కొడుకు పెండ్లికై నిర్మించిన 'సూత్రపందిరి' కథా గమనమునందు ప్రాముఖ్యము వహించి,నల్ల తంబిచే నాతని భార్యవైపు బలగమును చంపించెను.

పెండ్లికి ముహూర్తము నిర్ణయింపఁగనే పెండ్లి వారింట ముత్తైదువ లందఱును జేరి సువ్విపదములు, ఏలలు, ధవళములు పాడుచు, బంగారు, కట్లు గల పవడంపు రోకళ్ళతో కొట్నము లు దంచుదురు. అప్పుడు పాడెడి పాటలనే కొట్నాల పాట లందురు. జానపద గేయగాథలయందు కొట్నములు దంచుటకై తెచ్చిన తీరు తీరుల ధాన్యములను రమణీయమైన నామములతో వర్ణించుట విరివిగా కాననగును. ఈ నాఁడీ కొట్నముల దంచు నాచారమున్నను, కొన్ని కులముల యందు కొట్నములకు బదులుగా 'పసుపు కొట్టు' నాచారము నెలకొన్నది. లోకమున పసుపెప్పుడు కొట్టెదరను ప్రశ్న వివాహమెప్పుడను దానికి పర్యాయ ముగా వాడఁబడును.

వధూవరుల పేరు బలములుచూచి లగ్నపత్రికలు వ్రాయించి బ్రాహ్మణుల చేత పెండ్లి కొడుకు తలిదండ్రులకు పంపుదురు.

పెండ్లివారు బయలుదేరి వధువు నూరికివచ్చి యూరిబయట 'వనాంత్రము'న విడిది చేయుదురు. అక్కడికి పానకపు కావడుల తోడను భక్ష్యముల తోడను ఆడు పెండ్లి వారెదురు వచ్చి 'కలపట' మనుమ నూరిలోనికి గొని పోదురు. బాజాభజంత్రీల తోడను, బాణా సంచా కాల్పులతోడను, వేశ్యల మేళములతోడను, గంధపుపొడి, పుష్పాలు, ఒకరిపైనొకరు చల్లుకొని మర్యాదలు నిర్వహించుకొనుచు తాంబూల సేచనములు చేయుదురు. ఈ తంతును 'ఎదురు కోళ్ళ'ని వ్యవహరింతురు. ఈనాటికిని 'వనాంత్రములు' లేక పోయినను రైలు స్టేషను కడనైనను వధువు సోదరుడు వరుని పుష్పమాలాలంకృతుని జేసి యూరేగింపుగా విడిదికిఁగొని వచ్చు నాచారమట్లే యున్నది. ఇట్లూరేగుటను 'మెరవణి' యందురు. ఊరేగించుటను 'మెరుగు ద్రిప్పట' యనియు నందురు.

పెండ్లికి ముందు వధూవరులను పెండ్లి కూతురును, పెండ్లి కొడుకును చేయు నాచారము కలదు. నున్ని పిండితో పెండ్లికొడుకునకు నలుగిడి, కాలిగోళ్లు మంగలిచేఁ దీయించి, స్నానము చేయింతురు. మిగిలిన నలుగు పిండిని గొనిపోయి వధువునకు మంగళ స్నానము కావింతురు.

తెర కీవలావల వధూవరులు గూర్చుండుదురు. ముహూర్త మాసన్నమగు తఱి వరుఁడు వధువు కాలిని సన్నెకల్లుపై నుండఁగా త్రొక్కి చేతికి కంకణము కట్టును. తలపై జీలకఱ్ఱ బెల్లముకలిపినముద్దను పరస్పర ముంచుకొందురు. కొన్ని యెడల వివాహ చర్యయందు కంకణధారణమే ప్రధానాంగముగా కాన్పించుచున్నది. కొమిరెల్లి మల్లన్న కథయందు మల్లన్నకును రత్నాంగికిని పరమశివుఁడు ఉన్ని దారము పేని కంకణము చేసి వివాహ కార్యము నడపెను. ఇవి కుఱుమలలోని యాచారము. వీరిలోనే ప్రత్తి కంకణములు వివాహమున కట్టబడెడి తెగకు ప్రత్తి కంకణము కుఱుమలని పేరు.

మఱికొన్ని తెగలలో వివాహమునకు 'పోలు వ్రాయుట' ముఖ్య కార్యముగా భాసించుచున్నది. ఒక్కొక్క కులమునకు ఒక్కొక్క రకపు ముగ్గు 'పోలు'గా నమరును. దీనిచుట్టును నాలుగు వైపులను చిన్నచిన్న కుండల నుంచి వాని చుట్టును దారమునుత్రిప్పి చవికె నేర్పాటుచేయుదురు. దీనినే పోలు దారమందురు.

ఈతంతునేఁటివివాహములలోకొన్నిచోట్లనాగవల్లిగామారినది అచటనురంగు రంగుల పిండితో ముగ్గులు పెట్టుటయు, నైరేణి కుండలను బోలిన 'పూజు

ముంతల'ను నాలుగు వైపులనుంచి దారము చుట్టుటయు గలదు. ఈ ముంతలను జానపదుఁడు 'గరిగె బుడ్ల' నియు వ్యవహరించెను.

కొన్ని చోట్ల వధూవరులు పరస్పరము 'జీలకఱ్ఱ బెల్లము'ను తలలపై నుంచెడి చర్యకే ప్రాధాన్యమున్నది. అట్లే తలంబ్రాలు పోసికొనుటకును ప్రాధాన్యము కలదు.

సూత్రాధారణా రూపమున వధువును బంధించు నాచారము వెనుక ప్రాచీన కాలమునకుఁజెందిన రజ్జు తంత్ర మిమిడి యున్నదని నృశాస్త్ర వేత్తల యభిప్రాయము.[6] ఒక వ్యక్తిని మఱియొకనికి సన్నిహితుని చేయుటకు, లోఁబడునట్లు చేయుటకు, జబ్బుగా నున్న వానినుండి వ్యాధులు నిష్క్రమించునట్లు చేయుటకు, గాలి ధూళిమొదలగు నభౌమాంశములు మానవుని యాశింపకుండునట్లు చేయుటకు, నీ రజ్జు తంత్రము (Cord Magic) ఉపయోగింపఁబడును. ఈ నాఁటికిని నాగరకులయందును ఈచర్య వ్యాప్తిలో నున్నది. జబ్బుగానున్న వాని చేతులకో మెడకో నొక త్రాడు కట్టి, యాపైన దానిని దీసి పచ్చని చెట్టుపై వేసినచో నాజబ్బు వానినుండి చెట్టునకు సంక్రమించునని యచట నెలకొన్న విశ్వాసము. అట్లే పసివాండ్రు నేలపాటు చెందినపుడు అక్కడి కక్కడ నీరు దిగదుడిచి క్రింద పోసి, మొలత్రాడు తెంచి పార వేయుదురు. ఈ త్రాడు పిల్లవాని శరీరమును బాయుట వలన వాని నాశింపఁగోరిన గ్రహాదికములును తొలఁగి పోవును. అట్లే ఒక వ్యక్తిని వశీకరింపఁగోరుకొనువారు తాయెత్తు రూపమునఁనో, ఉంగరము రూపముననో, నా వ్యక్తిని 'బంధించిన'చో నా వ్యక్తి తమ చెప్పు చేతులలో నుండునని విశ్వసింతురు ఇట్టి చర్యలన్నిటి యందును రజ్జువునకు తంత్ర ప్రాధాన్య మాపాదింపఁబడినది. వివాహమునందలి సూత్రధారణకును ఇట్టి తాంత్రిక ప్రాధాన్యముగలదు. సిలోన్ లోని వెడ్డాలు చెట్టు నారచే తయారు చేయఁబడిన త్రాటిని పెండ్లికూతురు నడుముకు బంధించు నాచారము పాటింతురు. వైదిక వివాహ తంత్రమునందును నడుమును బంధించు చర్యయు, దానికి మంత్రమును కలదు. ఇదియే వివాహ బంధము. ఈ బంధమే హిందూ వివాహముల యందు కేవలముకొన్ని యెడల గళబంధముగను కొన్ని యెడల కంకణబంధముగను, కొన్ని యెడల మాలికాధారణముగను, (మాలలు మార్చుకొను పద్ధతియు

6. Wilhelm Wundt-Elements of Folk Psychology

వివాహ చిహ్నమే. స్వయంవరమను నీ పద్ధతికి స్థానము గలదు) కాన్పించు చున్నది వధూవరుల చెఱఁగులు ముడి వేయుటను సిద్ధిదే క్రైస్తవ వివాహము లలోని యంగుళీయక ప్రాధాన్యమునకు ఈ యర్థమునే చెప్పవచ్చును స్త్రీలు ధరించు కంఠహారములు కడియములు ఉంగరములు వడ్డాణములు అందెలు, కాలి గొలుసులు మొదలగునవన్నియు మతపరముగా తాంత్రిక ప్రాముఖ్యమును గలిగి యమరిన బంధములై, రాను రాను నాభరణములుగా రూపు చెందినవి

వివాహము నందు ఐరేణి కుండలకు ప్రాముఖ్యము కలదు. 'ఐరాళ్ల'ను వివాహమునకు ముందే ముత్తైదువలు మేళ తాళములతో పైన నుల్లెడ పట్టుచు కుమ్మరి యింటి నుండి కొనివత్తురు. వానిని పూజా గృహమున నుంచి పూజించిన వెనుక వివాహ వేదికపై స్థాపించి 'యఖండము'ను వెలిగింతురు ఐరేణులను దెచ్చు ముత్తైదువులకు 'గరిగె బుడ్ల పేరంటాండ్రు' అను వ్యవహారము గలదు. వీని యువంతము గాంధారి కథ యందు హాస్యస్ఫోరకముగా వర్ణింపఁ బడినది.

జానపద గేయ గాథల యందు బుప్పము, బంతులాట, దండాడింపు, అలుక, పాన్పు, మొదలగు సంశము లేవియు స్పృశింపఁబడలేదు.

వధువు నత్తవారింటికి పంపుటకు ముందు "బంగారు" పళ్ళెమున పాలును నేయిని ఉంచి, దానియందు వధువు చేతులు నుంచి, వరునకు, అతని తలిదండ్రు లకు, అప్పజెల్లెండ్రకు, తదితర ముఖ్యులకు, చేతులలో చేయి వైచి యప్పగించు నాచారమున్నది.

వధువు అత్తగారింటికి వెడలునపుడు. కంద దుంపలు, చందనపు బొమ్మలు, పసుపు కుంకుమ, దువ్వెన, కాటుక బరిణె, నల్లపూసలు, బియ్యము మొదలగు వస్తువులను ఒడియందు కట్టుకొనును దీనిని 'ఒడిబాల' బియ్యమనియు, ఒడిబియ్యమనియు నందురు. అత్త యింటికేగిన వెనుక నీ బియ్యపు పాయసము వండి వధువు, ఊరివారికి విందు చేయవలయును. ఆ సాయంవేళ తాను సారెతో పాటు తెచ్చిన నూతన వస్త్రములను అత్తమామల కును ఆడు బిడ్డలకును ఈయవలయును.

ఇట్లు ఒడిబియ్యము కట్టుకొనివచ్చు పద్ధతి తెలంగాణము నందు వివాహ చర్యతో ముగియదు. ఆడుపిల్ల మూఁడేండ్లకో, ఐదేండ్లకో ఒకసారి పుట్టింటికి కేగి యొడిబియ్యమును పోయించుకొని రావలయును. ఇంటి "వంతన"ను బట్టి 5 లేక 3 శేర్ల బియ్యము, అయిదు అవికె కనుములు, చీరె, భర్తకు బిడ్డలకు వస్త్రములు, అత్తకు ఆడుబిడ్డకు అవికె గుడ్డలు పుట్టింటి వారి కడనుండి ఆడుపిల్ల తెచ్చుకొనును. వీనితోపాటు ఎండు కొబ్బరిచిప్పలు (కుడకలు) పసుపు కుంకుమ, నలుగు బిండి, పచ్చపిండి,యుండవలయును. ఇట్లు పన్నెండేండ్ల లోపున పుట్టింటి కేగి యొడిబియ్యము పోయించుకొనలేక పోయినచో, నా మీదట పుట్టింటినుండి దానిని గ్రహించు హక్కు ఆడుపిల్ల కోల్పోవును. కావుననే తెలంగాణమునందలి పడుచులు పుట్టింటికేగి యొడిబియ్యమును పోయించుకొని వచ్చుటలో ప్రాలుమాలరు. గేయగాథల యందు కథావశమున కాన్పించు వైవాహికాచారముల స్వరూపమిట్లున్నది.

కులములు :

ఏ శుభమునకైనను ముహూర్తము నుంచుటకు బ్రాహ్మణుఁడు కావలయును. రాజసభల యందు శుభ ఘడియల నెప్పుటకును, నేసలు పెట్టి యాశీర్వదించుటకును బ్రాహ్మణులుందురు.

ఈ గేయ గాథల యందు కనుపట్టెడి ''రెడ్డి" యను పదము వ్యక్తి యొక్క యూరి పెత్తన దారితనమును సూచించునుగాని, కులమును గాదు. ఈనాఁడు రెడ్లని వ్యవహరింపఁబడు వారందఱును జానపద వ్యవహారమున కాపులు కావనఁగా కేవలము పంట కాపు మాత్రమే కాఁడు. ఊరి పెత్తనము వహించిన మోతుబరి రైతునే కాపనఁజెల్లును. కాపు గ్రామముపై నెఱపు నధికారమే "కాపదనము". కాపులు కరణములు అను వాడుక విడదీయరాని జంట మాటల వాడుక. బ్రాహ్మణుడైన కరణము ఊరి యాయవ్యయములను కవిలెల రూపమున భద్రపఱుచుచుండఁగా, కాపు గ్రామ పాలనము చేయు చుండును. ఊరి యందు కీలక స్థానమున నున్న కాపు ముఖ్య జీవిక సేద్యము. వీరికి వ్యవసాయముతో పాటు పాడి పశువులను కలిగియుండుటయు నభీష్టమే

కుంతి మల్లారెడ్డి కథయందు కొన్ని విచిత్రాంశములు కలవు. బ్రహ్మతాను సృష్టించిన భూమిని పాలింపుమని బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను వరుసగా నడిగెనట. మొదటి ముగ్గురును ఆ భారమును వహించుటకు ప్రాలుమాలగా శూద్రుడందుల కంగీకరించి యొక నియమ మంచెను. తనకు ముగ్గురు దైవముల శక్తిని పరిపూర్ణముగ నందుబాటులో నుంచినచో తాను పరిపాలనా భారమును వహించుటకు వీలగునని చెప్పెను. ఆ ముగ్గురును త్రిమూర్తులు కారు, వారు, ఆసనము గడగని దేవర, (ఎద్దు) చీర కట్టని దేవర (అగ్ని) బొట్టుపెట్టని దేవర (గంగ)-గంగ, గోవు, అగ్ని, యీమూడు మూర్తుల సాయముతో కాపు ప్రపంచ మేలఁగలఁడు.

కుంటి మల్లారెడ్డి కథ యందే కాపులలో గల పలు శాఖలును, ఆయా శాఖలకా పేర్లు వచ్చిన వివరములును గలవు కుంటి మల్లారెడ్డి పిచ్చుకుంట్ల మూల పురుషుఁడు. అతని పెద తండ్రి ఉత్తమారెడ్డికి అమ్మోజమ్మ, తిమ్మోజమ్మ యను కూతుండ్రు గలరు. వారిని రాజ్యమేలు నవాబు చూచి మోహించి పెండ్లి యాడుదునని కబురు పంపెను [7] అంత నుత్తమారెడ్డియు, నా సీమలోని కాపు లందరును గుమిగూడి అంభోజమ్మ తిమ్మోజమ్మలను వెంటనిడుకొని, కూరి కొడవండ్లు చేతఁబట్టి బండ్లపై దక్షిణాదికి 'వలసబు దీయ' నేగిరి. దారిలో కాపు లెక్కిన బండి యిరుసు విరిగి కూలనుండెను. అంత నొక రెడ్డి పెడ యిరుసున చేయిబెట్టి 'పోబండి' యనెనట. ఆనాఁటి నుండి యా రెడ్డి వంశము వారందఱును పెడకంటి కాపులైరి. బండి నొగలున గూర్చున్న కాపు మోటాటి కాపయ్యను బండి విఱుగఁగా వెంటనే దిగి ప్రక్కన నడచిన కాపువంశము వారు పాకనాటి కాపులైరి. దారి యందూసులు చెప్పుచు సంఘతికిని ఉల్లాసము కలిగించిన కాపు వంశమువారు నెరవాటి కాపులైరి. అట్లే గోనె కాపులు, చిట్టెపు కాపులు, అఱవ, కుఱుమ నడిగడ్డ, కొంగ, కొయ్య, ముక్కునత్తు, ముంజూరు కాపులు, అనుచు ననేకరకములగు కాపులలోని తెగలనీ గేయ గాథ వర్ణించును. కొమిరెల్లి మల్లన్న కథ యందు, మోటాటి, గుడాటి, పాకనాటి వంటి కాపులలోని తెగలు, ఆదిరెడ్డి

---

7. ఈ కథను బోలిన కథలు కోమటి కులము నందును, వెలమ కులము నందును గూడ చెప్పఁబడుట కానవచ్చును.

కొడుకులైన మోటాటి రెడ్డి, గూడాటి రెడ్డి, పాకనాటి రెడ్డి మొదలుగా గల వంశ కర్తల నుండి జనించినవని వివరింపఁబడెను. అనుముల బ్రహ్మారెడ్డి కథయందును కాపులలోని భేదముల ప్రసక్తి కలదు. ఉత్తమా రెడ్డికి వచ్చిన కష్టమును నిర్లక్ష్యము చేసి యొక కాపు, వారితో కలియక 'వాలుగొండ' లో తలదాచ కొన్నందున వాని సంతతివారు వాలుగొండ కాపులైరి నేఁటికిని పిచ్చుగుంట్లు వారి గోత్రములు చెప్పరు.

కాపులలో వివాహమునకు ముందు వీరుని కొలుచు నాచారమున్నది తెలంగాణమున దీనినే, "వీరుని కెల్లుట" 'వీరునకు పెట్టుట' యందురు ఇందు ప్రధానాంశము వీరపూజ. మల్లారెడ్డి కథయందీ యాచారమునకు వివరణాత్మకమగు నంశములు గలవు. ఉత్తమారెడ్డి పెద్దకొడుకు వీర నాగిరెడ్డి పేర నీ వీరపూజ నెలకొన్నదని యా గేయగాథ వివరించుచున్నది. అమ్మోరజమ్మయు, తిమ్మోరజమ్మయు తమ్ము నవాబు కోరినందున, తమ జన్మలు మైలపడినవిగా నెంచి యగ్ని ప్రవేశము చేసిరి. అప్పజెల్లెండ్రు పోఁగా నేనెందుకని వీరారెడ్డియు నగ్ని ప్రవేశము చేసెనట. ఆ వీరారెడ్డియే కాపులు వివాహమునకు ముందు గొలుచు "ఒంటి వీరుఁడు"గా నెలకొనెను.

అమ్మోరజమ్మ తిమ్మోరజమ్మలు, అత్తయింటికి వధువు కొనిపోవు నొడి బియ్యములోని చందనపు బొమ్మలై నిలచి యుందురట ఒడి బియ్యమున బొమ్మలను వేయు నాచార మొక్క కాపులకే కాక చాల కులములయందు కాన్పించుచున్నది.

కుంటి మల్లారెడ్డి ఉత్తమారెడ్డి తమ్ముఁడగు సత్యమా రెడ్డి కొడుకు లోకవ్యవహారమున కాపులును పిచ్చుకుంట్లును ఒక వర్ణమునకు జెందినవారుగారు. పిచ్చుగుంట్లను సిరాజుల్ హసన్ కాపులకును గొల్లలకును గలిగిన సంతానముగా నూహించెను[8]. అట్టి బాంధవ్యమే రూపాంతరమునందియీ కథా గేయమున పిచ్చుకుంట్లును కాపులును అన్నదమ్ములను భావము కలుగు నట్లుగా వర్ణింపఁబడినది. భట్టులు క్షత్రియ ప్రభువుల గోత్ర సంకీర్తనము చేయునట్లు, వీరు కాపుల గోత్రములను కీర్తింతురు: పరమేశ్వరుఁడు తత్కార్య నిర్వహణమునకై మల్లారెడ్డి

8. Syed Sirajul Hassan-Castes and Tribes of. H. E. H. The Nizam's Dominion,

నాలుక యందు దేవవాక్కు, అమృతవాక్కు, విషవాక్కు, అను మూడు బీజాక్షరములను వ్రాసెనట. జానపదగేయ గాథాగతమగు పిచ్చుకుంట్లవరిత్ర యిట్లున్నది

కొమిరెల్లి మల్లన్న కథ యందు కుఱుమల పుట్టుకను గూర్చిన యంశములు గలవు. కుఱి యనఁగా గొఱ్ఱె కుఱుమలు గొఱ్ఱెలను గాచు జాతి. వీరికిని వ్యావసాయిక జీవులగు కాపులకును సంబంధములు గలవు. ఈ సంబంధమును కొమిరెల్లి మల్లన్న కథ సూచించును కాపులలో వివాహ సమయమున వధూవరులు ప్రతి, కంకణమును గట్టుకొను నాచారము కలదు మల్లన్నతన మొదటి భార్య నా పద్ధతి తోడ వివాహమాడెను. తదుపరి మల్లన్నకు గొఱ్ఱెలగుంపు నొకదానిని పరమేశ్వరుఁడనుగ్రహించి దానిని సాకుమని చెప్పెను. ఒక రాక్షసి పెంచిన రత్నాంగి యను బాలనాతఁడు వివాహమాడఁబోయెను. అచట ప్రత్తి దొరుకక పోవుటచే నీశ్వరుఁడు గొఱ్ఱెల యున్నిని త్రాడుగా పేని యున్ని కంకణముల నమర్చి వారిరువురికిని వివాహము చేసెను.రత్నాంగి సంతతి వారందఱును గొఱ్ఱెలను గాచు కులవృత్తి గలవారై కుఱుమలనఁబడిరి. ఇది యీ గేయగాథా గతమగు నంశము. సిరాజుల్ హసన్ పరిశోధన ప్రకారము తెలంగాణా యందలి పశుపాలక జాతియగు కుఱుమలు, కర్నాటక కురుబలు, తమిళదేశపు కురుంబలు, నించు మించొకరే. ఈ నామములు 'కుఱి' యనఁగా గొఱ్ఱె యను నర్థము నిచ్చు పదమునుండి రూపు నందినవి.

వీరి వంశపురుషుఁడు మల్లన్న. మల్లన్న గొల్లలకును దైవమే. గొల్లలును కుఱుమలును నించుమించొకటే జాతి యని చెప్పినను విప్రతిపత్తిలేదు. గొర్లవారే గొల్లవారై రనుట యుక్తి సహము. గొల్లలలో[8] మొదాటి గొల్లలను తెగ కవి గాయక లక్షణములు కలిగి మిగిలిన గొల్లవారి గుణ కీర్తనము చేయుచుందురు. తమ కడనున్న నిడివి చీరలచే వేషములు మార్చుచు, నృత్యగానముల నెఱపుచు నూరూర తిరుగు వారగుటచే వీరికి తెఱ చీరల వారనియు నామము గలదు. వీరిలో పికిలి గొల్లలు, గంగ కథలను, కాటమరాజు కథలను ప్రచారముచేయుచు జానపద గేయ గాథా ప్రవర్తకు లగుచున్నారు. అట్లే కుఱుమల యందు, 'బీరోళ్లు 'బీరన్నలోళ్లు' 'ఉగలోళ్లు' అని పిలువ బడువారు బీరప్ప దేవత ముందు పూజారి తనమును నెఱపు వారును, గేయ గాథా ప్రవర్తకులును అగుచున్నారు.

గొల్లలకును బీరప్ప దైవమే. కాటమరాజు కథయందు బీరప్ప మహా వీరుఁడై నెగడి, యాతనికి కుడిభుజముగా వర్తించెను.

భిన్న వర్ణములకుఁజెందిన యీ కలగలుపు విషయములను జూడఁగా తొలుదొల్త కాపులు పిచ్చుగుంట్లు, గొల్లలు, మొదలగు సబ్రాహ్మణ జాతులన్నియు నొకటిగానుండి తదుపరి వారిలో వేఱు వేఱు తెగలవారు చేపట్టిన వివిధ వృత్తుల వలన విభిన్న వర్ణములు రూపొంది యుందురని యూహించుట కనుకూలముగా నున్నది. వ్యవసాయమును ప్రధాన వృత్తిగా కలిగిన కాపులే సంఘమున తొలుత ప్రాముఖ్యము వహించిన ప్రధానమగు సబ్రాహ్మణ జాతి యని చెప్పుటలో సందియము లేదు.

జానపద గేయ గాథలయందు విరివిగా తడవఁబడిన మఱియొక వర్ణము మాదిగకులము. మాదిగలు తమ్ము తాము జాంబవదాసుల మని చెప్పుకొందురు. వీరి మత గ్రంథమనఁదగిన పురాణము జాంబపురాణము జాంబవంతుఁడు వీరి కులదైవము. ఆయన వారసులే జాంబవదాసులు. సంప్రదాయ సాహిత్యమున కీర్తిఁగన్న యరుంధతి వీరి యింటి బిడ్డ. జమదగ్ని యర్ధాంగమగు రేణుక వీరి యిలవేల్పు. దేవతలకు చిత్ర విచిత్ర వస్తు నిర్మాణము నొనరించి యిచ్చు విశ్వకర్మ జాంబవంతునిచే 'కొఱముట్లు'ను బడసి చతురశిల్పి కాఁగలిగెను.

మాదిగెలకన్న తక్కువ కులము డక్కలి కులము. దీని యుత్పత్తిని గూర్చి జాంబపురాణము వివరించును. జాంబవంతుఁడు విశ్వబ్రహ్మకు పనిముట్లు చేసి యిచ్చుటకై తన పెద్దకొడుకును జంపి వాని యంగములతో సుత్తి, డాకలి, డాకలి మొద్దు, సంబెట్లు, తిత్తి, పట్టుగట్టులు, మూస, సలాకులు, ఆకురాళ్ళు మొదలగు పరికరములను జేసి యిచ్చెను. అంతయు చేసి కొడుకు వెన్నుపూస లోని యేడు పూస యెముకలు మిగులఁగా వానిని పారవేసెను. పరమేశ్వరుఁడు ఆ యెముకలపై విభూతివేసి. సంజీవి పుల్ల మోపి, పిల్లవానిని లేపెను. లేపి జాంబవంతుని యింటికి పంపక యింటి ముంగట నున్న పెంటకుప్పపైఁ గూర్చుండఁబెట్టెను. అందున వాఁడు జాంబవంతునకు దక్కనివాఁడై డక్కలి వాఁడయ్యెను. డక్కలి వానికి మాతవాడలో ప్రవేశము లేదు. రెండు నిద్రాళ్ళ యిల్లు లేదు. పండుటకు మంచమును, కాలికి చెప్పును, లేవు. కప్పుకొనుటకు గొంగడి

లేదు. సివారు మీద బిచ్చమెత్తుకొను హక్కులేదు. ఇది యీ గేయగాథ వలన వ్యక్తమైన డక్కలివాని స్థితి.

జాంబపురాణమువందే కొన్ని కులముల 'జాబితా' కలదు. మాల, డక్కలి, కనికుడుకుల, గంప దింపుల, బొల్లి, కాయల, మొదలగు తక్కువ కులములు. అవి కాక, కాపు, మున్నూరు కాపు, బొందిలి, బోగము, తెలుగు ముత్తరాసి, వడ్రంగి, కంసాలి, కంచరి, కోమటి, అట్కారి, కమ్మరి, మేదరి, గౌండ్ల, పిచ్చకుంట్ల, బాలసంత, తుర్క, తంబల, కుమ్మరి, మంగలి, పంజరి, మార్వాడి, అర్వకులములు పేర్కొనబడినవి. ఈ యన్ని కులములకును చెందిన ఆయా వృత్తుల కవసరమగు పరికరములు లభించుట మాదిగలు పెట్టిన భిక్షయే యని జాంబపురాణము సగర్వముగా సాహంకారముగా, చాటుకొనును.

ఆ యా కులములకుఁజెందిన మౌలిక లక్షణములను కించిదపహాస్య ధోరణితో నీ పురాణము వర్ణించుట చూడఁగా నీ పురాణ కర్తలగు మాదిగలు తమ కంటె నగ్రవర్ణములుగా సాంఘిక ప్రతిపత్తి కలిగిన పైకులములపై ననాది నుండియు పేరుకొనిన కక్ష నీ రూపమున వెల్లడించుకొనుచున్నారన్న యూహ రాకమానదు.

మాదిగలలో దేవీపూజ నెఱపువారు బైనీండ్లు. వీరే బైండ్ల వారనియు, బవనీలనియు, భవనీలనియు పేర్కొనఁబడిరి. వీరికే, 'పంబ' వాద్యమును ప్రయోగించుచు మాతృదేవతా కథనము చేయుట వలన, పంబల వారని పేరు వచ్చినది. అంకాళమ్మ కథ, మారెమ్మ కథ మాతమ్మ 'పుట్టుదల', పెండ్లి, బాలగౌరి వివాహము, మలిసెట్టి వారి రాయబారము మొదలగున వన్నియు వీరు రాత్రులకు రాత్రులు గానము చేయు కథలు. జమిడికెలు వాయించుచు వీనిని గానము చేయుట వలన వీనికి జమిడికె కథలనియు పేరు వచ్చినవి.

వీరిలో కొమ్ము వారను నొక తెగ, కాటమరాజు కథలను గంగ కథలను గానము చేయుదురు.

మాలవారును జానపదగేయ గాథా ప్రవర్తకులే. పల్నాటి సీమ యందంతటను వీరు మాల దాసరులనఁబడుచు, కథలను చెప్పుట కలదు. నెల్లూరు ప్రాంత

మున ద్రౌపదీదేవి యుత్సవములు జరుగునపుడు మహాభారత కథలను తిరునాళుల యందు గానముచేయు నాచారము కలదు. ఆ కథలను గానము చేయుట వలన వీరికి పాండవుల వారనియు పేరు కలదు. 'గుత్తికొండబెళము' కడ సాగు జాతరలయందు పలు రకములగు వీరగాథలను పచరించు వారును మాల వారే. మాచర్ల, కారెమపూడి, దాచేపల్లి, గుత్తికొండ మొదలగు స్థలములన్నియు చరిత్ర ప్రసిద్ధములై వీరతా వైభవమునకు నెలవులైన స్థలములు. ఇట్టి స్థలముల యందు వినిపించు కథలలో, పల్నాటి వీర చరిత్రముతోపాటు గోపరాయనికథ, మాలదాసు కథ, వీర రాజమ్మ కథ మొదలగునవి ప్రముఖములైనవి [9]

ఇంకను ఈ గేయగాథలయందు విరివిగా, తంబళ్ళవారు, నంబులు, కోమట్లు, మొదలగు కులముల వారి ప్రస్తావన కాన్పించుచున్నది. కమ్మ కుల మునకు చెందిన లక్ష్మమ్మ కథయు, పణతి కథయు ప్రసిద్ధములు "పణతి" కథయే "కమ్మోరిపిల్ల" యను నామాంతరమున లభించినది. పల్నాటి వీరులలో బాలచంద్రాదులును,బొబ్బిలి నేలిన రంగరాయాదులును వెలమలు. వీరి యాచార వ్యవహారములు క్షత్రియ కులోచితములై వీరిని పరాక్రమోపేత జాతులుగను, ఆయుధోపజీవులుగను వర్ణించుచున్నవి. – ఈ విధముగా జానపద గేయగాథల యందచటచట స్పృశింపబడిన కులములను గూర్చిన సమాచారము నింకను పొడిగింప వచ్చును. కాని గ్రంథ విస్తర భీతిచే దీని నింతటితో, ముగించు చున్నాను.

జన జీవితమున సాంఘికములగు నాంక్షలును విధులును ఎన్నియేని పాదుకొని ప్రాచుర్యము నందుట యందరెరింగినట్టిదే. జానపదగేయ గాథలకును వీనికి సముచిత స్థానమున్నది. విధులనెడివి కొన్ని యాచారముల రూపమున సంఘమునందు నెలకొని యున్నవి. ఆచారములు కేవలము జనుల నమ్మకములపై జన్మనంది స్థిరత సంపాదించునవిగా నున్నవి. కావున విశ్వాసములను, జనులు విధిగా పాటించు సంప్రదాయ పద్ధతులయొక్కయు, నాచారములయొక్కయు వివరణములుగా మనము గ్రహింపవచ్చును.

---

9. మహావాది వేంకట రత్నము – పల్నాటి కథలు.

ఈ గాధలయందు శకునముల ప్రాబల్యం మెక్కువగా కాన్పించుచున్నది. ఒక కార్యమును ప్రారంభించుటకు ముందు శకునములు చూచుట జానపదులకే కాక నాగరకులకును సంబంధించిన యాచారము ఇది పురాతన కాలమునుండియు ప్రాచీన మత స్వరూపమునుండి యుద్భవించి పెరిగి లభించిన యాచారమగుటచే దీనికి నాగరకుల దృష్టియందును విలువ, కాన్పించుచున్నది. చెడు కలలు వచ్చిన దుష్ట ఫలితములు కలుగుననియు, నపశకునమునులు పొడగట్టిన కీడు జరుగు ననియు నమ్మట మానవజాతికి ప్రాచీన కాలమునుండియు లభించిన యలవాటు.

కామమ్మ కథ యందామె అత్తవారింటికి బయలు దేరఁబోఁగా నిల్లాలు తుమ్మెను. రెండిళ్ళ సందున పిల్లి అడ్డమాయెను. నంబి తంబళ్ళ వాఁడెదురు వచ్చెను. నాగుబాము జోడడ్డమాయెను. కామమ్మకు క్రొత్త కుండల కావడియు నొంటి మాలవాఁడును నెదురు వచ్చిరి. అట్లే కామమ్మకు వచ్చిన కలలన్నియు చెడు ఫలితములను సూచించు కలలు మారయ్య బ్రహ్మలోకానికిఁబోయినట్లు, చూడరాని భూమి చూచినట్లు, అగ్ని గుండములోనఁదూకినట్లు, కుడి చేతి నీలాలు చిట్లినట్లు, అత్తి పూసలవండ తెగి నేలఁబడ్డట్లు నొష్ట కుంకుమ నేల రాలినట్లు"- ఇట్లే కలలన్నింటిని కామమ్మ కనెను. ఇవన్నియు జరుగనున్న మారెయ్య మరణ మునకు సూచనలు.

మండపేట పాపమ్మ పేరంటాలి కథయందు, పాపమ్మ పుట్టినింట నుండఁగా నత్తింట భర్తకు జబ్బు చేసెను. అంత పాపమ్మకు నదిలో స్నానమాడి నట్లు, 'చేతెడు' గాజులు చిట్లిపోయినట్లు, నల్లపూసల పేరు తెగిపోయినట్లు, కాళ్ళ మట్టెలు విఱిగి పడ్డట్లు. భర్త శిరమున నూనె రాచుకొన్నట్లు, తానగ్ని గుండమున దూకినట్లు కలవచ్చెను. అత్తింటికి పైనము కట్టిన పల్లకిని బోయీ లెత్తుకొను చుండఁగా వచ్చిన వారిలో నొకరు తుమ్మిరి. రెండిళ్ళ సందున పిల్లి యెదురాయెను. తెలికివాఁడెదురాయెను. క్రొత్తకుండల కావడి యడ్డు వచ్చెను. కుడి వైపున తొండ కూసెను. ఇవన్నియు నపశకునములు.

వీనియందు శుభ సూచకములగు శకునములును గలవు. పల్నాటి వీర చరిత్ర యందు కోడి పోరు సందర్భమున బ్రహ్మనాయనికి జయమగునేని, సంపూర్ణ నాదమొప్పార శంఖమని చిట్టి షల్లును పరివార మర్థించిరి అది

తొలుత సల్లే కూసెను తరువాత. తిరిగి రెట్టించి, యెలుగించు మని యడుగఁగా నది యుత్సాహము మాని యొడలు ముసిక్రించి, హీన స్వరమున 'నెలుఁగించెను' దానిని బట్టి శకునజ్ఞులు తొలి పందెము విజయ దాయకమనియు మలి పందెము జరిగినచో నది పరాజయ హేతువగుననియు నిర్ణయించిరి.

బ్రహ్మన్న పక్షము వారు పోరు కాయత్తు పడుచుండగా నెన్నియేని దుశ్శకునములు పొడగట్టెను. దేవునకు దండము పెట్టు చున్నప్పుడాయన తోమాలె తెగి క్రిందపడెను. ఎదుట నెత్తుకొని వచ్చుచున్న నిండు కడవ విచ్చెను. శవమొకటి సరినడకల ముందునకు సాగెను. చెట్టు మీది పులుఁగెగసి పోయెను. వంట కట్టెల బండిపడి దొర్లిపోయెను. కోడెలు లేగలు కోరాడెను. నక్షత్రములు చుట్టి వచ్చెను. నక్కలు కూసెను. ఇట్టి శకునములు గేయగాథల యందు కొల్లలుగా కాన్పించుచున్నవి.

టోటమిక దశయందు టోటమ్ జంతువులు శకున సూచక విషయములుగ నుండెడివని ప్రాచీన మానవుని మతాచార పద్ధతుల వలన స్పష్టమగును. బల్లి, ఎద్దు, పిల్లి, తొండ, గాడిద, ఎలుకలపోతు, పైడికంటి, పాల, గుడ్లగూబ, కాకి, నక్క మొదలగు తిర్యక్కులే సాధారణముగ నెల్లయెడల శకున సూచకములుగా పేర్కొనఁబడుట నీ యభిప్రాయమును బలపఱచుచున్నది.

జానపదులు నెఱపుకొను పండుగలు పరిశీలింప నర్హములు. నిత్యజీవిత మున సామాన్య హైందవుఁడు మిక్కిలి యుత్సాహముతో నిర్వహించు, దసరా, దీపావళి, ఉగాది, సంక్రాంతి వంటి పండుగల ప్రసక్తియే యిందు కానరాదు. జానపదుఁడు సమధిక సంరంభముతో నిర్వహించు పండుగలలో నొకటి 'అమ్మవారి జాతర' దీనినే వారు 'పరుస' యనుటయు కలదు. ఈ పదమును పాల్కురికి సోమన శ్రీశైల యాత్రోత్సవపరముగా విరివిగా వాడెను. ఈదెమ్మ కథ యందు, మాత్రారాధనాంగముగా నీ పరుస మిక్కిలి వైభవముగా వర్ణింపఁ బడినది.

దవన పున్నమనాఁడు మాహురమ్మ పరుస ప్రారంభమయ్యెను. దేశదేశాల వారును, పసిడి పావనములు, ముద్రగడలు, పట్టుకొని వచ్చిరి. ఎచ్చోఁ జూచినను పటము పందిళ్లు వెలసెను, పోతురాజులు సాటోపముగఁదిరుగ సాగిరి.

జమిడికలు వాయించు బవనీలు, కొఱ్ఱు నెక్కి యాడు కుమార వర్గము, దీవెల వారు, గవ్వలవారు, బాకు, కటార్లువాల్చినవారు, పగ్గములవారు, సిడెలాడువారు, పుట్టుఁబాపలు, విచ్చలవిడిగా విజృంభించిరి. కుతిక అంపములు, గుండెగాలములు, నాలుక మడుపు కొఱ్ఱులు, నడినెత్తి కొఱ్ఱులు, దాల్చిన వీరభక్తులు, ఆత్మబాధా సహనమున దేవికి ఉపహారములుగా వెలుఁగు చుండిరి. భేరీ డమామీలు, బిరుదు మద్దెలలు, బూర గొమ్ములు, ఢక్కీలు, తప్పెట్లు, శింగినాదములు, చిఱుత వీణెలు, గంటలు, చేపిడి గండలు, దండెలు, వీణెలు, గోవింద వీణెలు, పద్మ వీణెలు, 'పంచమా వాద్యములు', జమిడికెలు, మ్రోఁగుచుండఁగా

"సొక్కుచు సోలుచు తూలి యాడుచును
తక్కుచు తమలోన తావు దప్పకను
నిక్కుచు నీల్గుచు నిగిడి రేణుకకు
మ్రొక్కుచు నంతంత మొనసి యాడుచును
దాటుచు నెగయుచు ధర పిక్కటిల్ల
వీరు వారనుచును విరసంబు లేక
ఉబ్బుచు మాతంగు 'లుద్దా' యని నుడువ
కోటాన కోట్లును కుంకుమాడుచును.

దేవీ భక్తు లుత్సవమున సంరంభించిరి.[10]

ఆ పరుస యందు పావనములు, పల్లికెలు, పట్టుకుంచెలు, పడిగెలు, కదిలెను. ఏదుము చేను మేర నేకాంగులు, పందుము చేను మేర పుట్టుఁబాపలు, జతగూడిరి. ఎచటఁజూచినను తామెయై కోలకాండ్రు పరుసను నడిపింప సాగిరి. మధువును మాంసమును పరుస యందెల్లెడల జనులను ముంచి యెత్తసాగెను. ఇది జానపదులు వర్ణించిన యమ్మవారి జాతరల తీరుతెన్నులు. ఇవి ప్రత్యేక సమయము నందేకాక, ఊరియందు 'గాయి, గత్తర' చెలరేగఁగా తత్ప్రశమనార్థమును, జరుగుట కలదు జనుల కేనేని యాపద వచ్చినచో దానిని గడవఁ బెట్టుటకై

10. ఈరమ్మ కథ - నాచే సేకరింపబడినది.

ప్రజలు గ్రామదేవత కింటింటికి నొక్క వేట (గొఱ్ఱె) చొప్పున నిచ్చి, నీటి యందాదేవిని 'వాసంత' మాడించి, జాతర చేయింతుమని మ్రొక్కుకొందురు రాయలసీమ యందిట్లు జాతరను చేయుటకు 'పెద్దేవర చేయుట' యందురు. ఈ పెద్దేవర చేయుట రాయలసీమలోని కోయిలకుంట్ల తాలూకాకు చెందిన 'గోవిందిన్నె' లో మిక్కిలి ప్రసిద్ధి వహించినది. ఆ సమయమున పంబల వారచట పెద్దమ్మ కథలను, రాత్రులకు రాత్రులకు చెప్పుదురట పల్నాటి సీమ యందెల్లడను గ్రామ దేవతల జాతరలు జరుగుట కలదు, ఇట్టి జాతరల యందే మాతృదేవతా గుణకీర్తనము చేయు కథల ననేకములను మాలవారు పచరించు చుందురు.

జాతరలు, గ్రామమున రోగములు చెలరేగి ముజ్జిడ్డుగా నున్నపుడు విరివిగా జరుగుచుండును. గ్రామదేవత కొలుపులు సాగించుట కూరి యందు నిశ్చ యింపఁబడిన వెనుక నూరంతయు నా వార్త 'యుడుము'వలన చాట బంపుదురు. గ్రామ మధ్యమున కలశస్థాపన జరుగును. దీనిని 'పురము వేయుట' అందురు. ఆపల దేవిని ప్రతిష్ఠించినంత కొలుపు లారంభమగును. ఊరి వారందఱును దేవికి 'బోనములు' చెల్లింతురు. 'బోనము' భోజన శబ్దవికృతి. రంగులతో చక్కగా చిత్రించిన 'పూజు కుండ' లో ముందు రోజు వండిన యన్నము నుంచెదరు. ఆ కుండను 'చద్ది కలశము, కడుముంత'యందురు. కడుముంతపై నుంచినమూకుడు వంటి దాని పేరు 'కంచుడు'. ఈ 'కంచుడు' నందు నూనెపోసి, వత్తివేసి జ్యోతి వెలిగింతురు. ఇది దొంతిగా పెట్టుకొని యమ్మవారి గుడి కడకుఁ గొనిపోవుటయే బోనాలు గొనిపోవుట. ఒకముంత కల్లుగాని, నీరుగాని, అమ్మవారి ముందు 'సాక' బోసి యీ బోనమును ఎవరికివారు ఆమెకు నివేదించెదరు. ఇట్లు బోనము లెత్తు నాచారము అన్నిచోట్ల నున్నను, తెలంగాణమున విరివిగా వ్యాప్తిలో నున్నది. 'అమ్మవారి కొలుపు' ను "బోనాలపండుగ" యని వ్యవహరించుటయు నిచట కలదు. అమ్మవారి సమక్షమున రుంజలు, తప్పెటలు, బూరలు, కొమ్ములు మొదలగు వీరవాద్యములు మార్మోగుచుండును. చివరిరోజున దేవికి 'పోతుబోనము చెల్లించుట యుండును. అంతకుముందు పూజారి బలిఖడ్గమునకు పూజ యొనర్చును. ఊరంతయు నుమ్మడిగా చేరి కొన్న పోతు నట బలియిత్తురు. పోతు అంగలోపము లేనిదై యుండవలయును, కొమ్ములు వంకరలేనివై తీరి యుండ

వలెను. దాని నట బలియిచ్చి దేవిముందు పోసినకుంభముపై దాని రక్తమును చల్లుదురు. రక్తసిక్తమైన యన్నము నూరి వీధులలో నెగఁజిమ్మెదురు. ఆ మెతుకులు పడినచోట నంటువ్యాధులు సోకవని జనుల విశ్వాసము. ఆ మెతుకుల నేరి గృహస్థులు తమ యిండ్లయందు భద్రము చేసికొనుట వలన నరిష్టములు కలుగవని నమ్ముదురు.

బలియీయఁబడిన జంతువుయొక్క దబ్బలను ( Liver ) నోట నిడుకొని యూరి మాదిగవాఁడు, ఊరంతయు లోన నిముడు నట్లుగా చుట్టును దిరుగును. ఆ రక్తము పడినంతమేర, కలరా, మసూచి మొద లగు వ్యాధులేవియు తమ ప్రభావమును చూపింపలేవనియు, పశువులకు గాలి సోకుట, వంటి యుపద్రవము లుండవనియు జానపదుల నమ్మకము. ఇట్లు చేయుటను 'ఊరుబాగుచేయుట' యందురు.

అమ్మవారి యెదుట మేకలను, కోళ్ళను, గొఱ్ఱెలను, నోటితో గొంతులు కొఱికి బలియిచ్చు పద్ధతిని 'గావు పట్టుట' యందురు. ఇట్లు గావులు పట్టువారు అమ్మవారి పూనకమును పొందిన పోతురాజులు. పోతురాజు దేవీ కథనమునందు, ఆమెకు తోద బుట్టినవాఁడును, కోలకాఁడును, అంగరక్షకుఁడును. ఆధునిక కాలమున పోతులకు బదులు గుమ్మడి కాయలను గావుపట్టుపట్టి పోతురాజు లావేశము తెచ్చుకొనుట కాన్పించును.

ఈ జాతరలయందు 'రంగమెక్కుట' యను కర్మకాండ యొకటి కలదు. ఒక స్త్రీగాని, పురుషుఁడుగాని ఆవేశమును దెచ్చుకొని, పూనకమును పొంది, ఆవమున కాలని పచ్చికుండపై నెక్కి చిందులు త్రొక్కుచు, నూరి ప్రజలకు రాఁబోవు కాలమునందు జరుగు శుభాశుభములను చెప్పుటయే రంగ మెక్కుట. పల్నాటి వీరచరిత్రమున రంగము పెట్టించు (పే. 177) ప్రసక్తి గలదు.

గ్రామదేవతల జాతరవంటిదే నెల్లూరి ప్రాంతమున దొనకొండ యందును, కనిగిరి తాలూకాలోని ఆలవలపాడు నందును, సాగు 'గంగజాతర'. గంగ యాదవుల కులదైవము. కాటమరాజు కథలను కొమ్ముపాంద్రులను, పికిలి గొల్ల లును ఈ సమయమునందే చెప్పుదురు. కాటమరాజు కథకు సంబంధించిన 'ఆవుల పరపు' ను గూర్చియు, నందు వివరింపఁబడు తానకములను గూర్చియు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ముచ్చటించియున్నారు [11]

11, మల్లంపల్లి సోమశేఖరశర్మ - కాటమరాజు కథ పీఠిక

ఈ జాతరలతో సరివచ్చుచు విశేష భక్తిగౌరవములతోఁ జరుపఁబడు నుత్సవములు పేరంటాండ్ర యుత్సవములు. భర్తతోడ సహగమనము చేసియో, ప్రజాహిత కార్యమునకై ప్రాణము లర్పించియో, వీరాద్భుతచర్యలను నెఱ వేర్చియో స్త్రీలు జానపదుల భయభక్తి గౌరవములను పొందుట కలదు. వీరు మరణించిన వెనుక పేరంటాండ్రై జనులచే పూజల నందుకొనుచుందురు. వీరి చిహ్నములైన 'సతీకల్లు'లు ద్రావిడదేశమునందంతటను కాన్పించుచునేయుండును గ్రామదేవతలయందధిక సంఖ్యాకలైన దేవతలు ఈ విధముగా పేరంటాండ్రైన వారే. పొదిలమ్మ, కనకమ్మ, ముండ్ల మూడెమ్మ, కళుగోళమ్మ మొదలగు దేవతల మానవ స్త్రీ జన్మయు, నా జన్మయందు వారు నిర్వహించిన విశేషములును, గ్రామదేవతా కథనముల యందుగ్గడింపఁబడుట కలదు.

గేయగాథల యందు. పేరంటాండ్ర కథలలో, మరణానంతరమువారు శిలలైన విధమును, వారికి పూజలు సాగెడి పద్ధతియు వర్ణింపఁబడినది.

సన్యాసమ్మ కథ యందామె గుండమున పడిన వెనుక గుండమును చల్లార్పించి చూడఁగా నందు సతిపతులు "పుట్టుశిల"లై కాన్పించిరి. సన్యాసి యన్న రామన్న యచట గుడిగట్టించి కోనేరు త్రవ్వించి తులసి మంటపములు కట్టించెను. ఏఁటేట నచట నేడు దినములు నిత్యతీర్థములు సాగు నేర్పాటు కలదు

అట్లే కామమ్మ గుండమునుండి యెఱ్ఱ కలువపూవై పుట్టుకొని వచ్చెను. కార్తిక పూర్ణిమ నాఁడచట "తిరునాళ"జరుగును. ఈ తిరునాళ యందు, గ్రామ దేవతలకు చెల్లించునట్లు "సిడులు" బోనములు, చెల్లింపవలదని కామమ్మయే గట్టి కట్టడి చేసెనట. అచట తొమ్మిది రోజులు, జాగరములు జరుగును. నిండు 'పౌర్ణమి' నాఁడు రథముపై కామమ్మ నూరేగింతురు దేశదేశపు జనులును నీ పేరంటాలి సంబరమును తిలకించుటకు 'తీర్థప్రజ'గా వత్తురు.

పాపమ్మ కథ యందు గుండమునఁబడ్డ పాపమ్మ పాముగా మారి యామె పెదతండ్రి చూచుచుండఁగా నొక పుట్టలోనికి ప్రవేశించెను కావున నాపుట్టపైననే పందిరివేసి ప్రతి సంక్రాంతి పండుగకును, బోనపు కావళ్ల తోడను, నైవేణి కుండలతోడను, పండ్లు, పాయసాన్నములు, చలిమిడి, వడపప్పు పానకము, మొదలగు పంచ్యారములతో జనులచట "తిరునాళ్ల" సాగింతురు. పాపమ్మ పుట్టి నింట తలయంటుకొని పుట్టదగ్గఱ బోనపు కావళ్లు చెల్లించి సతిపతు లెవ్వరేని భక్తిమై యామెను ప్రార్థించినచో వారికి 'సంతు' కలుగును.

గుండమున పడకపోయినను భర్త చేతిలో మరణించిన శ్రీ లక్ష్మమ్మయు పేరంటాలే యైనది. ఆమెను దహనముజేసి మఱునాఁడు 'కాష్టము' చల్లార్చి బంధువులు పాలు పోయఁగా, నంసుండి లక్ష్మమ్మ పుట్టు శిలయై లేచి వచ్చెను. పల్నాటి సీమ యందీమె కేటేట సంబరము లు చేయు నాచారము కలదు. గ్రామ గ్రామము నుండియు కుంకుమ బండ్లును, పంద్యారపు బండ్లను తోలుకొనిపోయి జనులు భక్తితో నీ పేరంటాలిని కొలిచి వత్తురు

'సతీకల్లు'ల వంటివే 'వీరకల్లు'లును. పల్నాటిసీమయందు వీరుల నేఁడాది కొకసారి పూజించు నాచారము కలదు. పల్నాటి వీరగాథ ననుకరించు నీ వీరోత్సవమచట నాఱు రోజులపాటు జరుగును. ఈ యాఱు రోజులును, నిరు పక్షములవారిని పిలువ నంపుట, రాయబారము, భేరులు మ్రోగించుట యిత్యాది యుద్ధ నటనము సలిపి, యాఱవనాఁడు భూతతృప్తికై రుధిరాన్నము సమర్పింతురు[12] "గుత్తికొండ బిలము" కడ సాగు నీ వీరారాధనోత్సవము ప్రసిద్ధమైనది. ఈ బిలము నందే చివరకు బ్రహ్మనాయుఁడు ప్రవేశించి తన యవతారము చాలించెనని జానపదులు చెప్పుకొందురు.

ఇట్టివి జానపదులు మిక్కిలి సంభ్రమోత్సాహములతో జరుపుకొనెడి యుత్సవముల తీరుతెన్నులు.

విద్య :-

జానపద గేయగాథలయందు 'విద్య' ను గూర్చి యెట్టి ప్రత్యేక ప్రస్తావనయు లేదు. పిల్లలు చిన్ననాఁడు చదువులబడులలోఁజేరి శిక్షణ క్రింద విద్య నేర్చుటయు సాము గరిడీలయందు సాము నేర్చుటయు, వీని యందచటచట స్పృశింపఁబడును. వేదములు, పురాణములు, శాస్త్రములు, అఱువది నాలుగు విద్యలు, కథానాయకుఁడు క్షుణ్ణముగా నేర్చెనని చెప్పుట జానపదున కభిమతము. స్త్రీ విద్యగాని, సంఘమున విద్యావతియగు స్త్రీకిఁగల ప్రాతినిధ్యముగాని, యెచటను వివరింపఁబడిలేదు. కాని 'గాంధారి కథ' యందు మాత్రము, గాంధారి బాలరాజుతోఁగూడి చదువు నేర్చుకొనుచు మంత్ర విద్యను రహస్యముగా నభ్యసించెను. ఆ మంత్రవిద్యకు కథాగమనము నందు ప్రాముఖ్యము కలదు. మొత్తము మీద నీ గాథలయందు విద్యార్జన కీయఁబడిన స్థాన మంత ప్రముఖమైనది కాదు.

---

12. మహావాది వేంకటరత్నము - పల్నాటి కథలు

ఔషధములు :-

కథాగత పాత్రలు రోగ పీడితులగుచో, వాడఁబడెడి యౌషధములన్నియు నాకులు, మూలికలు, జంతువులను, మొదలగునవిగా పేర్కొనఁబడినవి. వీని యందనేకములగు వ్యాధుల ప్రసక్తి కలదు. కాసె, ఉక్కెన, గంగ వెఱ్ఱులు, గండమాల, వాలగౌడలు, కాకి సోమాల, మొదలగు రోగములు ప్రసంగ వశమున బేర్కొనఁబడినవి కాని వీని కన్నింటికిని కారణము భగవదాగ్రహ విశేషమేగాని శరీరగత రుగ్మత కాదని సిద్ధాంతము చేయఁబడును. కావున దైవానుగ్రహ విశేషము, భగవత్ప్రసాదము కలిగిన వెంటనే రోగములు మాయ మగును కొన్ని యెడల మంత్రములు, విభూతి, మంత్రజలము వంటి యతి మానుష శక్తి పూరితములగు వస్తువుల 'సోకు' వలన నా రోగములు నశించినట్లు వర్ణించుట కలదు.

కాంబోజరాజు కథయందు, రాచపుండునకు మాత్రము వైద్యులుపయో గించిన యనేకములగు నౌషధములతోపాటు, కోడి, మేక, నరుఁడు మొదలగు ప్రాణుల మెదడుచే తయారగు 'కట్టు' మందుగా నిర్ణయింపఁబడినది. కాంభోజ రాజు కథయందును, శివకుమారుని కథయందును, నలభ్య స్థానమున నున్న మందులను కొని వచ్చుటకై కథానాయకు లమేయ పరాక్రమ చాతుర్యములను చూపవలసి వచ్చినది.

క్రీడలు :-

సాము గరిడీల ప్రసక్తి యీ గేయగాథలయందు కలదు. వీనిని జాన పదుఁడు 'సాధన గరిడీ' అని పేర్కొనును - బొంగరముల యాటయు, కోడి పోరును జానపదునకు మిక్కిలి ప్రీతి పాత్రములైనవి. బొంగరముల యాట పల్నాటి వీర చరిత్రయందును, బాలనాగమ్మ కథ యందును, పరంజ్యోతి కథ యందును, కొంత కథ నడచుటకు కారణమైనది. అట్టే కోడిపోరు, పల్నాటి వీర చరిత్రయందు అన్నదమ్ముల మధ్య కలహమును, బొబ్బిలి రాజు కథయందు, సంస్థాన పతనము సంభవించుటకు మూలకారణమును, సృష్టించినది. అట్లే 'చతురు బాల' పందెము, అనఁగా పాచికల యాటయు, గౌత పురాణమునందున రాణి మైనావతి కథయందును, కథ నడచుటకు కారణమైనది. ఇవి కాక, పిల్లలాడెడి యాటలుగా, రూకల తుప్పలు, ఓకపోకలు, గుంతమూపలు, కుందిన

గుడి, చిఱ్ఱగోనె, గోలి గుండ్లు, మొదలగు క్రీడల ప్రసక్తి ఈ గాథల యందు కలదు.

భాషా విశేషములు, ఆయుధ వైవిధ్యములు, ధాన్యభేదములు చీరల యందును అవికెల యందును గల భేదములు, చతురంగ బలములలో రథ గజ తురంగములకు గూర్చు వివిధాలంకారముల నామములు, రాజలాంఛనములు, కొన్ని కొన్ని కుల వృత్తులకు సంబంధించిన పరికరముల పేర్లు-ఇవన్నియు నీ గాథల నుండి తెలిసికొనుటకు వీలున్నది ఒక విధముగా నీ యీ విషయ సేకరణమున కివి సర్వస్వముల (Encyclopaedias) వలె పనికి వచ్చును. జానపద గేయగాథలలో ప్రస్ఫుటమగు నాచారముల యందును, నమ్మకముల యందును, ప్రాచీనతా వైభవము పరిమళించుచుండును విధులు, ఉత్సవములు, ఔషధములు విద్య, మొదలగు నంశము లన్నియు, నీ గేయగాథలయందు స్పష్టాస్పష్ట రూపములతోడ లభించుచు జిజ్ఞాసువులకు కుతూహల కారణము లగుచున్నవి



# భాషా విశేషాంశములు

నాగరక ప్రపంచమునకు దూరముగా పామరజన సదనములయందు నిలచి యున్న జానపద భాషా స్వరూపము నవగతము చేసికొను నవసరము భాషా వేత్తల కెంతయేని కలదు కొన్ని కులములు జానపద గేయగాథలను ప్రచరించుటయే తమ వృత్తులలో నొకటిగా స్వీకరించి యాకళ నశించి పోవకుండ కాపాడుకొను సంరక్షక భారమును వహించి, సంప్రదాయ రక్షకము లగుచున్నవి

పల్లెలు వదలి పట్టణముల కెగఁబ్రాకుచు, సేద్యమును విడిచి యుద్యోగము నభిమానించుచు, అక్షరాస్యులగుచున్న పల్లెటి ప్రజలు, అభివృద్ధి పథము వైపు పురోగమించుట ఆనంద హేతువే. కాని పరంపరగా తమకు లభించిన కాణాచివంటి యీ ప్రాచీన సంపద, అలన పాలనలు లేనిదై వన్నె తఱిగి పోవు చున్న దీపకళిక వలె కొన మెఱుపులు మాత్రమే ప్రచరించు చదగుట విచార హేతువు. ఈ నాటి జనమానస పర్యాలోచన చేసినచో నొక్క విషయ మాకళింపునకు వచ్చుట బాధావహముగా నుండును. పల్లెటూరి జనులకైనను, వారి తండ్రి తాత లాదరించిన ఆచార విశేషములు తెలియవు. వానియందు నిక్షిప్తముగా నున్న జనోపయోగియగు నంశముల స్వరూప మవగతము కాదు అమ్మమ్మలును, నాయనమ్మలును జెప్పఁగలిగెడి పేదరాసి పెద్దమ్మ కథలలోని కథా రచనా చాతుర్యమునందు వారికి రుచి లేదు వానియందు గుప్తరూపమునఁ బ్రదికియున్న ప్రాచీన మేధా సంబంధియగు నంశముల సాక్షాత్కారము వారికిఁ జరుగదు. అణువులును, రాకెట్లును మనుష్య జీవితము నేలుచున్న కాలమున పుక్కిటి పురాణములలోని యాచారములను పరిశీలింపుఁడన్నచో నవి హాస్యాస్పద విషయములుగనే కాన్పింపవచ్చును నిజమునకు పామరజన సాహిత్యముపై నాగరకుని యభిప్రాయమునేడట్లే యున్నది కేవల నాగరకుఁడే యననేల. బాగుగా చదువుకొన్న వారికిని, ప్రాచీన సాహిత్యమును పుడిసిట బట్టఁగలుగు నేర్పుగల వారికిని గూడ, జానపద సాహిత్యముపై చిన్న చూపే కలదు. ఈ చులకఁదనము ఈ నాఁటి దనుటకు వీలులేదు శ్రీనాథుని నాఁటినుండియు పండిత లోకమున ప్రవేశ్లానియే యున్నది

నిజమునకు, జానపదుని సాహిత్యమును తక్కువగా గణించి చిన్న మాపు చూచుట తగదు. వాని యాలోచనా విధానమునుండి రూపుకట్టిన "కాకమ్మ కథల" యందే, ప్రాచీన మానవ మేధాపరిణామమును, వాని మత విషయక, సాంఘిక స్వరూపమును, స్పష్టరూపములలో నిలిచియే యున్నదని మందు ప్రకరణములలో వివరింపనైనది. అనగా జానపద గేయగాథలు, ఏ ధారూపము వహించిన, నృశాస్త్ర (Anthropology) సాంఘికశాస్త్ర (Sociology) సర్వస్వములన్నచో నతిశయోక్తి లేదు.

అట్లే భాషా విషయకముగ గూడ నీ జానపదగేయ గాథలు, భాషయొక్క క్రమ పరిణామ స్వరూపమును సూచించు నమూల్యాంశములకు నిధులగు చున్నవి.

భాష ప్రవాహము వంటిది. ప్రవాహము, ఎట్టి క్షేత్రమును మెట్టిన నట్టి లక్షణములను పొంది భిన్న భిన్నములుగా దోచునట్లు, భాషయు దానిని జేపట్టిన యధికారి తత్త్వము ననుసరించి భిన్నభిన్న రూపముల నందుచున్నది. చదువు కొన్నవాని భాషయు, చదువు రాని వాని భాషయు నొక్క రూపము కలవికావు. ఒక మండలమునకును మఱియొక మండలమునకును ఒకే భాషయందు వైవిధ్యయు కలదు పర్వతవాసి పలుకుల లోను సాగర తీరస్థుని మాటలలోను గల విభేద మంటయును గుర్తింప దగినదే.

అట్టి యెడ నాగరకత నేర్చి, సంస్కృతి పథమువైపు గమించుచున్న, నేటి చదువుకున్న మనుష్యుని భాషకును చదువు సంధ్యలు లేక, గ్రామ జీవనము వలన బయటి ప్రపంచముతో సంబంధముంచుకొనక, అల్పపరిధిలో బ్రదుకు పామరుని భాషకును గల యంతర మెక్కువ. ఒక భాషయొక్క ప్రాచీన స్వరూపమును దెలుపు నంశములు పామర భాషయందు నిలుకడగా నున్నట్లు నాగరకుని భాషయందుండవు. ఈ యంశమును మనస్సులో నుంచుకొని యీ గేయగాథల యందలి భాషాస్వరూపమును పర్యాలోచించినచో భాషా శాస్త్రజ్ఞులకీ గేయగాథా సేకరణము అమూల్య నిధివంటిదగును.

దేశము నాలుగు చెఱగులకును పఱచుకొనియున్న తెలుగు జానపద సాహిత్యము నందలి భాషను పరిశీలించి మూడు ముఖ్యములైన ఫలితములను పొందవచ్చును. 1. తెలుగు భాషయందలి మాండలిక భేదములను గుర్తించి

స్థాపింపగలుగుట, 2. ద్రావిడకుటుంబమున ఆ భాషా పరిణామ క్రమమునందు తెలుఁగు పొందిన స్థానమును నిర్ణయించి, దానికి సోదర భాషలతోడి సంబంధమును స్థాపించుట, 3 ప్రాచీన కావ్యములయందు, మారుమూల పదములుగా మిగిలి, యర్థ నిర్ణయము చేయుటకు వీలులేనివై యుండిన పదముల స్వరూపమును గుర్తుపట్టుట.

ఒక పథకము ( Scheme ) ప్రకారము, ఆంధ్రదేశము నాలుగు చెఱఁగుల నుండియు గేయగాథలను సేకరించుటకు, ఒక సంస్థ కగువు పనును గాని, ఒక వ్యక్తికి కాదు.

జానపదగేయగాథల యందలి కథాకథనమున పొదుగఁబడిన నృశాస్త్ర విజ్ఞానమును వెలికి దీయుటయే నా పరిశోధన యందలి ముఖ్యాంశ మగుటవలన నాచే సేకరింపఁబడిన, గేయ గాథలయందలి భాషా సమాచారము, మాండలిక నిర్ణయము చేయుటకు చాలదు. కాని యందలి ధ్వనులు మార్పును గుర్తించుటకును, ఆ మార్పులతో, నెన్ని ప్రాచీన కాలమునుండియే, స్థాపింపబడినవియో, ఎన్ని క్రొత్తగా జనించినవియో ( Innovations ) నిర్ణయించుటకును, ఈ సమాచారము కొంతలో కొంత పనికివచ్చును.

అట్లే, జానపదుల నుడికారపు సొంపును, క్రొత్తపదబంధముల నిర్మితిని, సామ్యము వలనను, పరిచితివలనను, వారు క్రొత్తమాటలను ఏర్పరించుకొను వైనమును, ఈ సమాచారమునుండి తీర్చుటకు వీలున్నది. అట్టి ప్రయత్నమే యీ వ్యాసమున చేయఁబడినది.

1. ధ్వని పరిణామము : భాషా నిర్మితికి ధ్వనులు ఇటుకరాళ్లవంటివి. ప్రాచీన భాషకును, వర్తమాన భాషకును మధ్యవంతెనలు నిర్మించినట్లుగా నమరిన యనేక లక్షణములీ ధ్వని పరిణామమునకు చెందినవే. ఈ మార్పు, జీవద్భాష యందు ఏ దశయందైనను జరుగుచునే యుండును. ప్రాచీన ద్రావిడ భాషకును తెలుగునకును మధ్య కొన్ని మార్పులు స్పష్టముగా భాషా వేత్తలచే గుర్తింపబడినవి. అవి,

1. పదాది పరుషములు సరళముగా మారుట.

| | | | | |
|---|---|---|---|---|
| *[1] | క | కెంటణ్ | > | గండ |
| * | త | తీట్టు | > | దీటు |

*. ఈ గుర్తు గలవి ప్రాచీన ద్రావిడమునందు నిర్ధారింపఁబడిన ధ్వనులు.

| | | | |
|---|---|---|---|
| *ప | పొత్తిల్ | > | బొత్త |

2. కొన్ని పదాది వర్ణముల మార్పు -

| | | | |
|---|---|---|---|
| *క > చ | కెయిరు | > | చేరు |
| *చ > త > ద | చునై | > | దొన |
| *వ > బ | విటమ్ | > | బెట్ట |

3. పదాది హల్లులు కొన్ని జారిపోవుట

| | | | |
|---|---|---|---|
| *చ > φ[2] | చందమ్ | > | అందము |
| *న > φ | నీను | > | ఈదు |

4. 'ఴ'[3] కారము తెలుగున డ, ర, లుగా మారుట. కొన్ని యెడల జారిపోయి, సమీకరణము నంది నశించుట.

| | |
|---|---|
| *ఴ > డ | అఴల్ > అడరు |
| | ఈఴ్చు > ఈడ్చు |
| | ఇఴ్గు > డిగ్గు |
| * ఴ > ర | మిఴ్ంగు > ఘ్రింగు > మ్రింగు > మింగు |
| *ఴ > φ | అఴ్ > కర > అక్కర |
| | మెఴ్తు > మెత్తు |

5. ప్రాచీన ద్రావిడాచ్చులలో నీ క్రింది విధమగు ధ్వని పరిణామము తెలుఁగున రూపొందుట.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇ> ఎ | నిలవు | > | నెలవు | DED | 3113[4] |
| ఉ> ఒ | పుగై | > | పొగ | DED | 3483 |
| ఒ> ఉ | ఒలి | > | ఉలివు | DED | 837 |

---

2. φ - ఈ గుర్తు లోపమును సూచించును.

3. ఴ - ఇది ప్రాచీన ద్రావిడ వర్ణము.

4. Burrow & Emeneau- Dravidian Etymological Dictionary-D.E.D.

ఇంతేకాక, ధ్వని పరిణామ క్రమమును సూచించు, వర్ణ సమీకరణము (Assimilation) వర్ణ వ్యత్యయము (Metathesis) అచ్చులోపము (Synecope) దీర్ఘలోపము (Loss of Length) లోప దీర్ఘత (Compensatory lengthening) వంటి యనేకములగు మార్పులు కూడ ప్రాచీన ద్రావిడమునకును తెలుఁగునకును మధ్య సంభవించినవి.

6. వర్ణ సమీకరణము :-

| | | | |
|---|---|---|---|
| నెరుప్పు | > | నిప్పు | |
| నెంబు | > | నెమ్మ | DED 3102 |

7. వర్ణ వ్యత్యయము

| | | | |
|---|---|---|---|
| అడైకల్ | > | డాకలి | |
| తుర | > | త్రోచు | DED 2744 |

8. లోప దీర్ఘత

| | | | |
|---|---|---|---|
| వింకు | > | వీఁక | DED 4477 |
| నెట్టమ్ | > | నీటు | DED 3100 |

ఇట్టి మార్పులు, ప్రాచీన ద్రావిడమునకును, తెలుఁగునకును మధ్య జరిగిన వని, పై యుదాహరణములవలన స్పష్టము చేయుటకు వీలున్నది. నాకడచేరిన జానపదగేయ గాథా గతమగు తెలుఁగు పదసమూహమును పరిశీలించి, యిచట పొడఁగట్టిన ధ్వనుల మార్పులెట్టివో యీక్రింద నమర్చుచున్నాను. ఈ మార్పులు, ఒక్క తెలుఁగు నందే విభిన్న కాలములయందును, ఏక కాలమునందే విభిన్న వర్గములయందును జరిగినవిగా భావింపవచ్చును. ఒకే మాటకు (word) భిన్న భిన్న రూపములు లభించినపుడు ఆ మాట అట్టి రూపాంతరములు చెందుటకు వీలు కలిగించిన ధ్వనిపరిణామ మెట్టిదో, వివరించుటయే యిచటి ముఖ్యోద్దేశము, కాని ఈ ధ్వనుల మార్పులలోని చారిత్రక పరిణామమును సూచించుటకీ సేకరించిన సమాచారము చాలదు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | క > గ | కొప్పెర | — | గొబ్ర |
| | | కల్లంతులు | — | గల్లంతులు |
| | | కవ్వ | — | గవ్వ |
| 2. | [5]-క > -గ | రాకిడి | — | రాగిడి |
| 2. | క > చ | కర్నకోల | — | చర్నకోల |
| 3 | -గ > -వ | వాలగ | — | వాలవ |
| | | సగరేత్రి | — | సవరేత్రి |
| | | ధగిడీ | — | ధవిడీ |
| | | లోగిళ్లు | — | లోవిళ్లు |
| 4. | -గ > φ | బగిసిమాలి | — | బైసిమాలి |
| 5. | -ట > -త | గుమ్మెట | — | గుమ్మెత |
| 6. | -డ > -న | వడగండ్లు | — | వనగండ్లు |
| 7. | -డ > -ణ | గవిడి | — | గవిణి |
| 8. | -డ > -ర | మెదడు | — | మెదురు |
| 9. | త > ద | తోరణము | — | దోర్నము |
| 10. | -ద > -జ | ప్రమిద | — | ప్రముజు |
| 11. | -ప > -బ | ముసాపరు | — | ముసాబరు |
| 12. | -ప > -వ | కపిల | — | కవిల |
| 13. | -బ > -మ | సంబెట | — | సమ్మెట |
| 14. | -బ > -వ | కబళము | — | కవళము |
| 15. | చ > స | చాలు | | సాలు |
| | | చానలు | | సానలు |
| | -చ > -జ | వంచెలు | | వంజెలు |
| | -చ > -ద | గడవంచలు | | గడవందులు |
| 16. | -జ > -ద | నజరు | | నదరు |
| | జ > ద | జంట | | దంట |

5. వర్ణమునకు ముందుండు ఈ '-' గుర్తు ఆ వర్ణముయొక్క అపదాదిస్థితిని సూచించును.

| | | | |
|---|---|---|---|
| 17. | హ φ | హవుదా | అవుదా |
| | | హెచ్చు | ఎచ్చు |
| | | హరివాణము | అరివాణము |
| | -హ φ | వహి | వై |
| | | మొహిరీలు | మోరీలు |
| | | గ్రహణము | గ్రాణము |
| | | ఆహుతి | ఆవతి |
| | -హ -గ | లాహిరి | లాగిరి |
| | | ఆహుతి | ఆగతి |
| 18. | న > φ | నజ్జి | అజ్జి |
| | న > ర | నోట్లు | రోట్లు |
| | | నొల్లు | రొల్లు |
| | -న > -ర | తచ్చనము | తచ్చరము |
| | -న > -ల | ఉజిని | ఉజిలి |
| 19. | ణ > ళ | జమఖాణము | జమకాళము |
| | -ణ > -డ | రుణము | రుడము |
| 20. | -ల > -ళ | మందెమేలము | మందెమేళము |
| 21. | -ర > -డ | జంగిరి | జంగిడి |
| | -ర > -ల | జారాడ | జాలాడ |
| | | పందిరి | పందల |
| | -ర > -న | శిఖరము | సిగినము |
| | | జంజరము | జంజనము |
| 22. | య > φ | యుగం | ఉగం |
| | | యంత్రం | అంత్రం |

23 మహాప్రాణత్వము లోపించుట :—

| | | |
|---|---|---|
| ఖ > క | ఖాయిదా | కాయిదా |
| | ఖాయిలా | కాయిలా |
| -ఖ > -క | జమఖానా | జమకాణము |

| | | | |
|---|---|---|---|
| | -ఖ > -గ | శిఖరము | సిగినము |
| | ఘ > గ | ఘడోంచీ | గడవంచె |
| | -ఫ > -ప | ఉల్ఫా | ఉలపా |
| | ధ > ద | ధాతువులు | దాతవలు |
| | భ > బ | భరోసా | బరోసా |
| | | భగ్నము | బగ్గము |
| | -ఛ > -చ | బిఛాణా | బిచాణా |
| 24. | అచ్చుల మార్పు :– | | |
| | అ > ఇ | జడ్డగం | జిడ్డిగం |
| | ఆ > ఒ | మగ | మొగ |
| | | గజుగోరు | జగోరు |
| | -అ > -ఇ | కావడి | కావిడి |
| | | పోబడి | పోబిడి |
| | -అ > -ఎ | పడిగ | పడిగె |
| 24 ఎ. | ఇ > ఉ | రిత్త | రుత్త |
| 25 | ఇ > ఎ | గిరవి | గెరవు |
| | | గిటక | గెటిక |
| 26. | -ఇ > -ఎ | కాసి | కాసె |
| 27. | ఉ > ఇ | ఉగ్గోళ్ళు | ఇగ్గోళ్లు |
| 28. | ఉ > ఇ | గురిగింజ | గిరిగింజ |
| | -ఉ > -ఇ | జులుము | జులిమి |
| | | మాలుము | మాలిమి |
| | | బులాకు | బులాకి |
| | -ఉ > ఎ | తీను | తీనె |
| | -ఊ > -ఓ | సంగూర | సంగోరు |
| | -ఉ > -అ | రుమాలు | రుమాల |
| | -ఉ > -అ | ధాతువులు | దాతవలు |
| 29. | -ఎ > -ఒ | రెయ్య | రొయ్య |
| | -ఏ > -ఓ | గేధె | గోద |

| | | | |
|---|---|---|---|
| ఓ | ఔ | ఓటి | ఆవిటి |
| -ఔ | -అ | కౌగిట | కాగట |

తెలుగున పదాది అచ్చులు ఊనిక ఉండుటవలన మారవను తీవ్రాభిప్రాయ మున్నది కాని పైన సూచించిన మార్పులు నేను జానపద సాహిత్యమున గుర్తించినవి అవి యట్లు మారుటకు ఇతర కారణములను నేను పరామర్శించుట లేదు కేవలమా మార్పులు జరుగుచున్నవని సూచించుట మాత్రమే నాధ్యేయము ఈ ధ్వనుల మార్పులను పరిశీలించిన నిందు చాలవఱకు, ప్రాచీన ధ్వనిపరిణామ క్రమము ననుసరించినయంశములే కాన్పించుచున్నవి. కొన్ని మాత్రము గమనింపఁ దగినవి.

1. -గ- బగిసిమాలి > బైసి మాలి

తెలుఁగున ఆపదాద్యమును, అసంయుక్తమునగు 'గ' కారము 'వ' కారముగా మారుటను వ్యాకరణములు గుర్తించినవి.

ఉదా. — పగలు > పవలు

ఇచటి వకారమును సంధికార్య నిషేధమునకై (Prevention of Hiatus) వచ్చిన యాగమముగా గుర్తించినచో నా రూప నిష్పత్తి యిట్లుండును

పగలు > 6*పఅలు > పవలు

ఈ పద్ధతికి మఱియొక ఉదాహరణ

-హ -వ ఆహుతి > *ఆఅతి > అవతి

అట్లే బగిసి > *బఇసి > బయిసి

యనునది సంధి నిషేధమువలన నేర్పడిన రూపమును,

బగిసి > బఇసి > బైసి

యనునది సంధివలన నేర్పడిన రూపమునని వివరింప వచ్చును.

2. కర్నకోల / చర్నకోల

చర్నకోలకు వర్ణవ్యత్యయము వలన చన్ద్రికోల యను రూపమేకాక, కర్నకోలయను రూపమును కాన్పించుచున్నది. ఈ యొక్క యుదాహరణను మించి, యెచటను నిట్టి మార్పున కాధారములు దొరకలేదు. ప్రాచీన ద్రావిడ 'క' వర్ణమునకు తాలవ్యాచ్చు పరమైనప్పుడు తెలుఁగున 'చ' వర్ణముగా మారునదే గాని, ఆ దశ గడచిన వెనుక తెలుఁగు భాషయందేకాలముననైనను 'క' వర్ణ

6. '*' ఈ గుర్తిచట, ఊహింపిన రూపమునకు, సూచన (Hypothetical form)

యుక్త రూపములు చవర్ణ యుక్తములుగా మారుట మిక్కిలి యరుదుగా కాన్పించును.[7]

3. కలాసి / పలాసి.

క. ప ల మధ్య మార్పు కొంత విచిత్రమైనదియైనను భాషాధ్వనుల పరిణామములో నిది యచ్చటచ్చటఁ గానపించుచునే యుండును. అచ్చయిన వృత్తి పదకోశములయందు పూటీ > కూటీ యను శబ్దములొకే యర్థమున నీయ బడినవి శ్రీబూదరాజు రాధాకృష్ణగారీ మార్పును గురించి యుపోద్ఘాతమున నొసంగిరి.[8] పురికొస యను పదము 'కురికొస' యనుటయు, 'పుతుంబాక' యను నింటి పేరును 'కుతుంబాక' యనుటయు నిట్టి మార్పు సాధ్యమే యనుటకుఁ దెలుఁగున మఱికొన్ని యుదాహరణములు.

క, ప అనునవి శ్వాస స్పర్శములనుటకన్న సాంప్రదాయికమైన భాషా శాస్త్ర పద్ధతిలో వీనిమధ్య వేఱొక సామ్యము కానుపింపదు. కాని వర్ణములను భేదకాంశములు (distinctive features) గా విభజించు నొక క్రొత్త పద్ధతిలో క,ప వర్ణముల సామ్యమును Grave అను నంశముతో సూచింతురు. ఈ పద్ధతిని తొలుదొల్త భాషాశాస్త్రములో Roman Jacobson సూచించెను.[9] ధ్వనివిశ్లేషక యంత్రసాహాయ్యమున క - ప - ల మధ్యనున్న సామ్యమును గమనించియాతఁడు వీని మధ్య 'Grave' అను సామ్యాంశమును సూచించెను.

---

7. మాండలిక వృత్తి పదకోశము - Vol.1 పేజీ 38. రెండు రూపములు-పదాదిన, కింక > చింక, కీలిసె > చీలిసె-మాం వృ.కో Vol.IV ఒక్కరూపము - అచ్చులమధ్య చుంకు > చుంచు.

8. మాం. వృ.కో. Vol.IV

9. Jacobson, Fant, Halle - Preliminaries to speed analysis. The the MIT Press - Cambridge Massachusetts 1963.

Jacobson & Halle-fundamentals of Languge Mouton & Co. The Hague,

4 డ > న వడగండ్లు పనగండ్లు

- డ - ణ మార్పు భాషయందు విరివిగా కాన్పించు మార్పులలో నొకటి

ఉదా. కడఁగు. కణఁగు.

ఇట్టివి 23 వఱకు, మూం.ప్ర.కోవము (Vol. 1) నందు చూపఁబడినవి. -డ -ణ -న యనునది సహజ పణారిమక్రమము. కాన వడగండ్లు > *వణగండ్లు> వనగండ్లు అను క్రమము నందు మధ్యనున్న రూపము ఊహించిన రూపము.

5. -ద -జ ;- ఇట్టి మార్పు భాషాపరిణామ పద్ధతికి సహజమగునదే కాని దీనిని సూచించు ఉదాహరణములు తెలుఁగు భాషలో విరివిగా కాన్పింపవు. నాకు దొరికిన ఒక్క ఉదాహరణమున, రూప నిష్పత్తిక్రమమిట్లుండి యుండ వచ్చును. ప్రమిద> ప్రముదు> ప్రముజు. తాలవ్యాచ్చుతో కలిసినప్పుడే ద> జ మార్పు సాధారణముగా నుండునని డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తిగా రుదాహరణ ములను చూపిరి. కాని నాకు దొరికిన యుదాహరణములో నట్టి నియత కన్పింపదు.

ఈ సందర్భమున మరి రెండుదాహరణములను పేర్కొనుట యసమంజ సము కాదనుకొందును. అవి ప్రత్యక్షముగా ద, జ ల మార్పును తెలియఁజేయక పోయినను, అట్టి మార్పుతో వానికిగల సంబంధమును సూచించును. అవి 1. జంజరము, 2. జంజనము. ఇవి జంధ్యమునకు మారుగా వాడఁబడిన పదములు. వాని రూపనిష్పత్తిక్రమ మిట్లుండి యుండవచ్చును.

జంధ్యము> జందెము> జంజము. ద > జ మార్పుకు పైన పేర్కొన్న శ్రీకృష్ణమూర్తిగారి నియమ మిచట వర్తించుట గమనింపదగినది. జంజనము జంజరము. ఇచటి 'న', 'ర' లు ఆగమములు కావచ్చును. వీని యాగమమునకు కారణములు జానపదునకు స్ఫురణకు వచ్చిన మరి యేపద సామ్యమో కావచ్చును.

6. జ > ద:-

ఇది పైదానికి సరిగా వ్యతిరేకమగు మార్పు. దీనికి ఉదాహరణములు తెలుఁగున కొల్లలుగా కాన్పించును మూం. వ్ర కో. Vol. 1 యందు ఈ

మార్పునకు పాతికకు పైగా నుదాహరణము లీయఁబడినవి నాకు లభించినవి మాత్రము మూఁడే అందు పూజించు> పూదించు అను రూపము కావ్య భాష యందు లేనిదియు నిఘంటువుల కెక్కనిదియును.

7. గడపంచలు > గడవందులు

ఈ మార్పును విశదము చేయుటకు కొన్ని జారిపోయిన రూపములను నిర్మించుకొనుట (Reconstruction) యవసరము ఇది మరాఠీనుండి యప్పు దెచ్చుకొన్న పదము. ఘడోంచీ, గడపంచ, గడవంచ అను మూఁడురూపముల నిష్పత్తిక్రమ మిట్లుండవచ్చును. గడపంచ > గడవంజ > గడవంద లేదా, గడవంచ> గడవంత> గడవంద. ఇందు మొదటి రూపనిష్పత్తియందు, -జ —ద గా మారెననుటకు, పైన జెప్పఁబడిన పూజించు> పూదించు, నజరు > నదరు వంటి యుదాహరణములు సహాయకారులుగా నున్నవి.

-చ -త మార్పు ద్రావిడ కుటుంబమున నంగీకార యోగ్యమైనను, దీనికి తెలుగునందే యుదాహరణములు కాన్పించుచున్నను,[10] నాకట్టి యుదాహరణములు గేయగాథలయందు లభ్యము కాలేదు. కాగా వంచెలు> వంజెలు వంటిమార్పును సూచించు రెండుపదము లితరత్ర లభించినవి. దీనినిబట్టి యిచట చ> జ మార్పేసమంజసమైనదిగా నేను గ్రహించుచున్నాను.

8. నోటు > రోటు :-

ఈ మార్పుకొంత విచిత్రముగా కాన్పించుచున్న మార్పనక తప్పదు. ప్రాచీన ద్రావిడ న వర్ణము అన్ని సోదర భాషలయందును న వర్ణముగనే రూపొందినది. తెలుఁగునందు మాత్రముకొన్నిచోట్ల న> లమార్పుకాన్పించుచున్నది. ఉదా. మునగ> ములగ, తొన> తొల. అందుకు భిన్నముగా నున్న యీ న ర మార్పును విశదీకరింపక తప్పదు. ఈ మార్పును సూచించునవి మూఁడు దాహరణములు దొరికినవి అందు రెండు అన్యదేశ్యములగుటచే నవి నకార యుక్త పూర్వరూపముల నుండియే నిష్పన్నము లయ్యెనని నిర్ధారించుట సులభముగా తేలినది. 1. నోటు > రోటు (Note). 2. తక్షణము >

10. మాండలిక వృత్తి పదకోశము Vol. IV

తచ్చరము. 8. నొల్లు > రొల్లు ఈ మూడవ యుదాహరణము నందు గూడ సహజరూపము నకార యుక్తమైనదే యని చెప్పుట కుపపత్తులు కలవు 'నొల్లు' అను తెలుగు ధాతువునకు సరియగు రూపము తమిళమున 'నొళ్'[11]. ఇదియే "మాల్తో" యందు 'లొలె' యను రూపమును పొందుచున్నది. దీనినిబట్టి యీ యారోపము యొక్క రూపనిష్పత్తి నిట్లుగా చెప్పవచ్చును.

నొల్లు > లొల్లు* > రొల్లు అట్లే నోటు > లోటు > రోటు అనియు చెప్పవచ్చును. 'లోటు' అను వాడుకను కొన్నిచోట్ల మనము వినవచ్చును. భాషయందు అంతకుముందు జరుగకపోయినను, ఒక్కొక్క కాలమున నొక్కొక్క క్రొత్త తరహాకు చెందిన మార్పులు, ధ్వనులయందు జరుగుట యనునది యసమంజసమైన విషయము కాదు. దీనినే భాషావేత్తలు 'నవ్యకల్పన' (Innovation) అని పేరు పెట్టి యంగీకరించిరి. ఆ దృష్టితో చూచినచో నిచట న>ర ల మార్పు క్రొత్తమార్పు అని చెప్పుకొని యంగీకరించుటయు సమంజసము.

"మాండలిక వృత్తి పదకోశము ( Vol. IV ) నందు ఈ క్రింది యుదాహరణములు కనుపించుచున్నవి.

కోపిని > కోపిరి
సానె > సారె

ఈ పై పదములందు రెండవ యుదాహరణములో 'న' కార 'ర' కార ఘటిత రూపములలో నేది పూర్వరూపమో నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు న కార ఘటిత రూపమే పూర్వరూపమని నిరూపితమైనచో న > ర మార్పు అచ్చులమధ్య జరిగెననుటకు నీ యుదాహరణము సరిపోవును. నాకు దొరికిన యుదాహరణములలో నీ మార్పు అచ్చుల మధ్యనే కాక పదాదియందు గూడ జరిగెననియు, అందు 'న' కార ఘటిత రూపములే పూర్వరూపములనియు నిశ్చయించుట కవకాశమున్నది.

9. మెదడు > మెదురు

ఇందు డ > ర మార్పును సూచించుట యొక పద్ధతి. కాని ఇది క్రమబద్ధమైన మార్పనుటకు నిట్టి యుదాహరణములు పెక్కులు కావలయును అందు

---

11. నొళ్ - Measure out as grain - DED. 3140.

"ద" కార ఘటితరూపములే చారిత్రకముగా పూర్వరూపములని నిర్ధారణ కావలయును. ఇంకొక పద్ధతి ప్రాచీన ద్రావిడ "ఱ" (చూ D E D. 4153) కారము కొన్ని మండలములందు 'డ' కారముగాను కొన్ని మండలములందు 'ద' కారముగాను మారినదని చెప్పుట అచ్చుల మధ్య ద్రావిడ "ఱ" కారము "డ" కారమగుట శాస్త్ర సమ్మతము. అది భాషా శాస్త్రజ్ఞులచే నిరూపితము కూడ.[12] కాని ఱ>ర మార్పు తెలుఁగు నందచ్చుల మధ్య నిశ్చయముగా జరిగినట్లు నిరూపించుటకు బలమైన యాధారములను సేకరింపవలసియున్నది.

గోండీ భాషలో ఆదిలాబాదు మాండలికమునందు అచ్చులమధ్య "ఱ" కారము "ద" కారముగా మారినట్లు భాషాశాస్త్రజ్ఞులు నిరూపించిరి. ప్రస్తుతము తగిన యాధారములు లేకుండ ప్రాచీన ద్రావిడ "ఱ" కారము తెలుఁగు నందచ్చుల మధ్య "ర" కారముగా మారినదనుటకంటె అదే పరిసరములో (అచ్చులమధ్య) అట్టి మార్పు జరిగిన, మన పొరుగు భాషయైన గోండీ నుండి 'ర' కార ఘటితమైన ఈ పదమును ప్రదేయపదము ( Loan word ) గా నంగీకరించుట యుచితము.

| తమిళము | కొలామీ | కన్నడ | తెలుగు | ఆదిలాబాదుగోండీ |
|---|---|---|---|---|
| మిదఱ్ | మెడ్ల్ | మిదుళ్ | మెదురు | మెదుర్ |
| | | మిదుడు | | |
| | | మెదుళ్ | | |
| | | మెదడు | మెదడు | DED 3145 |

10. పందల :-

ఇది పందిరి యొక్క రూపభేదము. 'పందిరి' ని మూలరూపముగా గ్రహించి, స్వరభేదముచే 'పందల' యను రూపమేర్పడినదనుట కంటె 'పందల' యే తొలి రూపమనుట సమంజసము. ద్రావిడ భాషలయందలి దీని పరిణామ స్వరూపము ఈ విధముగా నున్నది.

---

12 Bh. Krishnamurti "Proto-Dravidian Z"- Indian Linguistics, Turner Jubilee Volume I, 1958

| తమిళం | మళయాళం | కన్నడ | కొడగు | కోలామీ |
|---|---|---|---|---|
| పందర్ | పందల్ | పందర్ | పంద | పంౘి |
| పందల్ | | పందర | | |
| | | పందల్ | | |

DED - 3240

ఇందొక్క కోలామీ రూపము దక్క మిగిలిన వన్నియు అకారయుక్త రూపములే. ఆ పరిణామము ననుసరించి, తెలుఁగున తొలుత 'పందల' రూప మేర్పడినదనుటయు దానినుండి పందిలి పందిరి రూప నిష్పత్తి జరిగినదనుటయు సమంజసము.

11. అచ్చుల మార్పు

| | |
|---|---|
| మాలుమ్ | మాలిమి |
| జులుమ్ | జులిమి |
| యాద్ | యాది |

తెలుఁగున హలంతములగు నన్యదేశ్యములు సాధారణముగా 'ఉ'కారాంతము లుగా స్వీకరింపఁబడును. కాని పైన నీయబడిన దృష్టాంతములలో 'ఇ' కారాంతత కాన్పించుచున్నది. అట్లే,

| | |
|---|---|
| రుమాల్ | రుమాల |
| ధూప్ | దూప |

అనుచోట్ల, అకారాంతత్వమును కాన్పించుచున్నది.

12. రెయ్య > రొయ్య

జనులలో నెక్కువగా వాడుకలోనున్న పదము 'ఒ' కార యుక్తమగుటచే ఒ ఎ అనుసదియే రూప నిష్పత్తి క్రమమనుకొనవచ్చును. కాని ద్రావిడ భాష లలోని యీ పద స్వరూపమిట్లున్నది.

| తమిళ | పర్జి | కుయి |
|---|---|---|
| ఇరవు | రేడ | రే |
| ఇర | | |
| ఇరల్ | | |

దీనిని బట్టి తెలుఁగునందు రేయ, రెయ్య యను రూప నిష్పత్తియుండి రెయ్య యే ప్రాథమిక రూపమును, 'రొయ్య' తరువాత ప్రాప్తించిన రూపమునై యుండవచ్చును. ఇప్పటికిని వాడుకలో కొన్నిచోట్ల 'రెయ్‌లు,అనురూపముకలవు,

13. షరీ చూరి
జగా జాగ
సందూక్ సందుకా
ధిమాక్ దీమకు

ఈ మార్పు నొక విధముగా చెప్పవచ్చును. ఇచ్చట వర్ణములలో మార్పు జరుగలేదు. రెండవ యచ్చునకు గల దీర్ఘము మొదటి యచ్చునకు, మొదటనున్న హ్రస్వాంశము రెండవ స్థానమునకును మార్పునందినవి. ఈ దీర్ఘమును వర్ణాంశముగా గ్రహించినచో నీ మార్పును[13] వర్ణాంశవ్యత్యయమని పిలువ వచ్చును. దీర్ఘ హ్రస్వముల మధ్యను (పై యుదాహరణ), మహా ప్రాణత్వ, అల్ప ప్రాణత్వముల మధ్యను (బాధ > భాద) నిట్టి వ్యత్యయము కాన్పించుచున్నది.

వర్ణసమీకరణము, వర్ణవ్యత్యయము, అజ్లోపము, లోపదీర్ఘత, దీర్ఘలోపము, వర్ణనాశము, సర్వాభక్తి వంటి మార్పులను ఈ జానపద భాషయందు చూపుటకు వీలుగా నక్కడక్కడ ఉదాహరణములు కాన్పించుచున్నవి.

14. వర్ణసమీకరణము (Assimilation)
కంబడి కమ్మడ
మంచె మచ్చె
వర్ధి వద్ది

15. వర్ణవ్యత్యయము (Metathesis)
బర్లు బల్రు
చర్నకోల చన్ద్రకోల
గుండెబగులు గుండె బలుగు
పగుల జీరు పలగ జీరు

16. అజ్లోపము (Synecope)
ఎలవ ఎల్వ (పాదు)
జులుము జుల్మి
గొపిర గొబ్ర

---

13. ఈ పేరు సూచించినది డాక్టర్. చేకూరి రామారావు, లింగ్విస్టిక్ డిపార్ట్మెంట్ ఉస్మానియా యూనివర్సిటీ.

ఏముక ఎంక

17. లోపదీర్ఘత (Compensatory lengthening)

గ్రహణము గ్రాణము

పెండ పేఁడ

వెంప వేఁప

మొహిరీలు మోరీలు

18. దీర్ఘలోపము (Loss of length)

దూడ దుడ్డె

త్రోవ తొవ్వ

తీనె తిన్నె

సోరలు సొర్రలు

చీకట్లు చిక్కంట్లు

19. వర్ణనాశము (Haplology)

జోగుకోల జోకోల

తోడెమంత తోమంత

ఎదురుబొమ్మ ఎదురొమ్మ

పోక చెక్క పోచెక్క

20. స్వర భక్తి (Anaptyxis)

ఉల్పా ఉలపాలు

ఫర్మానా పరమానా

ప్రదక్షిణ పరదక్షిణ

ధ్వనులయందీ విధమగు మార్పులీ భాషయందు గుర్తింపబడినవి. ఇంతే కాక కొన్ని రూపములను పరిశీలించినచో కృత్తద్ధిత ప్రత్యయములను, క్రొత్త వానిని కొన్నిటిని గమనించుటకు వీలగు చున్నది.

1. కూరాడ = కలినీళ్ల కుండ

నీరాడ = నీటికుండ

పాలాడ = పిల్లలు పాలుత్రాగు చెంబు

ఐరాళ్లు> ఐరాడ = ఐరేణి కుండ

చివతి ఆడ/ఆడు అనునది 'container' అను నర్థమిచ్చు ప్రత్యయముగా భాసించుచున్నది.

| | | |
|---|---|---|
| 2. | బాసండ్లు | [13]బాసన + లు |
| | చేండ్లు | చేను + లు |
| | నిచ్చెండ్లు | నిచ్చెన + లు |
| | కుంటెండ్లు | కుంటెన + లు |
| | హనుమాండ్లు | హనుమాను + లు |
| | పిల్లాండ్లు | పిల్లాణి + లు |
| | జవాండ్లు | జవాను + లు |

అను బహువచన రూపముల కేక సూత్రత ఘటించుటకు వీలున్నట్లు తోచుచున్నది ఇచట అమూర్ధన్యములగు (Non hetroflex) న, ల వర్ణములు సంయోగమున మూర్ధన్యములుగా (Retroflex) మారుట గమనార్హము. ఈ రెంటికిని మధ్య సహాయక వర్ణముగా (Help sound) 'డ' వర్ణము చేరుచున్నది. దీనినే భాషావేత్తలు Transitional sound అనియు వ్యవహరింతురు.[14]

బాసన + లు > బాసణ్ + లు > (బాసణ్ + ళు > బాసండ్లు)

3. కృత్తద్ధిత ప్రత్యయములతో గూడిన రూపములు కొన్ని క్రొత్తవిగా కాన్పించుచున్నవి.

(i) పోరుబడి - పోట్లాట

(ii) పోలమి - పోలిక

(iii) రాకట్లు - వచ్చుటలు

13. 'బాసన'యని యేకవచనము యొక్క వాడుక వినబడక పోయినను ఇది 'బాసన' శబ్దముయొక్క వర్ణవ్యత్యయరూపముగా గ్రహింపవచ్చును.

14. దీనికీ పేరు పెట్టినవారు శ్రీ కోదాడ రామకృష్ణయ్య Journal of Venkateswara oriental Institute P. 104

iv కూటువ - సంభోగము[15]

v దాసంగం - దాసులకిచ్చు భిక్ష

vi కొలిపిడి - కొలుపు

ఇట్టి వానిని అధిక సంఖ్యలో చూపుటకు వీలున్నది.

1 బడి, ఇమి, ఇడి - ఇవి వ్యాకరణములయందు బేర్కొనబడిన ప్రత్యయములే కాని, వీనితో పైన పేర్కొన్న ధాతువుల సంయోగము. మాత్రము క్రొత్త

ii ఈ క్రిందివానిలో 'దాసంగం'అనుపదమునకు ప్రకృతి ప్రత్యయ విభాగము చేయుటకు వీలు కన్పించుటలేదు కాని రెండింటి నొకవిధముగా వివరింపవచ్చును.

iii రాకట్లు :—

రాకడ > రాకట - ఇది వచ్చు ధాతువు యొక్క భావార్థక రూపము. దీనినుండి రాకటలు - రాకట్లు అని యేర్పడవచ్చును.

iv కూటువ :—

కూడు + ఉవ యని 'ఉవ' ప్రత్యయమును కల్పించి దీనిని కృదంతముగా తీర్చవచ్చును. కాని యిచట డ > ట వర్ణముగా మారుచున్నది. లేదా కూటము + వ యని దీనిని తద్ధిత రూపముగా చెప్పవచ్చును.

4. భాషయందలి మార్పును సూచించు మఱియొక పద్ధతి నిట నుదాహరించుట సమంజసము. దానిని పదారోపము (Meta analysis) అందురు. ఈ మార్పు కేవలము ధ్వనిభేదముపై ననే యాధారపడినదనుటకంటె సామ్యము గూడ దీనికి తోడ్పడుచున్నదనవలయును. ఒక పదమునకొక రూపము స్థిరమైయుండగా దానిస్థానమున, మార్పును కోరువారికి సుబోధకమగునట్టి మఱియొక రూపముయొక్క సామ్యము వలన క్రొత్త రూపమొకటి ప్రాచుర్యమునకు వచ్చు పద్ధతియే పదారోపము (Meta analysis) ఒక్కొకసారి సాధారణ పద స్వరూపమునకు భిన్నమగు పద్ధతిలో ఆలంకారికముగనో సమాసరూపముననో కొన్ని పదములు నిర్మితములై భాష

---

15. ఈ రూపము కావ్యముల యందుఁగలదుగాని, అచటి యర్థము 'గుంపు' అని మాత్రమే - శబ్దరత్నాకరము.

యందుఁ జొరబడును వాని నిర్మితి యందెంత సూత్రబద్ధత యున్నను సామాన్యుని వ్యవహారమునందవి యిముడవు అట్టియెడ సామ్యము కల పదములు వాని స్థానమున స్థిరపడుట జరుగును. ఈ పద్ధతిలోనే భాష యందైనను కొంత పదజాల మేర్పడుట కవకాశమున్నది. ఈ మార్పు నాగరక భాషయందు కంటె జానపద భాషయందు మిక్కిలిగా నవలంబింపబడును. ఉదా. 'ఉల్పాలు'- కానుకలను నర్థమున ఉల్పాలు, ఉలపాలు- ఇది 'ఉలపావుల'ను రూపము నందుటయు, 'ఉలపాయల'ను రూపము నందుటయు పదారోపము (Meta analysis)వలన జరిగినది. వక్తకు'పావులు' 'పాయలు' అను నితర పదములతోడి గల పరిచితివలన 'ఉలపాలు'అనురూపము, ఉలపావులు, ఉలపాయలను రూపములనుపొందుటకు వీలయ్యెను.

వింజామర > ఇంజామణి
సురాపానం > సూర్యాపానకం
ముక్కాలిపీట > మొక్కలపీట
స్వాతివాన > సాటివాన
విగ్రహము > ఇగ్రహారము
వ్యాఘ్రము > యాగ్రుహం

ఇచట నీ యుదాహరణలలో వరుసగా మర,పానం,ముక్కాలి,స్వాతి,హము,ఘ్రము మొదలగు భాగములు మణి, పానకం, మొక్కల, సాటి, హారము, గ్రహం వంటి జానపదునకు పరిచితములైన భాగములుగా మారి, ఇంజామణి, సూర్యాపానకం, మొదలగు క్రొత్త రూపము లేర్పడుటకు వీలు కలిగెను, ఈ విధముగా రూప నిర్మితి జరుగు పద్ధతి (Meta analysis) "పదారోపము"

౬. మఱియొక హృదయ రంజకమగు ప్రక్రియ భాషయందు క్రొత్తపదముల నిర్మితికి కారణమగుచున్నది. ప్రయోక్తకు పరిచితిగలిగి ఇంచుమించు ఒకే యర్థముగల కొన్ని పదములను కలగలుపు కొనుటవలన ఒకపదము, దాని సహజస్వరూపముకంటె భిన్నరూపము గలిగి యేర్పడుట ఈ ప్రక్రియ యొక్క పరమార్థము. దీనిని సమ్మిశ్రణ ప్రక్రియ (Contanination) అనవచ్చును.

ఉదా. ఉర్దూయందు "ముస్తాబు" "ముస్తీదు" అను రెండు పదములును గలవు. ఈ రెండు రూపములును అన్యదేశ్యములుగా తెలుఁగు లోనికి వచ్చుటకు వీలయ్యెను. అంతేకాక ఈ రెండింటి కలగలుపు వలన 'ముస్తాదు' అను రూప మేర్పడుట యీ ప్రక్రియ యొక్క ఫలము. అట్లే

సందుకాయ పెట్టె < సందూక్
గంగడోలు < డంగడోలు
పేపరు కాగితం < News Paper

అను రూపములు ఈ ప్రక్రియ వలన సాధ్యములు.

6. జానపదులు, తాము మాట్లాడు భాషలోని కొన్ని పదములు మిక్కిలి యనాగరక స్వరూపమును కలిగినవను స్పృహకలిగినప్పుడు వానిని నాగరీకరణ మొందించుటకు ( Hyper standardization ) ప్రయత్నింతురు. నాగరక భాషాలక్షణములుగా జానపదులు గుర్తించినవి కొన్ని గలవు. అవి

1. పదాదిన సంయుక్తవర్ణమును జొనుపుట.
2. పదాది తాలవ్యాచ్చులు, ఇ, ఎ లకు, వ కారము చేర్చుట
3. మహా ప్రాణత్వమును కలిగించుట.

కావున నీ యీ లక్షణములను జొనిపి తమ భాషను నాగరీకరణ మొనర్చుచుంటిమని భ్రమింతురు. అట్టి పదములు, ఈ క్రింద నీయఁబడినవి.

1. పదాదిసంయుక్తాక్షరత :-

| | | | | |
|---|---|---|---|---|
| స్థాళి | < | తాళి | = | (తాళిబొట్టు) |
| (దేవ స్తంబళి) | < | తంబళి | = | (తంబళివాఁడు) |
| (గంధ) స్తరువులు | < | తరువులు | = | (గంధపుచెట్లు) |
| స్తాంబాళము | < | తాంబాళము | = | (అంచుగల పెద్దపళ్ళెము) |
| (స్నాన) ప్రాణములు | < | పానములు | = | స్నాన పానములు |

2. 'వ' వర్ణమును జొనుపుట :-

వెంకలు < ఎంకలు = ఎముకలు

విస్తరని < ఇస్తరని = ఇచ్చెదని

వెంగిలి < ఎంగిలి

వేనుగు < ఏనుఁగు

వీరకాండ్రు < ఈరకాండ్రు = వియ్యంకులు

వెగతాళి < ఎగతాళి, = పరిహాసము

వెక్కిరింత < ఎక్కిరింత = ,,

ఇట్లు వ కార యుక్త రూపములైన వానిని కొన్నింటిని నాగరకులును గ్రహించి వాడుట భాషయందు కాన్పించును. ఉదాహరణకు 'ఎక్కిరింత' వెక్కిరింతగా కూడ నామోదయోగ్యమై నిఘంటువుల కెక్కినది. అట్లే 'ఎన్ను' (Ear of Corn) 'వెన్నై'నది.

౬. మహాప్రాణత్వమును పొందించుట :-

కంఠకము < గంటము

స్థానము < స్నానము

ఘ్రాణము < స్నానము

హావతి < ఆవతి

హావము < ఆవము

7. ప్రయోక్త యొక్క కల్పనా వైభవమువలన కొన్ని పదములు వానిచే నప్పటికప్పుడు సందర్భము ననుసరించి, నిర్మింపఁబడి భాష యందు వ్యవహరింపఁబడుట కానఁబడును. అట్టి నిర్మితులవలన భాష భావసంపుష్ట మగుటకువీలున్నది. ఈ తరగతికి చెందిన పదము లీ భాషయందు కొల్లలుగా కాన్పించుచున్నవి. ఉదా.

ంకసాటు = చిన్నబిడ్డ (సంతానము)

ొమ్ముచిప్పలు = స్తనవల్కలము (Brasseries)

ల్పులోడు = పూజారి

రయింటి దీపము = ఆడుపిల్ల

ర స్తళము చేయు = ఇతరస్థలమున భుజించు

| | | |
|---|---|---|
| గుండ్ల తిత్తులు | = | Catridge Cases |
| ముండ్రగాసం | = | మనోవర్తి (విధవకిచ్చు భృతి) |
| ఋణము విప్పు | = | పెండ్లిచేయు |
| ధర్మపెట్టె | = | Witness Box |
| మనుసాల | = | Living Room |
| ఇల్లు చేసుకొను | = | పెండ్లియాడు |
| ఇంటితనము | = | యాజమాన్యము |

మొదలగునవి.

8. అంతేకాక నగలు, చీరెలు, ధాన్యవిశేషములు మొదలగు వానికి పేర్లుంచుట యందును, అట్టి పేర్లలో వైవిధ్యము చూపి కల్పనా రమ్యముగా వానిని తీర్చుటయందును, జానపద బుద్ధి మిక్కిలి చాతుర్యమును వెలయించుచున్నది. ఆ విధమగు పదజాలమే జానపదుని భాష సుసంపన్నమై, విశిష్టముగ శోభించుటకు కారణము.

ఉదా.

చీరెలు — కోట బొమ్మంచు చీరెలు
గంగసరాల చీరె
హంసలచీరె
నాగపడిగెల చీరె
గొల్లకొంగు చీరె
గువ్వ కన్నంచు చీరె
కళావతు చీరె
తారబాను చీరె
మళ్ళ చీరె
మూడుకొంగుల చీరె
అంచపట్టిన చీరె
నక్షత్రాల చీరె
ముత్యాలపందిరి చీరె మొ.

రవికెలు—

పూసల రవికె
పోత రవికె
గొల్లపోత రవికె
సన్నపోత రవికె
సేర్లు దీసిన రవికె
అద్దాల రవికె
బొందె రవికె
అద్దకం రవికె
గొల్ల రవికె
పసరు మొగ్గల రవికె

ఆభరణములు—

గిరిగాజులు
బిళ్ళగాజులు
కర్ణపువ్వులు
హంసనత్తు
గుత్తులు
తుమ్మపూలు
మీనా బిళ్ళలు
నాగబంధపు సరులు
చంద్రసూర్యులజోడు
బవిరి రేకలు
చిటికెన బద్దులు
అనంత గంటీలు
ముంగాముురుగులు
జూమకాలు
చిల్కతాలి హారములు మొ...

ధాన్యభేదములు—

కాశిసన్నాలు

మల్లెసన్నాలు
మహారాజభోగాలు
నీలకంఠెలు
రాజసరులు
చిట్టిమల్లెలు
రత్నసరులు
కృష్ణప్రయాగలు
గౌరికుంకుమలు
చిటి కిన్నెరలు
రామసాగరాలు మొ.

ఆయుధ భేదములు—

చిగురు కండెలు
చందురు వంకలు
చల్ల జంపులు
తామర కూసలు
తల్లి మెరగులు
చీకటి మిణుగుర్లు
కుప్పికోలలు
కుత్తిక గురులు
కొంగచాల్ కత్తులు
పంకిణీలు
నేజాలు
సురవ కటార్లు మొ...

గుఱ్ఱముల పేర్లు —

పున్నమ చంద్రుఁడు
కాళ్ల జున్నుఁడు
మైలారు
గేదంగి రేకు
నడు మింటి డేగ

గండు కోకిలము
చంద్రుని తేట
సంపెంగ పువ్వు మొ॥

ఆవుల పేర్లు —

చంద్రిక
లేత మామిడి
లేఁదోట
కల్పవృక్షము
కామధేనువు
ఆకాశగంగ
చిత్ర వన్నెల చిల్క
బొండుమల్లె
పాల పెద్ద మొ.

వ్యాధి విశేషములు —

కాశి
మక్కెరోగము
కడుపుబల్ల
గండమాల
కాకి సోమలు
సవ్వపొక్కు
వాలగౌదలు
గానుగరోలు
గజ చర్మము
దోర శిరసు
కుందేటి యెర్లు
గంగెర్లు
ముద్దవాయువు

ఇట్టి పదసృష్టి జానపద వాఙ్మయమును సుసంపన్నము చేసిన దన్నుటలో నసామంజస్యము లేదు,

9. కాని యీ వాఙ్మయమున లభించు నెన్నియో పదములకు, సందర్భము లను బట్టి యర్థ నిర్ణయము చేయవలయునే గాని నిఘంటువుల వలన నర్థమెఱుంగుటకు వీలు కాదు. అందుకు ముఖ్యకారణము మనకు తెలుఁగు భాషయందు లభించు నిఘంటువులన్నియు కావ్యభాషను అనుసరించి నిర్మింపఁబడినవే యగుట. అందు వలన నిఘంటువుల కెక్కని పదములుగా, నీ వాఙ్మయమునుండి యెన్నియేని పదములను నేర్పఱచుటకు వీలున్నది. అది పరిశోధనార్హమగు పెద్ద విషయము. ఉదాహరణకు ఈ క్రింద కొన్ని పదములు పరిశీలనార్హములు.

1. అంగనాలబావి : ఈమాట శబ్దరత్నాకరమున లేదు. దీనికి సమానముగా కిట్టెల్ నిఘంటువున (A well in a yard) అనునర్థమున అంగణ వావి, అంగణ బావి యను రూపములున్నవి. ఈ పదమునకు గేయ గాథల యందు ప్రాచుర్యమున్నది. అట్లే సోమనాలబావి యనుపదమును విరివిగా కాన్పించును కాని దానిస్వరూపము తెలియదు.

2. సూర్యవీధులు సోమవీధులు: తెలుగు నిఘంటువులలో దీనికి వివరణములు లేవు. ఊరి యందలి వీధులను వర్ణింపవలసినపు డెల్ల, అవి సూర్య.సోమ వీధులుగా చెప్పబడుట జానపద సాహిత్యమున కానవచ్చుచున్నది.

వీనిని గూర్చి పర్యాలోచనము చేయుచు శ్రీరామరాజుగారు[15], "సూర్య సోమ వీధుల'ను మాటకర్థము నాలుగు వీధులై యుండును. శ్రీనాథ మహాకవి వాడిన సందర్భమును బట్టి సోమ వీధియనఁగా పడమటి వీధియని తేలుచున్నది" యనిరి. కాని వారే దెందులూరి శాసన ప్రయోగము నుటంకించుచు, "అగ్గండి ఉత్తరవీధి కడపట సోమవీధి సూర్యవీధులు గూడిన ఈశాన్య కోణమున మొకరి అన్నెపకుం బెట్టిన గృహక్షేత్రము" అనుచోట సూర్యసోమవీధులు కలియు చోటు ఈశాన్య మగుటచే సోమవీధి యనగా నుత్తర దిక్కగుచున్నది" యని వివరించిరి. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిలువు అడ్డముగా నున్న వీధులని వీనిని

15. తెలుఁగు జానపద గేయ సాహిత్యము — పే. 685.

వివరించిరి నిలువు, అడ్డము అను మాటలు సందర్భము ననుసరించి యర్థము చేసికొనవలసిన (Relative Terms) మాటలగుటచే నీ పదముల కింకను వివరణ యవసరము సోమవీధి యనగా నుత్తర వీధియని శ్రీ రామరాజుగారు పైన వివరించిన వివరణము సరియైనది. దానిని బలపఱచుటకు నాకు దొరికిన యాధార మొకటి యున్నది కన్నడ గ్రంథమున పూర్వ పశ్చిమములకు వ్యాపించునది సూర్యవీధి యనియు, దక్షిణోత్తరములకు వ్యాపించునది సోమ వీధియనియు నిర్వచింపబడెను.[16] దీనిని బట్టి సూర్యసోమ వీధుల యర్థము నిర్ణయమైనట్లే.

3. అమృతపడి — ఈ శబ్దము శాసనములయందు కన్పించును. ఇది దేవుని నైవేద్యపు పదార్థము అను నర్థమున గలదు. కాని యిచట దీని యర్థము హరిదాసులకిచ్చు స్వయంపాకము అని మాత్రమే.

4. స్వయం పాకము — బ్రాహ్మణ భిక్షువులకు వంట చేసికొను నిమిత్తమిచ్చు నాహార సామగ్రి - సదావర్తియనియు సాహిత్య మనియు, (జాం. పురా) 'మోయన' యనియు,దీనికనేక పర్యాయపదములు వాడుకలో నున్నవి.సదావర్తియను పదముమాత్రము శ.ర.[17] యందు సదావృత్తిగా నిదే యర్థమున సూచింపఁబడినది. మిగిలిన పదము లేవియు నిఘంటువుల కెక్కలేదు

5. ఆటకూటములు — క్రీడా స్థానములు (Play grounds)

6 ఉల్లెడ — పెండ్లి కొడుకో, ఐరేణి కుండలో,పూజాకలశమో, ఊరేగింపుగా బట్టబయలున కొనిరావలసినపుడు

16. పూర్వ పశ్చిమ దీర్ఘ వాగిహ సూర్యవీధియు,
దక్షిణోత్తరసార్వనిర్మల చంద్ర వీధియు - గుప్త వీధిగళు
శౌర్య తురగపదాతి వీధిగ
శార్యరంతర వీధిగళు తాం శిల్ప విన్యాసం -
శిల్పసిద్ధాంతి శ్రీ సిద్ధలింగస్వామి-శిల్పసార- పె 14 ఎడి 1948

17. శబ్దరత్నాకరము.

7. సోలురావులు
సాలురావులు
చాలు రావులు

నలువైపుల నలుగురు చేరి యొక వస్త్రము నాచ్ఛాదముగా పైనఁ బట్టుదురు. అదియే యుల్లెడ ఈ పదమే నిఘంటువుల యందును లేదు. కాని సందర్భమును బట్టి, తగవులు తీర్చుటకై యూరి పెద్దలాశ్రయించు రావి చెట్లన వలయును. చాలు రావులు అను ప్రయోగము కాన్పించుటచే వరుసగా తీర్చిన రావిచెట్లని భ్రమ పడుటకును ఆస్కారమున్నది. కాని 'చాలు' శబ్ద స్వరూపము నరయుటకై సోదర భాషల నాశ్రయింపగా

| Ko | To | Kan |
|---|---|---|
| చాల్మ్ | సొల్మ్ | సాల్, సాలు |
| Piece of advise | Assets and Liabilities | to be bound to, be obliged, under obligation[18]. |

అను నర్థచ్ఛాయలు కాన్పించుచున్నవి.

దీనిని బట్టి తెలుఁగునందలి 'చాలు'నకును అట్టి యర్థచ్ఛాయ యుండక తీరదు. అదియే యిట గ్రహింపఁబడి, చాలురావులు, సోలు రావులు, అనఁగా నూరి పెద్దలు చేరి సలహాల నిచ్చుట కాశ్రయ భూతములగు రావిచెట్లు అను నర్థము చెప్పుకొనుటకు వీలగును.

8. బల్లాని పెట్టెలు : శ.ర లో ప్రవేశము లేదు.

"అతుల సాహస వృత్తి నాదండు వెడలె
గొల్లెనల్ గట్టిన గొప్ప లౌ బండ్లు
బల్లాని పెట్టెలు పట్టె మంచములు
తఱుచైన పీటలు తమ్మపడి గెలును" అని

ఖ్యాటివీరచరిత్రమున శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులపాఠము. బ్రౌన్ తన నిఘంటువున నుదహరించిన పాఠము వేరుగా నున్నది.

18. (D.E.D. - 2039)

అతుల సాహస వృత్తి నాదండు వెడలె
గొల్లెనల్ గట్టిన గొప్ప లొబండ్లు
భల్లాడ ధట్టీలు పట్టె మంచములు
నందైన పీటలు తమ్మపడిగెలును-అని

భల్లాడధట్టి-కి వివరణము నిచ్చుచు, బ్రౌన్ 'బల్లడధట్టి'యనగా మడిగుడ్డ, పొత్తిగడ్డ యని తోచినది (A kind of Bark Garment) యని వ్రాసెను. శ.ర. యు 'బల్లాడ దట్టీ' యనగా నొక దినుసు కాసెయని వివరించెను అందుకు కళాపూర్ణోదయ ప్రయోగమును చూపెను. కాని యిచట బల్లాని పెట్టెయను పాఠమే సరియైనదని తోచుచున్నది. పద విచారము చేయబూనినచో నిట్లుండును.

| Tam | Ma | Ko | Ko | Tu |
|---|---|---|---|---|
| వళ్లమ్ | వళ్లమ్ | వళ్మ | బళ్ల | బళ్ల |
| A measure of grain | Large bamboo basket to hold grain upto 200—400 para of rice | Round grain storage Basket | Measure of capacity, the 4th part or 4 | Measure of capacity[19] |

దీనిని బట్టి "బల్లాని పెట్టె" యనగా నొక నిర్దిష్టమగు కొలతగల ధాన్యమును మోసుకొని పోవు పెట్టెలు (వెదురువి కావచ్చును) అను నర్థమును నిర్ణయించుటకు వీలగుచున్నది. సందర్భము ననుసరించి చూచినను దండునకు, పొత్తిగుడ్డలు మడిగుడ్డల కంటె, ధాన్యము యొక్క యుపయోగ మెక్కువ. కావున నిచటి పాఠము బల్లాని పెట్టె లనుటయే సమంజసము.

9. సాక – గ్రామదేవతల పూజాసమయమందు, నైవేద్య మిడిన వెనుక, కల్లును గాని, నీటిని గాని విగ్రహము నెదుట క్రింద వార బోయుట. కల్లును బోసినచో నది 'కల్లుసాక' యగును. బెల్లమును పోసినచో నది బెల్లపుసాక యగును.

19. D.E.D.

10 ఓలి - శ ర కేవలము ఉంకువ, వరుస యను నర్థము నిచ్చినది కాని పెండ్లికొడుకు ఆడు పెండ్లివారి కిచ్చు కానుక ఓలి (కన్యా శుల్కము) దీనికి సమానార్థక మగు మాటలు ఇతర ద్రావిడ భాషల యందు దొరకక పోయినను, ఈ పదమునకు కొంత చిత్రమగు చరిత్రయే యున్నట్లు తోచును.

| Tam | Ma | Kan |
|---|---|---|
| ఓలై | ఓలె | ఓలె |
| Palm leaf, Rolled palm leaf used as an ornament- Jewelled ear ornament.[20] | Ear-ring of Gold | Metallic Ear ring |

దీనిని బట్టి చూడఁగా మగపెండ్లి వారిచ్చు నాభరణములలో కమ్మలు ముఖ్యమగుటచే, ఓలి యనగా, కర్ణభూషణమను నర్థమునను, పెండ్లి కొడుకు, ఆడుపెండ్లి వారికిచ్చు, అంగీకార సూచకభూషణమను నర్థము నను, స్థిరపడి యాపైన 'నుంకువ'కునన్వయింపబడి యుండవచ్చును. –'ఓలిమూడలు' అను పదము జానపదసాహిత్యమున విరివిగా కాననగును.

11. ✓ఆడు పాప - శ. ర యందు పడుచు, కన్యక అను నర్థము తీయబడెను. జానపద వ్యవహారము నందీ పదమున కున్న యర్థము 'దాసి', 'బానిస'యని. ఇల్లు వాకిళ్లు ప్రత్యేకముగా లేక, యజమాని యింటనే బానిసతనము నెఱపు స్త్రీ యాడు పాప (రూపాంతరము- అడి వాప, ఆడు బాప.

ఈ పదకోశమునందే పుట్టుపాపలు – (ఈదెమ్మకథ) నగరి పాపలు – (ఈదెమ్మకథ) అను ప్రయోగములును కాన్పించుచున్నవి.
పుట్టుపాపలు = పుట్టుకతో దాస్యము నెఱపువారు.
నగరిపాపలు = అంతఃపుర దాసీజనము. దీనిని బట్టి 'పాప' యను శబ్దమునకే 'దాసీ'యను నర్థమున్నట్లు తోచుచున్నది. దీని మూలరూపము వెదుకఁదగినది.

---

20. DED. 913.

12. పోలు దారము- 'పోలు' అను రూపము శరలో ప్రయోగింపబడి నది వ్యావసాయిక పదముగా 'పోలు' అనగా ఎడికోం యను నర్థము మాండలిక వృత్తి పదకోశమున నీయం బడినది. జానపదకోశమునందు, కొన్ని తెగల వివాహము నకు ముందు పెండ్లి మంటపమున వ్రాయు ముగ్గునకే పోలనియు, దాని చుట్టును పేర్చు చిన్న 'గురిగె'ల మూతులకు చుట్టు దారమునకే పోలుదారమనియు పేర్లు. ఈముగ్గులుఒక్కొక్క కులమున కొక్కొక్క విధముగా వ్రాయు నాచారమున్నది. ఈ పద స్వరూపమును అరయవలయును.

ఈ విధముగా నీ గ్రంథము నెంతయైనను పెంచుకొనుచు పోవుటకు వీలున్నది. జానపద కోశమందు కాన్పించు మాట లెన్నియో యిట్లు నిఘంటువుల లోని కెక్కనివిగా కాన్పించుచున్నవి. వీని వాడుకల నెఱిగి, స్వీకరించు ప్రయత్నము చేసి, నిఘంటువులను పరిపుష్టముచేయు బాధ్యత యింకను తెలుగు జాతిపై నున్నది.

10. అన్యదేశములు :-

తెలుగు భాష బహుభాషా సంపర్కము కలిగిన భాషయగుటచే నిందన్య దేశ్యములెక్కువగా జేరుటకు వీలున్నది దేశపు దక్షిణ పశ్చిమ భాగములయందు తమిళ కర్ణాటక భాషలున్నందున, ఆయా సరిహద్దులలో వానికి సంబంధించిన పదము లనేకములు చేరుటకు వీలున్నది. కాని యీ రెండును తెలుగు వలెనే ద్రావిడ భాషా కుటుంబమునకు జెందినవగుటచే నీ మూడుభాషలకును మధ్య నేవి దేశ్యములో, యేవి యన్యదేశములో గుర్తించుట యంతసులభముకాదు. కాగా తెలుగు రాష్ట్రమునకు పశ్చిమమున నభివర్థిత మగు మహారాష్ట్రి భాషయు నీశాన్యదిశ యందలి యోఢ్ర భాషయు తమ పద సంపదచే తెలుగు పదకోశమును సుసంపన్నము చేసినవి. కాని నాచే సేకరింపబడిన జానపదగేయ గాథలన్నియు తెలంగాణము, రాయలసీమ మధ్యాంధ్రములకు చెందినవి మాత్రమే యగుటవలన నీండి రెండు భాషల సంపర్కమునం జొరంబడిన యన్యదేశము లెక్కువగా లభింపవు. ఎచటనైనను కన్పట్టినను, అవి మిక్కిలి యల్పసంఖ్య కలవిగా నుండును.

| ఉదా | తెలుగు | మరాఠీ |
|---|---|---|
| | మడిగి | మళ్ఘీ |
| | మడిగె | ,, |
| | చిక్కుడ | ఛపట్ |
| | | చికణ్ |
| | తట్ట(లోహపు పళ్లెము) | తక్టె |
| | గిండి | గిండి |
| | చిటిక | చుట్కీ<br>చిట్కీ<br>చుర్కీ |
| | గడవంచ | |
| | గడవంద | ఘడోంచీ |

ఇట్టివి మఱికొన్ని యీయవచ్చును.

సంస్కృతము వలె తెలుఁగును సుసంపన్నము చేసిన మఱియొక భాష ఉర్దూ. 14వ శతాబ్ది నుండియు నాంధ్రదేశమునకు ముసల్మానులతో సంబంధము కలదు. అప్పటినుండి, క్రమక్రమముగా వారు ఆంధ్రదేశము నన్ని దిక్కులను విస్తరించి తమ యేల్బడిని సాగించిరి. కొన్ని శతాబ్దులపాటు పాలక భాషగా గౌరవ పీఠ మలంకరించిన ఉర్దూభాష జన జీవితమున స్థిర స్థానమును పొందఁగలిగినది. వారి నిత్యవ్యవహారము నందెన్నియో యుర్దూ పదములు రూపాంతరము చెంది కలగలిసి పోయినవి. ఉర్దూ క్రియలు గూడ నొక క్రమ ప్రణాళిక ననుసరించి, తెలుగు క్రియలుగా మారిపోయినవి. కేవలము నాగరకుని భాషయందేకాక, చదువు సంతలు నేర్వని పామరుని భాషయందును ఉర్దూ భాషా ప్రాబల్యము కలదని నిరూపించుటకీ కోశములోని యుర్దూ పదములు మిక్కిలి యుపయోగపడును.

నామవాచకములను క్రియగా మార్చుకొనుటకై చేయు, వేయు, ఉండు, పడు, వంటి యను బంధములు చేర్పఁబడుచున్నవి.

| ఉదా. | | | |
|---|---|---|---|
| | హయిరాను చేయు | – | గల్లంతు చేయు |
| | పర్వా ఉండు | – | లక్ష్యపెట్టు |
| | ఖుషాలు పడు | – | సంతోషించు మొదలైనవి. |

క్రియారూపములను తెలుఁగులో క్రియలుగా మార్చుకొనుటకై ఇంచు గాగమము వాడఁబడినది.

| | | |
|---|---|---|
| భరాయించు | - | నింపు |
| అటకాయించు | - | అడ్డుకొను |
| సముదాయించు | - | బుజ్జగించు |

ఇట్లీంచుగాగమముచే ఉర్దూ క్రియలను భాషలోనికి గ్రహించు ప్రక్రియ మిక్కిలి విరివిగా కన్పించుటచే ఒక్కొకచో కొద్దిగా ఉర్దూ క్రియలతో సామ్య మున్నట్లుగా తోచు దేశ్య క్రియలకును ఇంచుగా గమము చేర్పఁబడి వాడబడుట గమనార్హము.

ఉదా. అదలాయించు

'అదలు' అనునది, దేశ్య క్రియ దీనికి భారత ప్రయోగమును కలదు. కాని వైకృతములకు వలె దీనికి ఇంచుగా గమము చేర్పఁబడి తెలంగాణమునందు (సదాశివరెడ్డి కథ) ప్రయోగింపఁబడినది.

క్రియా విశేషణములనఁదగినవి తెలుఁగునందువలెనే 'కాన్' అనుబంధము చేర్పఁబడి రూపొందుచున్నవి.

హేజీబుగా

జఫర్ దస్తుగా

ఉర్దూపదము లెన్నియో తెలుగు భాషా సామాగ్రియందు మిశితములై తెలుఁగు పదముల వలెనే రూపాంతరము నందినవి.

ఉదా.

| | |
|---|---|
| అసలు | అస్‌ల్ |
| రోజు | రోజ్ |
| కర్చు | ఖర్చ్ |
| సన్నాయి | షెహనాయి |
| ఉలపా | ఉల్పా |
| నదురు | నజర్ |
| పత్తె | పతా |

| | |
|---|---|
| మాలిమి | మాలూమ్ |
| సందుకా | సందూక్ |
| మాలు | మహల్ |
| యాది, ఆద | యాద్ |

ఇట్టి వెన్నియేని చూపవచ్చును.

జానపద భాషయందలి విశేషములను, నాకు లభించిన పదకోశమును మాత్రమే యాధారముగా గొని యిచట స్థూలముగా వివరించు ప్రయత్నమే యీ వ్యాసమున జరిగినది. క్రమ ప్రణాళిక ననుసరించి దేశము నాలుగు చెఱగుల నుండియు జానపద భాషా సేకరణము చేసి కోశములు నిర్మించు పని యింకను తెలుగుజాతి చేయవలసి యున్నది. కావ్య ప్రయోగములలో నర్థము దొరుకక మిగిలి పోయిన పదములు, ఇట్టి కోశములవలన సువిదితములగుటయేకాక, కావ్యగత భాషా స్థితికిని, జన వ్యవహారమున నున్న భాషకును మధ్య కాన్పించు పరిణామ క్రమము గూడ సుబోధకమగును.



# సేకరించిన గేయగాథలు

సేకరించిన గేయగాథల నన్నిటిని పరిశీలించి చూడఁగా, సంప్రదాయ సాహిత్యమునందలి భారత, భాగవత, పురాణాదులతో దీటువచ్చు జానపదపురాణ మొక్కటి కానవచ్చుచున్నది. ఇది యొక కుటుంబ గాథ యని చెప్పవచ్చును. పురాణములయందు మనకు గౌతమ మహర్షిగా పరిచితుఁడైన భృగువంశ వర్ధనుఁడీ కుటుంబమున ముఖ్యుఁడు ఈయన అహల్యను వివాహమాడుటకై యీనుచున్న గోవుచుట్టును ప్రదక్షిణము చేసి బ్రహ్మనుండి యామెను పొందెనని పురాణ గాథ-అట్లే, దేశమున క్షామము సంభవింపగా, నీయన మునులకు ఒక వత్సరము పాటాశ్రయము నిచ్చి కాపాడె ననియు, తత్ఫలితముగా, మునుల యీర్ష్యకులోనై మిథ్యా గోహత్యా పాతకమునకు, పాల్పడెననియు మఱియొక పురాణగాథ. ఇంద్రుఁడహల్యా శీలమును కపటమున చెఱచగా, వానిని శపించె ననునది రామాయణాంతర్గత గాథ

జానపద పురాణమునందలి గౌతముఁడు[1] 'రగుతమా' బ్రహ్మ యొక్క కొడుకు. ఆయన కాలముననే కైలాసమున 'శాంబ్రము' దోచెను. తినుటకు పూరియు, త్రాగుటకు నీరును, దొరుకక కైలాసమందలి ధేనువు లన్నియు, 'రగుతుని' 'శంకుల' మరమునకుఁ గదలివచ్చెను.అచట సుభిక్షముగనున్న భూమి యందు క్షేమముగ, కైలాసమందలి క్షామము దొలఁగువఱకునుండి, తిరిగిపోయెను, అవి తమకు 'గాతము' మేపినందులకు 'గౌతమాబ్రహ్మ'ను, జమిలి గుండమందలి యుదకముల నిచ్చినందుకు 'జమిలికాపార్వతి'ని, సంతానముగా ప్రసాదించినవి.[2] గౌతముఁడు రగుతునకట్లు పుట్టెను.

---

1. (జానపదుల వ్యవహారమున గౌతముఁడు గౌతుఁడు-ఈయనపేరనే యీ పురాణము గౌతపురాణ మయ్యెను)
2. "గాతము మేపినందుకు గౌతమాబ్రహ్మ వరమిచ్చినాము. జమిలి గుండాన ఉదకాలు బోసినందుకు జమిలికాపార్వతిని వరమిచ్చినాము" గౌతపురాణము.

జమిలికా పార్వతిని గిరిరాజు వివాహమాడెను. జానపద గేయగాథల యందీ గిరిరాజునకును, పరమేశ్వరునకును, జమిలికా పార్వతికిని, పార్వతీదేవికిని అభేదము చెప్పఁబడినది. గిరిరాజు చెల్లెలు, జలగన్నె-జలగన్నెయే పురాణాంత ర్గత పాత్రయగు నహల్య-జానపదుని దృష్టిలో నహల్య పరమేశ్వరుని (గిరిరాజు యొక్క) చెల్లెలు. అందుకొక మనోహరమగు కల్పన రూపు గైకొన్నది. పార్వతీ పరమేశ్వరులు పగడసాల పందెమాడుచుండిరి. పార్వతి నవ్వుచు "పుడమిలో కలియుగ ద్వాపర మెదుకులాడినగాని తన కన్న చక్కని స్త్రీలు'' లేరని యహంభావము చూపెను అంతట నీశ్వరుఁడు పంతమునకై, ''సకియరో నీ కన్న చక్కని స్త్రీని దెప్పింతు''నని విశ్వబ్రహ్మను బిలచి యట్టి స్త్రీని వెదికి తెమ్మనెను. విశ్వబ్రహ్మ లోకాలోకములు వెదకి చిట్టచివరకు అల్లియ[3] వృక్షముల తోపులో, తొలకరి మెఱుపు వలెనున్న స్త్రీని, పార్వతి కన్న చక్కని దానిని జూచి, ''అలియమాదేవి" యని పేరిడి వెంటఁగొని వచ్చుచుండెను. పరమేశ్వరుని వెనుక వైపునుండి వచ్చుచున్న అందగత్తెను జూచి, పార్వతి దిగులు జెంది, త్వరితగతిని ఒక ఉపాయ మాలోచించెను

"తమకన్న ముందువచ్చే మగవారయితే ఏమి గావలెనూ, వెనక వచ్చే స్త్రీ యేమి గావలెనూ" అనఁగనే, పరమేశ్వరుఁడు, ''వినవె పార్వతి నీకు విన్న వించెదను-తనకన్న ముందు వచ్చేవారు మగవారయితే అన్నగావలెనూ, స్త్రీ లయితే చెల్లెండ్లు గావలెనూ'' అని వివరించి, ''వెనక ముందేమి వివరింపు" మనెను- చతురురాలగు పార్వతి వెనుక వచ్చుచున్న 'అహల్య'ను జూపి, నీ మాట ప్రకారమీమె నీ చెల్లెలనెను. పరమేశ్వరుఁడామాటకు కట్టుబడి యామెను సోదరీ నిర్విశేషముగ జూచి, యామె వివాహమును చాటఁబంపెను.

అంతఃపురమున పెద్ద గంట కట్టించెను. ఎవ్వరా గంటవాయించి, ఆ ధ్వని యారిక మునుపే ''మహామేరు పర్వతాలు'' దిరిగి వచ్చెదరో, వారికిచ్చి అహల్యను వివాహము చేయుదునని కట్టడి చేసెను.[4](జమిలికా) పార్వతి మూల మున 'గౌతున'కు గిరిరాజు బావమఱది యగును, ఆయన చెల్లెలగు నహల్యా

3. Te-అల్లి, Tam-అల్లి- Iron wood Tree(Memecylon Edule)

4. పురాణాంతర్గతమగు నహల్యా సంబంధియగు 'కట్టడి' యిచట పోల్చఁదగినది.

తనకు వరుసయైన పడుచగుటచే నామెను వివాహమాడఁగోరి గౌతముఁడు తండ్రి యనుజ్ఞగొని కైలాసమునకు పయనమగును. దారిలో, ఈని సహాయము లేక వెతలు బడుచున్న కామధేనువునకు సహాయముజేసి, అందుకు ప్రతిఫలముగా, తాను గంట ధ్వని నశింపకమునుపె, మేరు పర్వతమును చుట్టి వచ్చితినని, ధేనువుచే దొంగ సాక్ష్యము చెప్పించి యహల్యను పొందఁగలిగెను. పురాణాంతర్గతమగు ధేను ప్రదక్షిణమున కిచటి యాకృతి యిది-గౌతమునితో పోటీగా వచ్చిన దేవేంద్రుఁడు, సూర్యుఁడు, శుక్రుఁడు, 'కొక్కొటా సూర్యుఁడు', అహల్యను పొందలేక పోవుటచే తరువాత పగగొని యామెను, గౌతముఁడు లేనిసమయమున చెఱచిరి-గౌతమునకు అహల్యకును బుట్టిన కూతు రంజనా ('అంజలీ')దేవి యని యిచట జానపదుని కల్పన. "శంకుల మటమున బుట్టిన చెట్టవార్త" యెల్లెఱుఁగ వైతివి నీ''వని, యామెను తండ్రి కనులు లేని కబోదివి గమ్మని శపించెను.

తదుపరి యహల్య కొంతకాలమొక చట్టుగా నుండి, రామపాద స్పర్శ మున నారియై, 'జలగన్య' యాయెను. జలగన్యయు, గౌతముఁడును శంకుల మఠమున కాలము గడుపుచుండఁగా, పార్వతికిని, గంగకును మధ్య పంతము మెరసి, గంగ నీటి చుక్క కనఁబడనీయక లోకములలో క్షామము కలిగించెను-అంత ''కోటి ఒక్క జంగాలు, కోటి ఒక్క మునులు'' గౌతముని శరణుజొచ్చి, 'యెద్దు తొక్కని రాజనం ఒప్పక', గోవు తొక్కనిచోట కొఱ్ఱ పండించి యన్నము పెట్టుమనిరి.

గౌతముఁడు

వనములు గిరులునూ వలమైన నదులు
ఘనమైన భూములూ కోనలూ వెదికి
మేరు పర్వతాలందు మేదినీ వెదికి
వనములూ వనాంతరము లతివేగ జూచి
ఏడు దీవుల భూమి వెదికినా గాని

---

5. ''ఇపుడు తన కేపును తనతో గలిపి పోవయ్య, పరమేశ్వరుని
కొలువుకు పరగ వచ్చేను, నూఱు కల్లలాడి తప్పు
సాక్ష్యం బలికి ఆల్యను కల్యాణ మందించెదను,
నమ్మవయ్య నా మాట నమ్ము మునినాథ'',- గౌత పురాణం.

గోవు తొక్కని భూమి గోరెడు లేదు'' - అంత

నాతఁడు చింతపడి చేయునది లేక, 'యుగజగముల' యందుఁబుట్టిన మఱ్ఱి చెట్టు నొకదానిని గాల్చి, పోడుచేసి, యచట కొఱ్ఱలు పండించి పదిగడియలలో నన్నార్తుల కందఱికిని అన్నము బెట్టెను. మఱ్ఱిని పడగొట్టుటవలన దానిపై గూళ్లు గట్టుకొని నివసించు పక్షులును, దాని క్రింద పుట్టలో వాసముచేయు పాములును నశించి యా పాపము గౌతముని చుట్టుకొనెను.

గౌతమునకు జమదగ్నియు,[6] మఱి నలుగురు కుమారులేకాక తరిదేవి యను కుమారియు జనించిరి. గిరిరాజు, ఒకపరి వేటకేగినపుడచట నాదిశక్తి, మాహురమ్మయై పన్నెండు కోమల పసిడి పుట్టలో, నాగుబామై వెలసి, యా రాజునకు కూతురై లభించెను. ఈమెయే రేణుక, ఎక్కలి దేవమ్మ, ఏకవీర, మాత యనఁబడును. ఈమెతోపాటు గిరి రాజునకును, జమిలికా పార్వతికిని, సిద్ధమారాజు, పోతురాజు అను తనయులు జనించిరి. ఈ పోతురాజే అమ్మవారి కనుంగు తమ్ముఁడును, కోలకాఁడునై భటత్వము నెఱపు పోతురాజు. సిద్ధమారాజు జమదగ్ని చెల్లెలగు తరిదేవిని వివాహమాడి యామె వలన నైదుగురు మగపిల్లలను ఒక్క యాడు పిల్లను పొందెను. గౌతముడు తన తనయుఁడగు జమదగ్నికి రేణుక నిమ్మని బావమఱది నర్థించి, యవమానితుఁడాయెను.[7] కాని చివఱకు రేణుకా జమదగ్నులకు వివాహమగును. వివాహమైనంతటనే, గౌతముఁడు కూడఁబెట్టిన ధనధాన్యములు, చేసిన పుణ్యపాపములు సమముగా, గౌతముని పుత్రులతోపాటు పంచుకొనుటకై సప్తకోటి మునులు కదలి వచ్చిరి. తండ్రి చేసిన పాపములు, జమదగ్ని పంతునకు వచ్చెను.[8] ఆ పాపములు తీర్చుకొనుటకై యాతఁడు పండ్రెండేండ్లు తపస్సు చేయబోయెను.

---

6. గౌతమమహర్షి కుమారుఁడు జమదగ్నియను నంశమును, ఏ పురాణముల యందును, గానము.

7. శిశుహత్య మీయింట సిద్ధించియున్నది
పక్షిహత్య మీ యింట ప్రబలమైయున్నది
గోహత్య మీ యింట గౌదగాని యున్నది
కర్ములకు రాజు కన్య నివ్వనంటాడు - రేణుకపెళ్ళి.

8. ఎడ్లు ఒకనికి, ఇల్లు ఒకనికి
తండ్రి చేసిన యేడు యెత్తులు (వెతలు)
జమదగ్ని మామునీశ్వరునికి వచ్చె - ఎల్లమ్మ కథ

గౌతమ సంతానమును, సిద్ధమారాజు భార్యయునగు తరిదేవి ప్రముఖ పాత్ర వహించిన కథలును కొన్ని కలవు. తరిదేవి తన పుత్త్రిలలో నొకనికి అన్న కూతురగు, (జమదగ్ని రేణుల పుత్రిక) బాలగౌరిని భార్యగా నొందవల యునని విశ్వప్రయత్నములుచేసి సాధించు కథయే శ్రీ బాలగౌరి వివాహము. మొదట రేణుకను తనకొడుకునకిమ్మని గౌతముఁడవమానము పొందినందుకు ప్రతిగా, పరశురాముఁడు తనచెల్లెలిని మేనమామలయింట నిచ్చుటకు సుముఖుఁడు కాలేదు. అంత తరిదేవి గొల్లతయై చల్లలమ్ముచు. మాహురమునకు పోయి కాఁబోవు కోడలిని చూచి వచ్చుట, కొడుకులు రాచమల్లు, అనుమల్లు, చినమల్లు మొదలగువారు బలిజ వేషములు కట్టి, సరుకులమ్ము నెపమున మామ పట్టణమున ప్రవేశించి యెన్నియో యొడుదుడుకులను లెక్కసేయక బాల గౌరమ్మను సాధించుట యిందు వర్ణితములు.

ఈ కుటుంబములో బాల గౌరమ్మ వలెనే, ఆ కుటుంబమున కనుమాల చంద్రమ్మ[9] కలదు. ఈమె బాలగౌరికి ఆడుబిడ్డయు, రాచమల్లుకు అప్పచెల్లెలును. ఈమెను రేణుకా ప్రథమ సంతానమగు జంపలేశ్వరుని కీయవలయునను ప్రయత్నము, తద్విజయమే 'కనుమాల చంద్రమ్మ కథ' – ఇట్లు మేనత్త మేన మామ బిడ్డల వివాహగాథ లిందు కొల్లలుగా కాన్పించుచున్నవి.

జంపలేశ్వరునకు సంబంధించిన 'సిద్ధ యోగము' అను గేయగాథ యందు, ఎల్లమ్మ సిద్ధభుక్తి పెట్టగోరి, మేరు పర్వత సీమలలో కొలువైయున్న సిద్ధులను ఆదినాధుని, తోడితెచ్చుటకై తన కుమారుని జంపన్ననచటకు పంపును-జంపన్న దారిలో నష్టకష్టములనుబడి, చివరకు ఆదినాధుని యునికిని దెలిసికొనును. ఆయన యొక పంచవన్నెల పక్షిని దెచ్చి 'జంపలయ్య'కు నిచ్చి, తాను సిద్ధులను గొనితెచ్చునంతలో నా పక్షిని పాకము చేసిపెట్టుమని యాజ్ఞాపించి యేగును. జంపలయ్య యందుకు కటకటఁబడి, తల్లి కార్యము చెడునేమోయని, చేయునది

---

9. 'కనుమాల చంద్రమ్మ కథ' కలదని వింటినిగాని, నాకు లభింప లేదు. ఈ కుటుంబ ద్వయమునకు సంబంధించి యిట్లు తామర తంపరగా పెరిగి యల్లుకొన్న గేయగాథ లెన్నియో కలవని తోచుచున్నది.

లేక, కరవాలముచే పక్షిని ఖండించి, దానిని వండుచు ప్రక్కనున్న ఒక పుల్లచే నా కూరను కలియబెట్టెను. అది 'జీవిగర పుల్ల' యగుటచే నా పక్షికి ప్రాణము వచ్చి కుండలోనుండి యెగిరి పోయెను.

ఆదినాధుఁడు సిద్ధులతో జంపన్నను చేరవచ్చి, పక్షిని నీవే భక్షించితి వనియు, నందులకు శిక్ష నిన్ను చంపుటయే యనియు, వానిని బట్టి చంపి ముక్కలుగా తరిగి, కుండలో నుంచి పాకము చేయనారంభించెను. పొంగురాగా, వెనుకటి జీవిగర పుల్లతో కలియబెట్టుటయు, కుండనుండి జంపలేశ్వరుఁడు, ఇతోధిక కాంతి సౌందర్యములతో వెలికి వచ్చుటయు జరిగెను.

సిద్ధులును, ఆదినాధుఁడును, "మీ తాత గౌతముడు పక్షులను జంపిన పాపము నిన్నంటియున్నది. అది పోవుటకు మేమిట్లు చేసితిమని బుజ్జగించి, వాని వెంట పయనమై రేణుక నుండి 'సిద్ధభుక్తి'ని పొందిరి.

ఇట్టి కుటుంబగాధ లింకను ఎన్నియేని లభించుట కాస్కారమున్నది. నాకు దొరికినంత వరకును, ఈ గాధలనుబట్టి, గౌతమ, గిరిరాజవంశ వృక్షముల స్వరూపము నీ క్రింద పొందుపరచుచున్నాను*

ఇందు, శ్రీ బాల గౌరి వివాహము, 'రేణుక పెళ్లి', గిరిరాజు కధ, డా. దొణప్పగారిచే సేకరింపబడినవి. మాహురమ్మ కధను డా. బి. రామరాజు గారు సేకరించిరి. నాకు వీని నిచ్చి, నా పరిశోధన వ్యాసమున వాడుకొనుట కంగీకరించిన వారిరువురకును నా కృతజ్ఞతలు.

ఇట్టి కుటుంబ గాధలతోపాటు జానపదపురాణ మనదగిన 'జాంబపురాణ' మొకటి నాకు లభించినది. ఇది ఆసాదివారు, బైండ్లవారు, పంబలవారు, అను నామ భేదములుగల మాదిగవారిచే చెప్పఁబడు గాథ. వీరినే చిందోళ్ల అనుటయుఁ గలదు. వీరి కులమునకు మూల పురుషుఁడు తాతా జాంబవంతుఁడు. విశ్వబ్రహ్మ వంశమునకు జెందిన, కమ్మరి, కంసాలి, వడ్రంగి మొదలగు కులములవారికి జాంబవంతుఁడెట్లు సహాయకారి యయ్యెనో యీ పురాణ ముగ్గడించును. తమ కులమున జనించిన యరుంధతి మహాసాధ్వియై బ్రహ్మర్షియగు వశిష్ఠుని యర్ధాంగ

---

* వంశవృక్షము వెనుక పేజీలో ఇవ్వబడినది.

# వంశవృక్షము

- రగుతుఁడు
  - గిరిరాజు + (జమిలికా పార్వతి)
  - జలగన్నె ⇄ జమిలికా పార్వతి
  - గౌతముఁడు + (జలగన్నె)

- గిరిరాజు + (జమిలికా పార్వతి) / జలగన్నె
  - అగస్త్యుఁడు
  - పోతురాజు
  - సిద్ధమారాజు + (తరిదేవి)
  - రేణుక ⇄ తరిదేవి

- గౌతముఁడు + (జలగన్నె)
  - తరిదేవి
  - జమదగ్ని + (రేణుక)
  - చపల ముని
  - నీలమా ముని
  - పాలమా ముని
  - శంఖు ముని

- సిద్ధమారాజు + (తరిదేవి)
  - బండారు మల్లు
  - బాల మల్లు
  - పెద మల్లు
  - ఎడ మల్లు
  - రాచమల్లు + (బాలగౌరి)
  - కనుమాల చంద్రమ్మ ⇄ బాలగౌరి

- జమదగ్ని + (రేణుక)
  - బాలగౌరి
  - జంపన్న + (కనుమాల చంద్రమ్మ)
  - పరశురాముఁడు

లక్ష్మి యెట్లు కాఁగలిగెనో కీర్తించును. ఇందు నిండి నిబిడీకృతమైయున్న స్వకులమును గూర్చిన యుత్కర్షను, నగ్రవర్ణములపై పేరుకొన్న కసిని ఆవల నుంచి యీ జానపద పురాణమును పరిశీలించినచో, నిది గ్రామ జీవనమునకు సంబంధించిన విషయ సర్వస్వము (Encyclopaedia) అనఁజెల్లును. వ్యవసాయమునకుఁజెందిన విషయముల నెన్నిటినో, నాకు దొరికిన జాంబపురాణ భాగము వెల్లడించినది. ఇట్టివి యొక విధముగా నాశువులనఁదగినవి ఇందలి ముఖ్య కథాంశమును గుర్తిడుకొను ప్రయోక్త. సమకాలిక సంఘటనలను జోడించుచు, నప్పటి కప్పుడు తన వాచా నైపుణ్యముచే మలచి దీనిని ప్రయోగించును. అంతేగాని యిందు ప్రయోక్త కంఠస్థముచేసి, నిలువబెట్టు రూప విశేషమేమియు లేదు. అందువలననే ఒక ప్రాంతమున, నొక యాసాది చెప్పు జాంబపురాణమునకును, మరియొక చోట మఱి యొకఁడు ప్రయోగించు దానికిని ఏకత్వము కథాంశము నందుండునుగాని, రూపమునందు గాదు జానపద గళస్థము లైన కథాగేయము లన్నిటికిని, ఇంచు మించీ లక్షణము వర్తించుననియే చెప్ప వచ్చును.

నాకు దొరికిన జాంబ పురాణముతోపాటు డా. రామరాజుగారు సేకరించిన మరియొక జాంబపురాణమును కలదు. దీనిని చెప్పినవాఁడు మెదుకుజిల్లాకుచెందిన తిమ్మాపుర వాస్తవ్యుఁడగు "సింధు పుట్టలయ్య"- నాచే సేకరింపఁబడినది, కర్నూలు జిల్లాకు చెందిన "బోయి రేవుల వాస్తవ్యుఁడు రంగదాసు చెప్పినది- రెండును రెండు మండలములకుఁజెందినవి. కథాంశ మొక్కటియేగాని, మొదటిది ప్రశ్నోత్తర రూపమునను, చాలవరకు వచనమునను గాన్పించుచున్నది. రెండవది, మిశ్రగతియందు నడచు పదము. ఈ పురాణమును, ఆద్యంతము, వివిధ ప్రాంతముల యందున్న దానిని సేకరించినచో గ్రామజీవన సంబంధియగు నంశముల నెన్నిటినేని వాఙ్మయ రూపమున భద్రపఱుపవచ్చుననుటలో సందేహములేదు.

మాతారాధనా ప్రాముఖ్యమును, తదారాధకులకు, వీరశైవమువంటి నాగరక మతములతో గలగిన స్పర్ధను, చాటెడి గ్రామదేవతల కథలలో, మాత పురాణము, ఈదెమ్మ కథ, అంకాళ దేవత గాథ, వంటివి ముఖ్యమైనవి. మాత పురాణము, నాకు తాళపత్ర గ్రంథరూపమున లభించినది. దీనిని రచించిన వాఁడు ఖడబాగ్ని రామచంద్రుఁడనువాఁడు. దీనిని వ్రాసుకొన్నవాఁడు భువన

గిరికి జెందిన బవనీని చినపాక దేవయ్య కుమారుఁడు, "ఎంకయ్య". బడబాగ్ని రామచంద్రుఁడు "గిరిరాజు కథ"ను గూడ మంజరీ ద్విపదయందుఁ జెప్పెను. మాత పురాణము యొక్క ఛందమును అదియే. దేవీ కుటుంబ గాథలరో నిఁక నెన్నిటి నాతఁడు కైగట్టి, రూపుదిద్దెనో యరసి చూడవలసియున్నది-ఇదియే "మాతంగి కథయను పేర ఒంగోలు ప్రాంతమున ప్రచారమున నున్నది.

'ఈదెమ్మ కథయు' తాళపత్ర గ్రంథ రూపముననే లభించినది. దీనిని రచించిన కవి కనకదండి గోపాలుఁడనువాఁడు ఇదియే మాంధాత కథయను పేరిట ఒంగోలు ప్రాంతమున ప్రచారములోనున్నది.

## II

రెండవ భాగమునకుఁ జెందిన గాథలన్నియు వీరశైవ మతము, ప్రాబల్యమునకు వచ్చిన తరువాత జనించిన గాథలు. ఇందు, ఎలనాగిరెడ్డి కథ, చెర్విరాల బాగయ్య కవి వ్రాసిన 'కొమిరెల్లి మల్లన్న' కథతో నించుమించు పోలియున్నది. (కొమిరెల్లి మల్లన్న కథ ముద్రితము) భల్లాణ రాజు కథయు, సిరియాలుని కథయు, 'సూర్యభాండవ' కథయు శివమహాత్మ్య ప్రతిపాదకములై వెలసిన గాథలు – ఈ కథలు గేయగాథలుగా మాత్రమేకాక, యక్షగానములుగను, హరికథలుగను వెలయుట మనము గమనింపవచ్చును.

గోపిరెడ్డి కథ నాకు తాండూరు వాస్తవ్యుఁడగు కిష్టయ్య యనువాఁడు జెప్పెను. పర్వతాల మల్లారెడ్డి కథ, డా॥ రామరాజుగారు సేకరించి యిచ్చిరి. ఈ రెండు కథలును ఒక్కటే. గోపిరెడ్డి తండ్రి పేరు కాగా, మల్లారెడ్డి, కుమారుని పేరు- ఈకథలలో భేదమంతే.

## III

సాహస ప్రదర్శకములును, వీరాద్భుత కార్యసముపేతములునగు కథలన్నియు నీ విభాగముగా రూపొందినవి. ఇందతిమానుషాంశము యొక్క యునికి విరివిగాఁ గాన్పించుచుండును. "కమ్మొరిపిల్లకథ" ప్రచురితమైన "కమ్మవారి పణతి – పసల బాలరాజు" కథకు మారు రూపు.

ఇందు చాల భాగము కర్నూలు జిల్లా యందును, నల్గొండ జిల్లాయందును నాచే సేకరింపఁబడినవి — నల్గొండ జిల్లా యందలి గాథలు సేకరించుటలో

నాకు తోడ్పడిన నా సహాధ్యాపకురాలు శ్రీమతి సంయుక్త యిచట నా కృతజ్ఞతకు పాత్రురాలు.

## IV

ఈ విభాగము నందున్న వన్నియు స్పష్టాస్పష్ట చారిత్రకాంశములు గలిగినవి. కుమార రాముని కథ, మద్రాసు గవర్నమెంటు (April 1951) వారు ప్రచురించినను, నేను హైదరాబాదునందు వ్రాసుకొన్న గాథ కొంత భిన్నముగా నున్నది. వనపర్తి, సదాశివపేట, గద్వాల, సంస్థాన చరిత్ర లనఁదగిన, రాజారామేశ్వరరావు కథ, సదాశివరెడ్డి కథ, నల్ల సోమనాద్రి కథ లిందుఁ జేర్చనైనవి. మొదిమెకోటకుఁ జెందిన నాగిరెడ్డి కథయు, కృష్ణాజిల్లా లోని యొక గ్రామమునకుఁ జెందిన యనంతరెడ్డి కథయు, నొక కాలమునందు జీవత్పాత్రలైన 'కామందు'ల కథలనవచ్చును.

చారిత్రకాంశములు జానపద గేయగాథలయందు, అభౌమాంశ యుక్తము లగుటచేతను, పుక్కిటి గాథలతోఁగూడుకొని యుండుటచేతను, వీనిని నిరూపించుటకు, ఈ గాథలలోని యంశముల సహాయము కంటె ఇతరాంశముల (కైఫీయతులు, కవిలెలు - శాసనములు వగైరా) సహాయము మిక్కిలి యవసరము. చరిత్రాంశముల స్థాపన యనునది ప్రత్యేక పరిశోధనకు లక్ష్యము కాఁదగిన విషయము.

## V

ఈ విభాగమునందు ఆదివిష్ణువుయొక్క అవతారములైన మత్స్య, వరాహ నరసింహాద్యవతార గాథలు కలవు. ఇందలి వరాహావతారగాథలోని కథాంశము ప్రకరణాంతరమున చర్చింపఁబడినది - ఇవియన్నియు, విశాఖమండలమునందు, డా॥ దోణప్పగారిచే సేకరింపఁబడినవి. జానపద గేయగాథలయందు విష్ణు ప్రశంసాత్మకములగు గాథ లివి దప్ప యితరములు నాకు లభింపలేదు.

శివకుమారుని కథ, రాణి మైనావతి కథ, నల్లారెడ్డి కథ, సూర్యభాండవ కథ, సారగమ్మ కథ, వడ్డెరాజుల కథ-ఇవి యీ పట్టికయందుఁ జేర్చఁబడలేదు. కారణము, ఇవి యాయా గ్రామములయందు కథాగాయకులు చెప్పునపుడు, చెప్పినది చెప్పినట్లుగా వ్రాసుకొనుటకు వీలు కలుగలేదు. స్థలాంతరమున నుండుటచేతను, ఇంటికి మరలవలయునను తొందరచేతను, కాలాభావమువలనను వారు చెప్పుచుండఁగా కేవలము కథా సారాంశము వ్రాసుకొనుటకే నాకు వీలైనది

గాని, తద్రూపమును అక్షరబద్ధముచేయుటకు వీలు కాలేదు. కేవలము వచనమున వ్రాసుకొన్న రూపములు కలవి యగుటచే. నీ కథలను 'మచ్చు' చూపించుట కిచట ననువు కాదయ్యెను.

## 1. గౌత పురాణం

1. శ్రీరామ స్వామిని చిత్తమున దలచి
శ్రీ శారదాంబకు చేయెత్తి మొక్కి
ఘనుడు విద్యల గురువు గణపతిని దలచి
సరస్వతి స్తుతియించి సంతోషముగను
ప్రాకటంబుగ మునుల ప్రార్థన జేసి
శారదాంబ కరుణ జెప్పిన కథను
అలర గౌత పురాణ మంత నెరిగింప
విన వేడుకై యుండు వీనుల యందు -

2. వ. అటువంటి కైలాసానికి శాంబ్రము ఎటు వలె దోస్తున్నాదీ -
అతి చిత్రభాను నామ సంవత్సరమున
మఖపుబ్బ దీరిపోయె మరి వేగనపుడు
చిత్తస్వాతి ఒరుపాయె
శివుడున్న పట్నానికి శాంబ్రముదోలుతున్నది
రాయి రాయి ఒరిసి భగ్గున మండుతున్నాది.
మాను మాను ఒరిసి మంటలై మండుతున్నాది
మింటను మేఘాలు మెరుపులు లేక
వసుధలో వెంబడి వర్షములు లేక
లోతాటి సముద్రాలు లోతుల్లు జూపె
అల్లిన దామెర్లు అటు అదల సాగె
నీళ్లు మేతలు లేక ధేనువలు అడలె
కొలుకుల కన్నీళ్లు వొలవొలా రాల్చె
కైలాసాన ధేనువలు కడు దుఃఖపడుచు
కుడికంటి శోకంబు ఎడమ కంట బోసె
ఎడమకంటి శోకంబు కుడికంట బోసె
ముత్యాలకన్నీరు ముకు వరుస దాల్చె

పగడాల కన్నీరు పలువరుస దాల్చె
కైలాసాన ధేనువలు గడగడా వణకె

3. తపము చాలించి గౌతమా బ్రహ్మ
తలిదండ్రి కొలువుకు వచ్చె
హస్తములు ముకుళించి అంత ప్రార్థించి
ఓ మునీశ్వర చంద్ర యోగీంద్ర శరణు
ఓ తపసి మునీంద్ర ఒక మాట వినుము
కరమర్థి కైలాస వైకుంఠమందు
పరమేశ్వరుని చెల్లెలు అల్యాదేవిని కనకమేడల
యందు నిలిపి యున్నాడు. అంతఃపురముల
గంటకట్టి యున్నాడు. గంట వాయించి
గంట ధ్వని ఆరక తలికె మహా మేరు
పర్వతాలు తిరిగివచ్చిన వానికి అలియా
దేవిని కళ్యాణ మందింతుననెను
పోయి కల్యాణమంది వచ్చేను –
సెలవిచ్చి పంపుమనె గౌతమేశ్వరుఁడు –

4. గౌతుడు పక్షుల కపుడు ఏమనియె
మట్టి యేలాగు పుట్టె మీరు ఏలాగు పుడితిరి
తెలియ జెప్పుడు నాకు తేట మీరగను
అనంగనె పక్షులు అప్పుడిట్లనియె

వ. పార్వతి పరమేశ్వరుడు వేదాల బండి గట్టుకుని, కాశినుంచి రామేశ్వరం కదలి పోగాను.

శివుని జడలో ఉన్న జాలారి గంగ
పార్వతి కన్నుల పరగంగ జూచె
తొలుకరి మెరపోలె కనఁబడి యుండె
అంతట పార్వతి ఉగ్రకోపమున
ఎగద్రొక్కిన బండి యిరుసులకు విరిగె
వేదాలన్ని కలమెలిగి మర్రి మొదలయ్యే
వేదాలకు చుట్టిన దారాలు ఊడలై నిలచె

వ. ఆకుల ఉన్న ప్రాలు ఆ సమయమందు పదిగోట్ల పక్షులై ప్రబలె తక్షణమె ఆ కాల మీ కాల మేకమై మేము ఉంటిమి ఇక్కడ ఉచితంబుగాను-

5. శివ పూజ పక్షులు సిరసు దెగ గాలె
దేవ పూజ పక్షులు శపియిస్తు గాలె
హరి పూజ పక్షులు అదలుచు గాలె
వేద పురాణం పక్షులు వెతపడుచు కాలె
కూసపాములు మట్టిన కుములుచు గాలె
తాచుపాములు మట్టిన తగులుచు గాలె
జర్రిపోతులు మర్రిన జడ మెలిగి గాలె
పక్షులు పాములు ప్రలపిస్తు గాలె
సాలగాలి మట్టి అంత సమసినయపుడు
అగ్గిమంటలు చల్లార్చె ఆ గౌతముండు.

## 2. తరిదేవి కథ

కీర్తన దరువు :-

దేవినే కాని భారి దేవినే
దేవినే నే దేవతాలా నమ్మిన దేవినే
కాంతినే కరిరాజ వరదూని వేడెద
కాంతినే కాంతను నేనిక
కమల సంభవుని నాకు మదిలోపల
నమ్మి కోరితి దేవినే చెలియా
చెలియను నేనిక చేతోమోదమున
శంకరుని పూజ చేతునే
అమ్మా రాజు భార్యనూ
దేవినే కోటినోమూలు నోమితి.నోయమ్మా-

ద్వారపాలకుని మాట

అమ్మా మీ నామములు మాకు విన్నవించితిరి
గాని మీ రాజ్యము పేరు మాకు విన్నవించుట లేదు
ఆనందంతో విన్నవించవమ్మా తరిదేవి

తరిదేవి వాక్యం

చెబుతాను వినవమ్మా చెవినిండు బెట్టి
గంజివెల్లి పట్నంబూ మా పట్నంబు గలదూ
అట్టి పట్నంబు ఏలేటి మారాజూ
గిరిరాజు మా మామా, జంబికాదేవి మా అత్తా
అతిపుణ్యా శాలి
శిద్ధమ్మా శెట్టికి న్నాకు పెండ్లైన
మొదలు గంజివిల్లి పట్నము ప్రజాలు
అధిక సంపన్నులై నారూ
ఇంత పదార్తము బంగారము గలిగినాది
ఈ పదార్తము ఉండి యేమీ
నాకు సంతానంబు లేదూ

వచనం :— ఆ సమయంబున
ఆ బ్రహ్మ దేవుండూ
పంచాంగము విప్పి
మొదలెల్ల చదివి
మొదలెల్ల పంచాంగమూ
కొదవెళ్ళ జదివి
ఓ సిద్ది మారాజ
గంజివెల్లి పట్నమూన
మీరు ఘనరాజులైరయ్యా
ఓ సిద్ధ మారాజా
ఊరుకు ఉత్తరంబున
పర దక్షిణంబూన
బెజవాడ మల్లికార్జునుని గుట్టా
పాడు బడ్డాది
ఆ గుట్ట మీరు పూజ జేసితే
సంతానంబు మీకు చాల గల్గున్
ఆ సమయంబున సతీ పురుషులు ఏకార్థులై

యా రోజు
బెజవాడ మల్లికార్జునుని గుట్ట
జేరబోయినారు. పోయేటి వరకల్లా
గుళ్ళు ఎట్ల ఉన్నాయి
పాడు బడి గుళ్ళూ పాడుగొట్టు
కాడుతా యున్నావి.
కోనేరు తోడించినారూ
పువ్వుల చెట్లకు నీళ్ళు బోసేరు
గుళ్ళల ఉండా దిగుడు బావుల మెట్లా
ధర్మ తరిదేవి
పవిట కొంగుతోని
ఎత్తి పోసిన్నాది
కోనేట్ల నీళ్లూ
బంగారు బిందలాతో
మోసి కొదువ లేక ఉదకము దెచ్చి
గుడి సుద్ది జేసినారూ
మల్లె సల్వాలు దెచ్చి
లింగాన్ని దండ వేసినారూ
రాత్రింబగళ్ళు సతిపురుషులు
సతిపురుషులు
పూజ జేస్త యున్నారూ
ఆ సమయంబున మల్లికార్జున దేవుడు
వారి భక్తి పూజలు మెచ్చి
మీ అష్టకష్టాలు
ఈడేరి పోయినావి
మీకు సంతాన ఫలంబూ
మీకె దొరుకుతాది
ఈ అయిదు మల్లె పుష్పములూ
నీవు ఆరగించవమ్మా

ఓ ధర్మ తరిదేవి
ఆ సమయంబున తరిదేవి జంగమయ్య యిచ్చిన
మల్లె పుష్పములూ ఆరగించినాది ధర్మ తరిదేవి
అయిదుగురు మొగకుమారుండ్లూ,
ఒక్క ఆడి కుమార్తె గల్గినాది.

౩. శ్రీ బాలగౌరి వివాహము

1. శ్రీకరంబైనట్టి సృష్టిలోపలను
తెరగొప్ప క్షత్రియ తేజమీ కథను
ద్విపద కావ్యముగాను తేజరిల్లగను
కశ్య బ్రహ్మ గోత్రము కలిగిన ఘనుఁడ
రారాజు పుత్రుఁడు రిపు సంహరుండు
గిరి యేలిన యట్టి గిరిరాజుగారు
పంచాద్రి యేలిన పట్టాభిరాజు
రాజుకు భార్యైన రమణీ మనోహరి
జమిళికామాంబ యను జలజాతనేత్రి
ఇరువురకు ముగ్గురు ఇంపైన సుతులు
సిరిని వ్రతమాచరింపగా సిద్ధమారాజు
అవనీశు వేడఁగా అగస్త్యుఁడు పుట్టి
భూతములకు వైరిగా పోతురాజు పుట్టి

2. ఓహో గోపిక వదరకే నీవు
ముట్టపాలు దాగిన మూర్ఖమా నీకు
కాగుపాలు దాగిన గర్వమా నీకు
పచ్చిపాలు దాగిన పౌరుషమ నీకు
నెట్టండి గోపికను నెలమి తోడుతను
ఉంచరాదు భామను ఉర్వడి నగరిలో
మా అన్న పరశురాముఁడు పట్నాన లేడు
శూరుఁడు జంపన్న చూడలే దీమెను
కదిలెను ఆ భామ కడు సంతసమున

## 4 గిరిరాజు కధ

1. శ్రీ శారదాంబకు చేతులు మొగిచి
లోకపావని సకల లోకైకమాత
ఏక వీరాంబకు వేడ్కతో మొక్కి
ప్రకటితంబుగ శక్తి ప్రార్థన జేసి
వీరవైష్ణవులకు వీర శైవులకు
కడు వేడ్క విప్రులకు కరములు మొగిచి
ధరగల జనులెల్ల తగ సంతసిల్ల
కరమర్థి జెప్పిన ఘనుఁడెవరనిన
ప్రభవించు నతి వేడ్క భైరవు మంత్రి
అలరి భైరవ మంత్రి అంబికాంబకును
అతివేడ్క నుదయించె నన్నయ మంత్రి
మతి మంతుఁడైనట్టి సుతుని కల్పకము
వినుతింప శ్రీ ఏకవీరను మెప్పించి
రచకుఁడు బడబాగ్ని రామచంద్రుఁడు
చెప్పంగఁదొడగిన చతురుఁడై యంత...

2. పందిట కొమ్మున బల్లి పక పక పల్కె
తన మంత్రి యచ్చోట పలికె నొక మాట
శకునములు గావయ్య, రాజశేఖర వినుము
ప్రధాని మాటలకు పల్కెను రాజు
మనకేటి శకునాలు మన్నెరాజులకు

---

## ౫. రేణుక పెళ్లి

వినవయ్య గిరిరాజ విన్నవించెదను
యెరిచి చెప్పెద యెరియక చెప్పెదను
వెరపేల భయమేల వెరవక చెప్పు
అనఁగానె గౌతముఁడు అటు జెప్పఁదొడగె
మీ చెల్లెలు జలకన్యను మాకు ఇచ్చింది మెదలు

నోమరాని నోములు నోమసాగాము
పట్టరాని వ్రతములు పట్టసాగాము
ఎన్ని నోములు నోమిన ఎన్ని వ్రతములు బట్టినగాని
మా గర్భవాసంబు ఫలించకపోయె

వ. మూడు కోట్లమునులు ఆరు కోట్ల దేవాంగనా ఋషులు సమాన కోట్ల సత్యమా ఋషులకు క్షామంబు దగిలి మా సెంకుల మటముకు కదిలి వచ్చినారు.

అన్నమో గౌతముఁడా అనడిగిరి ఋషులు
కొత్త పంట అన్నంబు కోరిరి వారు
మా మట్టి గొట్టించి పోడు గావించి
పంట పదిగడియలకు పరగ పండించి,

వ. గంట నాడించి గంట ధ్వని ఆరక తలికె సల్ల బాండవలో అన్నం వొండి సరగున అర్పించినాము.

వినవయ్యా గౌతమ విన్నవించెదను
శిశుహత్య మీ యింట సిద్ధించినాది
పక్షి హత్య మీ యింట ప్రబలమైనాది
గోహత్య మీ యింట గొడగొని యున్నది
కర్మలకు రాజు కన్నె నివ్వనంటాడు

వచ. ఎందున నా కుమార్తె ఎలబోని పక్షానకు వక బావిన దోస్తనంటాఁడు – తటాకమున దోస్తనంటాడు –

---

## 6. మాహూరమ్మ కథ

శ్రీ రాజాధిరాజు గిరిరాజు
రాయ కుంభిణి రక్త కుంభిణి
కంచు కుంభిణి గజకుంభిణి
కుంభిణిలో ఏక స్తంభం ఏలినారాజు
అయిదుగిరులు ఏలిన పట్టంపురాజు
ఏక చక్రంగ భోగావతి ఏలినా రాజు

వచ. అటువంటి రాజుకు, అతని కులాంగన అగు పుణ్యశాలి జమిలికాదేవికి పుత్ర సంతానమె గాని ఆడ సంతానం లేదు-

అంతట జమిలిదేవి అతివేగ వచ్చి
తన ప్రాణనాధునికి దండంబు బెట్టి
వినవయ్య రాజేంద్ర విన్నవించేను

వచ. ఏక చక్రముగా భోగావతి మనము ఏలుచున్నాము. మనకు పుత్ర సంతానం కలిగియున్నది. ఆడ సంతానం లేదు.

ఆ మాట విని రాజు అటు చెప్పదొడగె
వినవె ఓ భామరో వివరంబుగాను
ఆడసంతూ గోరి అటు చింతపడితే
ఎవ్వరూ ఇచ్చేరు ఎరిగించమనెను.

వచ. ఆ మాటకు జమిలికాదేవి మనము సతిపతులము ఒక్క సత్యంబు చేత, కాశినుండి రామేశ్వరానికి పిడికిడు లింగాలుగా పట్టి నోమవలెనూ-

ఆడ సంతానం కొరకు అతి వేగ వారు
నోమరాని నోముల్లు నోసిరివారు
పట్టరాని వ్రతముల్లు పట్టిరి వారు
పచ్చనీ వృక్షాలు పత్రిగా నోమిరి
నిండు బిందెలు నోమిరి నీరాళ్లగాను

వచ. అందున గిరిరాజు వారికి ఆడ సంతానం గలుగ లేదు.

## 7. సిద్ధయోగము అను ఎల్లమ్మ శాస్త్రము

1. శ్రీ గురుస్వామిని చిత్తమున దలచి
వాసిగా వైకుంఠ వాసునీ దలచి
ఆది రేణుక కథ అగ్గిణో నేను
ఎల్లవారలు వినఁగ యక్షగానమున
సిద్ధయోగంబు ఏర్పాటు జెప్పెదను-

2. అప్పుడు రేణుక అతి వేగముగను
విప్రకుల జంపన్న విజ్ఞానమూర్తి
నా మనవి ఒక్కటి చిత్తగించయ్య

సిద్ధయోగంబు నే జేయంగవలయు
శీఘ్రంబుగా బోయి సిద్ధులా వేగ
అతివేగముగ బోయి ఆదినాధుణ్ణి
తేవయ్యా పుత్రకా తీవ్రంబుగాను
తల్లి మాటలు విని తనయ జంపన్న
నే బోను ఓ తల్లి నెలతరో యిపుడు
పరశు రాముని నీవు పంపించవమ్మ
తగునయ్యా జంపన్న, తనయ యిట్లనగ
పరశురాముని యెట్లు పంపుదు నేను
శాంతంబు లేనట్టి కోపాగ్రు నెటు బంప
సిద్ధులు ఏమన్న చీకాకు జేసి
అది వక అపకీర్తి అంటి రా వచ్చు-
ఇదుగో నా విన్నపం బింత గైకొనుము-
తల్లి మాటలు విని తనయ జంపన్న
కదలెను జంపన్న కులగిరుల తోవ-

౩. ఆదినాధుని మాట :-

మేము మేర్వగట్లలోన
కండ్ల బడని కోనలోన
ఉన్న జాడ ఎట్లు దెలిసెరా
అల్లవో వో జంపలేశ్వర
మీ తల్లి నిన్ను ఎట్లు దోలెరా

ఆ సమయమున జంపలేశ్వరుఁ డేమనుచున్నాఁడూ-

చక్ర బాణముల దనుజుల
సంహరింపబోగ శక్తిని భూశక్తి
అడిగితే జెప్పె
మా తల్లి మీకు కొండ పొదుగు యోగంబు జేసినాదీ
అందు నిమిత్యమై యిందు తోలించె
వాయు వేగంబున శీఘ్రంగ బోయి
సిద్ధుల తోలుకా రమ్మనె మాతా-

4. పంచపన్నెల పక్షిని ఆదినాధుండు
పట్టుకవచ్చి యా పక్షిని యిచ్చె
సుద్ధి జేయుమని జెప్పె సురనాధుడపుడు
నే బోయి సిద్ధులా తోలుకొని వత్తు
వచ్చేను తోలక వాయు వేగమున
ఈ చోట పక్షిని ఇది సుద్ధి జేయు-
ఆ చోట జంపన్న అనుమాన పడుచు
కట కట నేనెంత కర్మండ నైతి
నేడు ఈ పక్షిని నేనెట్లు జేతు
అని యిట్లు జంపన్న అపుడు దుఃఖించె

వచ. జంపన్న ఆదినాధుడు చెప్పిన మాట తోయలేక తల్లి జెప్పిన కార్యసిద్ధి గావలెనని వర్తింపుచున్నాడు.

చేత పక్షిని బట్టి జంపలేశ్వరుడు
దేవ దేవయని తలచి ముమ్మారు
కడలేని దుఃఖాన కన్నీరు దీసి
కరవాలమున శిరసు ఖండించె నపుడు
రెక్కలాడుతు పక్షి నేలపై గూలె

5. భేరీ మృదంగాలు దౌడ శంకులునూ
గంట నాదంబులు గణగణ మ్రోయ
భేరీ టమ టమ దణ దణ మ్రోయ
బోరుకొని పట్నంబు బుగులు బుగులనగా
యెదురుకొనె సిద్ధులా ఇంతి వేడుకతో
ధూపార్తినివ్వాళు లెల్ల ముట్టించి
వార్తిలో ఉదకములు వరుసతో నపుడు
పాదజలంబు లందరికి నిచ్చె
పంచరత్నాలు దాపిన పందిళ్ల నడుమా
సిరి సాపలు బరిపించె సిద్ధు లందరికీ
శరణని కూర్చుండగా జేసె నపుడు-

## 8. ఎల్లమ్మకథ

1. భూమి ఆకాశం బుట్టినప్పుడూ
మహాశక్తి లోకమాత
ఆదిశక్తి లోకమాత
కాలమాశక్తి ఎట్లు బుట్టె
ఒక పక్షి రీతిగ బుట్టె
దానికి కూర్చుందామన్న తావు లేకపోయె
కల కలఆశక్తి అంత్రాన ఆడుతున్నదీ —

2. అపుడు సాంబమూర్తి ఎలిగొండ పట్టణము
పిల్లణ్ణి జూడ చేర వచ్చిరయ్యా
పిల్లల్ని జూసి సాంబమూర్తి సంతోషపడెనూ
పంచాంగములు చూయించు తున్నారు
పిల్లగాని పేర్ల పిల్ల పేరాట
పంచాంగములు ఇడిసి చూయించుతున్నారు.
పరుగులు వారికి కలిసి ఉన్నాయీ
గణాలు వారికీ కూడి ఉన్నాయీ
మట్టు మంగళ వారం నాడు
బహుళ పంచమి రోజు
అపుడు సాంబమూర్తి పచ్చల పల్లకి పంపించినాడు
ఆడికేలి పిల్లణ్ణి తీసుకొచ్చినారు
పొలుపొంద ముత్యాల పోలైన వ్రాసీ నవరత్న బాసింగం నయమొప్పగట్టి
బ్రహ్మ ముళ్లు వేసిరి బ్రాహ్మండ్లు అపుడూ

3. వ. అమ్మవారు రేణుకా దేవిని ఆగబట్టిరపుడూ
ఓ తల్లి మాకు అనేకంగ దప్పి ఆకలి అయితున్నాదీ
అని చిన్నవాండ్లు ఇట్ల అనేటి వరకల్లా
ఓ కొమాండ్లార నేను, నాయొక్క పురుషుడు
భోంచేసినంకా తదుపరి వచ్చి మీకు వడ్డించుతా
కొమాండ్లారా —

ఆకలి పోయినంక అన్నమెందుకు తల్లీ
ఈడు పోయినంక పెండ్లమెందుకుతల్లీ
నీ బోనమే ఇంత శృంగార మున్నదీ
బోనముల ఉన్న అన్నమెంత కమ్మంగ ఉండేనూ
ఆ బోనము మీది మూతన్న ఓరబెట్టి చూపమ్మా
అప్పుడు అమ్మవారు తొడలపై బోనము
దించుకోని ఆ రంత్రాల బోనము ల్యాబట్టి చూపినాది.

## 9. రేణుకా యెల్లమ్మ కథ

1. చక్కాని పార్వతీ ఏమంట బలికేను
నా యారుగురి బిడ్డల్ని పెండ్లాడమన్నది.
నీ యారుగురి బిడ్డల్ని నే పెండ్లి యాడనే
ఎనక సీరి బుట్టేటి ఎల్లునే పెళ్ళాడత.
అణ్ణుంటి మునిరాజు సముద్రాల ఒడ్డుకు
సముద్రాల ఒడ్డుకూ వచ్చాడు మునిరాజు
పన్నెండు ఏళ్ళయిన తబుసుల్లు గోరాడు

2. అణ్ణుంటి ఎల్లారి సద్దుల్లు జేసింది
అచ్చన్న లాడేడి రచ్చల్లు దాటింది
సీమలూ దూరనీ సిట్టడవి దాటింది
గద్దలూ దూరనీ పెద్దడవి కొచ్చింది
సముద్రాల ఒడ్డుకూ వచ్చింది ఎల్లారి.

## 10. మాత పురాణము

1. ధరవీర వైష్ణవుల తగిలి సేవించి
మొగివీర శైవుల మదిలోన దలచి
అందరి జగముల సన్నుతి జేసి
గద్దరి జగమాత కమలాక్షి నింత
వినిపింతు కవులకు విను ప్రస్తుతింప
వినుతి కెక్కిన యట్టి వీర శైవులకు
మధములణగించి మర్ధించినట్టి

కథ విన్నవించెద క్రమమెల్ల దెలియ
రక్షించు ఆ మాత రమణచే జగతి.

2. హెచ్చుగ మహూరమ్మ ఎదురేగుదెంచి
తండ్రికి మామకు దండంబుబెట్టి
నిండు వేడుక రాంగ నేర్చిన భక్తి
కూర్చుండ విడెమిచ్చె గురుతు మీరంగ
తీర్చిన పూబోణి స్థిరముగ బలికె
ఒప్పని కలగంటి ఓ మామగారు
విప్పి చెప్పెద మీకు మీరె నా తండ్రి
కడలేని యుగములు గడిపితి ముందు
తడయక నాకంటె తగదు దేహంబు
కృత యుగంబున వచ్చి కెరలి కోపమున
హతమణంచితి రాజుల రాక్షసూల
బహుకాలమూ నాడు భయము లేదాయె
భయము గానని దాన్కి భయమాయె నేడు
మహిలోన ఒక డెదురు మసలుచున్నాడు
పరగ ఓరుగంటి బాల రుద్రుండు
బాలరుద్రుడు ఎంత ప్రజ్ఞ వహించె
రట్టు చేయుచు వీర రాజేంద్రుడంత
ఏలుచు నున్నాడు ఎదిరించి నన్ను
ఏపణతు వానిని ఈ క్షణంబునను
"ఢీ" యని నే బోయి ఢిల్లిలో నిలచి
మర్దింతు రుద్రుని మామ గౌతముడ-

3. వీర ప్రతాపుండు విఘ్నంబు జేసె
ఘోరాగ్ని దగిలించి కొట్టించెనమ్మ
పట్టుకుంచెలు బోయె పడిగెలుబాయె
బొడ్డు గంటలు బాయె బోనములు బాయె

దరిశనంబులు బాయె తగవులు బాయె
శిరసు దివ్య యాప చీరెలు బోయె
పూత చంద్రములు బోయె పుణ్యములు బాయె
మాత లాంఛన అన్ని మహిమీద గూలె-

4 బహుళమై శీమకుర్తి పట్నంబు తూర్పు
పుడమి అరుంధతి పుట్నిల్లు మరియు
మహిమతో నున్నది మాతంగ వాడ
ఆది యుగముల నాడు ఆ వాడలోన
వేదములకు ముందు వెలసిన వేము
యాప వృక్షము క్రింద ముద్దరూపమున
అక్షయముగ మణులు అమరిన గద్దె
పచ్చల గద్దెమీద పరమాత్మరాలు
మచ్చికతో ఉన్నాది మచ్చల మాత
ఆమె నా చెల్లెలు ఆ యమ్మకిపుడు
శ్రీ మించు ఈ లేఖ కొంచుబొమ్మనెను.

5. నీలి గొడుగుల కింద నిలిచి బవనీలు
తమ చేతి జమిడిక ధ్వనుల నుల్లించి
మునుముగ వాయించె కడు భీతి నంద
ఆ సమీపంబున ఆ మాత జూచి
రుద్రునితో ననియె రూఢిగ నపుడు
ఒక్క మనసు చేత ఓ రుద్ర నీవు
తగ రేణు కాంబను తగ వేడు కొమ్మ
అనుచు చెప్పిన రాజు అతి భక్తితోను
సాష్టాంగము చేసె శాంభవి కపుడు

---

## 11. మాతంగి కథ

1. ఎక్కలి దేవమ్మ ఆది దేవమ్మ
ముక్కంటి సత్పుత్రి మూడవనేత్రి

మా పాలి దైవమ మము గన్న తల్లి
ఈ యెడ మరి దిక్కు ఇక నీవె కాక
దైవములు మరి గలరె ధరణి మీదను
ఓ లోకపావని ఓ జగజ్జననీ
భూమిలోపల పరుస బోరు కలుగుచును
అన్ని దేశముల వారందరు గూడి
అదరుచు భువనము లాటపాటలను
వేమారు నీ కడకు నేతెంచు త్రోవ
వీర ప్రతాపుండు విఘ్నంబు చెరచి
దిమ్మరుడై నిన్ను దిట్టెనోయమ్మ.

2. ఆదికి నాదైన అల మాహురమ్మ
తన చెల్లెలని యేటి ధవళ నేత్రికిని
జనులెల్ల జయవెట్టు శక్తి రూపికిని
మచ్చరం బట్టిన మర్దించి విడుచు
మచ్చల మాతకు మహామాతకును
పలుమారు దీవించి పంపిన లేఖ
కలయ నిచ్చట నొక్క కార్యంబు పుట్టె
నర రుద్రుడనువాడు నా వోరు గంట
బిరుదుగ నేలుచు ప్రేలుచున్నాడు.

---

## 12. ఈదెమ్మ కథ

1. శ్రీ శారదాంబను చెలువొప్ప దలచి
మతి యందు ఇహమందు మనుమన్ని దలతు
నా పాలి గణపతిని నయమొప్ప దలచి
ఏకదంతుని కృప ఎల్లవేళలను
ప్రాకటంబుగ నేను ప్రణమిల్లి మొక్కి
సరస్వతిని స్తుతియించి సంతోషముగను
శారధాంబను ధలచి చెప్పినా కథను

పదిలుడై పెనుగొండ పల్లెలోపలను
యదువంశ పుణ్యుండు యాదవ ఘనుడు
కన్నెసిరుల గోత్రుండు కాంతి చంద్రుండు
వర్ణించి కనకబండి వంశ వర్ధనుడు
కొండయ్య పుత్రుండు గోపాలు డనగ
చెలువొప్ప గట్టిగ చెప్పిన కథను...

2. చేటు కాలంగాక చెల్లంబో వీడు
ఎడమకాలి బొమ్మ యెట్లనె వీడు
అయ్యోధ్య ఒక తెరువు ఎలు ఒక తెరువు
తనయులు ఒక తెరువు తాను ఒక తెరువు
ఇద్దరు కొమాండ్ల నిటునటు జేసి
మద్దులేర్ల కింద మట్టుదు పీన్ని

3. ఆ మాట కమ్మవారు అళ్లన నవ్వె
రాజువుగాగ కడబల్కి తీవు
కానక గర్వించి తీవు
రాజగర్వంచేత కానకాడితివి
మదన మెచ్చంగ మద మెచ్చెనా రాజ
కన్నులకు కవి తొట్టెనా రాజ
నా మహత్తు కానకాడితివీ
ఆడదానిగాంగ ఆడితివి మాట
ఎల్లరాజులకు మూతిన మీసముంటె
నా ముంజేతి మీదనే మగ మీసమున్నాది...

4. వెంట బెట్టుక యాది యింటికి వచ్చె
పంద మంచము జూపె ఉండిల్లు జూపె
కూడు అంబలి గలిపి గుంపించి పలికె
తెలియదు మీ కులం తెలియంగ రారు
బాలలు మీరును బడలి యున్నారు
చప్పిడి అన్నంబు చవి జెడ్డ కూడు

డొప్పలలో గల్పి దోసిన్డబోసి
ఈ పొద్దు బండుండి ఋంటి లోపలను
లేపేను కూలివాడ లేపేను నేను
బాలల మంచాన పండను బెట్టి
నేల నిద్దఱు బండ నెలగూక వచ్చె
ఆ వేల విధి కుంచెడారుకలు దెచ్చి
పోవోయి కూలికి పొద్దెక్క వచ్చె
కొడవలి లేదెట్లు కోతునే నేను
పిడిలేని కొడవలి పిలిచి తానిచ్చె
కడుపు కక్కుర్తికి ఘనమైన రాజు
కొడువట అరుక కొయ్యను బోయె
భోగి చేతులుగాంగ బొబ్బలు వచ్చె
పగిలె ఆ హస్తములు దోస పచ్చల రీతి

---

## 13. మాంధాత కథ

1. కడవ వంక జూసె వసుధేశు డపుడు
అడవిలో మాంధాత ఆలిని నమ్మడాయె
మరచి నిద్రించంగ మమ్మి దిగనాడి
తరిగిన మాంసం తానంతదిన
అదృశ్యమైపోయె అకాశమునకు

2. బాపురే కులసతి బాపురే భార్య
బాపురే తన మీద భక్తి లేదాయె
తనకు వుంచక తిన్న తనయులకు నైన
పిన్న బాలలమీద ప్రేమ లేకపోయె
భయభక్తులు విడిచి భామ తనమీద
దయలేక మాంసం తానారగించె,

## 14. అంకాళ దేవత గాథ

1. శ్రీరమానాథుని సేవించి నిరతం
శారదా దేవికి చేతులు మొగిచి
ఆదిగా గణపతి నాత్మలో దలచి
కాళిదాసాది సత్కవుల నుతించి
యల్లమ్మ పుత్రుండు విహంగ వాహనుడు
ధరణిపై రాజులను తండ్రి పగకై
ఇరువది యొక మారు వెదకి చంపగను
ఉర్విపై క్షత్రియుల ఉడుకు రక్తంబు
పారె శమంతక పంచమడుగులుగ
అట్టి పౌరుష ధీరుడయిన భార్గవుని
గట్టిగా వేడెద కార్యంబు కొరకు—
అమ్మా భవాని అలినీలవేణి
రంగు ముత్తెపురాణి రాముని తల్లి
కంజాక్షి అంకమ్మ కరుణ విభ్రాంతి
నైశ్వర్య వచనముల్ అమర శోభిల్ల
భావంబునందు శక్తిని ప్రార్థన జేసి
మదిలోన ఎందరిన్ మరువక తలచి
కథ విన్నవించెడి క్రమ మెట్టిదనిన—

౨. కొలిచిన రాజులకు కొంగు బంగారమన్నావు
తలచిన రాజులకు తలలో పుష్పమన్నావు
కన్నె ఆడవారిని బట్టి కండలారగించినావు
పుట్టినావు నీవు భూమండలాన
పెరిగినావు నీవు దక్షిణ వీర కాంభోజిలోన
మోరిన రాజులకు మోర చిక్కమన్నావు
పల్లద మాడిన రాజులకు పక్కలో సురియ నన్నావు
ఎదిరించిన రాజులకు ఎన్నుగాల మన్నావు

3. వినవయ్య పిన్నాయన విన్నవించెదము
తడవాయె యుద్ధమునకు తర్లి పోవలె మేము
ఘనముగా దీవించి గ్రక్కున బంపవయ్య
అనగానె కనక రాయేంద్రు డప్పుడిట్లనియె
వినరోయి కుమాళ్లార విన్నవించెదము
పోరిలో భేతాళుని పొగరడంచియును
శీఘ్రముగ రాయ భేతాళుని శిరస్సు దెచ్చి
అతివేగ నాకు చూపించిన నాడు
అపుడు దీవించెద అయ్యారో మిమ్ము.

---

## 15. జాంబ పురాణం

(రుద్రవరపు జాంబవదాసునిది)

1. ఆది మూలంబు దెలియకా
అనుమూలూ దెలియలేకనూ
మురహరీ దేవ బ్రాహ్మడూ
వంకనా నామ మున్నదీ
పలుపాతా జందె మున్నదీ
మొల్లో వర గంట మున్నదీ
చేతులా మెరతాపులున్నవీ
చెవులందూ హంస కుండలూ
శంకుం చక్రాల పోగులూ
ధర్మ కంకణం బాగ గట్టెనూ
శ్రీవిష్ణూ దేవ బ్రాహ్మడూ
జాంబవ గిరీ పట్న మొస్తడూ
అశోక వృక్షంబు కిందా
బ్రాహ్మండే కొలువు దీరెనూ
వాడల్లో ఎవరే తల్లీ
మేడల్లో ఎవరే అమ్మా
మూడు రోజులు పోయెను

అన్నాహారంబు లేకనూ
ఏడు రోజులు వోయెనూ
స్నానంబూ చెయ్య లేదు గా
అన్నదానం చాల జెయ్యావే
అవునమ్మా వారూ

2. ఆ వేళా జాంబవంతుడూ
కొడుకూనే కళ్ళ జూచెనూ
99 కోట్ల లింగాల కత్తి బట్టెనూ
ఏటుకే శిరసు గొట్టెనూ
ఆ తాతా జాంబవంతుడూ
శిరసూ డాకాలి జేసెనూ
లోపాలి గుండె దీసెనూ
ఇక సృష్టి జేశాడండీ
డొక్కామణి కొలిమి జేసెనూ
చర్మంబూ తిత్తి జేసెనూ
అస్త్రములే పట్టు దెరలుగా
పాదములే బాడిశలన్నా
బొమ్మెల్లే ఉలులు జేసెనూ
ఆ నేళా విశ్వ బ్రహ్మకూ
ఒళ్ళంతా చెమట బుట్టెనూ
నొష్టనా చెమట దీసెనూ
భూమందే పార వేసెనూ
అండామే పిండమాయెనూ
పిండం బ్రహ్మాండ మాయెనూ
తొమ్మిది ఘడియల కల్లా
బాలుడూ జన్మాదు లెత్తెనూ
విశ్వబ్రహ్మను జూచెనూ
ఆ బాలుండేమి బలికెనూ
స వెవ్వరి వాడవయ్యా

నిజముగా బలుకా మనెనూ
ఇనవయ్యా ఇశ్వబ్రహ్మ
ఇక నీకూ తెలియ జెప్పెదా
తల్లీ భూదేవి యున్నదీ
తండ్రీ మరి విశ్వబ్రహ్మ
నా పేరు తెలియ జెప్పెదా
రుంజాకాసురుడ నాయనా.

## 16. జాంబ పురాణము
## (Another version)

1. గోదై నాల్గు కాళ్ళైన నిబ్రాడ గాయించి, ఎన్నుపూస ఒక ఎనుగజ్జదాపి, పక్క బెంకెలు ఆసాలు దాపి, దాని చర్మము కప్పరము గప్పించి, తొల్లి గుడిసెలో, ఎండిసేర్లు బంగారు టుంగుటుయ్యాలమీద, తాతా జాంబవంతుఁడు అరుంధతిని ఊపుతుండెను. ఊపుతుండగ అప్పుడు బ్రాహ్మడు యోగము జూసుకున్నాడు. చూసి యెక్కడ జూసిన మహా చక్కదనము స్త్రీ లేదని మాత వాడల మహా చక్కదనమైన స్త్రీ ఉన్నదని బ్రాహ్మడు వస్తూ ఉన్నాడూ-వస్తు వస్తు మూడు దోసిల్లె ఉసికె ముని కొంగున గట్టుకోని అరుంధతి దగ్గరి కొచ్చినాడు-ఓ అరుంధతి నీ యు క్తి జూ స్త శ క్తి జూ స్త నీ యొక్క భ క్తి జూ స్త-నా కొక్క వంటపాకం జేసి పె త్తవా అరుంధతి _ అని అడగ బట్టె -

2. మాలోల్లు మాదిగోల్లు మాంసంబు దింటె
తక్కన కులమంత కొవ్వు దిందూరు
తక్కువ కులమని తాకనాడకయ్య
ఎక్కువ కులమంత ఎన్నేను నేను-

3. ఇర వై యారువె ఉక్కుముద్దలు
అర వై ఆరు కాకాలు
ఉక్కుత ఉర్మత జేసెను క త్తి
ఉర్మల పూజలు దించెను
నాకు జూడ క త్తి నయమయి యున్నది.
ఎక్కి జూస్తే ఏడు తాళ్ల పొడ్వు

నాగబండ్ల మీద ఒరిగే కత్తి
కత్తికి గద్దుర గజ్జలు
దాని కొమ్ముకు ఏతుర లుంజలు
పొయ్యపొంటి రొండు దీసి
కత్తికి గద్దునా ఉయ్యాల
నా కత్తి పుట్టినాది మొదలు
సామి ఎక్కడ లేదాయె కయ్యము -

ప్రశ్న :- మే మెట్ల మొక్కుతమురా !

జాంబవంతుడు :- మొదలు ప్రతానం. తరవాత లగ్గం.
ఎనుక నాగెల్లి — నాగెల్లినాడు గరిగ బుడ్ల
అంబలి బోసుకుంటరు - పత్తిగింజలు ఒడిలో
బోసుకుంటరు. పిలగానికి కర్రు తాల్లు
ఇస్తరు - ఇచ్చి జారాట కాడికి పోతరు
అయిదు పత్తి చాల్లు బోస్తరు – ప్రతి మనిసి,
ఆవంక, సూర్యుని దిక్కు మొగం జేసి
అరుంధతి, ఓ అరుంధతి – నీ యంత ఆలిమి
రాని, నీ అంత బలిమి రాని నిండు
ముత్తైదుతనం రాని అని నా అరుంధతికి
మొక్కుతరు-

II

## 17. ఎలనాగిరెడ్డి కథ.

1. గంగా ప్రార్థన :-

లంకకు వారధి కట్టక ముందు
సీతకు శ్రీ కల్యాణం జరగక ముందు
లంకాలలోన బుట్టితి వమ్మా
కాపుల పాలిటి జన్మించి నావమ్మా
తొమ్మిది చేతుల దొనకొండ గంగా
పన్నెండు చేతుల పరమ కల్యాణి

ఇరవై నాల్గు చేతుల వీరణాల గంగా
హ స్త కంకణాల ఐరావతి గంగా
నూనె కుండల వంటి నురుగుల్ల గంగా
పాలకుండల వంటి పాతాళ గంగా
చొప్ప వాగుల వంటి తెప్పల్ల గంగా
గంగ లేనిదే జగంబు లేదు
గంగ కలిగి యుండంగ శివునికి
శివ పూజ కలదు
విష్ణుకు తీర్థంబు గలదు
బ్రహ్మ దేవునికి పంచాంగంబు గలదు
పంచకోటి లింగాలకు
ప్రార్థన గలదు.
ముల్లోక పావని వమ్మ
కాలము నాటి తల్లివమ్మ
కాశీశ్వరీ గంగా భవానీ
నీవే కలవూ.

2. కృతయుగము త్రేతా యుగము
ద్వాపర యుగము గడిచిన తరువాత
కలియుగంబులోన
రక్తపురి పట్టణములోన
కాపు వంశస్థులైన
అప్పిరెడ్డి మల్లమ్మల కడుపున
ఏడు మంది కొమాళ్ళు జనించి యున్నారు.
వారిలోన ఎలనాగిరెడ్డి
అనేవాడు
మహా శివ భక్తుడు
ఈశ్వరుని వరప్రసాది
ఆ కాపు వాళ్ళు నిరు పేదలుగా ఉన్నారు

వాళ్లకు తిన నన్నము లేదు
కట్ట వస్త్రము లేదు.

## 18. భల్లాణరాజు కథ

చిందు ఖడ్గమనే పట్నమున్నదీ
పట్నమేలె భల్లాణ రాజుగా
అతనికి ఇద్దరు భార్యలున్నారయ్యా...శంకరా మహాదేవ
యన్నడూ
మల్లమాంబ యనె మగువ యున్నదీ
చల్లమాంబ యనె సఖియ యున్నదీ
సంతానంబె లేకపోయెనూ.

వ. వనమునకు బోయి, ఆ వనములో తపోనిష్ఠా గరిష్ఠుడైన వశిష్ఠ మహాముని ఉన్నాడు, అక్కడికిపోయి తపస్సుచేసి సంతానం దీసుకొని వస్తాం పా అని ప్రయాణమైనాడు.

అఘోరమైన తపస్సు చేసినాడు
వశిష్ఠ మహాముని కళ్ళు జూచెను ఈశ్వరా పరమేశ్వరన్నడు
ఏమి కొరకై యిక్కడా స్త్రిరీ
ఎన్ని అభంగాలు తక్కువచ్చెనూ...శం...

ఎండియు బంగారు ద్రవ్యమున్నదీ
రాజ్యమున్నదీ
అమ్మా అని పిలవడానికి
ఆడబాల మాయింటలేదురా,
అయ్యా అనీ పిలవడానికీ
మగబాలుడే లేక పోయెను.
నేను సంతానం ఇవ్వడానికి నేను కర్తనా
నీ చేతి విభూది యియ్యవయ్యా
ఏమయ్యా భల్లాడ దివిజుడా
నా చేతి విభూది వద్దురా,

నా చేతి విభూది పొంది
అబద్ధం నువ్వు ఆడవద్దురా
తప్పు సాక్ష్యమే యివ్వవద్దురా
రవరవాది నరకాల బడెదవు
వద్దు వద్దు నీ కొద్దు అన్నాడు

లేదు స్వామీ
అబద్ధంబు నే నాడ నంటడూ
తప్పు సాక్షి నే పలక నంటడూ
నీ భార్యనే దాన మివ్వమంటాడు ఇస్తావా ?
భార్యనడిగినా దాన మిస్తాను
ఇస్తానంటూ ఒప్పుకున్నడు
అడిగిన దానం ఇస్త నన్నడూ.

## 19. గోపిరెడ్డి కథ

1. కొండ్యాలపురి గోపిరెడ్డి కలడూ మహారాజ
భార్య పేరు రెడ్డిసాని, కొడుకు పేరు మల్లారెడ్డి
ధనమంటె మస్తుగున్నాది
సన్నబియ్యం గర్శల ఉందీ
సాలంగ పదార్థ మున్నదీ
ఇట్లా ఉంటె గోపిరెడ్డి
ఒకరి కీయడు, తాను దినడుగా...గోపిరెడ్డి...

2. శంకరుడు జూచి కిలకిల నవ్వెండు
ఏడేండ్ల కరువు లేపె మా లింగమయ్యా
ఆకలి పట్టలేక అరక యెద్దమ్ముకున్నరు
భార్య కుతిక తాళి బొట్టమ్ముకున్నరు
చెంబు ముంతలమ్ముకున్నరూ
పట్ట భూములమ్మ కున్నరూ
సగము రొట్టెకు సంక పిల్లల్నమ్ము కున్నరూ
సాటి కాపులైనా-

ముత్యాల వడశాల దోటి మల్లారెడ్డి
పిట్టల గొడుతున్నాడు మల్లారెడ్డి
శంకరుడు కళ్ళు జూసిండు
కిల కిల కిల కిల నవ్వుకున్నడు...శంకరుడూ...
గోపిరెడ్డికి దానం పంచే దెరుకలేదు
కొడుకుని కావలి పెట్టిండు
ఈడన్న దానమిచ్చునో ఇవ్వడో
అరవై యేండ్ల జంగమైండు సాంబశివుడు
సన్నపు జోలె సంక నేసిండు
శంకు గంట బుజాన బెట్టిండు
చేను మంచె కాన్నె పుట్టిండు...శంకరుడూ...
ఓ నాయన్నా మల్లారెడ్డి
ఓ కొడుకా మల్లన్న పటేలా
కాశినుండి రామేశం బోతున్నా మల్లయ్యా
నడువ జాలక యెనుక బడ్డ నాయన
కడుపులో ఆకలి సొద బుట్టుకొచ్చె
నీ కొట్టిసేను సల్లగుండని మల్లారెడ్డి
మూడు పిడికిళ్ళ బిచ్చం యివ్వు కొడకా...మల్లారెడ్డి
కాశిలో నీ పేరు దలుస్తా నేను-

4. పోరపోర మొండి జంగమోడ
మా కొడుకును కోసుకుంటాము పోరా
దొడ్డ వారికి బుద్ధి జెప్ప వచ్చినావా
కిల కిల కిల కిల నవ్వెండు జంగమయ్యా
నేను జెప్పిందేమి తప్పు లేదు గోపిరెడ్డి
నీకు బుద్ధి గల్ల మాట జెప్పినా గోపిరెడ్డి

5. కిర కిర గొంతు గోసింది రెడ్డిసాని
మూడు దోసిళ్ల రక్తం దీసింద
చేనుమీద పోలి సల్ల బట్టింది

పొలి పొలిగా సాల పొలి
భూతల్లికి సాలినంత పొలి
చేనుమీద పొలి సల్లింది రెడ్డిసాని...

## 20. పర్వతాల మల్లారెడ్డికథ

1. శీల శీల సౌ పర్వత మందున...తందాన తాన...
చిన్న ఏటి దగ్గర భగవంతం...తం...
పన్నెండు మంది పట్టి కాపులయ్యా
అరవై యిద్దరు గోనె కాపులయ్యా
అక్కడ తంగెళ్ల పూడి పట్నమున్నదయ్యా
ఆ పట్నములోన రైతు లెవ్వరయ్యా
పాకనాటివాండ్లు కాపువాండ్లు నయ్యా
శీల మెత్తుక చిన్నారెడ్డి
జోనమెత్తుక బుద్ధారెడ్డి
తంగిడాపురీ మాసిరెడ్డి
అనుముల బ్రహ్మారెడ్డి
బిచ్చ మివ్వని లింగారెడ్డి
అందరికంటె మించిన కాపు లెవ్వరు
ఇంటి పేరు ముక్కెరోళ్లు
కొండా లతడు గోపిరెడ్డి
భార్యపేరు రెడ్డిసాని భామ
పన్నెండు కొప్పెర్ల ధనము ఉన్నదయ్యా
ముప్పైమంది జీతగాండ్లు గలరు
చాలా అతడు కఠినస్తుడండి
దానము లేదు ధర్మము లేదండి

2. పర్వతము మల్లికార్జునుడు చూచినాడు
ఇతనికి కోరినట్లుగా పంట పండింతు
ఇతను చేసే ధర్మము కండ్ల జూత్తు నేను

భూలక్ష్మమ్మ నీవు ఇంటవేమి
కాపోనికి అపరబుద్ధి పుట్టేటట్లు
అఖండముగ చేను పండించు
ఈశ్వరుఁడు చెప్పి మాయమయ్యినాడు

3. జవిరి కొడుకు జడలు పట్టినాది
ఉరికి రావయ్య రండ గోపిరెడ్డి
కొడవలి దీసుకు ఉరికి వచ్చినాడు
కాళ్లు చేతులు తల్లి బట్టినాది
తండ్రి కొడవలితో గొంతు గోసినాడు
రక్తము అంత చేను వెలుపున జల్లినారు
చెటి ఒక్క కొడవలి చేత బట్టినారు
చెటి ఒక్క మునుము చేను గోస్తరయ్య

## 21. హట్కారు కథ

1. జలకోటి జంగాల మడుగు-పాలమాది పడగన
పాలమాది పడగనా-దేరె మాది దేశము
దేరెమాది దేశమూ-గౌడ బంగరి భూములూ
గౌడ బంగరి భూములూ-శనగపూరి పట్నమూ
పట్నమేతె దొరలూ-దొరలెవ్వరున్నరు
దొరలెవ్వరున్నరు-దాతలెవ్వరున్నరు-

2. భోంచేసె రాయడూ బోరల్లా మోయనా
కుంచెనమ్మా రాయడూ గుండెల్లా మోయనా
జాలిచెంబూ పట్టెనూ జాలాది కెళ్లెనూ
చేతి వెంగిలిడిచెను మూతి వెంగిలిడిచెను
కుర్చీలమీదను కూర్చుండె రాయడు
రామగిరి పోకలు ఇడె మేసుకున్నడు
తల్లి కానంబాయమ్మా అన్నలాకు సద్దులూ
అన్నలాకూ సద్దులూ సద్దులైనా గట్టెనూ

3. అయ్యచేతి ఊబిది రాయడు చేత బెట్టెను
చెలిమె కింత ఊబిది యేస్తా ఉండంగను
ఉగములుప్పొంగెను జలములైనా గదిలెను
ఎద్దు ఈత ఉతకము ఎల్లివారుతున్నది.

## 22. సిరియాలుని కథ

చట్టూరకూరల్లు నడుమ నన్నాము
భోంచేతుర్ రండయ్య శివభక్తులారా
నరమాంసము లేంది భోంచేయమనిరి
ఆడేటి బాలుణ్ణి అటు బిలిచినారూ
పాలుబోసి ఒక కత్తి పాకంగ నూరి
నెయిబోసి ఒక కత్తి నేటంగ నూరి
వచ్చేటి బాలుణ్ణి వడిసి నరికారు
చిన్న చిన్న వెంకలు చిన్నటిక కేసి
పెద్ద పెద్ద వెంకలు పెద్దటిక కేసి
నెయిబోసి ఒక కుండ నేటంగ వండె
పాలు బోసి ఒక కుండ పాకంగ వండె
చుట్టూర కూరల్లు నడుమ నన్నమ్మ
భోంచేతు రాండయ్య శివభక్తులారా

## III

## 23. అనుముల బ్రహ్మారెడ్డి కథ

1. తంగెడాపురీ మానిరెడ్డీ
తన భార్య మల్లికాదేవీ
పన్నెండు మంది పాలేటి కాపులూ
పదముగ్గురూ గోనె కాపులూ
ఎవ్వరెవ్వరూ కాపులున్నరూ
అన్నమారెడ్డీ చెలమారెడ్డీ
బమ్మాల వీరారెడ్డీ

పచ్చికోట పసిమిరెడ్డీ
భూమికీ మొదలైనవారూ
భూపతి రెడ్డీ పెద్ద పటేలూ –
మాసిరెడ్డి పొట్టన సంతానము లేదూ
ఏలనీకి రాజ్యమున్నదీ
ఎక్కిదిరగ గుఱ్ఱాలు ఉన్నవీ
రాజు కడుపునా సంతు లేదయ్యా –

2. మాసాటి కాపోడవు నువ్వు
నీ అంగమందునా లింగ మున్నదీ
లలాటమందు ఇబూది ఉన్నదీ
ఏ ఊరు ఏ పల్లె నీదీ
బ్రహ్మరెడ్డి ఏమంటాడా,
రాండయ్య ఓ కాపుల్లారా
తంగెడాపురీ పట్నం మాదీ
పాలబిందెల వంటి కాపులం
పాకనాటి కాపులమయ్యా
మామ పేరు మాసిరెడ్డీ
ఇల్లటమైనా దెచ్చినాడూ
ఇత్తనాలకూ బోతుండాను –

3. ఓ నాయనా సాంబ శివుడా
కలియుగానికి ఇత్తన మిచ్చినా
ఈ అవసత్య పొలిమార్ల ఉండలేను
వైకుంఠం వస్తానయ్యా
మంచిదన్నడూ సాంబశివుడు
బ్రహ్మరెడ్డినీ పార్వతీదేవినీ
రథములోపల గూర్చుండ బెట్టి
జావు పరమేశ్వరా అనె
పదిమంది చెయ్యెత్తి మొక్కంగ

వైకుంఠం ఎల్లినాడు
అనుముల బ్రహ్మరెడ్డీ —
శివుని మల్లె తోటలో ఉన్నాడయ్యా —

## 24. సూర్యచంద్ర రాజుల కథ

1. దేశగిరి పట్న మున్నాదీ
పట్నమేలే మా రాజెవరయ్యా
రాజా దేసంగి మారాజు
రాజుగారీ భార్య రత్నామూ
భామా మాండోదరమ్మ వారూ
సంతు లేకా కొంత దుఃఖమూరా
బిడ్డలు లేకా కొంత దుఃఖమురా
రాజు పొట్టలా సంతు లేదమ్మా
మరి దీపం పెట్టా దిక్కు లేదమ్మా
మరి రైకదొడగా రంభ లేదమ్మా
మరి గుజ్జ మెక్కా కొడుకు లేదమ్మా

2. నాతోడ బుట్టినా తోడు ఉన్నదయ్యా
నా చెల్లెలున్నదీ శ్రీ దేవమ్మా దా
నువ్వు మారు లగ్నమూ ఆడరాద రాజా

3. చెంబుతోను దా నీళ్లు బట్టినాడా
గుజ్జము కెల్లి కిందకి దిగవమ్మా
నేను బిడ్డనంట నీ తానికి రాలేదూ
నేను చుట్టమాయి నీ తానికి రాలేదూ
నేను వచ్చినా పనీ పెద్దదయ్యా
ఇస్తనంట నువు ఆజ్ఞలు ఇస్తేనూ
అప్పుడుగా నే కిందికి దిగుతానూ —

అంతట, అమ్మవారు తండ్రి శామంతి మారాజు చేత అవుననిపించుకుని, తన ప్రాణనాధుని చంద్రాయుధమునకు చెల్లెలి నిచ్చి పెండ్లి చేయుమనెనూ.

## 25. పరమజ్యోతి కథ అను బిత్తో మారాజు కథ

1. వయ్యో దేవా, దైవా రామా
సింహా దేవా అయ్యో రామా
ఒంటి మిట్టనేలే భుజంగ మారాజు
ఏడు లక్షల ఎండి గొడుగులు
పది లక్షల బంగారు గొడుగులు
గలవాడు భుజంగ మారాజు
రాజు పొట్టలో సంతు లేదు ఓ యమ్మా
అయ్యో రామా దైవా రామా.

2. చుక్కల్ల చంద్రుడా నా వన్నెకాడ
నా సీటుకాడ నా తలమీద గొడుగ
నా ప్రాణవల్లభా నన్నేలిన రాజా
ఇంతే మన రాత ఫలమూ
మానెడుంటే మట్టి పాలు
కుంచెడుంటే కుంటపాలు
మన వంతులో ఇంతే ఉన్నదేమో
నేను సంతు కొరకు అడవికి బోతున్నా
సెలవియ్యి మారాజా యనె మూర్ధాళదేవి

జారొర నేటన్నా ॥తాన తందన తాన॥
మహాలింగ గుడికాడ ,,
ముత్యాము పెట్టమ్మా ,,
పగడాము పెట్టమ్మా ॥తాన తందన తాన॥
పగడాల మీదానూ ,,
ఒకరత్నం బెట్టమ్మా ,,
శిరసూ కిందికి బెట్టీ ,,
సిరిపాదం మీదికి ,,
కడుపూల రక్తామూ ,,
ఎదలోన కొచ్చింది ,,

ఎదనున్న రక్తమూ ॥తాన తందన తాన॥
నోటిలో కొచ్చిందీ ,,
జీవమే లేదమ్మా ,,
మరిసోయి లేదమ్మా ,,

3. చెండ్లాటలే ఆడినట్లమ్మా ,,
సీసాపు గుండ్లాతొ చాన ఆడతాడు ,,
కుస్తీపట్లు చాల బట్టినాడు ,,
డాలు బల్లెమే పట్టినాడు తల్లీ ,,
బిర్మోమారాజు ఒక్కడే ఒక వంకా ,,
పన్నెండుమంది జట్టి వాళ్ళు ఒక వంకా ,,
మందంతా నా తండ్రి మరి కింద బడిరి
చేతులూ విరిగినోళ్లు కాళ్ళు విరిగినోళ్ళు
నీ యట్టి విద్యలు ఎవ్వరు నేర్వలేదు
కుమారకా –

4. నిమ్మలు గొట్టీ నీడలేసిరీ
పనసలు గొట్టీ పందిళ్ళేసిరి
వాడవాడకూ పందిళ్ళేసిరి
చాలగా సంతర్పణలు బెట్టిరీ...
బిత్తోరాజుకూ పరమజోతికీ ఋణము విప్పిరయ్యా...
॥తందాన తాన॥

## 26. జలకంటి వీరుని కథ

తందాన, తందనా తాన తందాన
తండ్రి కనుకను ముక్కంటి వీరుడు
అమ్మవారూ భార్య మూర్తాల దేవి
వారికడుపున సంతు లేక నండీ
తిరిగిండ్రు త్రిలోకము లమ్మయ్యా
వెతికిన్రు జగలోకము లన్నీనీ

ధనధాన్యములు మస్తుగున్నవండీ
కడుపున నొక్క పండు లేదండీ... తం...

2. వచ. భామ ఓ బలవంత్రిదేవి, సల్లమదేవి, సందమ దేవి, గట్టుకున్న చీరెలు నీకు దెత్తునె ఓ భామా -

నాథా ఓ నా ప్రాణేశ్వరుడా ...తందాన—
దాని సొమ్ముల మీద మన్ను బొయ్యనార
దాని చీరలమీద మన్ను బొయ్యనార
ప్రాణము పొయ్యినా సొమ్ములు ఒద్దురయ్య
ఎన్ని జెప్పినా వినడు నా తండ్రీ
శత్రు మధ్యానికి, ఎట్ల దాటి పోతున్నడు
యాడికంట బోతున్నవు తండ్రీ జలకంటి
వీరుడా - తందాన...

3. దొంగతనానికి నేను బోతనయ్యా
తప్పక నేను పోయి వస్తనయ్యా
ఏడు కోలల వేపవృక్షమందు
వేప వృక్షము మీద గనకానూ
మాలకాకి గుడ్లుబెట్టినాదీ
గుడ్ల మీదయిన కాకి పొదిగింది

వచ. కాకికి తెలియకుండ గుడ్లు గనక నువ్వు తెస్తే నువ్వు మనగాడవు —
ఏడు కోళల వృక్షము ఎక్కిండు
కాకి గూడు కదలకుండ నాయనా
కాకి పొట్టల గుడ్లు దీసినాడూ
ఒళ్ళోనయిన బెట్టుకున్నదేమీ
చర చర చర చర చెట్టు దిగినాడూ —

## 27. భూపతి రాజు కథ

1. భూపతి రాజుకూ ఎందరూ కొడుకులూ
ఎందరూ ఎక్కడిది ఏడుమంది కొడుకులూ

ఏడుగురి ఎనకనే అక్కమ్మ బుట్టింది
ఎంచంగ పెంచంగ ఏడేళ్ళ బాలాయె
మండలము రాజ్యమూ మనుములే ఇచ్చిరీ

2. చెల్లెలా అక్కమ్మ మొక్కుదువు రావమ్మ
ఒంగి మొక్కేదాన్ని ఏటుకే నరికెనూ
కనుగుడ్లు జీరేను కర్మి ఆ రామన్న
కారే రక్తం బట్టి బాటల్లు బట్టెనూ

3. అక్కెమ్మ కనుగుడ్లు అవి రామ చిలుకలే
ఆ రామ చిలకలే ఎతలు జెప్తున్నాయి
కొన్న మొగుడూ వచ్చి ధర్మచెరు గొడ్డితే
చెఱుగులో వాక్కెమ్మ చేరవచ్చూనయ్య

## 28. వీరనాగమ్మ కథ

1. కపిలేటి ఒడ్డునే పెదగంగాన బోయడూ
పెదగంగాన బోయనికి ఎందరూ కొడుకులూ
తందన్నా తానా తందన్నా
ఎందరూ ఎక్కడిది ఏడుమంది కొడుకులూ
ఏడుమందీ ఎనక ఎంగమ్మ గలిగింది
ఆదరిని ఎంగమ్మకు ఎందరూ కొడుకులూ
ఎందరూ ఎక్కడిది ఎడుమంది కొడుకులూ
ధనము మస్తూగుంది ధాన్యమున్నాదీ
కులము ధరియించనూ కొడుకులున్నారు
గోత్రమెంచీ పాడ బిడ్డలూ లేరు

2. అప్పుడూ నాగమ్మ పత్తిరచ బోయె
నాగమ్మ బోయేది దుడుమన్న జూచె
చేని కాడికి తర్లి వోయె దుడుమన్న
అక్కగార్లూ తల్లి కండ్ల జూచీరి

బావగార్లాకైన తల్లి జెప్పీరి
కత్తూలు గొడ్డండ్లు చేత బట్టూక
ఏడుమంది బావలు వచ్చిరాడికి.

29. రత్నాంగి కధ

1. జలకమాడి రత్నాంగి
మాలుపైనా తల్లి కురులార్పుతుండెను
బ్రహ్మదేవుడు తల్లి మటి కండ్ల జూచెను
ఈ ఒక్క రాత్రికి నీ మొగుడు వస్తేను
ముత్యాల కొడుకైన నీయందు గలుగూను
ఈ రాత్రికాకుంటె అడవిలో నీ వాక్క
అడవిలో నీవాక్క వృక్షమై పుడుదూవు

2. పొయ్యేవాడవు బోదువు
నీ తండ్రికి జెప్పరయ్యా
నేను బోయినంకనే మూడు నెల్లాకు
మూడు నెల్లాకైన తిరిగొస్తు రత్నాంగి
నేను బోయినంక మాతండ్రి అడిగితే
మా తండ్రి అడిగితే నా పేరు జెప్పొద్దు

30. కమ్మోరి పిల్ల కథ

1. బాలరాజమ్మ బంగారి కొండ
సుత్స్యవరమంది మాయవరమైన
ఏలవాడమ్మ యీ యెలమరాజులది
యేడు దొడ్ల నిండ యెల్లనావులు
పది దొడ్లకయిన పుల్లావుల మంద
యేలెవాడమ్మా యెలమరాజయిన

2. యేడు మెట్లది యెండి కిన్నెర
పన్నెండు మెట్లది దమ్మన గొయ్యి
పాటలయినా యిక పాడుతాడండీ

చూచెనమ్మా కమ్మోరి పిల్ల
పరెటి నీళ్ల బిందెలు చేత పట్టిందా
నీళ్లాకెళ్లింది నీలారి గన్నె
ఎంత చక్కనివాడు ఈ యెలమరాజు
చస్తె పుట్టాడు, పోతె దొరకాడు
నిలువలేనయ్య నా యెలమ రాజ
తాళలేనయ్య ఓ యెలమరాజ
నిన్ను జూసింది కోరింది మనసూ

3. భామా ఓ భామా చిన్నదానా
ఇట్టి బాసాలు నే మెచ్చబోనె -
ఇంక యేమీ బాసాలు దొర -
ఏలుగొండ్లది యెన్న కావలె
పులి రాజుల పాలు కావలె
అట్టానన్నా నా యెలమరాజు
ఏమి బాధలూ తా బెట్టుతాడమ్మా
ఇట్టి మగడు లేకుంటె పోయె
వల్లానమ్మా మగన్ని వల్లా
ఎమి బాధలూ తా బెట్టుతాడమ్మా
ఎట్లా విడుతునే నా వెలమ రాజు
సస్తే బుట్టాడు, పోతే దొరకాడు
నిన్ను జూసింది కోరింది మనసు
ఇంటావయ్యా ఓ వెలమరాజ
అప్పుడి కన్నా పెళ్లాడుతావ

4. చూడు చూడు నా సత్య మన్నదయ్యా
బ్రహ్మ దేవున్ని పాటించి ప్రార్థించినాదా
నిలువు టద్దంబుల చేతి కిచ్చినాదా
నిలువు టద్దంబుల బుట్టినావి
యెలుగు గొడ్ల వద్ద కొచ్చినాదీ

పులి రాజుల వద్ద కొచ్చినాదీ
ఇంటరమ్మా ఎలుగు గొడ్లాలార
ఇంటరయ్యా పులి రాజులార
మీది సంకలా నేను గూర్చోని
ఎలుగు గొడ్లది ఎన్నగావలె
పులిరాజుల పాలుగావలె నయ్యా-

## 31. సవరమ్మ కథ

స్తుతి :—

1. హరిశారదాంబా శరణు దుర్గమ్మా
కరుణించు మాయమ్మ కనక దుర్గమ్మా
అమ్మా నిను కొనియాడెదా
మైసమ్మా నిను కొనియాడెదా
రవి తేజా
పోశమ్మా నిను కొనియాడెదా
సామీ నిసు కొనియాడెదా
రవితేజా నిను కొనియాడెదా
శారదా నిను కొనియాడెదా

వందానామూ లమ్మా సత్తెంగల్ల సవరమ్మా
వందానామూ లమ్మా సరసక్కారీ సవరమ్మా
దండామూ లోయమ్మా నా పాలీ సవరమ్మా
ఇక్కడి వారూ గాదమ్మా ఈ దేశమ్మూ గాదమ్మా
మల్లెవాడలోపలా నువు బుట్టిపెరిగినవూ
ఏడుమందీ అన్నల్లా నువు కడగోటీ సెల్లేవు
ఏడుమందీ వదినల్లా తోడి మరదల వున్నావే
వెన్నలు బెట్టీ సాకిందీ ఆ పెద్దా వదినమ్మా
పాలూ బోసీ పెంచిందీ మరి పెద్దా వదినమ్మా

నికు వందానములమ్మా నా పాలీ సపరమ్మా
ఎదిగీ యింటా నున్నాదీ ఆ బాలా సవరమ్మా

2. వచ. అందఱి కన్న చిన్నవాడు కత్తుల కర్రెన్న కనుగుడ్ల రక్తం దెచ్చుకోని పండ్లు పట పట గొరుక్కొని బయలెల్లిండు.

తల్లీ దండ్రీ చెల్లి పోతే పాలుపోసి పెంచినము
పెరుగన్నం బెట్టినము ఇంటికి పెద్ద వదిన వుంటివి.

ఇప్పుడు జూపించు నీ మరదల్ని అని గద్దరించినాడు కర్రెన్న—

రావమ్మా రావమ్మా నా మరదాల సౌరమ్మా
మీ అన్నా మొగమైనా చక్కగ జూడు సౌరమ్మా
కోపదారి కర్రెన్న జప్పుజప్పునా వచ్చెనే—

3. వీరభోగ వసంత రాయడూ కిల కిల నవ్వుకోని
జీవదారి పుల్ల దీసుకోని ఎట్లా వస్తాడా,
ఇంతా చక్కని సవరమ్మా నన్నూ లగ్గా మాడేనూ
ముత్యాలా పందిట్లో నన్నూ లగ్న మాడేనూ
చక్కని బాలా సవరమ్మా నన్నూ ,,
జీవదారిపుల్ల కండ కొకటి చేసి గొంతు మీద
మోపినాడే ఓ యమ్మా
శామంతి పువ్వులా ఓయమ్మా
ఆవలించి పైకి లేచే సవరమ్మా.

## IV

### 32. సదాశివ రెడ్డి కథ

1. రాజా ఓ రాజా రజాభోగతి కలిగి
మనది యా భూమి
పట్నానికి పడమటి దిక్కు
రగారంగం పేట
ఏలెవాడు రాజు రెడ్డి ఉదిమారెడ్డి
ఉదిమా రెడ్డి భార్య శివరంగమ్మ

శివరంగమ్మ కన్న కొడుకు
ధాల్ బహద్దర్ శివారెడ్డి
వేంకటేశ్వర్ల వరాన గలిగిన వాడు శివారెడ్డి
అయిదు రేఖలు గలవాడు
పట్నమున భేషైనవాడు ...రజాభోగతి గలిగి...

2. మెదకు శంకరమ్మకూ పీరి జాడ దెలిసే
గజ్జెల కొడవలి పట్టుకున్నదీ
ఎవడురా నవాబు
శివారెడ్డికి బేడీ యేస్తాడా
పాదం కాడ ప్రాణం దీతునూ
ఆమె మెట్లు ఎక్కి వచ్చెనమ్మ
ఏడు మెట్లు ఎక్కి వచ్చినాదీ
చూచెనయ్యా నవాబు పాదుషాగారు

## 33. రాజారామేశ్వరావు కథ

1. రాజా ఓరాజా రజాభోగతి గలుగని మేలు భళి
మనది యీదేశం ఏదిగడ్డ సూగూరి సముదు
సూగూరి భూమికి దొరలు
పూర్వ కాలము నాడు బోయవానిది భూమి
బొగ్గు తమాష కాడు
పాతపల్లి ఘడి కట్టి
అతడు పోయినంక
బలిజెవాడ సూగన్న
సూగూరు కట్టిపించె
ఆతడు పోయినంక
తిరుపతి దేశము కాపులు
తిరు నామధారుల సంతతి
సవై చిన జానమ్మ

సవై పెద జానమ్మ
కొన్నాళ్లు రాజ్యము ఏలిరి-
పెద జానమ్మ పేరిట
పెద జానం పేట కట్టిరి
చిన జానమ్మ పేరిట
బోడి జానం పేట కట్టిరి-

2. అతడు చదువు నేర్చిన సంగతయ్యే
నైజాము కెఱుక పుట్టెను
బహిరి రాజా రాజేశ్వరరావు
పట్నమునకు రమ్మని పిలిచినాడు
ఉత్తరము వ్రాసి అర్కారు కిచ్చినాడు
శ్రీ రంగం చెరువు కాడికి వచ్చినాడు
రాజుచేతికి జాబిచ్చినాడు
గిర గిర రాజు చదువుకునేను
రాజు తొందరగ లేచినాడు
పెద్ద గుఱ్ఱమును ఎక్కినాడు
జాతివాని దుర్భిణి పట్టినాడు
జాతివాని వేషము ధరించినాడు
రాణి టోపీ నెత్తికి బెట్టినాడు
వంక సొంగ నోట పట్టినాడు
గుప్పించి గుఱ్ఱాన్ని ఎక్కినాడు
దొరబోయె వేళలోన
నిస్సల్‌దారుడు అడ్డ మొచ్చినాడు.

## 34. నల్ల సోమనాద్రి కథ.

1. రాజా ఓ రాజా రజాభోగతి గలుగని-
మనదీ దేశము గాదు మనదీ భూమి గాదు
ఎన్ని చెప్పితే నేమీ మనది యే తాలూకా
నడిగడ్డ గద్వాల- గద్వాల గడికోట

పూర్వకాలమునాడు గద్వాల అది గాదు
గద్దగూడము పల్లి - ఒక రచ్చ కట్టా ఉండె
ఒక రాగి మాను ఉండె - ఆ ఒక్క ఊరికయ్యా
ధొరలెవ్వరున్నారు - పూర్వ కాలమునాడు
శాసవల చిన్నమ్మ దొరతనము ఏలుతుండె

2. ఇంటివా తిమ్మారెడ్డి
దీనికి పట్టి ఇరవైనాల్గు చూడు
లక్ష అరువై ఆరు
నీ యిష్టముంటె చేయి
అప్పుడు తిమ్మారెడ్డి దానికి గూడ ఒప్పుకున్నడయ్యా-

3. అమ్మ జోగుళాంబా తల్లి దేవి
నేను వెళ్లుదునమ్మ
అమ్మ జోగుళాంబ కిళకిళ నవ్వె
పదువయ్య పరవాలేదు అనె
కోనేటి పల్లెకు వచ్చినాడు
కోనేటిలో స్నానము జేసినాడు
గుఱ్ఱాన్ని తన కాలికి గట్టినాడు
వెంకటేశ్వరుని మదిని దలచినాడు
మఱ్ఱిచెట్టు కింద పాన్పువేసె
గంటన్నరలో నిదురబట్టెను
నిదురలో దేవతలు వచ్చిరయ్యా
పండుకున్న రెడ్డిని గుంజిరయ్యా
తిరపతిలో ప్రతిమై నిలచినాడు ...రజా...

## ౩౫. కుమార రాముని కథ

తందాన దేవ నందనానా
తిరుపతీ వీరకంపిణీ పట్టణమున్నదోయీ
పట్టణ మేలెడి కంపిలి ఘూరాజూ

కంపిలి నాయని భార్య అమ్మయ్యా
పరమ పతివ్రత హరియాల దేవమ్మా
పరమ భక్తురాలు హరియాల దేవమ్మా
బాలలు లేని హరియాల దేవమ్మా
పట్టరానియా వ్రతము పట్టినాదీ
నోమరానియా నోము నోచినాదీ
తనయులు లేని తనువు లెందుకయ్యా
ధనములున్నవీ ధాన్యము లున్నవిగా
ఎందరమ్మ నీకు బిడ్డలందురేమో
ధనధాన్యాలూ అడుగబోదురేమీ ;

2. వచ. తపసుకు మూడు లోకములు తలకిందులై పోయినాయి. దేవతలంతా అంతరిక్షమున నిలచి చూడగా ఏడు ఏండ్లనాడు ఎండిన
నేలతిమురులే భూమి బగిలినాదీ
ఉరుములు ఉరిమీ మెరుపులు మెరిశాయీ
పాలు పొంగినట్లు నీళ్లు పొంగినాయీ
చెట్టు చుట్టూరా చుట్టుకొన్నవమ్మా
ఉడికిన వేళ్ళకు ఊపిరొచ్చినాదీ
పాసిన వేళ్ళకు ప్రాణ మొచ్చినాదీ
లేత ఇగురులే చెట్టు బెట్టినాదీ
ఆకులేసి మరిమొగ్గ బుట్టినాదీ
మొగ్గలేసి బలు పూతలు పూసిందీ
పూతలు పూసీ పిందె లేసిందీ
ఆరూ మూడూ తొమ్మిది గడియలకూ
పళ్ళుబండి మరి పర్వము కొచ్చిందీ —

## 36. కుమార రాముడు

(Another Version)

1. కంపిలి పట్నం ఏలేటి మారాజు
కులాననయినా రాచబోయిలయ్యా
వాండ్లేలే రాజ్యం గనక మారాజా

వచ. కంపిడి గంగావతి, మన్నెకుంటం, మానంది. పూడూరు, జటప్రోలు, కొప్పళం, బొద్దురు బండ, చందోలు, సాపురాల, పచ్చకొండ, దూది కొండా, ఇటువంటి రాజ్యంబు ఏలుతాడు మా రాజూ —

2. వచ. ధనం మీద నిగా ఉన్న ఉజిలి మాంకాలి ఎల్లమ్మ చూచి కంపిడి రాజు కలలో పొయ్యింది.

ఓ రాజా వీరకంపిడి రాజా
నా ధనపు కొట్టిళ్ళకు మైల పారినాది
ఈ వేళనయినా కొలిపిడి నింపాలె —
ఉలికిపడి దిగ్గున లేచె రాజు
చేతికింద మనుషుల బిలిపించె
ధనదేవతకు కొలిపిడి జేపించె.

## 37. మొదిమెకోట నాగిరెడ్డి కథ

1. మొదిమెకోట తాలూకాకు
దొర దానారెడ్డి తల్లి గద రాజమ్మ
పెద్దవాడు పెద నాగిరెడ్డి
చిన్నవాడు చిన నాగిరెడ్డి
పెదనాగిరెడ్డి తీరిపోయిండు
భార్య అనంతమ్మ మరిది కొలువు కొచ్చినాదీ...తం...

ఓ మరిది నాగిరెడ్డి
మనకు ముప్పైరెండు పీరాలున్నయ్
అరవై రెండు అందలాలున్నయ్
డెబ్బైరెండు గ్రామాలున్నయ్
మనకేమి తక్కువ లేదు
మన సాటి దొరలు లేరు
నన్ను గూడి రాజ్యము లేలూ
నీవు నేను కూడితిమంటే
ఓ ధొరా నాగప్పా మన కెదుర్లు లేద్దూ-

2\. వ. అని చెప్పేవరకు బొందిలో దేమి జేసె కదా
కొత్తాకుండా దెచ్చి
కుండాకు జాది యేసి
నాగిరెడ్డి పేరు జెప్పి
మట్టితో బొమ్మను జేసె
ఇనప మొలలతోను
గారామ.ండ్లతోను
బొమ్మాకు నాటిండు
వహ్వారె బొందిలోడూ...తం...

3\. కాపుల గురువులు మోయిన వాళ్లు
దొరవారికి నిమాళము గట్టిరీ

వచ. జమ్ములకాడ, నాగిరెడ్డి గోరికాడ, మందీ మార్బలము, సిద్దులు అరబ్బీలు నేడు ప్రధానీలూ కాపులు పాలిగాళ్లూ అందరూ దొర నిమాళ మెత్తుకొనిరి.
కచ్చకాయ బాణాలూ
కానా దివిటీలూ
వెన్నెల మణుగులూ
దీన్ బాజాలతోనూ
ఆరంబాజీలతోనూ
దొరవార్ని సమాధి లోపల దింపిరీ
నోట్ల లింగం బెట్టిరీ
దోసిల్ల ఉప్పు బోసిరీ
ఎయ్యారు మందీ జూడగా
దొరవార్ని సమాధీ జేసిరీ—...తం...

## 38. అనంతరెడ్డి కథ

1\. కృష్ణాజిల్లా లోపలా మాతదక గ్రామములోనా
వారు కులాన్న కమ్మోరు
ఎంకట నర్సిమ్మ కొడుకుల్లు

తిరుమలయ్య, తమ్ముడు గోపిరెడ్డి
తిరుమలయ్యకు జష్టరాత రాసిండు బగమంతుడు
అన్నము లేకుంట ఒక పూట పస్తు ఒక పూట అన్నం.
తమ్ముని రాత అంశరాత
అన్న రాత జెష్టరాత-

2. ఏమమ్మా ప్రాణసఖి
నాకంటె తమ్ముడు భూమి ఎక్కువ దీసుకోలేదు.
నా దెస తమ్మునికి రాదు
తమ్ముని దెస నాకు రాదు
వాడి కన్నం ఉందని మన మేడవ్వద్దు
మన కర్మ మనం అనుబగించాలె
వాడలు బండ్లవు, బండ్లు వాడలవు
కొన్నాళ్ళు వెన్నెల కొన్నాళ్ళు చీకటి
మరదల్నిగాని తమ్మున్ని గాని
పదిమానికెలు ఇయ్యమని గడప దొక్కద్దు
కానోని కాల్లు బట్టుకోవాలె గాని
అయినోని అంచుకు బోవద్దు-

3. శుక్రవారంనాడు నిండమావాస్యనాడు
తిరుమలయ్య నిండనీళ్ళు బోసుకోని
నాలుగు కోళ్ళ మంచం మీద బండుకొనె
పెనిమిటి పాదాల కాడ గూసొని
అన్నంలేని రంగమ్మ వలపోయుచుండె
పసిబిడ్డ పాలు జీకని యాళ
బసవ దేవుడు గడ్డి గొరకని యాళ
ఊరంత మాటు మణిగిన యాళ
అమ్మవారి సోకము పార్వతీదేవికి మాలిమాయె-

4. నీవు పుట్టిన రెండేళ్ళలో మీ అమ్మ రంగమ్మ
మేడలు మిద్దెలు కట్టును

మూడేళ్ళలోపల నాగులకు మెచ్చుల కిచ్చును
గింజమర్ల బడును
డబ్బు మర్ల బడును
నీ చదువు మహాగొప్ప చదువు
నీ చదువు మెచ్చి సర్కారు జాగీర్లు ఇవ్వగలరు-

5. అనంత రెడ్డి పుట్టటము
గోపిరెడ్డికి దరిద్రము వచ్చుటము
అన్నము లేక గోపిరెడ్డి అల్లాడుచుండె
కొడుకులు బిడ్డలు గూడా
అన్నము లేక అల్లాడుతారు
గోపిరెడ్డి కొడుకు చంద్రారెడ్డి
ఓ నాయన, ఈ దుర్దశ ఎక్కడనుంచి వచ్చెమనకు
ఎటుపోయె మన ధనధాన్యాలు
కొడుక వో చంద్రారెడ్డి
అన్న కొడుకు అనంతరెడ్డి పుట్టటము
మనకు దరిద్రము వచ్చుటము
అతన్నే విధము నయినా
మనము యమపురి కంపితే
మన సంసారము బాగు పడును-

## V

## 39. నరసింహావతారము

1. అడగబోయి యిలనార్జ అడ్డు లేకుండా
సూరక త్తులతోను సూటిగా పొడిచినా
నాటకుండా వరము నాకు దయచెయ్యి
కోడుక త్తులతోను గొంతుకలు కోసినా
అందు చావులు లేని వరము తనకియ్యి

2. సంకల పుస్తకము జ్జరునే వీసెను
మునుగోల్ల పుస్తకం ముడులిప్పినాడు

అన్ని వేల్లను రేకు లమరు కున్నాడు
ఏద పుస్తకాలు ఎంచి చూచేను
ఎందుల్ల ఇలనార్జుకు చావులే లేవు.

40. వరహావతారము

సిగురు చింతలకాడ చిటు కొలము వెట్టి
కమసార్ల పిలిపించి కపట మెత్తించి
నేరాడి పండొంటి సీలాలు బోసి
ఉల్లి తెరొంటిదే ఊకపై బోసి
నిమ్మ పండూ చాయ నిప్పు లేసేను
బారు తిత్తుల జోడు బోరు కలిపేను
కొలిసి తూముడు ఇనుము కొలుములో బోసి
కొలక తూముడు ఇనుము కొలుములో బోసి
ఊదేరు తిత్తులు ఉరుములను బోలు
తూలేటి నిప్పులు చిన్నాలు బోలు
ఎగిరేటి నిప్పులు బాసికలు బోలు
కుతకుతని ఆ యినుము కదిలి ఉడికింది.

41. విష్ణుమవతారము

1. ఉగమూను జగమూను పుట్టకా ముందలా
ఆది సత్తవతార మెత్తి నానమ్మ
నిరాకారము సత్తి నిలిపి నానమ్మ
పోతుగాలే తగిలి పొలవు బారేనూ
పట్టు పెడదామంటె వృక్షాలు లేవు
ఒంద చేదామంటె కొండలే లేవు
ఒక రెక్క చెట్టార్చి ఒక రెక్క పట్టార్చి
మూడుగుడ్లెట్టింది ములహరుడు సత్తి
కాలు దగిలొక గుడ్డు కల్లి పోయింది
ఆకలే సొక గుడ్డు అనుభగించేను

ఒంటి గుడ్డూ మీద వరన మాయిందీ
ముక్కుతో మూణ్ణెల్లు గూడు నడిపింది
పాకానికొచ్చింది పగిలినా గుడ్డు
కింద పెక్కురి బోయి భూదేవతాయె
మీద పెక్కురి పోయి ఆకాశమాయె
అందులోపుల్లోట మము గన్న తల్లి
చూడ చక్కని రాజులాయి పుట్టేరు
ఇష్ణుమ యిలబ్రహ్మ యీశ్వరుడు ముగ్గురు
సత్యముగ జన్మించె సత్తి గర్భమున.

## 42. మచ్చావతారము

1. గోవు జంపిన గొప్ప దోష మన్నాడు
గోవు జంపిన పాప మేరీతి బాసు
స్తానాని కిల బ్రెహ్మ తలుపు దీసేనూ
కాయ వస్త్రారాలు గట్టుకున్నాడు
అంగవస్త్రారాలు పట్టుకున్నాడు
చావును పుట్టుగా చదివేటి వేదాలు
బ్రెమ్మాండ వేదాలు చెవుకు దరియించె
చేత జాడీ చెంబు పట్టుకున్నాడు
కాశి స్తానానికే కదిలేను బ్రహ్మ
ఇలపాల సముద్రాల జలదొడ్డి కొచ్చి
ఇసక కుప్పా దోసి బ్రహ్మ దేవుండు
కుప్ప మీద చెంబు కుదురుగా నిలిపి
చెంబుపై ఏదాలు చేరేసినాడు.

—: ం :—

# జానపదుల వాడుకలో నున్న
# పద సమూహము

అంకోళ్ళు–రికాబులు
అంగడి పనులు–బజారు పనులు
అంగడిగాయు–వ్యాపారము చేయు
అంగనాల బావి–పైన కప్పు గలిగి అంగణమున నెలకొన్న బావి
అంగనాల బిందె–కలశ విశేషము
అంగవస్త్రము–మొలగుడ్డ
అంగ్రీజు–ఇంగ్లీషు
అంచకల్లు–తీపికల్లు
అంచుకు–సమీపమునకు
అంజన కావు–కాటుక
అండీలు–పెద్దపాత్రలు
అండ్ల–అందులో
అండ్లము–అందము, గుడ్డు
అంతఃకరణ–ప్రేమ, అపేక్ష
అంతరాలు–భేదాలు
అండరి సందున–అందరి మధ్య
అంబుల తరషి–అంబుల పొది
అంశరాత–అదృష్ట జాతకము
అక్కర–అపేక్ష
అక్కరగు–అవసరమగు
అక్కరయుండు–అవసరమువచ్చు
అఖండం–నిర్విరామముగా వెలుగు దీపము
అగనైన పగనైన–ఏదో విధముగా
అగాను–నేలమాళిగ
అగ్గిదాకు–వడదగులు
అగు–మరణించు
అగుడుబడు–నిందమోయు
అగుభుగులు–తత్తరపాటు
అఘోరము–ఘోరము
అచ్చగిల్లలు–అచ్చనగాయలు
అచ్చపాత్ర–అక్షయపాత్ర
అచ్చివచ్చు–సరిపడు
అటకలి–సున్నిపిండి
అటకరి–గొఱ్ఱెల గాచువాఁడు
అటకాదీయు–నలుగువెట్టు
అటకాయించు–అడ్డు
అటికాసి–అటువైపు
అడలిక బడలిక–శ్రమ
అడ్డకత్తెలు–ఆయుధ విశేషములు
అడివార–దేవాలయావరణము

అడ్డిగ-ఆభరణ విశేషము
అరుకుబడియగు-కలసిపోవు
అదలాయించు-అదలించు
అద్ధమరాత్రి-అర్ధరాత్రి
అద్దరించు-గగ్గోలుపడు
అద్దాల బరిణె-మూతమీద అద్దము బిగించబడిన బరిణె
అద్దాల రవికె-అద్దపు బిళ్లలు తాపిన రవికె.
అదురు కుదురు-భేరీ మ్రోగు విధమున భేదము.
అదురు గుండె-పిరికి గుండె
అనంత గంటీలు-ఆభరణ విశేషము
అనలు తొనలు వేయు-చిగుర్చు, కొనసాగు.
అన్నచలి పందిరి-అన్న సత్రము
అన్నమ్మ శోకాలు-దీర్ఘ శోకాలు
అన్నవమనములు-వాంతులు
అన్న సత్తర-అన్న సత్రము
అన్న సలీంద్ర-అన్న సత్రము
అనుబగించు-అనుభవించు
అన్నైకరి-దోషకారి
అన్యకారి-దోషకారి
అప్ప-అక్క
అప్పణ-అర్పణ
అప్పనజేయు-అర్పించు
అబద్ధీకుఁడు-నమ్మదగనివాఁడు
అబ్బిలి-ఔడు
అమరిక-చాకచక్యము

అమళాలు-ఉసిరికాయలు
అమాని చేయు-విచారణ చేయు
అములగు-వశమగు
అమృత పడి-స్వయంపాకము
అయగాండ్లు-అయ్యవార్లు,
అయ్యలుగాడు -కోమటివాని చేతిక్రింది పనివాఁడు
అయితారము-ఆదివారము
అయితుపడు-ఒనగూడు
అయినోడు-దగ్గరి బంధువు
అయిబు-సాక్ష్యము
అరకలి-సందేహము
అరప-ముదుసలి
అరపోటు-చేతిపోటు
అరలేకుండ-కొఱత లేకుండ
అరవణం-కానుక, కట్నము
అరవాయిగొను-సందేహించు
అర్జిల పొట్ట-పొత్తికడుపు
అర్ధణాల గంట-ఘంటికా విశేషము.
అర్ధనాగు-ఒకటికి సగము చొప్పుననిచ్చు వడ్డీ (ధాన్య రూపమున)
అర్ధనారి జల్లు-అర్ధనాల జల్లు
అర్ధనాల జల్లు - చామర విశేషము
ఆర్జా - గది,
అర్కారులు - భటులు, ప్రభుత్వోద్యోగులు
అరికతు చేయు - అడ్డగించు
అరిగెల జోళ్లు - డాళ్ళజంట
అరితి పూసలు - నల్లపూసలు

అర్తి నిండ - మెడనిండ
అరుకతు - శక్తి
అర్చుకొను - సమాచార గ్రహణము చేయు.
అలంగారము - బురుజు
అలంగాలు - బురుజులు
అలతేరు - దుఃఖించు
అల్ల తల్లడము - అల్లకల్లోలము
అల్ల పల్లడ జేయు - చిందఱవందఱ చేయు.
అలిమి బలిమి - శక్తి యుక్తులు
అలికిడి - చప్పుడు
అలుగు బండలు - చెఱువు అలుగులకు దాపిన బండలు.
అవగుణముసోకు - దిష్టితాకు
అవశకునము - అపశకునము
అవాదీకము - తిట్టు, దూఱు
అవ్వాయి సువ్వలు - బాణా సంచా
అవిటి - వాని
అవిరేడి గూనలు - ఐరేణి కుండలు
అవుగల్యము - మురికి
అవుటి తమగము - ఓటి తమకము
అవుదా - హవుదా
అవురాతిరి - అపరాత్రి
అవుశకునము - అపశకునము
అవుసత్యము - అసత్యము
అశరీరి - అకాశవాణి
అశ్వ పెట్టె - మంగలివాని తోలుపెట్టి, పొది;
అశ్వావులు - కొలిమి తిత్తి, అశ్వతిత్తి (తోలుది)
ఆసరబ్బీలు - అష్రఫీలు, బంగారు నాణెములు
అసర సందర వేళ - సాయం సంధ్య
అస్తమానపు వేళ - సాయంత్రము
అస్తమానమూ - ఎల్లప్పుడు
అష్లన - ఒక్కుమ్మడి

ఆ

ఆకలింపగు - తెలిసి వచ్చు
ఆకలి దూపలు - ఆకలి దప్పికలు
ఆకు వడ్డాణము - క్రిందివైపు గజ్జల కూర్పులేని వడ్డాణము
ఆగమగు—చెడిపోవు
ఆగవేగిరాన-శీఘ్రముగా
ఆగారము-ఆహారము
ఆగించు—ఆపు
ఆగు-ఆపు
ఆజూబాజూ-ప్రక్క ప్రక్కన
ఆటకూటములు-క్రీడాస్థానములు
ఆటుపోటు-బాధయందలి హెచ్చుతగ్గులు
ఆడకట్టు-ఆడురూపు
ఆడచినదాయి-ఆడపిల్ల
ఆడపాపలు-బానిసకత్తెలు
ఆడబాల-ఆడపిల్ల
ఆడరు-అజ్ఞ
ఆడికలు-నిందలు
ఆడిది-భార్య
అడిబాప-బానిసకత్తె

ఆది–జ్ఞాపకము
ఆదుకొను–చేరువగు, సమీపించు
ఆధారము–విభూతి
అనుగంపుకాయ–సొరకాయ
ఆనుపీట–అనుకొనటకై గోడకుచేర్చిన పీట
ఆనుమాల – గుర్తు
ఆనువాల – గుర్తు
ఆపతి – ఆపద, కష్టము
ఆపుజేయు – అడ్డగించు
ఆబాదు పన్లు – చిల్లర పనులు
ఆముకొను – క్రొవ్వు
ఆరం – ఆహారము
ఆరతి పల్లికి – హారతి పళ్ళెము
ఆరుండం – అరణ్యం
ఆర్చు – నాశనము చేయు
ఆరెవాండ్లు – మరాఠీలు
ఆలగోడు బాలగోడు – గందరగోళము
ఆల జాలము – ఎగతాళి, మేలము
ఆవ జీవాలు – పంచప్రాణములు
ఆవతిన – ఆ వంతున, అంత
ఆవతి బోయు – కుంభము పోయు
ఆవపూ గద్దె – ఒకరకపు గద్దె
ఆవుసలు – ఆయుష్యము
ఆసర – సహాయము
ఆసాయశూరుడు – అసహాయశూరుడు
ఆసాలు – వాసములు
ఆస్థాన బెత్తము– హోదాను సూచించు కఱ్ఱ.
ఆసుగొట్టం – మగ్గమునందు ఆసుదిరుగు గొట్టము.

ఇ

ఇంగలం – నిప్పు
ఇంజామణి – వింజామర
ఇంటితనం – యాజమాన్యం
ఇంటి దీపం – మగ పిల్లవాఁడు
ఇగ్గోళ పుట్ట – ఎక్కువ కోమలు గల పెద్ద పుట్ట
ఇచ్చలు గొను – మనసుపడు
ఇజ్జోడుపడు – కూడఁబడు
ఇడిమిచ్చు – తాంబూలము నిచ్చు
ఇడెంబెట్టు – ప్రధానము చేసికొను
ఇనుప జీరాలు – ఇనుప కవచములు
ఇరువర్లు – రెండు వైపులవారు
ఇల్లటం – ఇల్లరికము
ఇల్లిటం – ఇల్లటము
ఇల్లువరుస – ఇంటి పద్ధతి
ఇల్లు చేసుకొను – వివాహమాడు
ఇల్లెం పొద – ఇలివెంద పొద
ఇష్టత – ఇష్టము.

ఈ

ఈడు – ఈడ్చు
ఈతబొండు – ఈతమ్రాను
ఈదులు – ఈతచెట్లతోపు
ఈదెవేయు – నీటిలోతు కొలుచుటకు ఈతబొండును నిలుపు
ఈష్టి ఉండలు – విభూతి ఉండలు
ఈ మీదు – ఈ పైన

ఈరదాడు-వీరత్రాడు
ఈలపీట-కత్తిపీట

ఉ

ఉంద్రకంప—ఒకరకపు ముళ్లకంప
ఉక్కళము-గట్టిది, దృఢమైనది
ఉక్కెస-దగ్గు, ఉబ్బసము
ఉగము-యుగము
ఉగ్గోళ్లు—ఉక్కుగోళ్లు
ఉడాను-జీను
ఉడ్డాడు-తత్తరపడు
ఉతకాలు-ఉదకములు
ఉత్తండాల పేరు-హారవిశేషము
ఉత్తది కాదు-గర్భవతి
ఉత్తరపు టిల్లు-నలుగురు కూర్చుండు చావడి
ఉత్కలాడు-ప్రసవించు
ఉద్ది-ఉజ్జీ
ఉదురు బిదురు-ఆదరాబాదరా
ఉద్దెర కష్టం-వెట్టి చాకిరి
ఉన్నికంకణం-ఉన్నితోరము
ఉప్పెన-సముద్రపు పొంగు
ఉమ్మదము-ఎండవేడిమి వలన చెమట పోయు స్థితి
ఉమాయి పిట్ట—గుజ్జుపు జీను
ఉమాయిపిట్టి- ,,
ఉమాయి పెట్టి- ,,
ఉరుదాళ్ళు—పశువులను కట్టుటకు పేనిన త్రాళ్ళు
ఉరువులు-బిళ్లలు
ఉరువులు దిగు-బిళ్ళలు గట్టు
ఉరిచిక్కము
ఉరికట్టు-పాలుపిదుకునపుడు పశువుల కాలికి వేయు బంధము
ఉలాయలు-కానుకలు
ఉల్పాయలు-కానుకలు
ఉల్పాలు-ఉల్పాయలు
ఉల్లిత్తు-ఒంటరి
ఉల్లెడ-దైవము, కలశము, పెండ్లికొడుకు మొదలగు వానితో ఊరేగునపుడు పైన నాలుగు కొనలును బట్టిన వస్త్రము.

ఊ

ఊకించి తన్ను-జాడించి తన్ను
ఊదకోత-చేనుకోసినట్లుగా దేనినేని నాశనము చేయుట.
ఊడిగంబుల వారు-సేవకులు
ఊతకోల-చేతి కఱ్ఱ
ఊబసన్నాలు-ధాన్యవిశేషము
ఊరజంగులు-ఒక్కడు కాను ఊరి పశువుల మంద
ఊర్పిళ్లు-నూర్పిళ్లు
ఊష్టం-జ్వరము
ఊసు వేయు-చాడీలు చెప్పు
ఊసెట్టు-ఊసు వేయు

ఋ

ఋణము విప్పు-వివాహము చేయు

ఎ

ఎంట్కలు-వెంట్రుకలు
ఎండ్లు-వెన్నులు
ఎకసక్కియములు-ఎగతాళిమాటలు
ఎకా కయ్యము-ఎక్కటి కయ్యము
ఎక్కులుపెట్టు-నేర్పిపెట్టు,కొండెములు చెప్పు.
ఎగ్గరించు-ధిక్కరించు
ఎచ్చుతవ్వలు-హెచ్చు తగ్గులు
ఎటికాసి-ఎటువైపు
ఎడంలేదు-వ్యవధి లేదు
ఎడపెట్టు-బలియిచ్చు
ఎడలు-నైవేద్యము, బలి
ఎడా సందులు-ఎడములు
ఎడె-చెదపురుగులు
ఎత్తగొట్టు-చెడగొట్టు
ఎత్తించు-శవమును స్మశానమునకు తర్లించు.
ఎత్తుగడచేయు-మొదలెత్తు
ఎత్తుడు కోడి-కుక్కుట క్రీడయందలి పరిభాష.
ఎత్తుబళ్లు-దహన కర్మకై శవమును లేపుట.
ఎత్తులు-పూలదండలు
ఎదురు బిచ్చం-కాన్పించినవాని నడుగు కొనుట.
ఎదురు బేటి-ఎదుర్కొలు
ఎదురు మసలు-ఎదురు తిరుగు
ఎదురు సేస-ఎదురుకోలు
ఎదె-చెదపురుగు
ఎద్దుకాలి బొమ్మ-ఎద్దుకాలికి గట్టు శత్రువు బొమ్మ
ఎద్దుల మాలు-పశువులశాల, గోష్ఠము
ఎనకసిరి-తరువాత
ఎనుగట్లు-ఇంటినడికొప్పున నా చివఱ నుండి యీ చివఱకు దాపిన కట్లు
ఎన్నెరాళ్లు-ఏనెరాళ్లు
ఎమ్మెలు-సొగసులు
ఎరకల పోతు-మగపక్షి
ఎర్కలేదు-తెలియదు
ఎరువు-దోషము, లోపము
ఎయవు సంపద-తనది కాని సిరి
ఎఱ్ఱగొల్లలు-గొల్లలలో నొక యుపజాతి
ఎఱ్ఱతోలు కూర-దున్న మాంసము
ఎఱ్ఱమారమ్మ పదవులు-ఎఱ్ఱమారెమ్మను కొలిచి పొందు క్షుద్ర శక్తులు
ఎలగోలు దళము-సేనాముఖమున నున్న దళము
ఎలగోలు ప్రజ-ముందున్న జనము
ఎలవ-విలువ
ఎలబోవు-పెండ్లాడు
ఎలాం-వెడల్పు
ఎలితె బొంగులు-వెదురు గడలు
ఎలుగట్టు-పాదుచేయు
ఎలుగు చెడు-నోరు పడిపోవు (తిట్టు)
ఎల్లెంతల-వెల్లకింతలుగ

ఏ

ఏక ధూపహారతి - అఖండ హారతి

ఏక బాణము నోము-వ్రత విశేషము
ఏక బారు-ఒకే వరుస
ఏకరి వాండ్లు-ఒక రకముసంచార జాతి
ఏకాంగి జగడము-ఎక్కటి కయ్యము
ఏకాంగి మూక-ఏకవీర సముదాయము
ఏకాంగులు-ఏక వీరులు
ఏకునారలు-ఏకులు
ఏడంత్రాలు-ఏడంతస్థులు
ఏడు వరసల సొమ్ము-ఏడు వారాల నగలు
ఏద-బాధ
ఏదస్తు-జ్ఞాపకము, గుర్తు
ఏదుం-(కొలత)
ఏనుగుమెట్లచావడి-అటు నిటు ఏనుగులు చెక్కి, కట్టిన మెట్లుగల-చావడి
ఏనెరాళ్లు-ఊరి పొలిమేరల నుండు రాతి గుట్టలు
ఏపులు-కుక్కలు
ఏపెలు-మద్దిచెట్లు
ఏరాలు-తోటికోడలు
ఏలిగుండ్లు-గోలి గుండ్లు
ఏలుట-అధికారము నెఱపుట
ఏల్పులోడు-పూజారి
ఏరాళ్ళు-ఐరేణి కుండలు

ఒ

ఒంజరాలు-మత్స్య విశేషము
ఒంటి వల్లె-ఏకవస్త్రము
ఒంటి నలుసు-ఏక సంతానము
ఒంపు-పల్లము
ఒండ-బురద
ఒకమలక-ఒక్కసారి
ఒక్కతాన-ఒకచోట
ఒగిచెడు-గతిదప్పు
ఒగ్గు-ముదుసలి
ఒచ్చెములు-లోపములు
ఒట్టుదిను-ప్రమాణముచేయు
ఒడిమెలు-సంపదలు
ఒడిపించు-పొడిపించు
ఒడిబాల-ఒడిగంటి బియ్యము
ఒడ్డియాణము-వడ్డాణము, కటి బంధ విశేషము
ఒడ్డుకాడు-ప్రాకులాడు
ఒత్తగించు-ఉత్తరించు, దాటు, ఆవలకు త్రోయు
ఒప్పలు-దొప్పలు
ఒయ్య-మెల్లగా
ఒరదోలు-వారు, తోలు
ఒరలు-వర్లు,వాచాలమగు
ఒరుగాలు-వంచినకాలు
ఒరుగు-వంక. తప్పు
ఒరుగునడక-వంగి నడచుట
ఒరుచు-కడుగు
ఒరుపులు-కష్టములు
ఒరుసు-రుద్దికడుగు
ఒత్తిపొక్క-నేలయందు బీటలు విచ్చగా నేర్పడిన రంధ్రము
ఒత్తెలు-బీటలు

ఒలిగింజలు—కళ్ళము నూర్చిన వెనుక ప్రోగు చేయు గింజలు

ఓ

ఓకిలింతల కట్టు—వాంతులు చేసికొనెడి కట్టు

ఓజు—కంసాలి

ఓడోరగము—ఒడ్డోలగము—నిండుసభ

ఓదెపలుపు—ఓదెలు కట్టు త్రాడు

ఓపలేని మనిషి—గర్భవతి

ఓరకొప్పులు—చెవిమీద వేయు కొప్పులు

ఓరణములు—వరుసలు, చాళ్ళు

ఓల—స్నానమాడుచు చేయు శబ్దము

ఓలిమాడలు—పెండ్లి కొడుకు పెండ్లి కూతునకిచ్చు ద్రవ్యము

ఔ

ఔషధక్రియలు—చెట్టు క్రియలు

క

కంకటిల్లు—దుఃఖించు

కంచల—అవికె

కంచుగొట్టు—తప్పెట వాయించు

కంచె—పశువుల కుద్దేశింపబడిన గడ్డిబీడు

కంచెగడ్డి—కంచెయందలి గడ్డి

కంజు—కొరడా

కంటకాలాడు—తిట్టు, దూషించు

కంట్లపుకోడె—గోనె సంచులు మోయు కోడె

కంట్ల పెద్దులు—కంట్లములు మోసెడి యెద్దులు

కంఠకము—గంటము

కంఠసరములు—హారములు

కండకావరము—పొగరు

కందువ—ఉనికిపట్టు

కంపటము లోడుకు—కంపించు

కంబార్లు—కూలీలు

కంపినీ కాయిదా—తెల్లదొరల కట్టడి

కక్కసము—క్రోధము

కక్కసాలాడు—దూషించు

కక్కుల కళ్లెం—కాకలుగల కళ్ళెము

కచపాల—కషపాల

కట్టడినిచ్చు—ఆజ్ఞ యిచ్చు

కటారి—కత్తి

కట్టాణి—స్వచ్ఛము

కట్టాయత్తపడు—సిద్ధమగు

కటికీలు—కటికవాండ్రు

కట్టు— ఎదుటిమనుష్యుని వశము చేసికొను విద్య

కట్టు బోతుల విద్య — క్షుద్రవిద్య

కట్టుమట్టు— ఆలానము

కట్టుముట్టు—కట్టుగొయ్య

కట్టుమోతులు—క్షుద్రవిద్య తెలిసినవారు

కడతేరు—పెరుగు, పెద్దయగు

కడదొంతి— చివరి వరుస

కడలు బాయు— ముట్టగు

కడి— ముద్ద

కడిపెడు బిడ్డలు— చాలినంత సంతానము

కడుదూప- మిక్కిలి దాహము
కడుపు పొంగు బాధ - బయటికి వెళ్ళవలసిన యవసరము
కణికెడు-ముద్దెడు
కత్తి ప్రతిజ్ఞ-కత్తిపై చేయు బాస
కత్తుల కళ్లెం-కక్కుల కళ్లెము.
కత్తుల వడ్డాణం- కత్తులతో కూర్చిన కటిబంధ విశేషము
కనక దేరాలు- పెద్దదేరాలు
కనక తప్పెట్లు - పెద్ద తప్పెట్లు
కనక నివాళి- శ్రేష్ఠమగు నివాళి
కనక మేడలు- శ్రేష్ఠమగు మేడలు
కనక వస్తువులు- మంచి వస్తువులు
కన్నబోవు- దొంగిలింపబడు
కనుగలిగి తిరుగు- పరికించి తిరుగు
కనుదృష్టి- చూపు
కన్నుగల్గి - పరిశీలించి,
కన్నెకయ్యము- మొదటి యుద్ధము
కప్పురము- పాదె
కపిరెలు- కొప్పెరలు
కప్పెర- కొప్పెర
కబ్జు- కొరడా
కమటము- అగసాలెవాని కుంపటి
కమతము- కమ్మరి కొలిమి
కమతము- వ్యవసాయము
కమసర్లు- కంసాలివాండ్రు
కమ్మచ్చులు- కంసాలి కడనుండు తీగలాగు పనిముట్టు
కమ్మలు-పేజీలు
కమాలు- చాతుర్యము
కమ్ముకొను-మూయు
కమ్ముడ-కంబడి
కరకంచు చీర- అంచులద్దిన చీర
కరకుల బిందెలు-నాణెములు నింపిన బిందెలు
కరచూరి ఆయుధములు- కత్తులు
కరపట్నములు- పన్నువసూలగు నూళ్లు
కరలంద- మాదిగవాని కడనుండు తోలు గోలెము
కరణము- కన్నము
కర్ణపువ్వులు- కమ్మలు
కర్ణపుష్పములు- కమ్మలు
కర్ణకోల- చెర్నకోల
కరాటం- బరిణె
కరాళించి దూకు- కుప్పించిదూకు
కర్మి- దుష్టుడు
కరువ- అచ్చు
కరువునాకు- కరువునబడు
కరువుబడివచ్చు- క్షామమనుభవించు
కలంపుల్ల- పేనా.
కలపనమగు- ఎదుర్కొను
కలపనగంప- కలగూరగంప
కల్లంతలు- గల్లంతులు
కల్పకట్టె- వంటచెఱకు
కల్యాణరేకు- శుభలేఖ
కళికితురాయి- శిరోభూషావిశేషము

కలిసీళ్ళు- ఒక్క పొంగు వచ్చిన వెనుక నుడుకుచున్న బియ్యమునుండి తీసి దిన దినము చేర్చుచు పులియ బెట్టిన నీరు
కలియగడ్డము- చిఱుగడ్డము
కలివర్ణం- మట్టిరంగు
కల్లిపోవు- విఱిగిపోవు, క్రగ్గిపోవు
కల్మిజల్లు- కలిజల్లు
కలుకోడి- శ్రేష్ఠమగుకోడి
కలుపవచ్చు- కలుపు దీయవచ్చు
కలువార- కలుపుదీయు సాధనము
కల్లుపడు- మాన్పడు, చేష్టలుదక్కు
కవగొను- జంటకూడు
కవళము-ముద్ద
కవ్వ-గవ్వ
కవ్వళ్లు-మత్స్య విశేషము
కపిలెకట్టు-మాట్లాడుట చాలించు
కపులావుల-కపిలగోవులు
కశంద రుమాల-కుట్టుపనిచేసిన గుడ్డ
కశిందరవికె-కుట్టుపని చేసిన రవికె
కశినికోత-అంపపుకోత
కష్టబాధలు-కష్టములు
కష్టార్థం-శ్రమఫలము
కసరు పొట్ట-పొత్తిపొట్ట
కసువు-ధూళి
కళ్యము-కళ్ళెము
కళ్ళుతపసులగు-కళ్ళు పేలిపోవు
క్షత్రియగొడుగు-ఛత్రి

కాకరెక్క బియ్యం - ధాన్యవిశేషము
కాక - పదును
కాకి నెపములు - కాకి శకునములు
కాకిపారు - మీదనుండి కాకి పోవు
కాకిశోకము - అవిరళ దుఃఖము
కాకిసోమలు - మూర్ఛరోగము
కాగట - కౌగిట
కాజు - జీడిపప్పు
కాటార్లు - కటార్లు
కాపుదనము - అధికారము, ఊరి పెత్తందనము
కామాటీలు - కూలివాండ్రు
కాయలా - అనారోగ్యము
కాయ స్తరాలు - కాషాయవస్త్రములు
కాయిదం - కాగితం
కార చేపలు - మత్స్య విశేషము
కాలంకుడక- మరణించినపుడు శవము కడనుంచు ఎండుకొబ్బరి చిప్ప
కాలకు గూర్చొను - దొడ్డికి వెళ్లు
కాలతామసము - ఆలస్యము
కాలమగు - చనిపోవు
కాలారులు - పదాతులు
కాలిగగ్గెరలు - కాలికి బందములు
కాలిపరివారము - పదాతి బలము
కాలిబంధకము- కాలిసంకెళ్ళు; తమపై నాధారపడినవారు
కాలి మానిసులు - పదాతి బలము
కావిడి - కావడి
కావిధూళి - బగ్గుండ, బుక్కా

కావు - అగ్నికుండము
కావు పాతర - నేలమీద గొయ్యిదీసి వడ్లు మొదలగునవి దాచు పాతర
కావురు - ఎఱ్ఱదనము
కావు గప్పు - పొగ గ్రమ్ము
కావురు గమ్ము - పొగ బారు
కాశి - దగ్గు, కాసె
కాశి సన్నాలు - ధాన్య విశేషము
కాష్టం జేయు - దహనము చేయు
కాసా కోళ్ళు - సొంతకోళ్ళు
కాసులపేరు - హార విశేషము, కాసుల దండ
కాసెపాత - గోచి గుడ్డ
కాసెబోయు - గోచిపోయు
కాహళ - సన్నాయి
కాశెలు - సన్నాయిలు
కించిత్తు చేయక - చులకన చేయక
కిస్తీ - వాయిదా
కీకారుండము - కీకారణ్యము
కీలశ్వము - కీలు గుఱ్ఱము
కీలారి బళ్లు - కుల్లారిబండ్లు
కీలు కత్తి - మరకత్తి

కుంకుమబండ్లు - కుంకుమను దైవ సన్నిధికి కొనిపోవు బండ్లు
కుంకుమ బిర్ద - కుంకుమ బరిణె
కుంకుదేళ్లు - కూకటి వేళ్ళు
కుంగవేళ్ళు - కూకటి వేళ్ళు
కుంచ కత్తెలు - చామర గ్రాహిణులు

కుంచ విసురు - వీవన వీచు
కుంచెలవారు - చామరగ్రాహులు
కుంటిండ్లు - కుంటెండ్లు
కుంటి నడపలు - కుంటి నడకలు
కుంటెండ్లు - కర్ణ భూషణములు
కుంటెన కుచ్చులు - ఆభరణ విశేషము

కుందేటి యెర్లు - రోగవిశేషము
కుంపిణీకోటలు - కంపెనీవారి కోటలు
కుంపిణీ దురాయి - కంపెనీ కట్టడి
కుంభ జడ - నడినెత్తిన వేయుజడ
కుచ్చు చెంగు - కుచ్చిలి చెంగు
కుటుకుటు ప్రాణము - కొనయూపిరి
కుడితి - బియ్యము కడిగిన నీరు
కుతిగంటు - కుత్తి గంటు
కుత్తి గంటు - కంఠాభరణము
కుదియు - కుదబడు
కుదురు - వంశము
కునుపు - చొప్పించు
కుప్పకోలంబులు - కుప్పి కోలలు
కుప్పడుగు - కుప్పకు క్రింది భాగమున నున్న ధాన్యము
కుప్పి కోలలు - ఆయుధ విశేషము
కుప్పెలు - జడకుచ్చులు
కుప్పెకోలలు - ఆయుధ విశేషము
కుప్పెన కుచ్చులు - జడకుచ్చులు
కుమ్మరాం - కుమ్మరావము
కుమ్మరిల్లు - కురియు
ఖుషార్ఖిలు - ఖిఛారించు, ఖుములు

కురచ మొక్కాలపీట- పొట్టి ముక్కాలి పీట
కురుకురు ప్రాణం- కొనయూపిరి
కురుచ గుంపు విల్లు- పొట్టి కణుపుల వెదురు విల్లు
కురచ బారిన కోడె- పొట్టి కోడె
కురుచయగు- కొఱబోవు
కురులు వెళ్లు-తలముణికి వదులు
కులకాయకం-కులవృత్తి
కులపగ-తరతరములనుండి నెలకొన్న పగ
కులవిద్య-వృత్తి విద్య
కుల్లా-టోపీ
కుల్లారి బండి-పైన కప్పులేక చుట్టును కంబళము చుట్టబడిన బండి
కుశాలుగుండు- సంతోషముగానుండు
కుసుమరుమాల-పూలు కుట్టిన గుడ్డ
కూచిదార-యుద్ధారంభమున నూదుబాకా
కూటమాడు-సంభోగించు
కూటలు-ఉనికి పట్లు
కూటిరఝాము-మధ్యాహ్నము
కూటువ-గుంపు
కూటువ మూక-బలవంతముగా యుద్ధమున చేర్చిన మూక
కూనలు-మసూచికము
కృష్ణప్రయాగలు-ధాన్యవిశేషము
కేకరించు-గద్దించు
కేడెలు-డాళ్లు
కేపు-దూధ

కైకిలి-కూలి
కైగట్టు-కవిత్వము చెప్పు
కైపూర్ణం-వస్త్రము
కైముళ్లు-వాద్యవిశేషము-తాళములు
కైలాస పైనాలు-మరణము
కైవరులు-కవివరులు
కైవార స్తంబాలు-ధ్వజస్తంభములు
కైవాల్చు-ఒంచు, ఒరిగించు
కైవ్రాలు-ఒరుగు
కొంకి కత్తి-కొడవలి
కొంగవాల్ కత్తి-వంకర కత్తి
కొంగు బట్టు-సంభోగించు
కొంచబోవు-కొనిపోవు
కొండకెక్కు-(దీపము) ఆరిపోవు
కొజ్జాయిళ్లు-చుట్టును వసారా దించిన యిళ్లు
కొట్నాల పాటలు-వివాహమునకు ముందు వడ్లు దంచుచు, పాడెడు పాటలు
కొట్టిడి-కొట్టు, గది
కొడకత్తులు_కొడవళ్లు
కొడికత్తులు-కొడవళ్లు
కొడి స్తంభం-తెఱచాపకొయ్య
కొడువండ్లు-కొడవళ్లు
కొణపం-త్రాడు
కొత్తడములు-బురుజులు
కొత్తళము-బురుజులు

కొత్తపంట అన్నము-తొలిపంట బోనము
కొదువచేయు-తక్కువ చేయు
కొన్నవారు-అత్తవారు
కొప్పరించు-విజృంభించు
కొప్పు సవరాలు-వెంట్రుకలతోచేసిన సవరములు
కొప్పెర్లు-పాత్ర విశేషము
కొబ్బరసొప్ప-ఎండు కొబ్బరి
కొమరకాటుక-శ్రేష్టమైన కాటుక
కొమాండ్లు-కుమారులు
కొమ్ములు-కొమ్మవాద్యములు
కొరముట్లు-పనిముట్లు
కొత్తిపోట్లు-బల్లెపుపోట్లు
కొత్తి వీరుడు-కొఱతఁబడి వీరుఁడై నెగడినవాఁడు
కొరుడు-ధ్వజము
కొలపట్టు-కొలుచు
కొల్ల-కొలను
కొల్లటబోవు-కొల్లబోవు
కొల్లదంతు-దోపిడిదండు
కొలికి-వింటికొన, కంటి చివర
కొలిపిడి-కొలుపు
కొలుపవధరించు-కొలువు దీర్చు
కొలువుకు వచ్చు-సముఖమునకువచ్చు
కొలువు దీరు-సభచేయు
కొసబావిలీలు-కర్ణభూషావిశేషము
కొళ్లబెట్టు-దోపిడిచేయు
కొళ్ళారిబండ్లు-ఖుల్లారి బండ్లు
కొళ్లగాల్చిన జాబు-సీలువేసిన లేఖలు
కోటదట్టము-కోటబలము
కోట పుట్టలు-కోటగోడకు బయటివైపున నానించి కట్టిన మట్టి గోడలు
కోటబొమ్మంచు చీర-కోటగోడలపై భాగముయొక్క ఆకారమును బోలిన యద్దకపుటంచు చీరలు
కోడంద్రకము-కోడలిని పెట్టు బాధలు
కోడికట్టు-కోడి మెదడుతోచేయు వైద్యము
కోడి మేడెము-కోడిపోరు, కోడి పందెములు
కోణం బెట్టు-బందకొయ్యవేయు
కోణం మొద్దు-బందకొయ్య
కోన మాటలు-అల్పపు మాటలు
కోనేల్లు-మత్స్యవిశేషము
కోపులు-బాణములు
కోమ- పుట్టకలుగు
కోరసిగ- వంక కొప్పు
కోలకాడు- సేవకుడు, భటుడు
కోలపెట్లు- కఱ్ఱదెబ్బలు
కోలు- బహుమానము
కోలు పుచ్చుకొను- కొల్లగొట్టు
కోపరాలు- శత్రుబలమును అంచనా వేయుటకై పొంచి చూచు స్థలములు
కోపురాలు- డిటో
కౌసు- సీచు, మాంసము
కౌసుపిల్ల- పురిటికందు

ఖ

ఖండ తుండెములు– ముక్కలు
ఖామందుంచు–ఉంచుకొను
ఖాయిదు– కట్టడి
ఖుషాలుపడు– సంతోషపడు
ఖైదు బంగ్ల– జైలు

గ

గంగెర్లు– గంగవెట్టులు
గంట్లం– గంటము
గంటునొప్పి– కడుపునొప్పి
గండదివ్వెలు– అఖండములు
గండ దీపం– అఖండము
గండదోషం– గండమువలని దోషము
గండమాల– మెడచుట్టు కురుపులు లేచుట
గండరిల్లు– వాపోవు, విచారించు
గండిపెట్టు–చెఱువులోని నీరు పోవిడుచు
గంపసిడి– దేవతకు మ్రొక్కుకొన్న వారు పెద్ద దూలమున కమర్చిన గంపలోఁగూర్చుండి తిరుగు పద్ధతి
గజకోనలు– ఏనుగులుండు కోనలు
గజగుండములు– ఏనుగులు మునుగు పెద్దగుండములు
గజచర్మము– చర్మవ్యాధి విశేషము
గజ్జలలాగు– అంచుకు గజ్జలు కూర్చిన లాగు
గజ్జలందెలు– గజ్జెలు పొదివిన అందెలు
గజు గోరతలుపు– గద్దగోరువంటి గడ గలిగిన తలుపు
గజ్జెల వడ్డాణం– గజ్జెలు కూర్చిన వడ్డాణము
గడవంచులు– సామానులుంచు పొట్టి మంచెలు
గడ్డలగు– నాశనమగు
గడవందులు– మంచెలు
గడిచేయు– మదతచేయు
గడిమిగాసము– శత్రువు ముట్టడించి నపుడు కోటలోనివారికి వలసిన గ్రాసము
గడియారమొగసాల– ఘంటశాల
గతవిష్యము– జరిగిపోయిన సమాచారము
గత్తర– కలరా
గద్దెబుట్ట– సోదెవనిత కడనుండు బుట్ట
గనికె– పొలముగట్టు
గనిమెలు–పొలముగట్లు
గన్నెరిబెలు– ఆయుధ విశేషము.
గప్పు ఉప్పుమనకుండు– ఊరకుండు
గమకించు– ఉద్యోగించు
గమణి– గవిడి, గవిణి
గమిగాండ్లు– అధికారులు
గమిడి– కోటద్వారము, ఊరిపొలిమేర
గమిడిపెండెములు– పురవీధులు
గముడు– గౌడు
గరగ– గ్రామదేవతల కడకు గొని పోవు కలశము
గర్భచిన్నెలు– దౌహృద లక్షణములు
గర్భవాసము– కన్నకడుపు

గర్భ వేదన- ప్రసవ వేదన
గరిగబుడ్లు- ఐరేణి కుండలు
గరిగపేరంటాలు- ఐరేణులు తెచ్చు ముత్తైదువలు
గర్దీ-చీకటి
గరుకు కుత్తుక-బొంగురుగొంతు
గలబా- తగవు
గల్బాకత్తి-పెద్ద కత్తి
గల్బాకచేరి-గొప్పసభ
గవిడి పేరులు-గవ్వలదండలు
గవిడి-ఊరి పొలిమేర
గవిని- ,,
గవిశన-ముసుగు
గవులు-కంపు
గవుళ్లు-గౌండ్లవారు
గసికె-కొయ్యమేకు
గస్తు-పారా, పారాయందిమిడిన చోటు
గాజులు పెట్టు-సీమంతముచేయు
గాజురొయ్య-సముద్రపు రొయ్య
గాలు-కాపలా
గాడి-బండి
గాడిబండ్లు-శకట విశేషము
గాడుపు-పెద్ద గాలి
గాతము-గడ్డి
గాదుకొను-విస్తరించు
గాయి-మశూచికము
గాయిదుపని-కూలిపని
గాయిదోడు-కూలివాఁడు
గార కొఱ్ఱలు-ధాన్య విశేషము
గాలికొమ్ములు-కొమ్ముబూరాలు
గాలిగాడు-గాడిద
గావు-బలి
గావుకొను-బలికై నిర్దేశింపబడిన జంతువును నోటితోపట్టి కొఱికిచంపు
గావుచెల్లించు-బలియిచ్చు
గావుచేయు- ,,
గావులమారి-బలిగోరువాఁడు
గాసగాండ్లు-జీతగాండ్లు
గ్రాణము-గ్రహణము
గింటిన గంటీలు-కర్ణభూషావిశేషము
గిడిగిళ్ళు-చేతాళములు, చప్పట్లు
గిరగిర ఉరుకు-త్వరగా పరుగిడు
గిఱ్ఱ-గిరి, వలయము
గిరులు దిప్పుల-దృష్టితీయు
గిరిగెలు-వాద్యవిశేషము, తాళములు
గిరియాలు-కాగులు
గిలకపలకలపేరు-హారవిశేషము
గిలకసరిపేట- ,,
గిల్ల-బండిచక్రము
గీటు కంచాలు-లోహపు పళ్ళెములు
గీసిగాళ్ళు-గిజిగాండ్లు
గుంటక-విత్తులు జల్లిన నేలను సవరించు పనిముట్టు
గుంటపలుగు-గడ్డపార
గుండ్లతిత్తులు-Catridge Cases
గుండాలమర్చు-సహగమనమునకై గుండములు త్రవ్వు
గుండాలు-అగ్నికుండములు

గుండెబగులు-బెంగగొను
గుండెముసురు-గుండెదిగులు
గుంతమాపలు-క్రీడావిశేషము వామన గుంటలు
గుంపు-వెదురుకణుపు
గుజ్జర్లు-ధాన్యవిశేషము
గుజ్జాకత్తులు-పొట్టికత్తులు
గుడహార్లు-గుడారములు
గుడారు-గుడారము
గుడాలు-సుండలు
గుడికట్టు-గుడియొక్క పునాదుల మధ్య లోని భాగము (Plinth Area)
గుడ్డెల్గు-ఎలుగుబంటి
గుద్దులాడు-పోట్లాడు
గునదనంచేయు-త్రవ్వు
గునపము-త్రవ్వెడి సాధనము, పలుగు
గున్నచింత-గుబురుగా వ్యాపించిన చింతచెట్టు
గునాదనం-పునాది
గుప్తి-కత్తి యిమిడిన కఱ్ఱ
గుబ్బబెత్తం-పొన్నుకఱ్ఱ
గుబులు కుడుచు-దిగులుజెందు
గుమ్మటము-దీపపు గూడు
గుమ్మడిగింజలుగు-ఆయుధవిశేషము
గుమ్మడిపండు-కేశబంధ విశేషము
గుమ్మస్తు-గుమాస్తా
గుమ్మి-గుండ్రని బుట్ట
గుమ్మిబుట్ట- ,,
గుమ్మె-వాద్యవిశేషము
గుమ్మెట-వాద్యవిశేషము
గుఱ్ఱాలగావు-గుఱ్ఱములను గావున కిచ్చుట
గురికాడు-అలుగు విడుచుటలో నేర్పరి
గుఱుతైన-ప్రశస్తి వహించిన
గుల్ల-చిన్నబుట్ట
గుల్లెడు-బుట్టెడు
గువగుత్తిగా-పొదివిపట్టు నట్లుగా,
గూడెగాండ్రు-గూడెమువారు
గెరవులుబెట్టు-చెప్పులు తొడుగుకొను
గెరుసులు-పొలము మధ్యనుండు మట్టి కట్టలు
గేరీ-బజారు
గై-గవి
గైల-గుహయందు
గొంగడిపాత-గొంగడి
గొంగవాల్కత్తి-వంకకత్తి
గొజగోరు-గజుగోర
గొట్టిగాడు-పిల్లవాడు
గొడ్డీనుట-సంతులేకపోవుట
గొదగొను-కూడుకొను
గొరకము-బాణవిశేషము
గొరకపోటు-బాణపుదెబ్బ
గొల్లెన-గుడారములు
గొల్లెనలెత్తు-గుడారములు వేయు
గొఱ్ఱెచీమలు-గండుచీమలు
గోగు-గోవు
గోచెడు-కొద్దిగా

గోద-గేదె
గోదాడు-దుఃఖించు
గోర్జము-గోరోచనము
గోరిబెట్టు-సమాధిచేయు
గోలాలు-గోలెములు
గోవిందవీణెలు-వాద్యవిశేషములు
గోషా-పరాయి మగవారికి కనపడకుండుట
గోళపుట్టు-కోమలపుట్ట
గౌరులు-ఏనుగులు

ఘ

ఘంట్లం-గంటము
ఘాత-పెడబొబ్బ
ఘోరించు-ఘోష పెట్టు

చ

చంకచాటు-సంతానము
చంద్ర బొగ్గులు-చంద్రకఱ్ఱవలన తయారగు బొగ్గులు
చంద్రకోల-చర్నకోల
చందవాలు-మత్స్య విశేషము
చంద్రపుటము-భూషణవిశేషము
చంద్రవంక గొడ్డఱ్ఱు-ఆయుధ విశేషము
చంద్రవంకలు-ఆయుధ విశేషము
చంద్రసూర్యులజోడు-శిరోభూషణములు
చంద్రహారము-హారవిశేషము
చందురువంకలు-శిరోభూషణ విశేషము
చణకులు-దెబ్బలు
చతురు బాల-పాళె, పాచికలయాట
చదరంగమిండ్లు-చతుశ్శాల
చదురు-సభ
చదురు దీర్చు-కొలువుదీర్చు
చదువు సాధనం-చదువు,సాము
చదువులబడి-పాఠశాల
చదువుసాల-పాఠశాల
చదురు బోయీలు-కొలువుకు కుదిరిన బోయీలు
చప్పరించు-చఱచు, అణచు
చబుకు-కొరడా
చరణాలు-తోలు
చలవేకి-రోగవిశేషము
చల్లగురిగె-మజ్జిగ పిడత
చల్లజంపులు-ఆయుధ విశేషము
చలికీలు-వ్యాయామ విశేషము
చలిబడ్డకూడు-చద్దికూడు
చలిబడు-పాసిపోవు
చలిబింద్ర-చలీంద్ర
చవికె-మంటపము
చషగిన్నె-చషకము, చిన్నగిన్నె
చవుబాయు-రుచిదప్పు
చాగరోకలి-చేవగల రోకలి
చాటువచెప్పు-పోల్చిచెప్పు
చాడీకోరు-కొండెములు చెప్పువాడు
చాపచదిరె-చాప, చదరము
చామరలు-విసనకఱ్ఱలు
చారి-సంచారము

చాలుగానిలచు-వరుసగానుండు
చాలు రావులు-న్యాయము చెప్పుటకై ఊరిపెద్దలు సభతీర్చు రావి చెట్ల క్రింది స్థలము
చాల్పు-వరుస
చాళవగొలుసు-బంగారు గొలుసు
చింతపోవు-విచారించు
చింతవనం-చింతతోపు
చిందుచేయు-చెదరగొట్టు
చిక్కము-తాళ్ళసంచి
చిక్కు-చెక్కు. పైపెచ్చు
చిక్కెంటు-దువ్వెన
చిటికెనబద్దులు-పిల్లేండ్లు
చిటికెలు-తాళములు, వాద్యవిశేషము
చిటిగోర తలుపు-చిన్నగడగల తలుపు
చిటుకొలము-చిన్నకొలిమి
చిట్టి-కొలత
చిట్టిమల్లెలు-ధాన్యవిశేషము
చిట్టుడుకు-ఒక్కయుడుకు
చిత్రవర్ణము-చిత్రకారైయందలి వర్ణము
చిత్రకన్ను-మూడవకన్ను
చిత్తుచిత్తుగ-చెల్లాచెదురుగ
చినదాయి-చిన్నపిల్ల
చిన్న పాతర-చిన్నపాత్ర
చిన్నపొల్లు-కళ్లము ఊడ్చిన వెనుక మాదిగవానికిచ్చు వడ్లు
చిన్నాలు-కనక శకలములు
చిన్ని-నేతిసిద్దె
చిమటాయిచ్చు-మోసముచేయు
చిమ్మిడి బావిలీలు-కర్ణభూషావిశేషము
చిర వెంట్రుకల-చింపిరిజుట్టు
చిరత కట్టులు-భేరీవేయు కట్టులు
చిట్టిగోనె-క్రీడావిశేషము
చిట్టి వెంట్రుకలు-చింపిరిజుట్టు
చిరుగంటలు-చిన్నగంటలు
చిలక ముక్కంబు-బాణవిశేషము
చిల్ల కోలంబు-బాణము
చిల్లకోలలు-బాణములు
చిల్ల గడలు-బాణములు
చిల్లర మల్లర-అప్రధాన వస్తువులు
చిల్కతాలి హారము-హార విశేషము
చిల్కతురాయి-శిరోభూషావిశేషము
చిలుకల తాళీలు-హారవిశేషము
చిలుకు-గొళ్ళెము
చివురు గండెలు-ఆయుధ విశేషము
చీకటింటి నోము-వ్రతవిశేషము
చీకటి మిణుగుర్లు-ఆయుధ విశేషము
చీకట్లు-చిక్కంట్లు, దువ్వెనలు
చీతువలు-తీతువు పక్షులు
చీదె-సిద్దె
చుక్కజూపించు-అరుంధతీ దర్శనము చేయించు
చుక్కల గద్దె-ఆసన విశేషము
చుక్కాని పరీక్ష-దుర్భిణిలో చూచుట
చుట్టు-చుట్టకుదురు
చుట్టి చూరిడుచు-దిగదుడుచు
చుట్టుకొల్లారములు-ఎద్దుబండ్లు
చుట్టు బట్ట-మొలగుడ్డ, అంగవస్త్రము

చుట్టు సెంబెలు-దీప పాత్రలు
చూరి-చుటియ, చుఱకత్తి
చెంపశిఖలు-చెంపలపైకి చాలుగా పెరిగిన వెంట్రుకల వరుస
చెట్టు క్రియ-క్షుద్రవిద్య-మందు మాకుల ప్రయోగించుట
చెబ్బ-చెడ్డ, లోపము
చెయ్యిచ్చు-మోసము చేయు
చెయి జబ్బ-చేతులు, దండలు
చెఱుగుపైడి-కొంగు బంగారము
చెరలు-కష్టములు, బాధలు
చెలకత్తి-చిన్నకత్తి
చెలపట్టు-పంతగించు
చెల్ల-వల్లె, ఓణీ
చెల్లవచ్చు-చచ్చుటకు వచ్చు
చెల్లా-వల్లె
చెలిమ-నీటియూట
చేండ్ల-చేనిలో
చేగంటలు-తప్పెటలు
చేటకమ్మ-చేటయందలి కమ్మీవంటి భాగము
చేట్లగలుపు-పాడుచేయు
చేతెడు-చేయిపట్టునంత
చేదు-పిత్తకోశము
చేదుకొను-పైకి లాగుకొను
చేపట్టుక-పాలించు
చేపట్టుగావించు-అలుకు
చేమపూ కడియాలు-హస్తభూషా విశేషము
చేరచుక్క-చేర్చుక్క, పాపటబిందెలు
చేరీ-వీధి
చేర్చుక్క బొట్టు-పాపటగొలుసునకు గల బిళ్ల
చేవతాళ్ళు-చేవగల తాటిచెట్లు
చొప్పగోల-దంటుకట్ట
చోపు జల్లు-ముత్తుజల్లు
చోపుదారు-వేత్రధారి
చౌకండి-ధాన్యవిశేషము
చౌకట్ల పోగులు-కర్ణభూషా విశేషము
చౌకళించు-కుప్పించి దూకు
చౌటిపడెలు-సేద్యమునకు పనికిరాని భూమి
చౌల పండగ - శోత్రపర్వము

జ

జంగిడి-చిన్న గంప
జంగిరి వెళ్ళు-వలసపోవు
జంజనము-జంధ్యము
జంజాళము-బాకు
జంబి ఆకు-జమ్మియాకు
జగజంపుమాట-మేలైన మాట
జగడ-పోట్లాట
జగ బిరుదులు-గొప్ప బిరుదులు
జడ్డిచేయు-నజ్జుచేయు
జట్టిగాలు-జట్టి పదవులు
జడ్డిగం-జిడ్డిగము
జిడ్డు-రోగము
జనపపట్టి-జనపనారతోనల్లిన పట్టి
జనవాడుక-లోకమందలి వాడుక

జనసమ్మతి–జనామోదము
జన్ని పుట్టు–సంధించు
జన్నియావు–దేవతకు మీదు కట్టిన యావు.
జఫర్దస్తుగా–బందోస్తుగా
జబరు–బలము
జబ్బ–దండ
జమకాళములు–జంఖాణాలు, కంబళ్ళు
జమదాళి–బాకు
జమాబందీ–పన్ను వసూలు చేయు పని
జమిడికె–వాద్యవిశేషము
జమిలి–జంట
జమిలిక–జమిడికె, వాద్యవిశేషము
జముదాళి బాకు–ఖడ్గ విశేషము
జయవారము–మంగళవారము
జ్రంత–కొద్దిగా
జలదారి–తూము
జలదొడ్డి–స్నానశాల
జలబిందె–నీటిబిందె
జల్తారు–తూము
జల్తారు చీరె–జరీచీరె
జల్దారు–తూము
జలిగెట్టలు–మత్స్య విశేషము
జల్లి–కుచ్చు
జవర పొద్దు–మసకపొద్దు
జవలుతాడు–జమిలిత్రాడు, పేనినత్రాడు
జవాండ్లు–భటులు
జవాబు చేయు–ఎదురు చెప్పు
జవ్వారి–నగకట్టు
జవిరిగుండ్ల పేరు–హారవిశేషము
జవిరిపొద్దు–మసకపొద్దు
జవురు–అక్రమముగా గ్రహించు
జాగంట–చేగంట
జాగ–చోటు
జాగట్లు–చేగంటలు
జాణులు–వీరులు
జాటికొయ్య–చెర్నకోల
జాడపత్తులు–జాడలు
జాడీచెంబు–జారిచెంబు, కొమ్ముచెంబు
జాతిసొంగ–హుక్కా
జాదవులు–తోటికోడండ్రు
జాది–ఎఱ్ఱమట్టి, జేగురురంగు
జానకి తాప్కు–మందుగుండు పేల్చుటకు నిప్పంటించు త్రాడు
జారుముడి–వదులుగా వేసిన కేశబంధము
జాల–జాటి
జాలపల్లిక–తాంబూలపు పళ్ళెము
జాలవల్లికె– ,,
జాలాడ–స్నానశాల
జాలారి బండ–స్నానము చేయు చోట నుండెడి బండ
జాలారి–స్నానముచేయుచోటు
జాలచెంబు–జాలిచెంబు
జాలెడు–సంచినిండుగా
జారాడ–జాలాట

జాలాడ—జాలాట
జారిచెంబు—కొమ్ముచెంబు, జాలిచెంబు
జిగురు గండెలు—ఆయుధ విశేషము
జిట్టెడు—చూపుడువ్రేలు, బొటనవ్రేళ్ల మధ్య పట్టునంత
జిడ్డిగము—జడ్డిగము
జిమ్మ—జిహ్వ
జిమ్మజిమ్మ—త్వరత్వరగా
జీతబత్తెములు—వేతనములు
జీరాలు—కవచములు
జీవత—ప్రాణము
జీవదారివుల్ల—సంజీవిపుల్ల
జీవాళము—కాహళలోని సన్ననిజీలుగు ; బెండుముక్క ; జీవశక్తి
జీవిగరపుల్ల—సంజీవిపుల్ల
జీవునాలు—ప్రాణములు
జుంజురుకట్టు—కాల్చు
జుంజూరుపెట్టు—దహనముచేయు
జుజ్జురుకొప్పు—చిట్టికొప్పు
జున్నుదాలు—జన్నిదములు
జుమకాలు—కర్ణభూషణము
జుమికీలు— ,,
జుముకపెంట—పిట్టరెట్ట
జులిమిచేయు—అధికారముచేయు
జుల్మి—అధికారము
జూజము—జూదము
జెష్టరాత—దౌర్భాగ్యము

జొత్తుపాపలు—దేవతరొమ్మున గట్టిన, నెత్తుట తడసిన ఎఱ్ఱబొమ్మలు
జోకు—తూచు
జోకోల—జోగుకోల
జోగు—భిక్షము
జోగిడుచు—భిక్షమిచ్చు
జోగుకోల—జోగడుగువాని చేతి కోల
జోడాలవారు—అంచెలపై ప్రయాణించు మనుష్యులు
జోడాలు—అంచెలు
జోడు—పాదరక్షలు
జోడుకాడు—భర్త

ఝ

ఝూస—ధ్యాస

ట

టంకణమగు—వచ్చిచేరు
టాకుగ—ఠాకునట్లుగా
టెక్కాలు—ధ్వజములు

డ

డాణ్యము—కావలియుండుచోటు
డాయిగ—రీవిగ

డ

డంగడోలు—గంగడోలు
డక్కలోడు—మాదిగకంటె తక్కువ కులమువాఁడు
డమాయీలు—భేరీలు
డమ్మాములు—భేరీలు

డల్లి—మాంసఖండము
డాకల—డాకలి
డాకలి—దాగలి
డాకలిమొద్దు—పట్టెడ
డీర్కాలు—తలంట్లు
డేరాకొట్టు—గుడారము దించు
డేరీ—గుడారము
ఢక్కీలు—డప్పులు
ఢమామీలు—పెద్ద డప్పులు

త

తంపి—దాలి
తంబళికి—తంబళివాడు
తండ్లాడు—వెదుకు
తంతుపటము—నేతగుడ్డ
తందనాలు త్రొక్కు—చిందులు వేయు
తందరగుడుచు—తొందర పడు
తఖ్తుబల్ల—అధికారము నెఱపుబల్ల
తగటు పటము—జరీవస్త్రము
తగత్తు—సింహాసనము
తగరాని కష్టము—కారాని కష్టము
తచ్చరము—తక్షణము
తట్ట—పళ్ళెము
తట్టు కోట—కోటగోడ బలమునకై దానికి చేర్చి కట్టిన మట్టి గోడ.
తట్లు—వాతలు, దద్దులు
తడప—నార
తడలు—పొంగులు
తడాపిడీ—ఎడాపెడ, గబగబ
తడుములాడు—వెదుకు
తనువు దిరుగు—ప్రదక్షిణముచేయు
తపాల—పెద్ద చెంబు
తప్పెట్లు—వాద్య విశేషము
తబుకు—పళ్లెము
తమకము—మంటపము, చావిడి
తమనములు దప్పు—నెల దప్పు
తమ్మలములు—తప్పెటలు
తమ్మపడిగె—పతద్గ్రాహము
తరక వాదన—తర్క వితర్కములు
తరవళ్ళు—పట్టా కత్తులు
తరిజుట్టు—ముజ్జిగ చిలుకు
తరువాజు—దర్వాజా
తలచు మాటలు—మూర్ఖవచనములు
తల కర్ర్నము—పెత్తనదారి, ఊరి పెత్తనము చేయువాడు
తలకోల—తలగోల
తలగొడుగు—రక్షకుడు, యజమాని
తలగోల—పాలుపితుకునపుడు ఆవు కొమ్ములకు దగిల్చిన త్రాటి కోల
తలపండు—శిరస్సు
తలపట్లు—శిఖపట్లు, పోట్లాటలు
తల పొలము—పొలిమేర
తలబాలిచ్చు—పెండ్లి చేయు
తలార—తలమునుగ
తలారి కట్టి—తలారివాని చేతియందుండు పెద్ద కట్టి
తలితండ్రాదులు—తలిదండ్రులు

తల్లి మెఱుగులు—ఆయుధ విశేషము
తలె—పళ్ళెము
తల్లె—పళ్ళెము
తహసీలు చేయు—నిలువరించు
తళియ—పళ్లెము
తళ్లె—పళ్ళెము
తాకనాడు—ఉచ్చిపోనాడు
తాటోటుమాటలు—మోసపు పలుకులు
తాపత్రయపు మాట—ప్రాకులాట
తాబొందు—పావడ, పరికిణీ
తామర కూనలు—అయుధ విశేషములు
తార్పన—పొందిక
తాలిమి—వ్యాయామము
తాలుపొల్లు—గింజకట్టని యూక
తావలము—వాసస్థానము
తావుదర్లు—ఉన్నచోటు విడిచి మఱి యొక చోటికేగు
తావురాలు—వాసస్థానములు
తాషామర్పాలు—వాద్యవిశేషము
తాసీలు చేయు—అధికారము నెఱపు
తింపు—త్రిప్పు
తిట్టు—నింపు
తిమిడి—చప్పుడు
తిత్తి—తోలు సంచి
తిమురు—పొగరు, క్రొవ్వు
తిమ్మిరి—మొద్దుబారు రోగము
తిల్లీమల్లీ చూచు—దిక్కులు చూచు
తిరుగుడు పూవు—కేశాభరణ విశేషము
తిరునము—తిరుచూర్ణము
తిరుపావనము—విభూతి
తిరువలిక—దీపము
తీట—గజ్జి, దురద
తీడబిళ్ల—కత్తులు పదును బెట్టు రాయి.
తీడు—పదును పెట్టు
తీని—తిన్నె
తీను—అరుగు
తీరిపోవు—మరణించు
తీనెలు—అరుగులు
తీర్థమాడు—ప్రసవించు
తీంట్రించు—మిడిసిపడు
తుంగుటుయ్యాల—తూగుటుయ్యేల
తుంట—ముక్క
తుడుకున—దుడుకుగా
తుడుపు—ఊడ్చుట
తుడుముగొట్టు—డప్పువేయు
తునకలు—మాంసఖండములు
తునకలు—కాకలు
తునెలు—ముక్కలు
తురుగుబెట్టు—బలవంతముచేయు
తురుమాడు—చంపు
తురుతువార్త—అంచెలపై చేరువార్త
తెట్టు—నీటిపైతేలు పదార్థము
తెన్నండి—తెండు
తెప్పకొయ్యలు—కాలువ దాటించు బల్లి చెక్కలు
తెప్పలు పడు—పోగుపడు
తెరచీర—తెఱ
తెరబొమ్మ—తెరమీదపడు నీడబొమ్మ

త్లైమి యగు—తెలియు
తెల్లాట—తెల్లవారిన వెనుక
తెల్లారిపట్ల—తెల్లవారిన వెనుక
తెలుపు—తెల్పించు
త్రేంచు—తేర్పు
తేజస్సుగా ఉండు—అనుకూలముగా నుండు
తేజు—పదును
తేడు—శయనించు
తొక్కు—పచ్చడి
తొగరుకుచ్చులు—ఏనుగుల తోకకు కట్టు కుచ్చులు
తొట్టు—ఎగదట్టు
తొడలు—సడలు, జారు
తొడుకం—కొసరు
తొడుకలు—(కట్ట) పెచ్చులు
తొడ్యెం—నమస్కారము
తొనుకు—పొంగు
తొలుకు—గుండు
తొలుకు గొట్టు—గుండుగొట్టు
తొవ్వ—త్రోవ
తోటి ఏరాళ్ళ—తోటికోడండ్రు
తోడి సాధన—వ్యాయామ విశేషము
తోడు—చేమిరి—పెరుగు చేయుటకు పాలలో వేయు పెరుగు
తోడు బోతు—క్షుద్రవిద్యలు నేర్చినవాడు
తోడుబోతుల విద్య—క్షుద్ర విద్య
తోమంత—తోడెమంత, కొద్దిగా
తోలించు—పంపు
తోలు సిద్దె—తోలు పాత్ర

ద

దంట—చతురుడు
దంటతాయెతులు—దండకు కట్టిన తాయత్తులు
దండ కడియములు—దండకు కట్టిన కడియములు
దండరెట్టి—జబ్బ, భుజము
దండగ మాటలు—పొల్లు మాటలు
దండూర—దండోరా, చాటింపు
దంతావళి రవికె—రవికెలో రకము
దంతెలు గొట్టు—అడ్డపట్టెలు బిగించు
దట్టించు—నింపు
దట్టి పొర—కట్టుకొన్న పంచె మడత
దడ్డుగట్టె—పెద్దకట్టె
దబ్బనము—గోనెలుకుట్టు పెద్దసూది
దబ్బరి తొత్తు—అబద్ధాలకోరు
దమ్ము చేయు—భూమిని పదునుకు దెచ్చు
దరిపొంటి—కట్టప్రక్కన
దరబారి—దర్బారు
దశమానులు—అదృష్టవంతులు, అస్త్రిపరులు
దస్తగుడ్డ—రుమాలు
దస్తా తుపాకి—ఆయుధవిశేషము
దస్తావేజు దొరకక పోవు—జాడతెలించు కుండు
దస్తికొంగు—రుమాలు కొంగు
దస్తిగుడ్డ—రుమాలు
దాకలగు—హాజరగు, చేరు

దాగుడుండు-దాగు
దాణా-పశువుల మేత
దాదినిమ్మ-చితి
దానా-పశువుల మేత
దాపురము-ప్రాప్తి
దారలు-కాహళలు
దారకం-ఆహారము
దారనాదం-కాహళ స్వనము
దారపోత-బాకా ఊదుట
దారబందం-ద్వారబంధము
దారుఢ్యంలేదు-స్తోమతలేదు
దావిణీ-వల్లె, ఓణీ
దాసంగం-దాసులకు పెట్టు భిక్ష
దాహచలి పందిళ్ళు-ప్రపలు
దాహసలీంద్ర-ప్రప
దాళవ-తాలువు, దవడ
ద్వారవాకిలి-ముఖద్వారము
దింపుడుకళ్ళం-స్మశానమునకుగొని పోవుచు శవమును మధ్య దించు ప్రదేశము.
దిగనెల్లు-దిగవిడిచి చను
దిగువారు-కాళ్ళు
దిగువై యుండు-చులుకనయగు
దిడ్డి-దొడ్డి
దిడ్డిదరవాజు-దొడ్డి వాకిలి
దిన చరులు-వార్తాహరులు
దిలాసచేసికొను-దిటవు పఱచుకొను
దివసం-దశాహకర్మ
దివ్యప్రమిజు-దీపపు ప్రమిద
దివ్యలెత్తించు-దీపములు వెలిగించు
దీటు-సమానము
దీపంకర్ర-దీపపుకోడి
దీపంతలు-ప్రమిదలు
దీమసు-ధైర్యము
దీవనార్తలు-ఆశీర్వాదములు
దుంగిభోగాలు-ధాన్యవిశేషము
దుఃఖముతీయు-దుఃఖించు
దుఃఖసిలు-దుఃఖించు
దుగదచ్చిబారాలు-సొగటాలు
దుగ్గాని-ఒకటిన్నర కాని
దుడ్డు-డబ్బు
దుడ్డు దుగ్గానులు-డబ్బు
దుడ్డు దుస్క-డబ్బు దస్కము
దుడ్డె-దూడ
దుడ్డెగాడు-విటుడు
దుబాసి-అనువాదకుడు
దుమ్ములు-ఎముకలు
దురాయి-ఆజ్ఞ, కట్టడి
దురతపురిక్కలు-అశ్లేష, పుబ్బ, భరణి మొదలగు చుక్కలు
దుశ్శాలువ-జోడించిన పట్టుశాలువ
దూపలు-దాహము
దూపార్చు-దాహముతీర్చు
దూసికలుపు-జవిరి చేర్చు
దెసపడు-గతిమాలు
దేవ దుర్గాలు-పెద్దకోటలు
దేవదూరములు-ఎక్కువదూరము

